
విషయానుక్రమణిక

# చిత్రములు

త్రివర్ణ చిత్రములు:—బోధిసత్వ పుష్పసమర్పణము (అజంతాచిత్రము); పద్మాసన బుద్ధుఁడు, చిత్రకారుఁడు-శ్రీయుత డబ్ల్యూ. ఏ. ఆర్యదాసుగారు.

సాధారణ చిత్రములు:—కీ. శే. దామెర్ల రామారావుగారు; కీ. శే. సత్యవోలు గున్నేశ్వరరావుగారు; మృచ్ఛకటిక నాటకమండలి పాత్రధారులు, శ్రీసీతారామాంజనేయ నాటక సమాజము, ఏలూరు; శ్రీయుత స్థానం నరసింహారావుగారు-రోషనార; శ్రీయుత నెల్లూరు నాగరాజ రావుగారు-పాపారాయుడు; శిల్పచిత్రములు; మేనక-విశ్వామిత్రుఁడు, వేణుగాన కృష్ణుఁడు, సత్యభామ-కృష్ణుఁడు, సరస్వతి, గ్రీకు లోహశిలావిగ్రహముల చిత్రములు; ఇతర చిత్రములును.



చెన్నపట్టణము, మార్చి ౧౯౨౫
1925

సంపుటము ౨. రక్తాక్షి సంవత్సరము ఫాల్గుణమాసము సంఖ్య 3.

పురాణస్మృతితరంగిణి

# నిర్వేదము

శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు

౨

పావకులగుణశీలము, లేవంకకుఁ బోయె, శాంత మెటు సనె, బ్రహ్మ
శ్రీవిలసితునకుఁ జండా, లావేశం బేల కలిగె నశ్వత్థామా!

మ. అకటా భూభువనప్రశస్త మగు ద్రోణాచార్యవంశాబ్ధి మా
నికముం బోలి జనించి గౌరవమునన్ దేజంబున న్మించియున్
సకలాత్రాసగతిన్ వెలుంగక విషజ్వాలాకరాళోద్ధత
ప్రకృతిం గాంచితి, దోషదూషితులు గోత్రఖ్యాతిఁ బాటింతురే.

క. తలతెగుటె యైన, నరకా-నలకీలలఁ బడుటె యైన నాకు భరంబే
తలమానికమే తెగి, నిం-దలపాలగుకంటెఁ బాపతాపముకంటెన్.

సీ. ధర్మపుత్రాదులు దాయాదులే నాకు, సహజస్వధర్మమే శాత్రవంబు
వీరవిహారముల్ విహితంబులే నాకు, సమ్మతాచారమే సంగరంబు

నిష్ఠురారంభముల్ నియమంబులే నాకు, ననుగతాభ్యాసమే యాగ్రహంబు
భయదాస్త్రశస్త్రముల్ పరతత్త్వములె నాకు, హితకరోద్యోగమే హింసనంబు
అతిథిసత్కారమో, దేవతార్చనంబో, బ్రహ్మచింతనమో, వేదభాషణంబో,
స్వర్గమో, మోక్షమో, లోక సంగ్రహంబో, పరవినాశనకృతి యేల బ్రాహ్మణునకు?

సీ. సురభిళమృదుల ప్రసూనంబనై పుట్టి, కుటిలకంటకవృత్తిఁ గూలినాఁడ
లలితమోహనకలాలాపంబనై పుట్టి, తుచ్ఛవాయసవృత్తిఁ దూలినాఁడ
దివ్యనిర్మలరత్నదీపంబనై పుట్టి, దావపావకవృత్తిఁ దాల్చినాఁడ
సురుచిరనవసుధాకిరణంబనై పుట్టి, గరళదంశనవృత్తిఁ గాంచినాఁడ
సౌమనస్య మెడలె, సాధువాదము వోయె, గౌరవంబు గ్రుంగెఁ, గళ నశించ
బ్రదికి మరణబాధ పాలైతి నాకింక, నాకమేడ, ఘోర నరకమేడ?

సీ. చూపులుఁ జూపులు జోడించి శూరులై, కలన నన్నెదిరించి నిలిచినారె
కరములుఁ గరములు గదియించి ధీరులై, దురమున నాకాలు ద్రొక్కినారె
బిరుదులు బిరుదులు మొఱయించి వీరులై, బవరాన ననుఁ గొంచెపఱచినారె
కత్తులుఁ గత్తులు హత్తించి క్రూరులై, యెత్తిఱ నను నొవ్వ నేసినారె
కయ్యమే లేక నిద్దురఁ గన్నవారి, గొంతుకలు గొల్లుమనఁ దెగఁ గోసినాఁడ
జ్ఞానమేలేని, దయలేని, శంకలేని, పరమచండాలుఁడను గాక బ్రాహ్మణుఁడనె?

క. కన్నుల నెన్నో పీనుఁగు, లున్నట్టులె, చెవుల మూల్గు చున్నట్టులె యా
చున్నది మతి చెడుచున్నది, యెన్నాళ్లీరోగబాధ కే నేస్తు శినా!

చ. పరమకిరాతవృత్తి జనపాలకుమారులఁ బట్టి యాదలల్
ఖరకరవాలధార కెఱగా నొనరించెడువేళఁ గ్రిందుమీఁ
దెఱుఁగక సంచరించి తుదకిట్లు పరాభవతాపపాదు
ర్భరపరితాపదుఃఖముల పాల్పడితిన్ జెడితిన్ జగంబునన్.

సీ. కుటిలమార్గముఁ బట్టి కులము గూల్చుటె గాని, గురుకీర్తి నిల్పుకో నెఱుఁగనైతి
భండనంబునఁ జేరి భంగ మందుటె గాని, సవ్యసాచి నెదుర్పఁ జాలనైతి
బిరుదుమాటలు సెప్పి పెనఁగులాడుటె గాని, రారాజు మెప్పింప నేరనైతి
క్రూరకృత్య మొనర్చి గొంతు లూడ్చుటె గాని, వీరగౌరవ మంద నేరనైతి
సత్యశౌచదయాధర్మ శమదమాది, సత్క్రియాసంతతికి జలాంజలి యొసంగి
భవవినిష్కృతిలేనిపాపము గడించి, హరహరా! యెంతదుష్క్రియా పరుఁడనైతి.

సీ. కావిదోవతిఁ జించి కాసెకోక బిగించి, చలరేఁగి కులవృత్తిఁ జెఱచికొంటి
ధర్మశాస్త్రము వ్రాని దారుణాస్త్రముఁ బూని, సివమెక్కి పాపంబుఁ జేసికొంటి
యజ్ఞవాసము రోసి యట్టహాసము సేసి, తెగసాగి తలవంపుఁ దెచ్చికొంటి
స్వస్తివాక్యము వీడి సమరగీతము పాడి, కైపెక్కి జీవంబుఁ గలఁచికొంటి
విశ్వవిహితమైన విప్రధర్మముఁ దూల్చి, గోప్యమైన రాజకులముఁ గూల్చి
చెడ్డపేరు మోసి జీవచ్ఛవంబనై, పరిభవమునఁ బడియు బ్రదికియుంటి.

సీ. కలుషదూషితముగాఁ గలఁగిపోయెనె, గోత్ర-పావనంబైన నాజీవనంబు
క్రూరదుర్మతముగా మాఱిపోయెనె, ధర్మ-సాధనంబైననా బోధనంబు
దుఃఖదుర్భరముగా దొరలిపోయెనె, సాధు-కీర్తనంబైననావర్తనంబు
ప్రళయభీకరముగాఁ బ్రబలిపోయెనె, ప్రేమ-దౌహృదంబైన నా సౌహృదంబు
భూమిదేవుఁ డేడ భీమాహవం బేడ, హేయబుద్ధి యేఁట హింస యేడ
అసురబుద్ధిఁ జేసి యపవర్గమార్గంబు, మూసికొంటి నింద మోసికొంటి.

సీ. అఘమర్షణస్నాన మైపోయెనే, సాధు-జనకోష్ణరక్తవాహినులలోనె
ఔపాసనక్రమం బైపోయెనే, తీవ్ర-ముఖరాస్త్రజనితాగ్నిశిఖలలోనె
ఆరాధనవిధాన మైపోయెనే, క్రూర-మారణమంత్ర కర్మములలోనె
ఆనందనర్తనం బైపోయెనే, మిత్ర-శవపూర్ణరణనివేశములలోనె
భూసురత్వ మెల్ల బుగ్గిపాలై పోయె-సాధుశీల మెల్ల సమసి పోయెఁ
జావులేనిబ్రదుకు సంకటమై పోయె-శివశివా! యిఁకేమి సేయువాఁడ






చిలుకూరి నారాయణరావు గారు, యమ్. ఏ., యల్. టి.

కవిజనాశ్రయమను ఛందశ్శాస్త్రమును ఆంధ్రసాహిత్యపరిషత్తువారు 1917-వ సంవత్సరమున ముద్రించి ప్రకటించియుండిరి. అది మ. రా. రా. జయంతి రామయ్య పంతులు గారిచే 'శోధింపఁబడి' ఇంగ్లీషులోను, తెనుగులోను పీఠికలతో ఒప్పుచున్నది. ఇంగ్లీషులో చెప్పినమాటలనే వారు తెనుగులో విపులముగా వివరించియుండిరి. ఈ గ్రంథము నిదివర కెవ్వరును సూక్ష్మముగ విమర్శించియుండలేదు. అట్టివిమర్శన ముఖ్యమని తలఁచి యీ విమర్శనమునకు పూనుకొనుచున్నాము.

1. శ్రీరామయ్య పంతులవారి శోధన పూర్వపండితుల మార్గమునబడి మాతృకను స్వతంత్రించి సవరించుటకు కొంతమట్టుకు వినియోగపడినది. ఏమాతృకలోను లేనిపాఠమును వీ రనేకస్థలములందు 'దూర్చి' * యున్నారు. ఇట్లు వారు తమఅభిప్రాయముల ననుసరించియే చేసినారని గోచరింపకపోదు.

(1) అవతారిక, 3వ పద్యము. మాతృక— వేమనవాడ; దిద్దుబాటు— వేములవాడ; 'వేములవాడ, లేములవాడయని వ్యావహారికనామములు' అని అడుగున సూచన. గ్రామనామములలోకూడ మాతృకలోమార్చుటకు వీరి కేస్వాతంత్ర్యమేమో? వేమనవాడయను గ్రామ మాకాలముననుండి యుండకూడదో! వేములవాడభీమకవి ఈ గ్రంథమును రచియించియుండునని వీరికి గట్టినమ్మకముండుటచేత ఈదిద్దుబాటు జరిగినది.

(2) అవ. 6 వ పద్యము. మాతృక— సంతోషిల్లగ. సవరణ — సంతోషింపఁగ; నన్నయభట్టులోనే 'సంతోసిల్లు'అని ప్రయోగములు గలవు- చూడుడు:.

ఆది viii. 197—నిజారంభంబు సఫలంబగుటకు సంతోసిల్లి.

ఆర 4. 87. వాసవుండును సంతోసిల్లి నాకిట్లనియె.

ఆర 4. 91. ధర్మరాజును ...సంతోసిల్లి.

ఆర 4. 133. ధర్మతనయుండు సంతోసిల్లి.

తర్వాతికవులలో యీ ప్రయోజనము బహుళముగా నున్నది.

(3) అవ. 6 పద్యము. 'ఏ ఛందము సుకవులు బ్రది, కేచందము తెరువుదాని నే రచియింతు॥'—సవరణ—'ఏ ఛందము సుకవులు బ్రదుకేఛందము...'' 'బ్రదికే' అనేరూపము గ్రాంథికము కాదనిన్నీ, చ, ఛలకు ప్రాసకూడదనిన్నీ వీరనుకొనడముచేత కలిగిన దీదిద్దుబాటు. 'బ్రదికే' వంటిరూపములు కుప్పలు తిప్పలుగా ఉన్నవి గ్రంథాలలో, 'సుకవుల'

*. దూర్చుట వీరిమాటయే. చూ. పీఠిక—17పుట, 11 పంక్తి.

గ్రంథాలలో. వర్గప్రథమద్వితీయాక్షరాలకును, తృతీయచతుర్థాక్షరాలకును, ప్రాస గ్రంథాల లో కనబడకపోలేదు.

క. పాఫాబాభామాలను
పాపాక్షర సంజ్ఞలేను పద్యము మొదలన్
రూపించి నిలిపిచెప్పిన
నాపద్దశలకును మూలమంత్రము కవీంద్రుల్.

కవిజనాశ్రయము. పుట 15.

స్వవర్గజప్రాసమని పేరుపెట్టి అప్పకవి 'థ, ధ' లకు ప్రాసము నొప్పుకొన్నాడు. అట్లే 'ద, ధ' లకును ఒప్పుకున్నాడు. తొమ్మిది ఉదాహరణము లిచ్చినాడు. ఇట్లే రంగరాట్ఛందస్సులోకూడా వర్గప్రాస కుదాహరణము లున్నవి. కాని, రామయ్యపంతులుగారు 'చ, ఛ' లకు ప్రాసము కూడదనుకొని కవిజనాశ్రయము లోని పద్యమును దిద్దినారు. పద్యాని కర్థము లేకుండా చేసినారు.

(4) పాఠాంతరములను చెప్పేటప్పుడు సాధారణముగా 'క, చ, ట' మొదలగు ప్రతుల నుదాహరించి, ఒకొక్కచోట 'కొన్ని ప్రతులలో' అనిచెప్పి విడిచెదరు. ఏ ప్రతులలోనో చెప్పిన బాగుండేది. చూ. పుటలు 1,3.

(5) పుట-8_'విష్ణు ప్రతిపాదకము' లగు_ రెండుపద్యములు మాతృకలో కనిపించుట చూచి, కవి జైనుడుకావున నాత డట్టిపద్యములను వ్రాసియుండడని ఊహించి పంతుల వారు వానిని గ్రంథమునుండి తొలగించిరి. ఇది సాహసము. ఇంతకును కవి 'శ్రీనాథా' 'ముకుందా' 'మాధవా' 'వరదా' 'శ్రీకృష్ణ' మురారి' 'శ్రీపతి' 'నృహరి' అనుపదములను ఆయాగణముల కుదాహరణములుగా చూపియున్నాడేకాని తనమతమును ప్రతిపాదించలేదే. పోనీ; తాను జైనుడ ననుఅభిమానము కవికుండెనేమో అనిన తనవిషయమై—'వాక్ఛ్రీపత్నీవల్లభ (పుట 36), శ్రీసంసేవ్యవక్షా (పుట 36), వాగ్వధూవల్లభా (పు39), శ్రీనివాసా (పు42), శ్రీరమణీప్రియ (పు 47), శ్రీతన్వీ ప్రముదితచిత్త (పు56), శ్రీకాంతాసఖ్యుడు(పు59), శ్రీపాదపంకజావాస మధుకరుండు (పు 66), శ్రీనారీప్రియకరుడు (పు 76), శ్రీశ్రితవక్షుడు (పు 79), అను మొదలైన విశేషములను చెప్పికొనియేఉన్నాడు. కవి జైనుడైనంతమాత్రమున విష్ణువు పేరుకూడ తలపకూడనంత పట్టుదల ఉండకపోవచ్చును. కవిజనాశ్రయకర్త కాలమునాటికి (నన్నయనాటికే) జైనమతము బ్రాహ్మణమతములోనికి సంక్రమించి పోవుచుండెను. కాని, శ్రీరామయ్యపంతులుగారి ప్రకార మట్లు సంక్రమించుట తప్పాగనుక పైపద్యములేకాక, "రగడలు, మంజరి, ఉదాహరణము, గీతము వీనికిలక్షణములు, లక్ష్యములు" ఇవన్నియు గ్రంథములోనుండి స్వరూపములేకుండా ఎగిరిపోయినవి (చూ-పుట 74). అందుచేతనే 'జితేంద్రపదభక్తి మెయిన్' అనుటకు బదులు 'జినేంద్రపదభక్తిమెయిన్' అని ఉండవలెనని సూచించినారు (చూ-పుట 1). శ్రీపాదపంకజావాసమధుకరుండు, అనుదానికి 'జినపాద' అనిదిద్దినారని మాకు సందేహము (పుట 66).

(6) పుట-21లో ప్లుతయతి కుదాహర

ణముగా భాస్కరరామాయణములోని 'ఏజనకాత్మజఙ్ఞ' అనుపద్యమును కవిలక్ష్యముగా నిచ్చినట్లొక ప్రతిలో నుండగా పంతుల వారు దానిని తొలగించినారు. పుట- 26లోని వచనమును పద్యములును "కావ్యాలంకార చూడామణియందుఁగూడ గన్పట్టుచున్నవి. కావున నిందుఁ బ్రక్షిప్తము లైనవేమోయని సంశయింపఁ దగియున్నది" అని వ్రాసియు గ్రంథమునుండి తొలగించక విడిచినారు. వీరిట్లుచేయుటకు కవిజనాశ్రయకర్త భాస్కరుని కిని, విన్నకోటపెద్దన్నకును తరువాతివాఁడై పోవునేమో. అనుభయముతప్ప మరియొక కారణము కానరాదు.

(7) పుట-84లో 'వెలయఁగఁ (జెఱకు) విలుగొని' అను కందపద్యపాదమును చూడుడు. మూలములో 'చిగురాకు' విలు అని ఉన్నదట. అది పొరపాటట. ఎందుచేతనో! తెనుగుకవులు మన్మథుని'చిగురాకువిలుకాఁడు, చిగురు విలుకాఁడు, చిగురువిలుతుఁడు' అని వర్ణించియే ఉన్నారే! 'చిగురాకు విలుకాని చేతిచక్రమురీతి' అని శశాంకవిజయము-3 ఆశ్వాసము. ఇట్లే ఎన్నైన ఉదాహరణములీయవచ్చును. పోనీ, వీరు చేసిన సవరణ అయినా బాగున్నదా? 'చెఱకు' అని ఎవరైనా అందురా? 'చెఱకు' అనివ్యవహారము, ప్రయోగములు. 'వెలయంగఁ జెఱకువిలుగొని' అని సవరణచేసిన ఒకరీతిగా ఉండియుండును.

(8) మూలములో నున్న పద్యములను కొన్నిటిని కారణము తెలుపకుండ తీసివేసినారు; (చూ. 52 పుట) "చ. ఒగిపదుమూఁడు......"

ఈరీతిగా 'శోధన' యందు చాల లోపములున్నను, పూర్వపు పండితులవలె పంతులుగారు పాఠములను రూపుమాపలేదు. గ్రంథములో తమ అభిప్రాయానుసారములైన పాఠముల నచ్చటచ్చట 'దూర్చి' నను, మాతృకలోని పాఠములనుమాత్రము వారు సూచించి మహోపకారమును చేసినారనియే చెప్పవచ్చును. వ్రాతప్రతులను సంప్రతించి సరియగు పాఠమును నిర్ణయించుపద్ధతి యింకను మన తెనుగు దేశమువారికి తెలియదు. ఆవిధానము చాలకష్టమైనది. దాని నింకను మనము పాశ్చాత్త్యులనుండి నేర్చుకొనవలసియున్నది.

ఇక శ్రీ రామయ్యపంతులుగారు వ్రాసిన తెనుగుపీఠికను కొంత విమర్శింతము. మొదటిది గ్రంథకర్తృ నిర్ణయము. "లోకమందెల్ల నీ గ్రంథము వేములవాడ భీమకవికృత మనియే ప్రతీతికలదు. అప్పకవ్యాదిలాక్షణికుల మతము కూడ నిదియే. అనేకములగు వ్రాతపుస్తకముల యట్టలమీఁదఁ భీమనఛందస్సు, అని వ్రాయఁబడియున్నది.'' ఇది అంతయుసత్యమే, కాని వ్రాతపుస్తకములో రామయ్యపంతులుగారు చూచినంతమట్టుకును, మేము చూచినంతమట్టుకును, 'జ'లోని అవతారిక మరియెచ్చటను కానరాదు. పోనీ, ఆ అవతారిక ప్రక్షిప్తముకాదనియే అనుకొందము. అవతారికలో 'వేమనవాడను వెలసిన, భీమేశ్వరు కరుణగల్గు భీమసుకవి' దీనిని రేచనమీద చెప్పినట్లున్నది, సరియే; కాని, 'అనవద్యకావ్యలక్షణ' (పుట-2)అనుపద్యమునకు పూర్వము 'పరఁగిన

విమలయశోభా, సురనిరతుఁడు భీమనాగ్ర సుతుఁడు! ఈకృతికి రేచనకు సహాయుఁడై నట్లు 'బ' ప్రతిలో నున్నదిగదా. భీమనయును భీమనాగ్రతనూజుఁడును ఒక్కరగుదురా? ఇట్లే 25-వ పుటలో "జననుత భీమతనూజా" అని యొకసంబోధన కలదు. ఇదియెవరికి చెందును? రేచన భీమతనూజు డనుకొనవలెను. లేదా, భీమతనూజుడే యీగ్రంథమును వ్రాసెనను కొనవలెను. అన్నిచోట్లను రేచన యీగ్రంథమును రచించినట్లు స్ఫురింపజేసి ఈచోటను పైనిచెప్పిన పద్యములోను భీమతనూజుఁడు భీమనాగ్రసుతుడు దీనిని రచించినట్లు చెప్పుట సరిపడదు. "పరఁగిన విమలయశోభా సురనిరతుఁడు భీమనాగ్రసుతుఁ డఖిలకళా" అనుటకు మారుగా "పరఁగిన విమలయశోభా, సురనిరతుఁడు భీమనాగ్రజుడు నఖిలకళా" అనియొక పాఠమున్నది. ఇట్టిపాఠమును చూచియే కాబోలు మ. రా. రా. చిలుకూరివీరభద్రరావుగారు "కాకతీయ ప్రతాపరుద్రుని కాలమున వర్ధమానపురమునేలిన భీమరాజుతమ్ముఁడైన గోకర్ణుఁ డీగ్రంథమును రచించి కల్యాణపురాధీశ్వరుఁడైన జగదేకమల్లుని సేనాపతి యగు రేచభూపాలుని కంకితము చేసె" నని వ్రాసియుందురు. భీమనాగ్రజు డనిన అన్న యగునుగాని తమ్ము డెట్లగునని ఆక్షేపణ రావచ్చును. భీమనసోదరుడని సాధారణముగా అర్థముచెప్పికొనిన ఈఆక్షేపణతప్పును గాని అది కొంచెము క్లిష్టమే. రేచన కోమటి యైయుండగా 'భూపాల' శబ్ద మాతనివిషయమున ప్రయోగించుటయు ఒకఆక్షేపణయే, కాని, అతనిపదవినిబట్టి ఆ 'భూపాల' బిరుదమున్నదనుకొనుట తప్పు కానేరదు. వైశ్యులకుకూడ 'రాజ' శబ్ద మనుప్రయుక్తమైయుండుట సర్వసాధారణమే. "భీమనాగ్రజుఁడు" అనుపాఠమే సరియైన దైనయెడల వీరభద్రరావుగారి వాదమునకు 'ప్రమాణము'ను, 'ఆధారము'ను ఏర్పడునని చెప్పకతప్పదు. ఇందువలన శ్రీరామయ్యపంతులవారి వాదమునకుకూడ భంగముకలుగదు. కవిజనాశ్రయకర్త గోదావరీ మండలమునుండి బయలుదేరి నైజాము రాష్ట్రములోనే వాసము చేయును. కాని, గ్రంథకర్తమాత్రము భీమన కాకపోవును. ఇది లోకప్రతీతికి విరుద్ధమగును. గోదావరీమండలమువాడును కాకపోవును. ఇదికూడ అనాదిగా వచ్చుచున్న సామాన్యలోకప్రతీతికే కాక విద్వల్లోక ప్రతీతికికూడ విరోధమగును. భీమన నైజామురాష్ట్రమువాడను ప్రతీతి శ్రీరామయ్యపంతులుగారా ప్రాంతములవారి యొద్దనుండి ఉత్తరములను బయలుదేర తీసినతరువాత వచ్చినదిగాని, అంతకుపూర్వము లేదు. ఇట్టి 'ఉత్తరములను' పుట్టించియే పంతులుగారు ఓరుగల్లువాదములో కొంతవరకును కృతకృత్యులైరి. వారి ఓరుగల్లువాదము సరియైనదనికాని, కాదని కాని యిచటచెప్పుట మాఉద్దేశము కాదు. ఆవిషయమై మరియొకసారి ముచ్చటింతుము. పూర్వకాలపు నిదర్శనములను చూపక వాదములో కక్షవహింపగలవారి 'ఉత్తరములను' పుట్టించుటమాత్రము సరికాదని మనవిచేయుచున్నాము.

పైని వ్రాసినదానినిబట్టి భీమన యెవ్వరో తెలియదుగాని, రేచఁడుమాత్రము కవిజనాశ్రయకర్తృత్వముతో సంబంధముగలిగియుండె ననిమాత్రము మిగిలినది. ఈరేచఁడు 'కమలాధీశుఁడు, కవిజనాశ్రయుఁడు, కవీంద్రాభరణాయమానుఁడు, జినమతహితుఁడు, వాగ్వధూవల్లభుఁడు, వారశ్రీవల్లభుఁడు, శ్రావకాభరణాంకుడు, శ్రావకాభరణుఁడు, శ్రీదేవీప్రియుఁడు, శ్రీనివాసుఁడు,' అనితప్ప అతని గురించి మరియెట్టి సంగతియు తెలియదు. ఏకాలమువాఁడోకూడ తెలియదు. పోనీ, భీమనయే ఈగ్రంథమును రచించెనను వాదము నంగీకరించి గ్రంథకర్త దేశకాలములను నిర్ణయింపఁజూతము.

భీమకవి దేశము

గోదావరీమండలమున కాకినాడకుసమీపములో వేములవాడ అనుగ్రామ మున్నది. వేములవాడ కామడదూరములో దాక్షారామ గ్రామమున్నది. అందులోని భీమేశ్వరుని అనుగ్రహమున భీమన పుట్టెనని యీ ప్రాంతము లందు ప్రసిద్ధి. 'అప్పాలు కప్పలగుట' ఈ ప్రాంతపు ప్రతీతియే. శ్రీరామయ్యపంతులువారు వ్రాయించి తెప్పించిన 'ఉత్తరము'లో (షప్పల)వారిపే రుదాహరించబడినది. వారి యింటిపేరు అప్పాలవారట. గోదావరీప్రాంతములోకూడ అప్పలవారు లేకపోలేదు. ఆ యింటిపేరుగల నాలుగైదుకుటుంబములవారితో మాకు పరిచయమున్నది. వారు మా బంధువులే. వారిపేర మే ముత్తరము వ్రాసి భీమకవికథకును మీయింటిపేరుకును సంబంధమున్నదా అని అడిగినయెడల తప్పక ఉన్నదనిచెప్పుదురనియే మానమ్మకము. అందుచేత అట్టిఉత్తరము వారికి వ్రాయ బూనుకోలేదు. కరీంనగరంజిల్లాలోని గ్రామము వేములవాడ కాదేమో, లేములవాడ లేక లేమలవాడ యేమో అని మాసందేహము. దానివ్యవహారనామము లేముల (లేమల) వాడయని రామయ్యపంతులవారు వ్రాసిరి. వేములవాడకూడ కావచ్చును. పూర్వవ్యవహారముకూడ లేమలవాడ, లేమ్బలవాడ, అనియే. లేమలవాడ వేమలవాడగా ఏశబ్దశాస్త్రము ప్రకారమైనదో తెలియరాకున్నది. అంతస్థమగు 'ల'కారము దంతోష్ఠ్యమగు 'వ'కారముగా సాధారణముగా తెనుగులో మారుట అరుదు; మారదనియే చెప్పవచ్చును. కవిజనాశ్రయము అవతారికలోనున్నది వేమనవాడ. 'న'కారము'ల'కారముగాను, 'ల'కారము 'న'కారముగాను మారుటకలదు. అందుచేత వేమనవాడ వేమలవాడ, వేములవాడ, కావచ్చును. ఒకవేళ లేమలవాడయే వేములవాడఅయియుండవచ్చుననియు, 'లేమలు' భోగస్త్రీలు నివసించుటచే నాగ్రామమున కాపేరువచ్చియుండుననియు అనుకొన్నను, దాక్షారామప్రాంతములందు మాత్ర మట్టిభోగస్త్రీలు లేరని యెవ్వరు చెప్పగలరు? శ్రీనాథుడు భీమఖండములో దాక్షారామమున నీభోగస్త్రీలనుగురించి విస్తరించి వ్రాసియున్నాఁడు. * దాక్షారామములోని 'సానికూఁతులు, సానికూఁతు' లని

* భీమఖండము— I-87-94, 106, 111, 112, 115, 117; III-63, 92, 93, 125; V-110; VI-77-9.

కలవరించినాడు. ఇక, జైనకోమట్లు హైదరాబాదుప్రాంతములలో ఇప్పుడుండుటబట్టి అప్పుడును ఉండిరని ఊహించుట కవకాశములేదు. ఆకాలములో అచ్చట వా రుండిరని ప్రత్యేక ప్రమాణములను చూపించవలసియున్నది. గోదావరీప్రాంతమందలి జైనులు బ్రాహ్మణుల బాధ పడలేక కాలక్రమమున పరదేశములకు పోయియుండకూడదా ? వేంగిదేశములో మాత్రము చాలకాలము వరకును జైనమతము వ్యాపించియుండె ననుటకు ప్రబలనిదర్శనము లున్నవి. ఏమతమైనను దేశములో ఒక్కసారిగా అంతరించిపోదు. భీమకవికాలమునాటికి జైనులు గోదావరీప్రాంతములం దుండిరనుట అసంభవముకాదు. ఇప్పటికిని రామతీర్థములో రెండుజైనకుటుంబము లున్నవి.

ఇప్పటికి తేలినఅంశము లివి! గోదావరి జిల్లాలో వేములవాడ ఉన్నది. కరీంనగరము జిల్లాలో వేములవాడఉన్నది. ఇచ్చట దాక్షారామమున్నది; అచ్చటనుదాక్షారామమను వాడుక పురాణములలోనున్నది. ఇక్కడ భోగస్త్రీ లున్నారు;అచ్చటనుఉన్నారు. ఇచ్చటజైనులుండేవారు; అచ్చటను ఉండేవారేమో ? ఇక్కడ అప్పలవారున్నారు; అక్కడ అప్పాలవా రున్నారు. ఇక్కడ భీమేశ్వరాలయమున్నది; అక్కడను భీమేశ్వరాలయమున్నది. భీమకవి యిక్కడివాడని యిక్కడి ప్రతీతి అనాది; అక్కడివాడని ప్రతీతి యిప్పుడైనా బయలుదేరినది. రాజరాజనేవా డక్కడనుండేవాడని చరిత్రాధారములేని యొకకథ అక్కడనున్నది. సారంగధరకథ అక్కడిదేఅని అక్కడిప్రతీతిఅట. ఇచ్చటిదే అనుప్రతీతి ఎప్పటినుండి వచ్చుచున్నదో తెలియదు. ఈసారంగధరకథ ఏ ప్రాంతమున కాప్రాంతములోనే తయారగుచున్నది. ఇక నేమిగతి? భీమకవి యెక్కడివాడు?

ఈరీతిగా భీమకవి ఎక్కడివాడో ఏకాలపువాడో చెప్పుటకుగూడ చరిత్రాధారము లేవియులేవని స్పష్టము. ఇక చాటుపద్యములు మాత్ర మున్నవి. చాటుపద్యములలో మన యిష్టమువచ్చినవానిని ప్రమాణములుగను, మన మేర్పరచుకొన్న సిద్ధాంతమునకువిరుద్ధము లైనవానిని అప్రమాణములుగను ఎంచుకోగూడదు. సాధ్యమయినంతమట్టుకు వాటికి సమన్వయముచేసికోవలెను. భీమకవి ప్రతాపరుద్రునికాలములో నున్నవాడని చెప్పుటకు గలకారణములు కొన్ని మంచివి లేకపోలేదు.

1. "చక్కదనంబు దీవియగు సాహిణిమారుడు" అనుపద్యమును రామయ్యపంతులుగారు తగినకారణముచూపక, అప్పకవిని ధిక్కరించి విడిచిపెట్టినారు. ఇది మాకు సమంజసముగా కాన్పించలేదు. అప్పకవి యొకసందర్భమున ప్రామాణికుడును మరియొకసందర్భమున అప్రామాణికుడును నగుచుండవలయునా? అదియు మన సిద్ధాంతమును బాధించుపట్లనేనా? 'ద్వీపమునకు నాకమునకు' అను ఆదేశవళిలక్ష్యమును దానికి లక్ష్యముగా నిచ్చినపద్యములును ప్రక్షిప్తములే యను

కోందము.* ప్లుతయతికుదాహరణముగా "ఏజనకాత్మజన్" అను భాస్కరరామాయణములో నుండి ఉదాహరించినపద్యము నేల తీసివేయవలయును? తమసిద్ధాంతమునకు విరుద్ధమనియే కదా. "పరంగినవిమలయశోభా, సురనిరతుండు భీమనాగ్రజుండు నఖిలకళా, పరిణతుండయ్యెను భూసుర, వరుండు ప్రసాదోదితధ్రువశ్రీయుతుండై" అను పాఠము సరియైనదైనయెడల వీరభద్రరావుగారివ్రాత కాధారముకలిగి కవిజనాశ్రయకర్త ప్రతాపరుద్రుని కాలమువాడగునుగదా!

ఇక "ఘనుండన్ వేములవాడ వంశజుండ ......వెలుంగాధీశ (తెలుంగాధీశ, కళింగాధీశ) అనుపద్యముపై రామయ్యపంతులుగారు చేసిన చర్చను కొంతవిచారింతము. వారు 'వెలుంగాధీశ, తెలుంగాధీశ' అనునవి వ్యాకరణదుష్టములని త్రోసివేసిరి. వెలుంగు + అధీశ, తెలుంగు + అధీశ అని వారిపదచ్ఛేదము. వెలుంగ + అధీశ, తెలుంగ + అధీశ అని మాపదచ్ఛేదము. ఇచట వెలుంగ, తెలుంగ అనునవి సంబోధనాంతములుకావు. అవి దేశనామస్వరూపములే అని మామతము. త్రిలింగశబ్దభవము తెలంగ, తెలుంగ అనియగును. బర్మాదేశములో 'తెలంగ' 'తెలైంగ' అని తెలుగువారికి పేరు. గౌడభాషలలో తెలుగువారికి 'తెలంగ' అనియే నామము 'తెలగా'లనువర్ణమువారు ఆంధ్రదేశీయులే', వారు తెలుగువారే. 'తెలుంగ'అనునది దేశనామమైనప్పుడు 'తెలుంగాధీశ' అనుసమాసము నిర్దుష్టమగును. అట్లే 'వెలుంగ'కూడను; దానికి 'వెలంగ' అని రూపాంతరము. వెలంగవాడ, వెలుంగవాడ, అనుపదములే వెలుంగోడ, వెలంగోడ అనియగును. ఆవాడవారే వెలుగోటివారు. ఇచట 'వెలంగ' అనగా వెలగచెట్టు అని యర్థముకాదని మాయభిప్రాయము. 'వెలంగ' అనుజను లుండు'ప్రూడి'యే వెలంగప్రూడి, వెలగలప్రూడి, అనియైనది, 'తెలుంగాధీశ' అనుపాఠము సరియైనప్పుడు, 14-వ శతాబ్దములోని తెలుంగురాయడే ఈతెలుంగాధీశుడైనప్పుడు, భీమకవికూడా 14-వ శతాబ్దమువాడే అగునుగదా, అట్లే 'వెలుంగాధీశ' అను పాఠమును సరియైనప్పుడు కాలనిర్ణయము చేయుట కష్టమే యగునుగాని, 14-వ శతాబ్దమునాటి ఒకవెలుంగాధీశుని కాపద మేల చెందకూడదో చెప్ప వీలులేదు.

ఇంక, 'కళింగాధిశ' యనుపాఠము మిగిలినది. 'కళింగగంగు' ఎవ్వరో కూడ నిర్ణయింపవలసియున్నది. త్రికళింగాధిపతియగు అనంతవర్మయే ఈకళింగగంగని రామయ్యపంతులుగారిసిద్ధాంతము. వేంగీరాజగు రాజ

* ఇందుకును అంతప్రబలకారణములు కాన్పింపవు. అనేకప్రతులలో పదివళ్లేకాక ఇతరయతులును కాన్పించుచున్నవని రామయ్యపంతులుగారే వ్రాసిరి. కవిజీవితములో భీమనచాటువని పదివళ్లను పేర్కొనిన సీసపద్యములోకూడ ప్రాసయతి ఎక్కువగానున్నది. అభేదయతి, వృద్ధియతి, ఆదేశయతి, నిత్యసమాసయతి, కాకుస్వరయతి, పూర్ణయతి, మొదలనవి మొదటి పదివళ్లలోను అంతర్భాగములే అను ఉద్దేశముతో యతుల సంఖ్య పదియే అని కవిజనాశ్రయములో చెప్పబడియుండవచ్చును. సులక్షణసారము, రంగరాట్ఛందస్సు, మొదలగులక్షణగ్రంథములలో యతులసంఖ్యను తొలుతనిర్ణయించియు, ఎక్కువయతులకు లక్ష్యలక్షణములను పేర్కొనుట ఆచారమే.

రాజ చోడగంగునుకూడ నీ రుదాహరించిరి; కాని, అతడు కళింగరాజు కాడని కాబోలు అతనిపేరును విడిచిపెట్టి, అతనికి సమకాలికు డైన అనంతవర్మపేరునే ఎత్తుకొనిరి. అనంత వర్మకు అనంతవర్మ చోడగంగదేవుడనుపేరు శాసనములందు కనబడుచున్నదిగాని, చోడ కళింగగంగదేవుడని పేరు లేదు. కళింగగంగను పేరు వచ్చుటకై అనంతవర్మ నామములో రామయ్యపంతులుగారు 'కళింగ' అనుమా టను 'దూర్చి' యుందురు. కళింగగంగని అనం తవర్మకు ఎచ్చటను పేరులేదు. అయినను అనంతవర్మను కళింగగంగని పిలుచుటకు మా కభ్యంతరము లేదు. కాని కళింగదేశములో చోడగంగనామము గలవారందరిని కళింగగం గని పిలుచుటకు వారి కభ్యంతర ముండకూ డదుగదా

ఎలమచ్చిపురాధీశ్వరు డగు చోడగంగ నురాజు శాకాబ్దములు 1413 ప్రాంతములో నున్నట్లు శాసనములు తెలుపుచున్నవి. ఇత నికి సర్వలోకాశ్రయవిష్ణువర్ధన మహారాజని బిరుదున్నది. ఎలమచ్చి కళింగములోనిదే భీమకవిచూచిన కళింగములోనిదే. భీమకవి చూచిన కళింగగం గీత డేలకాకూడదు ?

మరి 'కళింగాధీశ' అనుమాటను గూర్చి విచారింతము. కళింగాధిపతియను సంజ్ఞతో తూర్పుగంగవంశపురాజు లిద్దరున్నారు. కొల్లే రు తామ్రశాసనములోని విజయనందివర్మ యొకడు, అతనికొడుకు కోమర్తితామ్రశాస నములోని చందవర్మ రెండవవాడు. భీమకవి వీరికాలములోని వాడైనయెడల నన్నయకు చాలపూర్వుడగును. కవిజనాశ్రయము భాషను బట్టి యీతడంత పూర్వకాలమువాడని చెప్ప వీలుపడదు. త్రికళింగాధిపతి యనుబిరుదము గలతూర్పుగంగ రాజులు చాలా మంది యున్నారు. వజ్రహస్తుడు, రాజరాజు మొద లగువారు త్రికలింగాధిపతులే కాని కళింగ రాయ అనిగాని కళింగగంగ యనిగాని పేళ్లు లేవు.

కాలింగరాయ డనుపేరు దక్షిణదేశపు శాసనములందు తరుచుగ కాన్పించుచున్నది. ఈశాసనములన్నియు పదునాలుగో శతాబ్దము లోనివి. తిరువాడిలోని దేవాలయమున కొక కలింగరాయడు భూదానము చేసినట్లున్నది.[1] మారవర్మ త్రిభువనచక్రవర్తికులశేఖరదేవుడు (1) (1268-1308) కలింగరాజు ఆజ్ఞను స్థిర పరచినట్లు మరియొకశాసన మున్నది.[2] రెం డవరాజేంద్రచోళునికో మొదటికులోత్తుంగుని కో మంత్రియగు సభానర్తకుడనువాడు సిద్ధ లింగమఠములో సిద్ధలింగేశ్వరాలయమును కట్టించినట్లు మరియొకశాసన మున్నది.[3] ఈ సభానర్తకునికి 'కాళింగరాజ' 'మానావ తార' అనుబిరుదములున్నవి. చెంగల్పట్టు జిల్లాలోని నెరుంబూరులో చక్రవర్తి కాలింగ రాయనికొడుకు వరాహపిళ్లె యనువాడు సం 1367 రము మేనెల తే 24 దీని ఒకదానము చేసిన ట్లొకశాసనము కలదు.[4] మరియొక శాసనములో కాలింగరాయ డొకస్త్రీకి జరి మానా విధించినట్లును, ఆమె దానిని చెల్లించక

1 No. 40 of 1903. 2. No 566 of 1913. 3. No. 367 of 1909. 4. No. 271 of 1912.

పోగా ఆమెభూములను ఏలము వేయించినట్లును, ఎవ్వరును ఏలము పాటపాడనట్లును, అందుచేత దేవాలయమువారే ఆభూమిని కొనినట్లును ఉన్నది.[1] కాలింగరాయడును మరియిద్దరును జనులను బాధించి, తాము చేయవలసిన పనిని సరిగా చేయనందున ఆనాటిరాజు వారిని శిక్షించినట్లు క్రీ. శ. 1357 లోని యొకశాసనములో నున్నది.[2] రాయకళింగగంగు రాజ్యభ్రష్టుడయ్యె ననుకథ కిదియే మూలమగునేమో ! మధురజిల్లాలోని కురువిత్తూరై గ్రామములోని యొకశాసనమునందు కాలింగరాయడు శ్రీవైష్ణవులకు చేసినయొక దానమును స్థిరపరిచినట్లున్నది.[3] నెల్లూరులోని రంగనాయకాలయమునకు[4] కాలింగరాయడు 'సిఫార్సు' చేయగా సుందర పాండ్యుడనురాజు ఒక గ్రామము నిచ్చివేసెనట. కాలింగరాయని కోరికపైని త్రిభువనచక్రవర్తి శ్రీవల్లభదేవుడను నామాంతరముగల పాండ్యరాజగు జటావర్మ రామనాడుజిల్లా తిరుపత్తూరులోని యొకఆలయములకు రెండుగ్రామముల నిచ్చెనని ఒకశాసనమున్నది.[5] త్రిభువన చక్రవర్తికోనేరిన్మేల్కొండా నమరాజు సేలముజిల్లాలోని యొకఆలయమునకు ఒక గ్రామమునిచ్చెను. ఆ శాసనమున కళింగరాయడు సాక్షిగా నిరూపింపబడెను.[6] తంజావూరుజిల్లాలోని కోవిలూరనున్న దేవాలయమునకు కాలింగరాయడు కొన్నిదానములు చేసెను. ఇట్లే తిరునల్వేలిజిల్లా శెర్మాదేవియందును, ఆళ్వారుతిరునగరియందును, తిరుచునాపల్లిజిల్లాలోని సెన్నినవము, శ్రీరంగములలోను కాలింగరాయని శాసనములు గలవు. ఈకాలింగరాయడు చాలప్రసిద్ధుడై పదునాల్గవశతాబ్దమునం దుండెను. మనభీమకవి ఈ కళింగరాయని వద్దకే పోయెనేమో !.

కవిజనాశ్రయములో పదియతులును, కావ్యాలంకారచూడామణియందు పండ్రెండువళ్లును, అనంత డిరువదినాల్గువిశ్రమములును, ఆమీదకొందరు కవిగ్రామణు లిరువదియేడును విశ్రమముల చెప్పిన ట్లప్పకవిచెప్పి తాను నలభైయొక్కయతులను వివరించినాడు. కవిజనాశ్రయములోని యతులసంఖ్య అన్నిటిలోను తక్కువది కాబట్టి భీమకవి అందరికంటె ప్రాచీనుడు—అని రామయ్యపంతులుగారి వాదము. ఈవాదమును చాలమంది అంగీకరించినారు. కాని, చిన్నమనవి—సులక్షణసారకర్త,

"కృతుల ముప్పదియొక్కటి – యతులు దనరు
సత్కవులసమ్మతంబున – (జలధిశయన)"

అనిచెప్పినాడు. అందుచేత నాతడు అప్పకవికి పూర్వుడని చెప్పనగునా? రంగరాట్ఛందస్సులో ఇరవైయెనిమిదియతులు చెప్పబడినవి. అందుచేత కస్తూరిరంగకవి కూడ అప్పకవికి పూర్వుడగునా? కనుక ఈవాదములో కూడ అంతబలమున్నట్లు కనబడదు.

రామయ్య పంతులుగారి ప్రకారము మధ్యాక్కరలో నాలుగవగణము మొదట యతి ఉండుట ఆధునికమతము. నన్నయభట్టులో అయిదవగుణము మొదట నున్నది. ఎఱ్ఱాప్రెగడలో నాలుగవగణము

1. No. 277 of 1910. 2. No. 240 of 1912. 3. No. 319, 320, 326 of 1908
4. No. 196 of 1894 5. No. III of 1908, 6 No 4240 of 1913

మొదట నున్నది. భీమకవి గ్రంథములో మధ్యాక్కర నాలుగవగణము మొదట యతి ఉండుటచేత, భీమకవి నన్నయ ఎఱ్ఱాప్రెగడ లమధ్యనుండవలయునట. ఎఱ్ఱాప్రెగడతరువాత నేలఉండకూడదో తెలియరాకున్నది.

ఈరీతిగా రామయ్యపంతులుగారి కవిజనాశ్రయశోధనను, వారుదానికి వ్రాసినపీఠికను సూక్ష్మముగా విమర్శించితిమి. ఇందువలన వారుచేసినకృషిని కొంచెపరుచుట మాఉద్దేశముకాదు. వారు తమబుద్ధికి గోచరించినట్లు విమర్శించి చాలశ్రమపడి, మంచిపీఠికతో కవిజనాశ్రయమును లోకమున కప్పగించినారు. కాని, వారుభీమకవి దేశకాలములనుగూర్చి చేసినచర్చలో లోపములున్నవని మాత్రము చెప్పకతప్పదు. గ్రంథశోధనయందును, సంప్రతీకరణమునందును మాకు తోచిన కొన్నిలోపములను చూపించియున్నాము. భీమకవిదేశముగూర్చిగాని, కాలముగూర్చిగాని యింకను ఇదమిత్థమని తేలలేదని మనవిచేయుచున్నాము.



# మేఘము

సాహిత్యసరస్వతి సీరిపి ఆంజనేయులు గారు

జనకుఁడగు వారి, ధరణి నాజనని యగును
గగనమగు దాది, నేదాని కందునగుదు,
పని మహార్ణవ రోమకూపములనుండి
తీరములనుండి చనుచుంట మారుచుందు.

నేను మరణింప నిందునెందేని; కాని
యరుణకిరణసంతప్తంబు లగుచు, మిగుల
దప్పిగొనియున్న కుసుమసంతతులకొఱకు,
హ్రదినులనుండి- ఘనసముద్రములనుండి-
సేకరింతును నేను గ్రొం జినుకుగముల—
స్వప్నదశయందు, మధ్యాహ్నసమయమందు
ప్రాణఁ గోల్పడియున్న పత్రములకొఱకుఁ
జలువసీడలఁ గల్పింతు శ్రాంతినొందఁ

జిన్నిపిట్టలవేర్వేఱఁ జెట్లశిఖలఁ
దల్లియురమున నూఁగెడు తఱిని, నామె
యర్కభగవానుగూర్చి నృత్యంబుసల్పు
చుండి, సంతు నిద్దురపుచ్చు చుండువేళఁ
గాంచి, నాపక్షములనుండి మంచుసోనఁ
గురిసి, హాయిగ వాని మేల్కొల్పుచుందు—

అవలనవ్వాచుఁ బిడుగుతో నంబరమున
గమన మొనరించి, వర్షోపలముల రాల్చి,
యవనిఁ బచ్చికపట్టుల ధవళిమముగఁ
జేసి, వర్షరూపముఁ బొంది వాసిఁగాంతు....




పారనంది జగన్నాథస్వామి గారు, యం. ఏ. యల్. టి.

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రులవారు "భీష్మప్రతిజ్ఞ" ఉరఫు "ప్రతిజ్ఞాశాంతనవము" అనే నాటకము రచించకపూర్వమే ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున సుప్రసిద్ధులు. "సంస్కృతకవుల జీవితములు" "భాసనాటకకథలు" "ఆంధ్రదశరూపకము" "సత్యకీర్తినాటిక" ఈ మొదలైన గ్రంథములవలన వారి పాండిత్యము ఎట్లు ఉభయభాషలను స్వాధీనము చేసుకొన్నదో స్పష్టమవుతున్నది. "సమధిగతశబ్దవేదాంతశాస్త్ర సంస్కృతాంధ్రసాహిత్య సత్కవిత్వాంచితులు" "గద్యపద్యాత్మకానేకకావ్యకర్తలు" అగు శాస్త్రులవారు కవితాప్రతిజ్ఞగా వ్రాసిన ఈక్రొత్తనాటకమును విమర్శింపబూనుటలో కొంతసాహసము నాయందు కలదని నేనే ఎరిగినప్పటికీ, నా "రసాస్వాదనాభినివేశమును సార్థకము" చేసుకొనవలసి ఉన్నదని ఇందుమూలమున వ్యక్తము చేస్తున్నాను. కృతిని చక్కగా మథిస్తేనే కాని కవిహృదయము లెస్సగా గ్రహించ వీలుకాదనిన్నీ ఆలాగు చేస్తేనేకాని రసాస్వాదనసుఖము పొందవీలుండదనిన్నీ, విమర్శకులందరూ ఎరుగుదురు. విమర్శనప్రయోజనము తప్పులనుపట్టి కృతిని నిరసించుట కాదనిన్నీ, కృతియొక్క ఆహ్లాదకరత్వమును విమర్శకునికి తెలిసినంతవఱకు వెల్లడిచేయుటనిన్నీ నేను గ్రహించిఉండే ఈవ్యాసమును వ్రాయ సమకట్టినాను. ఈవ్యాసములో చర్చకంతకూ అదేప్రయోజనము.

ఈనాటకమునకు ఇతివృత్తమును మహాభారతము నుండి గ్రహించినట్లు కవే స్పష్టముగా ప్రస్తావనలో చెప్పినారు. ఆకథ అందరికీ తెలిసినదే. దీనిని రూపకముగా సవరించుటకు పూనుకొన్న శాస్త్రులుగారు కృతకృత్యులని చెప్పవలెను. ఇతివృత్తము చాలా చక్కనిది. విషయములో గాంభీర్యము కలిగి రసావిర్భావమునకు పాత్రపోషణమునకు చక్కగా అమిరిఉండి, కథారచనకు వీలిస్తూ ఉన్న భాగమిది. ప్రస్తావనలో సూత్రధారుడు "భీష్మునిచరిత్ర మిప్పుడు ప్రదర్శనపాత్రమ"ని చెప్పగా, నటి నవ్వి "భీష్మచరిత్ర మనగా నెంతయో కలదు. అదంతయు నభినయముగా ప్రవర్తించుట శక్యమగునా" అని సాకూతముగా అడగగా, సూత్రధారుడు ఈకథాభాగమునే *నిర్వచించి చెప్పినాడు. వారిసంభాషణములో ఉట్టంకించినకారణము, నేను సూచించే కారణము ఒకటికాకున్నా, భీష్ముడెంతో పవిత్రచరిత్రుడని అతనిచరిత్రనంతనూ రూపకముగా చేయకుండా ఈభాగముతోనే విరమించిన కవియొక్క రచనారుచిని మనము మెచ్చుకోవలసినదే. చరిత్రనంతనూ నాటకముగా చేసేటప్పుడు ఉండేసుంభన వేరు, ఈఒక్క అంశమునే ఎంచినపుడు ఉండేసుంభన వేరు. ఈరుచిని శేషమును మరికొంచెము సూక్ష్మముగా కవి చూపియుండెనా మరీ బాగుండియుండును. దేవవ్రతచరిత్రలోని ఈప్రతిజ్ఞాంశము నొక్కదానినే ఎంచి చరిత్రతో సంబంధించిన మిగిలిన అంశములను విడిచిపెట్టుట కెట్టిసబబులు కలవో అవన్నీ కూడా ప్రతిజ్ఞాపూర్వమైనఅంశములను విడవవలసివచ్చుటకున్నూ వర్తించునుకదా. దేవవ్రతునిజన్మ మొదలైనవి ఎట్లు అప్రస్తుతములో, ఆలాగే దేవవ్రతుని శంతనుడు గంగాదేవినుండి సంపాదించి తననగరమునకు తీసుకొనిపోవుటకూడా ప్రతిజ్ఞాకథకు అప్రస్తుతము. దేవవ్రత

* శంతనునకు సత్యవతిపై మోహము కలుగుట; ఆమెయందు పుట్టేవానికి రాజ్యము, పట్టముకట్టే షరతుపై వివాహము చేసగునని దాశరాజు చెప్పుట; ఆసంగతి విన్న దేవవ్రతుడు శాశ్వతబ్రహ్మచర్యము పూనుట; సత్యవతీశంతనుల వివాహము. ఇది నాటక కథాభాగము.

చరిత్ర ఎప్పుడైతే నాటకవస్తువు కాలేదో అప్పుడే ఈ భాగముకూడా విసర్జనీయము; దీనినికూడా విడిచే నాటకము ప్రారంభించియుండునా, సూత్రధారుని 'మాటలలోగల రుచివిశేషము బాగా వ్యక్తమైఉండును. ఈ కథాంశముతో భారతమందున్న కథావర్ణన ప్రారంభమగుటచేత కవిచేతులలో నాటకముగా మారేటప్పుడు కూడా ఈభాగము విడవక అంటిపెట్టుకొని ఉండిపోయెనా అనేసంశయము న్యాయముకాదు కాబోలు! లేదా రసపోషణకై కవి దీనిని ప్రయోజనపూర్వకముగా నిలిపియుంచెనని ఊహించ సాధ్యము. రసవిషయమై ఈభాగ మెంతఆవశ్యకమో ముందు చెప్తాము గాని ఇక్కడమాత్రము కథారచన కిది అనర్థదాయకమని చెప్పకతీరదు. అదెట్లో ముందుముందు చర్చింతము.

మూలకథకున్నూ, రూపకకథకున్నూ భేదములున్నవి. "భారతమునం దీకథ మిక్కిలి సంగ్రహముగా నున్నది. కావునఁ గొన్నిక్రొత్తవిషయములను గల్పించియు, మూలకథలోని కొన్ని యనుచిత విషయములను వదలియు, మఱికొన్నిటిని జక్కబఱచియు, కథౌచిత్యమును పాత్రౌచిత్యమును బాటించి శాస్త్రిలవారీనాటకమునువీరరసప్రధానముగా నతిమనోహరముగారచించిరి." అని పీఠికాకారులు వ్రాసినారు. తెలుగుభారతములో 32 పద్యములలోను సంస్కృతములో సుమారు 100 శ్లోకములలోను ఉన్నకథను ఆరంకములనాటకముగా సవరించేటప్పుడు, క్రొత్తగా చేర్చినవేవో సవరించినవేవో విడదీసి చెప్పుట సాధ్యముకాదు. మూలములో ఒక్కమాటలో సూచితమైనసంగతిని ఒకఅంశముగా నాటకములో కల్పించేటప్పుడు, అదిక్రొత్తదా, లేకసవరణా ఎట్లుచెప్పగలము? ఇట్టిచిన్న సంగతులుచాలాఉన్నవనిఅంగీకరించి, వాటిలో ముఖ్యమైనవాటినే లెక్కవేయగలము. మొదటిఅంకములోని అశ్వమేధదిగ్విజయము, పరశురామునిఆశ్రమము; రెండోఅంకములోని పాంథాశ్రమము, గాంధర్వవివాహప్రయత్నము; మూడోదానిలోని దేవవ్రతునిదిగ్విజయము; నాల్గోదానిలోని సత్యవతీ- అయోగశృంగారము; ఐదోదానిలోని శంతనుని మనోభీష్టప్రకటనపద్ధతి, ఆరోదానిలోని దేవవ్రతదాశరాజసమాగమవర్ణనము- ఇవి ముఖ్యమైనవి.

ఈస్వంతకల్పనలలోకెల్ల మొదటి అంకములోని దిగ్విజయకథ చాలా ముఖ్యమైనది. దీనిరచనకై కవి, చాలాశ్రద్ధ తీసికొని యుండవలెనని నా ఊహ. దీనికి మూలము ఇట్లున్నది. "అతం డొకనాడు మృగయావ్యాజంబున గంగా సమీపంబునం జనువాఁడు; కడు నల్పప్రవాహంబై యున్నదాని గంగానదిం జూచి, యిది యేమినిమిత్తంబో యనుచు గొండొకనేల యరిగి కనియె ముందట ధనువభ్యసించుచు బాణసంహతి సేతుగా గట్టియున్న కుమారు. అప్పుడెఱుంగనేరక విస్మయాకులితచిత్తుండయి యుండె. అంత కోమలాంగి దివ్యనది ప్రీతితో జనుదెంచి పతికి సుతునిచ్చి గంగసనిన, తనయుతోడుకొనుచు భూవిభుండు తనపురంబునకు వచ్చె." శరసేతు నిర్మాణము, గంగాశంతనులు తిరిగి కలుసుకొనుట దేవవ్రతుని తండ్రికి ఇచ్చుట మూలములోనివే. వీటికి, పరశురామాశ్రమము, దిగ్విజయసంరంభము కలిపి, కథను సవరించి మొదటిఅంకమును కవి రచించెను. పరశురామాశ్రమము దిగ్విజయమంత కల్పితముకాదు. (చూ. తెనుగు భారతము ఆది. 70-169) * వీరరసపోషణము

* ఈపద్యము కవినాటకములో ఎట్లు ఉపయోగించెనో కొంచెము విమర్శింతము. ఇందులో దేవవ్రతునివిద్యాసంపాదనము వర్ణితాంశము. అందుచేత ఇది చరిత్రసంబంధమైనదై ప్రమాణభూత మగుచున్నది ఈవర్ణనలో తెలుగు సంస్కృతభారతములకు భేదమున్నది. నన్నయ్యకుఆధారమేదో నాకు ప్రస్తుతముకాదు. కాని నాటకకర్తకు తెనుగో సంస్కృతమో ప్రమాణము కావలెను. అట్లాకాకుండా వారివర్ణన స్వంతమైనది. ఎందుకీమార్పుచేసిరో నాకు తెలియలేదు. ఆలాగని మూలములను అనుసరించలేదని చెప్పలేము. సముడని అనటకంటె నేర్చుకొనెనంటే ఎక్కువ సమంజసమనా? సంస్కృతము: ఆది. 100.25-391. వసిష్ఠునుండి సాంగవేదములు నేర్చెను. 2. అస్త్రములలోను, యుద్ధములోను ఇంద్రునితో సముడు. 3. శుక్రునికి తెలిసినశాస్త్రము లితనికి తెలుసును. 4. అస్త్రములలో పరశురాముడంతవాడు. తెను : ఆది 4-169. 1. సకలవేదంబులు సదివె వసిష్ఠుతో 2. శాస్త్రముల్ శుక్రబృహస్పతుల్ నేర్చినయట్లై 3. అస్త్రవిద్యను పరశురాము డంత దక్షుడు 4. ఆత్మవిజ్ఞానంబునందు సనత్కుమారాదుల.

నాటకము: 5 పుటలోని పద్యము 1. ప్రాంజసువులు నాలుగు పరాశరునియొద్ద 2. ప్రసిద్ధశాస్త్రముల్ వసిష్ఠునొద్ద. 3. సాన్వీక్షికీవిద్యలు భార్గవునియొద్ద 4. ఆత్మవిద్యారహస్యంబు సనకసనందాదిమునులయొద్ద 5. ధనుర్వేదము పరశురామువద్ద

కాబట్టి దిగ్విజయము, దిగ్విజయముకాబట్టి ధనుర్విద్య, కాబట్టి గురువు, కాబట్టి అతని ఆశ్రమము, ఇట్లు పరంపరగా పరిణమించి ఈ సవరణ సిద్ధమైనదని చెప్పవచ్చునేమో. కాని పరశురామునితో నివసించిఉండునట్లుకాని అతనినుండి అస్త్రవిద్య నేర్చుకొనినట్లుకాని మూలములో లేదు. మూలములో ఉన్న శరసేతు నిర్మాణమును కల్పితమైన దిగ్విజయమునకు అంగముగా కవి సవరించెను కాని ఈ రెండింటికి కథా రచనలో ఎట్టి సంబంధమూ కానరాదు. ఇంతకూ ఈ శరసేతు వెందుకు? ఈదిగ్విజయవర్ణన ఉత్తరరామాయణములోని కుశలవులకథను అనుకరించెనా అని స్ఫురిస్తున్నది "పుత్రాదిచ్ఛేత్ పరాజయం" అనే న్యాయమును అనుసరించి చేసిన ఈవర్ణన బాగానే ఉండవచ్చును దేవవ్రత సంప్రాప్తికథయొక్క ఆవశ్యకత మాట అటుండనిచ్చి, ఆకథచెప్ప నిశ్చయించినపుడు మూలములోనున్న మార్గముకంటె నాటకములోని సాధనము ఎక్కువ ఆహ్లాదకరముగా ఉన్నదని చెప్పగలము. నాటకములోని మార్పు దిగ్విజయముతో అతుకునట్లుగాఉన్నది. వీరభటులు, సేనాని, పరాజితులుకాగా శంతనుడు సమీపించి బాలుని విజృంభణమును శరీరాకృతినిచూచి, ప్రథమదర్శనమునుంచీ ఉద్భవించిన వాత్సల్యమునకు వశుడై యుద్ధమును ఆపినవాడై పిల్లవాని ఊరుపేరు అడిగి, గంగాదేవి సమాగమ పూర్వవృత్తాంతమును జ్ఞప్తికి తెచ్చుకొని ఆ బాలుడే తనకుమారుడని గ్రహించుట; ఆతరువాతనే పరశురాముడు స్పష్టపరచుట; గంగాదేవి అప్పగించుట; ఈ కథంతా రంగముపై మనోరంజకముగా ఉంటుంది. కాని ఒకచిక్కు ఉన్నది. నగరములో ఉండవలసినరాజు అశ్వముతో పోవుసేనలో ఉండుట ఒక అప్రసిద్ధమైన ఏర్పాటు అవుతున్నది. అలాగుకాక, మునిబాలునిచే సంభవించిన సేనానీపరాజయవృత్తాంతమును విని శంతనుడు పట్టణమునుండి బయలుదేరివచ్చెనని సమాధానము చెప్పితే రాజనగరమైన హస్తినాపురమునకున్నూ ఈఆశ్రమస్థానమునకున్నూ ఉన్నదూరము చాలా తక్కువని చెప్పవలసి వస్తుంది. నాటకములోని కాలసూచనలను చూడండి. శరసేతువు పూర్తిఅయేసరికి జాము ప్రొద్దెక్కినది. గురుడు వచ్చేవేళ అయినది (చూ॥ 5 పుట); సంగరము పూర్తి చెందేసరికి గురువచ్చేడు. శరసేతువు సమీపించినాడు. ఈరెండింటికి అంతరమైన స్వల్పకాలములోనే ఈ దిగ్విజయ పరాజయము పూర్తి అయినది. జయసింహునివీకు, శంతనునికి వార్త, వాని రాక ఈ స్వల్పకాలములో జరిగినప్పుడు పట్టణమునకున్నూ ఆశ్రమమునకున్నూ దూరము తక్కువని చెప్పక తీరదు. అంత దగ్గరనే ఉన్న ఈ ఆశ్రమము, ఈబాలుని సంగతి ఇదివరకెన్నడూ శంతనునికి వినికిడి కాలేదా? కవి బాలునిచే వేయించిన ప్రశ్న చాలా సరసమైనది. ఊరు, పల్లె, ఆశ్రమము, ఉగ్రవనంబు- ఇవా దుందుభి ప్రతిష్ఠకు స్థానములు? అక్కడా వీరులుండేస్థలము? అచ్చోటికా అశ్వము వెళ్లును? వెళ్ళినా అచ్చటా వారి వీర ఘోషణము? ఈ వర్ణనకుగల ఔచిత్యమెంతో విమర్శకులు విచారించవలసినదేకదా! మరొక సంగతి. శంతనుడు భార్యారహితుడై యుండ అశ్వమేధ మెట్లు తలపెట్టినాడు? రాముడు ప్రారంభించినపుడు సువర్ణసీతను సమీపమందుంచుకొనెనట. శంతనుడో! ఇంతకూ ఈ దిగ్విజయకథకున్నూ లేదా దేవవ్రతప్రాప్తికథకున్నూ నాటకవస్తువైన ప్రతిజ్ఞాకథకున్నూ ఎట్టి సంబంధమూ కానరాదు. దీనిని విడిచివేస్తే నాటక మెట్లుచెడును? చెడదు సరేకదా బాగుపడునని కూడా చెప్పవలసివచ్చును కాబోలు!

మొదటిఅంకములో శంతనుడు ప్రారంభించిన అశ్వమేధాంగమైన దిగ్విజయము మూడో అంకముతో పూర్తియైన దేవవ్రతుని దిగ్విజయము ఒకటేనా, ఒకదాని అనుబంధము ఒకటూ లేక వేరువేరా? ఈరెండింటికీ కథలో ఎట్టిసంబంధమూ కానరాదు. కాని రెండింటికీ ప్రయోజనము ఒక్కటే. అంటే అది కథారచనకై కాక రసపోషణమునకై కావలసి ఉంటుంది. ఏదైనా కథా రచనగురించి ఆలోచించవలెను. మనము పరిశీలించవలసినవిషయము లున్నవి. ముఖ్యముగా పాత్రలశీలవర్ణనము, మొదటి అంకములోనిది శంతనుని దిగ్విజయమైనా శంతనుని ప్రభ ప్రత్యక్షముగా ఎక్కడా చూపలేదు. రాజాధిరాజేశ్వరుడుగాక అన్యుడెవ్వడైనా అశ్వమేధము తలపెట్టగలడా అనే సూచనద్వారా కాక వేరుగా శంతనుని ప్రభ నాటకములో ఎక్కడా కానరాదు. లేకున్నా సూచనయైన ప్రభకు కళంకము రాకుండా కవి వర్ణించెనని అంగీకరింతము. శంతనుడు వీగిపోలేదు. దేవవ్రతుని గెలుపంతా

సోమపాలుని పైని జయసింహుని పైనిన్నీ ఇంతకూ ప్రకంపనాస్త్రము ప్రయోగించి దేవవ్రతుడు యుద్ధము తప్పించుకొన్నాడని మనము మరచిపోకూడదు. ముఖ్యవీరులతో పోరాటము జరగనేలేదు. రెండోమారు వర్ణించిన దిగ్విజయము వాస్తవమైనవిజయమే! చాలామంది సామంత రాజులను జయించి సామ్రాజ్యము స్థాపించినాడు. ఇదంతా దేవవ్రతుని వీరాగ్రేసరత్వమే. దేవవ్రతుడు దండయాత్రకు పోగా శంతనుడు మన్మథసేవలో పడియుండును. ఇట్టి వర్ణనవలన శంతనుని శీలమునకు కళంకము రాలేదా ఏమి? మొదటిఅంకములో సూచనగానున్న శంతనుని వీరత్వము ఇప్పుడేమైనట్లు? దేవవ్రతుడు, యువరాజు కాని రారాజు కాడు. యువరాజు తెచ్చినదంతా రాజుకే చేరుననే వ్యవహారధర్మమునుసరించి ఈఅంకములోని దిగ్విజయములమాట ఎట్లు? మొదటిదానిద్వారా దేవవ్రతుని ప్రాప్తి కలిగినది. ఇక రెండోదో? రెండోఅంకములో ప్రారంభమైన సత్యవతీకథంతా ఒకేఊపున చెప్పివేయనక్కరలేకుండా ఉండేటందుకు ఈ రెండో దిగ్విజయముకూడా శంతనునికే చెందవలెను; అట్లు చేకూరిన వీర్యము శంతనునికి చెల్లదా అని అడగవచ్చును. పాత్రశీలవర్ణన ఆలాగుండగా కథారచన విషయమై ఈరెండో దిగ్విజయవర్ణన ఉపచరిస్తుందని చెప్పవచ్చును. రెండో అంకముయొక్క విష్కంభకములో దండయాత్ర సూచన అగును; అంకమంతా సత్యవతీ దర్శనకథే వర్ణిస్తుంది. మూడోదానిలో మొదటసంకీర్ణవిష్కంభకము, ఆతరువాత అంకములోని ఒకరంగము, మొత్తముపైని నాల్గుపేజీల వినాగా అంకమంతా అయోగశృంగారమునే, వర్ణిస్తుంది. రెండుమూడంకములు కలిపితే మొదటకొస దండయాత్ర మధ్యదంతా సత్యవతీకథ ఉంటవి. కథారచనలో ఈవ్యత్యయము ఒక పెద్దలాభము కాదు. ఎందుకంటే మిగిలిన మూడంకములలోను కథ ఒక్కచోటైనా ఎట్లు రంగము మార్చుటచేత వర్ణన నడిచిందో ఆలాగే ఈ రెండుచోట్ల దండయాత్రసూచనలు విడిచిపెట్టి కథనడప వీలున్నది. అదే బాగుండునేమో?

"కథౌచిత్యమును బాత్రౌచిత్యమును బాటించి... ఇందుకు ఉదాహరణము, మూలమునందుఁ దనకుమారునితోఁ దన పెండ్లిమాట చెప్పచు శంతనుడు చేసినసంభాషణ మనుచితముగా నుండుటచే దానిని చక్కగా సవరించి శంతనుని ధీరోదాత్తునిగా మార్చుట యొకయుదాహరణము" అని పీఠికాకారులు వ్రాసినారు. శాస్త్రులుగారు చేసినమార్పులలో ఇదొకటనేకాకుండా, ఇది చాలా ముఖ్యమైనదని కూడా చెప్పుతున్నారు. దీనిలో శంతనునిశీలము చక్కగా వ్యక్తమవుతూఉన్నదని వారి అభిప్రాయము. మూలములో ఈసంగతి ఎట్లుఉన్నదో చూదాము. దాశరాజు తనఅభిప్రాయము చెప్పగా "గాంగేయు యువరాజుఁ దలచి" "అదితప్ప నొండు వేడుమయిచ్చెదను." అనిపలికెను. కాని దాశరాజు అంగీకరించనందున, విఫలమనోరథుడై ఇంటికి వచ్చి, చింతాక్రాంతుడై యున్నతండ్రిని చూచి, "నీకన్నివిధముల సౌఖ్యసాధనములే ఉండగా నీ కీపరితాప మెందుకు" అని దేవవ్రతుడు అడగగా, తండ్రి తనమనోరథమును వ్యక్తపరుస్తూ కారణములు చెప్పెను. ఏకపుత్రుడున్నూ అనపత్యుడున్నూ ఒక్కటే అని ఉండుటచేతనున్నూ, సంతానము అగ్నిహోత్రములవలెనే పెద్దవారికి కూడా ఎడతెగకుండా ఉండవలెనన్నీ, దేవవ్రతుడు యుద్ధప్రియుడగుటచేత వాని "ఉనికి నమ్మగానోపక" అనిన్నీ, కారణములుగా చెప్పి, "బహుపుత్రార్థంబు యత్నంబు సేయవలయు వివాహం బయ్యెదను" అని పలికెను. ఆతరువాత "గాంగేయుండు వృద్ధామాత్య పురోహిత సుహృజ్జనంబులతో విచారించి యోజనగంధి రాజుచిత్తంబునం గలుగుట యెఱింగి" దాశరాజువద్దకు అనేకసేనలతో వెళ్లెను. ఇది తెనుగుభారతమునుండి సంగ్రహించినది; సంస్కృతమునకు సరిగానే ఉన్నది. దీనిని నాటకములో ఎట్లు మార్చినారో సంగ్రహముగా చెప్పెదను. రెండోఅంకములో యమునాతీరమునకు వేటకై వెళ్లుట; అక్కడ సురభిచే తీసుకొనిపోబడి పాంథాశ్రమముచేరి, అక్కడ శకుంతలాపరిణయవృత్తాంతముప్రకారము (నాయకునికిమాటలురాక చదువుకొన్న శకుంతలాకథే జ్ఞప్తికివచ్చినదా అన్నట్లు) సుగంధితో మాట్లాడి, వృత్తాంతమును తెలుసుకొని, తండ్రిదగ్గిరికి పోవును. ఇంతవరకు మూలమునుండి గలభేదమంతా ఈ పాంథాశ్రమము. దానిలో శకుంతలాపరిణయానుకరణము తప్ప మరేమిన్నీ లేదు. మూడోఅంకము ప్రారంభిస్తుంది

అయోగశృంగారబాధను ఓర్వజాలక శంతనుడు బాధపడుచుండెనని మూలములో ఉన్నది. ఈవాక్యస్థ కథను ఒకఅంకముగా విస్తరించుటకు సహాయులైనమంత్రి పురోహితులను ప్రవేశపెట్టి శంతనునిచే అమాత్యా, ఏదోవచ్చినది, వచ్చినది వచ్చినట్లే యణగినది అడగినబెడత మరలత్రవ్వనేల? అని తనబాధాకారణము సూచింప చేసెను. పెండ్లికిగదా అని పురోహితుఁడు కంగించెను. ఇట్లుపలుకుట గంభీరత అని కాబోలు. ఈగాంభీర్యమునకును, పూర్వము ఆఅంకములోనే స్వగతమున వర్ణించిన శృంగారబాధకున్ను సామరస్యము లేదు. అప్పుడేదో ఒకటి అసత్యము కావలసివచ్చును. స్త్రీతోనే కాకుండా స్త్రీవిషయమైన అసత్య మేదన్నీ నీతిబాహ్యము కావని అభిప్రాయమా? ఇంతకూ శంతనుడు ధీరోదాత్తుడైనపుడు ఈ అసత్యమును ఒప్పుకొందమా? మూలములో శంతనుడు చెప్పిన ఏకపుత్రాది తర్కములన్నీ నాటకములో యజ్ఞతీర్థసుమంతులు అందురు. వీటిని శంతనుడు సహేతుకముగాను, నిరుత్తరముగాకూడా ఖండించి వేయును. మూలములో చక్కగా అతికినఈకారణములు నాటకములో సరిపడకపోతే, శంతనునివివాహేచ్ఛకు కామబాధేతరము ఏదన్నీ కారణముగా కనబడదు. అంతకంటె ఉదారభావ మేదన్నీ లేనియెడల శంతనుడు "ధీరోదారు"డెట్లు? శంతనునివయస్సెంత? [౧]పదుమతనములో లేడే కామబాధకు లొంగుటకు. శంతనుడు ధీరుడే అయితే, కాదని నిశ్చయించినదానిని త్రవ్వుతూ; ఆసంగతి పదేపదే జ్ఞాపకము తెచ్చుకొంటూ పైకి వ్యక్తమయ్యేట్లునూ, తనకిల్ల సాక్షాత్తుగాకాకుండా పైవారు పోల్చి కార్యముచేస్తే చాలుననే పేలవునివలె శంతనుడు ప్రవర్తించుట ఉత్తమనాయకలక్షణమునకు సరిపడదని చెప్పవలెను. "కుమారునిరాజ్యముకంటె నాకు బరిణయమెక్కుడుగాదు. సర్వథా నే నాచింత వదలియుంటిని. కర్మవశంబునఁగాని యాలోచనము గలిగి యది ప్రమాదవశంబున బయటఁబడుటచేఁ గౌరవగౌరవంబునకు గలంకము దెచ్చితినని పెద్దఃకుఁదలసూపనోడి కొందలపడుచున్నాఁడ"అని చెప్పినమాటలు సత్యమా, లేక శృంగారవికారమైన మురిపంపా? జ్ఞానమార్గము కోరిన ఇతడు, శ్లేషతో "దేవవ్రతుడు నీ కుభయలోకసాధనమైన రాజమార్గము" అని యజ్ఞతీర్థుడు అన్నమాట తన సత్యవతీప్రాప్తిసాధనముగా అన్వయించుకొనుట ధీరోదాత్తునికి ఉచితశీలమా? శంతనుడు వాస్తవముగా ధీరుడే యైతే, తానన్నమాటలు నిశ్చయమే యైతే, దిగ్విజయమునుండి వచ్చిన దేవవ్రతునికికూడా తనశోకము ఏల వ్యక్తము కావలసివచ్చింది? అతనిశీలవర్ణనములో ఇది ఒకచిక్కేకదా. మరొకసంగతి; దేవవ్రతుడు తండ్రిమనోభీష్టమును కనుగొనుట మూలముకంటె వేరుగా నాటకములో సవరింపబడినది. దేవవ్రతుడు తనలో తాను తర్కించి, పక్షములన్నింటిని విమర్శించి తుదకు వేటకేగినస్థలమునుపట్టి "ఆ! ఆమనోరథము ఇట్టిది గావుననే యింతగోప్యమై, వేదనాహేతు వగుచున్న"దని సూటిగా ఊహించగల్గినాడు. దేవవ్రతుడు కనుక్కోనిగాని, చెప్పకూడదని అన్నివిధాల నిశ్చయించిన యజ్ఞతీర్థులే దైవముమీద తప్పుమోపి చెప్పివేసినాడు. ఇందువలన కలిగేరసస్ఫూర్తి యేదో తెలియలేదు. ఇది చమత్కారముగా ఉన్నా శంతనునిశీలము ఆమాత్రము ఈసవరణవలన చక్కపడలేదు. ఈమార్పువలన గంభీరతను సంపాదించితిమంటిరా ధీరోదాత్తున కుండవలసిన స్థైర్యమునకు దృఢవ్రతమునకు, మహాసత్యమునకుకూడా భంగము వచ్చితీరును. మూలములో తండ్రి కొడుకుతో చెప్పుట అనుచితమైతే [3]శంతనుడు ఇంత జేల అగుట ఉచితమా? అపత్యార్థము వివాహప్రయత్నము చేయుట ఆర్యమతదృష్టిలో అనుచితముకాదు. అపత్య మందుచేత ఒకతగినకారణ మగుచున్నది; [౪]కామాంధ్యము అంతకంటె ఉచితమైనకారణము కానేరదుగదా. తనబుద్ధిని స్థిరము చేసుకొనలేక, ఎన్నోమార్లు ప్రయత్నముచేసినా

౧. చూ ఇష్టోపభోగంబులం బెద్దకాలంబు సనినఆది 4-162.

౨. యజ్ఞ: లోకాపవాదంబునకు జడిసి యితడు పెండ్లి వలదనుచున్నాడుగాని నిరీహచేగాదు. (పుట 64)

3. ఇవన్నీ ఇప్పటివాసనలు కాబోలు. సత్యవతి తనకు వ్యాసుడు పుట్టినవృత్తాంతము భీష్మునితో చెప్పినది. అలాగే కుంతి కర్ణునిజన్మవృత్తాంతము చెప్పినది. ఎన్నో ఇట్టిసంగతు లున్నవిగదా.

౪. వంశాభివృద్ధి, ధర్మాచరణము శంతనునికే చెల్లునా, దేవవ్రతునికి చెల్లవా?

వైకల్యము పొందువాడు ఎట్టి ఉదారనాయకుడో ఇంత వరకు శంతనుని ధీరోదాత్తునిగా చేయ ఉద్యుక్తులైనారని ఊహించే విమర్శించినాను. కాని పీఠికాకారులుమాత్రము "ధీరోదాత్త"డని వ్రాసినారు. అలంకారశాస్త్రములో నా కీప్రయోగము కానరానందున, శంతనుని శీలలక్షణము ప్రాచీనసంప్రదాయముగాక నవీనమా అనే సంశయము కలిగినది. నవీనమైనప్పుడు ఏఅర్థములో ఆమాటను ఉపయోగించినది స్పష్టముకాకుండా తగాయిదా పడకూడదని నాఅభిప్రాయము.

ఇంకొక ముఖ్యాంశమున్నది. ఈ నాటకమునకు ప్రధానరసము వీరమని గ్రంథకర్త ప్రస్తావనములోను, పీఠికాకారులు వారి వ్యాసములోను నొక్కి చెప్పియున్నారు. వీరరసమును కొందరు అలంకారికులు దాన దయా యుద్ధములనెడి మూడురకములుగాను, ధర్మవీరమును కలిపి కొందరు నాలుగు రకములుగాను విభజించియున్నారు. రసగంగాధర మతానుసారముగాకూడా ఈనాల్గింటిలోనే మిగిలిన పాండిత్యాదుల రకములకు అంతర్భావము చెప్పితే, మననాటకములో వర్ణించిన వీరరస మేదియై ఉండునో ఆలోచింతము. దయాధర్మములు కాదుగదా దానముకూడా కాదని చెప్పవచ్చును. దానవీరమునకు బలిచక్రవర్తిని లక్ష్యముగా చెప్పియున్నారు. అట్టి యేదానము నాటకములో వర్ణితమై యుండలేదు. అందుచేత యుద్ధమే ఇందలి వీరరసమని చెప్పవలసి వచ్చును. మీద నుదహరించిన రెండు దిగ్విజయములే ఈ వీరరస వ్యంజకములగును. ఇందులో మొదటి అంకములోని వీరరసోత్కర్షను చక్కగా విమర్శించవలసి ఉంటుంది. ఎందుచేతననగా కథారచన ననుసరించి విచారించినచో ఈఅంక కథకు ఎట్టిప్రయోజనము కానరాలేదని మీదను చెప్పినప్పుడు, ఈఅంకము ఏల ఎందుకు నాటకములో ప్రవేశించి ఉండవలెనో పూర్తిగా చర్చించక ఇప్పటికి నిలిపి ఉంచివేసితిని. వీరరసప్రధానమైన నాటకమును వ్రాయవలెనని నిశ్చయించిన కవికి వీరరసముతో నాటకమును ప్రారంభించుట సమంజసమే. ఈఅంకములో ఏరసమైనా ప్రధానమైతే అది వీరమే అని ఒప్పుకొనవలెను. నాయకుడు దేవవ్రతుడా, లేక శంతనుడా అనే ప్రశ్న ఇప్పుడు అప్రస్తుతము. కాని ఈదిగ్విజయ కథ ద్వారానే నాయకుని వీరత్వప్రకర్ష వెల్లడి కావలసి ఉన్నది. దేవవ్రతుడు నాయకుడైనా కాకపోయినా, అతని వీరము ఉత్సాహసమందుటచేత ప్రతిపక్షము లేనప్పుడుకూడా శరసేతునిర్మాణముద్వారా పైకిప్రవహిస్తూ ఉండెనని చెప్పి శరసేతుకథకు ప్రయోజనము కల్పింతాము. కాని ఏక రసానుభావములుగా శరసేతువుకున్నూ దిగ్విజయమునకున్నూ సంబంధమున్నాదన్నా, సాక్షాత్తుగా రెండు అంశములకు ఎట్టి సంబంధమూ లేదనేవాదము నిలిచి ఉండవలసినదే. దిగ్విజయముచే పోషితమయే వీరమునకు శరసేతువు ఏవిధానా ఆవశ్యకము కాదు సరేకదా, ముందొక శరసేతువర్ణన లేకుండా దిగ్విజయసంరంభ కోలాహలముతోనే తెర లేచేటప్పుడు ప్రదర్శనమునకు వచ్చేవన్నె ఈ చప్పని దేవవ్రతుని స్వగతముతో రాదని చెప్పే రంగరచకుల అభిప్రాయముతో మనముకూడా ఏకీభవించవలసి ఉంటుంది. రసోద్రేకమునకని చెప్పాలన్నా దిగ్విజయ సంరంభములో గల రసముకంటె ఎక్కువ ఏమిన్నీ ఈశరసేతు నిర్మితిలో స్ఫురించదు. రెండింటిని కలిపి ఏకరసాంగములుగా చెప్పుదామంటే విభావానుభావస్థాయీభావాదులలో దేనికైనా ఈ శరసేతువు ఏవిధాన ఉపచరించదు. ఇంతకూ పూర్వపు సంప్రదాయము ననుసరించి కాబోలు యుద్ధము రంగముపై చూపక అంతా మాటలలో వెళ్లపుచ్చినారు జరిగిన యుద్ధముకూడా అతిస్వల్పము. రెండుపక్షములలో సమానులు యుద్ధమునకు జోరుకోలేదు. యుద్ధమునకు సమపడిన చంద్రశేఖరుని భుజములు ఆరంభములోనే అరికట్టబడినవి. సోమపాలుడు ఇటు అటు పరుగెత్తడమేకాని యుద్ధమూ చేయనేలేదు. వచ్చిన జయసింహుడు కూడా ఆర్భాటమే చేసినాడు; పతాకము తెగింది; ఏనుగుకు ములికినాటింది; శరములన్నీ తునకలైనవి; సైనికులు బూరుగుదూదిగా ఎగిరిపోయిరి; కంపనాస్త్రము అందరిని పడవేసింది; అని తెరలో జరిగినట్లు చెప్పినదేదో అదే ఈ అంకములోని యుద్ధమంతా. దేవవ్రతునికి ఒక్కమారైనా శరముసోకనైనా సోకలేదు. ఈ యుద్ధవర్ణన వీరరస పోషకమని మనము భావించవలసి ఉన్నది.

అంతే కాకుండా ఈ అంకములోని వీరము కళంకితమైనది. ఆలంకారికుల మతములో వియుద్ధములనే వీర

శాంత కరుణ రసములకు మైత్రిని కవి కల్పించ యత్నించెను. వీటికి మైత్రి అసంభవమని ప్రధానసూత్రములలో అలంకారికు లందరూ ఘోషిస్తూ ఉన్నప్పటికీ, కవి వాటికి ఏకీభావము కల్పించబూని చాలా ప్రయాసపడినారు. అవును; ఆలంకారికులు కూడా తుదకు కొన్ని సిద్ధకవి ప్రయోగములను తీసి ఈ సహజ విరుద్ధములైన వీరశాంతములకు అనుగుణ్యమున్నట్లు చూపియున్నారు. ఆ గౌణమునే వీరు ప్రధానముగా చేసుకొన్నట్లు నాటకములో శబ్దతః ఉట్టంకించి ఉన్నారు. దేవవ్రతుకిందు సోమపాలుడు (పుట8); శంతనుడు స్వగతమున తనవిషయమై (పుట16), దేవవ్రతుని విషయమై (పుట17), దేవవ్రతుడు శంతనుని విషయమై స్వగతమున (పుటలు 17, 18, 20), ఈస్థలములలో వీరకరుణ శాంతములకున్నూ, శంతనునిలో (పుట19) వీరశృంగారములకున్నూ సామానాధికరణ్యము కవి వర్ణించినన్నీ, శబ్దతః చెప్పినన్నీ ఉన్నారు. ఇవన్నీ శబ్దదోషము లగునో కావో అలంకారశాస్త్ర పండితులు పరిష్కరింతురుగాక. ఇట్టివర్ణనకు ఉదాహరణములున్నా, శాస్త్రసూత్రములు గౌణముగా అంగీకరించినా, ఇన్ని మార్లు డప్పు వాయించినట్లు ప్రకటించవలసిన అవసరము గాని రుచివిశేషము గాని కానరాకున్నది. ఈరసముల సామానాధికరణ్యమునకు అనుగ్రహమున్నా, అట్టిస్థితికి "ఏకీభావము" అనవచ్చునా అని నాకు శంక కలుగుచున్నది. ఒకవేళ ఏకీభావము అనడానికికూడా ప్రమాణమున్నా "వీరము శాంతమై శాంతము కరుణమైన" దనే వర్ణనములోని పరిణామమునకు ఆధార మెక్కడిదో తెలియకున్నది. ఇక్కడికి మూడురసములైనవి. ఇక మిగిలిన రసములను కూడా ఏకీభావము కవి సమకట్టినట్లు వర్ణించినారు. పరశురాముని కలిసినతరువాత శంతన దేవవ్రతులు చూపిన వినయము, ఒక్కచోట (చూ. పుట 23) కనబరచిన భయము; పరశురాముడు చూపినరౌద్రము, దీని నంతటినీ పరిహాసము క్రింద సమన్వయముచేయుట (చూ. పుట 23) గంగాదేవి వచ్చినతరువాత శంతనుడు జహ్నుకన్య మొగము చూడ సిగ్గుపడుట; తల్లితండ్రులు పుత్రునిపై చూపిన వాత్సల్యము; ఇవన్నీ వీరరసప్రవాహములో నడ్డముగా వచ్చుచుండిన తునకలు. వీటిలో వ్యక్తమైన శృంగారాదులతో భీభత్స క్రోధ అద్భుతములనుమాత్రము కలపకపోవుటచేత నవరసముల ఏకీభావమునకు సమయ మొకటి పోయినట్లైనది. ఇట్టి రసముల ప్రోగునుకూడా అలంకారశాస్త్రము ఒప్పునా, ప్రాచీన సంస్కృత నాటకములలో సంప్రదాయమున్నదా అనే ప్రశ్నలకు తగిన విమర్శన చేయ నాకు పాండిత్యావకాశములు చాలవు.

ఈలాగున్నది మొదటి అంకములోని వీరరసము. ఇక రెండో దిగ్విజయ వర్ణనావసరమున స్ఫురించే వీర మెట్లున్నదో చూదాము. యుద్ధముయొక్క జయఫలము, విజయోత్సవముల సంగతి వింటాము. అంతకంటె యుద్ధసంబంధమైన కోలాహలముతో ప్రేక్షకుల వీనులు మనస్సులు పర్యాప్తము పొందవు. అప్పటికి గాని రసాస్వాదనమెట్లు ఎట్లు చెప్పగలము? ప్రతాపమనే విభావము, యుద్ధమనే అనుభావము, గర్వస్మృతి మర్షములనే భావములు, ఉత్సాహమనే స్థాయి, ఉచితమైనఆలంబనోద్దీపనములు [దశరూపకము VI. 73] ఈమొదలైన అంగములతో పొంగిపొర్లుతూ నాటకమంతా, రంగమంతా కప్పి, ప్రేక్షకులను పూర్తిగ ముంచి వేయునప్పుడుగదా వీరరసము నాటకరసము అగును. మనోనుకూలమైన అర్థమంగు ప్రవర్తకము; కార్యారంభములందు సంరంభమైన ఉత్సాహము ఇవేవిన్నీ కానరావు. వీరరసమునకు తగిన ఉదాహరణము వేణీసంహారము. దానిలో వర్ణితమైన రసోద్రేకము, అది ప్రేక్షకులను ఆకర్షించిన విధము ఈ నాటకములో వ్యక్తమవుచున్నవాఅని అడుగుతున్నాను. ఏమాత్రమైనా వీరరసముంటె అది ఏకదేశ మవుతున్నది. ఎట్లుచూచినా భీష్ముడొక్కడే తగిన వీరపాత్ర. వీర సహాయుడైన సుహృత్ కుమారాటవికులు, సామంత సైనికాద్యులు [దర్పణ 77 కారిక] ఎవరూ పాత్రలు కానరారు. మొదటి అంకములో వీరునివలె సూచితమైన శంతనుడు ఆ అంకము దాటిన దగ్గరనుంచి తుదకు నాటకాంతము వరకు శృంగారపాత్ర అవుతున్నాడు. ఇక శంతనుని సైనికులు, సోమపాల చంద్రశేఖర జయసింహులు మాత్రమే ఉన్నారు. నారొక లెక్కకాదు. పరశురాముడుకూడా వీరపాత్రే అని చెప్పగలమా? భీష్ముడైనా వీరపాత్రగానే తుదవరకు ఉండెనా అంటే చెప్పలేకున్నాము.

నాటకములో భీష్ముడు ప్రతిజ్ఞకై వచ్చియున్నాడు. భీష్మప్రతిజ్ఞ పామరుల కొకవేళ వీరమన్నట్లు ద్యోతకమైనా, నాటకకర్త పండితులు అలంకారశాస్త్ర రీత్యాగాని లేక లోకానుభవమునుబట్టిగాని ప్రతిజ్ఞ వీరరసభావముగా భావించరుగదా! భీష్ముడాచరించినది స్వార్థత్యాగము; అందుకొరకు చూపినదీక్ష, పడినకష్టములు, నాటకవస్తువులోకి చేరేఉంటే ప్రేక్షకులహృదయమునుకరిగించవచ్చును. స్వార్థత్యాగమును బుద్ధిపూర్వకముగా పట్టుదలతో చేసేవారు ధైర్యశాలులు, అసాధారణ మహనీయులు. ఆత్యాగమును వివరముగా వర్ణించిఉంటే, ఆరసమేమగునో అనేప్రశ్న అప్రస్తుతము. నాటకములో ప్రతిజ్ఞచేసినట్లు, చెప్పియుంటకంటె ఆప్రతిజ్ఞకు అంతకంటె ఎక్కువస్థానమును నాటకములో కల్పించలేదు. ప్రతిజ్ఞ స్వార్థత్యాగమువలెనే వీరము కానేరదు. అసనంటే ప్రాయోపవేశము, సహగమనము, కూడా వీరములు అయితీరవలసి ఉంటుంది. హరిశ్చంద్రుడు, శిబిచక్రవర్తి, లక్ష్మణుడు, రాముడు, బుద్ధుడు, యయాతికొడుకు, వీరందరూ వీరులే కావలసివచ్చును. దేవవ్రతుని ప్రతిజ్ఞ కూడా అట్టిదే. ఇందులో మెచ్చుకోదగినది, అసాధారణమైనది లేకపోలేదు. అంతమాత్రాన వీరమనిపించుకోదు. అందుకు ప్రాచీనసంప్రదాయము, అలంకారశాస్త్రసమ్మతము ఉండితీరవలెను. అంతేకాకుండా ప్రతిజ్ఞ వీరరసముయొక్క ఆవిర్భావమే అంటే; ఈప్రతిజ్ఞకున్నూ మిగిలినఆవిర్భావములైన దిగ్విజయమునకున్నూ ఎట్టిసంబంధమూ లేదు. రెండూ వేరువేరు సంగతులైనపుడు ప్రధానరసమైన వీరముయొక్క ఆవిర్భావములుగా అవి నాటకములో ఎట్లుపొసగును? ప్రతిజ్ఞే వీరమంటే, మూలములో లేక దానికి నైరంతర్యమెక్కడ కుదురును? ఏవిధాన పొసగకుండా ఉన్న ఈ దిగ్విజయములకల్పన ఎందుకు? అంతేకాకుండా ఈఫలమైనప్రతిజ్ఞయొక్క ఆరంభమెక్కడ? అట్టిప్రతిజ్ఞకు ఔత్సుక్యముండదుకదా. ఒకవేళ అసాధారణప్రజ్ఞగల ఈశాశ్వతబ్రహ్మచారికి అట్టిఔత్సుక్యము ఉండునన్నా, అది కొనసాగి తీరవలెననేపట్టుదల ఉండదుకదా. అందుచేత ఆరంభాదులు దానియందెట్లుపట్టును? ఇంతకూ ఆప్రతిజ్ఞ ఒకకార్యసాధక మవుతున్నది. సాధనమెప్పుడూ కార్యమునకు అంగమగుటచేత, దానిరసముకూడా కార్యరసమునకు అంగమైపోవును. కార్యము ఈనాటకములో శృంగారరసప్రధానమైనది. అట్టి సంబంధమును కృతికర్త ప్రస్తావనములోను, వారిహృదయమును బాగా ఎరిగినవారి మిత్రులు పీఠికలోను స్పష్టము చేసినారు. "శాంతనవుని బ్రహ్మచర్యప్రతిజ్ఞయే ప్రధానముగా నెఱవేఱిన సత్యవతీశంతనుల పరిణయము" (పుట 2) "శంతనుపుత్రునిబ్రహ్మచర్యప్రతిజ్ఞయే ప్రధానకారణముగా వారి పరిణయమనోరథము నెఱవేఱుట" (పీఠిక) ఇట్లైనపుడు ప్రధానమేదో అంగమేదో వేరే చెప్పవలెనా? ప్రధానరసము ప్రధానవిషయమునుపట్టి ఉండునా, లేక అంగమునుపట్టి ఉండునా?

నాటకమునకు శృంగారమో వీరమో ఏదో ఒక రసమని అలంకారికుల అభిప్రాయము [దశరూపక 3-33]; మిగిలినవి అంగములుగాను ప్రాసంగికములుగాను వైరుధ్యములేకుండా ఉండవచ్చును. "నాటకే శృంగారవీరరసయో రన్యతరస్య ప్రాధాన్యం; అన్యేషాం రసానాం అంగత్వేనాను ప్రవేశః" [ప్రతాపరుద్రీయము III 5.1.] అలాగైనపుడు శృంగారవీరములు రెండుండి ఒకదానికొకటి అంగముగాగాని, ప్రాసంగికముగాగాని ఉండవచ్చునా అనేఆక్షేపము చాలా ముఖ్యమైనదగునుకదా! శృంగారమునకు వీరము విరుద్ధమగునా కాదా అని నాకొకప్రశ్నకలిగి, నాసామాన్యజ్ఞానమును అనుసరించి విమర్శించుటకంటె, ప్రాచీనుల అలంకారశాస్త్రజ్ఞులమతమేమో కనుగొనుటకు ప్రయత్నించినాను. ఈవైరుధ్యచర్చ ఎక్కడచూచినా, ఏకదేశ వ్యాపకమైనదేకాని నాటకము మొత్తముపైని చేసినఉదాహరణ మొకటైనా కానరాలేదు. ఒకశ్లోకములో వైరుధ్యమున్నదా లేదా అని వారుచేసినతర్కము నాప్రస్తుతప్రశ్నకుసరిపోలేదు. మొత్తముమీద చాలాచోట్ల వైరుధ్యపరిహారమును

1, కాని నాటకమునకు ప్రతిజ్ఞాశాంతనవమని ప్రధాననామముంచి అభిజ్ఞానశాకుంతలమునకు అనుకరణమా ఏమి?—నాటకము వీరరసప్రధానమని చెప్పుటచేత, ప్రతిజ్ఞ వీరరసవ్యంజకముగా నాటకకర్త కూడా భావించినారా అని ఒక అనుమానము పుట్టకమానదు.

చేయుటకే వ్యాఖ్యాతల ప్రయత్నము. కాళిదాసభవభూత్యాదిమహాకవుల ప్రయోగములు ప్రమాణములు, శాస్త్రమర్యాదాకల్పనములు కావున, ఈవైరుధ లక్షణమునకు లక్ష్యములుగా చెప్పలేక పరిహారమును చేసినారు. ఐనా శృంగారవీరములకు వైరుధ్యము చెప్పినారా లేదా అని చూడగా, శృంగారముతో వీరమునకు పరస్పరవిరోధము చెప్పి, వీరమునకు విరోధులను చెప్పుటలో మాత్రము శృంగారమును ఉల్లేఖించలేదు. [దర్పణ. 242 కారిక "ఆద్యః కరుణబీభత్సరౌద్రవీరభయానకైః; భయానకేన శాంతేన తథావీరరసః] ఇట్లు చెప్పుటలో సారస్యమును కనిపెట్టి శృంగారము ప్రధానమైతే వీరము విరుద్ధమగును కాని, వీరమే ప్రధానమైనయెడల శృంగారము కాదని వాదించెదరేమో. ఇదమిత్థమని నేను చెప్పలేనుకాని, ఎక్కడైనా రెండురసము లుంటే, ఒకటిప్రధానము రెండోది అంగము అగును. అంగము ప్రధానమును పరిపోషించి, దాని ఉత్కర్షను తేవలెను. ఇక్కడ ఈఅంగాంగిసంబంధమే కుదరదు. కానవుడు రెంటికీ స్వతంత్రతయుండదు? అట్టిఏర్పాటు సంప్రదాయసిద్ధమా? కాదేమో అని నాభయము. ప్రాచీనులమతములోకూడా ఇట్టివైరుధ్యమును ఆశ్రయాలంబనములు మార్చి పరిహరించవచ్చును. అనగా వీరమునకు దేవవ్రతుని, శృంగారమునకు శంతనుని ఆశ్రయములుగా చేసినచో, రెండురసములు, ఇద్దరునాయకులు సిద్ధమగుదురు. అందులో ఒకరిని ఉపనాయకుడందమంటే నాయకోపనాయకులకు ఒకకథ ఒకరసము ప్రతిబింబించవలెను. దేవవ్రతశంతనులకు అట్టిసంబంధము సందర్భించదు. ఒకవేళ కుదరవలెనంటే, శంతనుడు నాయకుడు. దేవవ్రతుడు ఉపనాయకుడు కావలసివచ్చును. అప్పుడు శృంగారము ప్రధానరసమగును. సత్యవతి నాయిక అగును. వీరరసము ప్రధానమంటే నాయిక లేకపోవును. కాని నాటకము చదివే వారికి సత్యవతి నాయికవలె తోచకతప్పదు. వేరే మరొక నాయిక లేనందున ఎట్టిసమరసకుదరకుండా ఉన్నది.

శృంగారమే ప్రధానమంటే స్థాయీ భావాది రసావస్థలు, ఔత్సుక్యాదికార్యావస్థలు చక్కగా అత్తును కాబోలు. ఒకకథ ఒకజత నాయికానాయకులు కనబడుదురు. కథకు ఆరంభము, ఉపసంహారములు వ్యక్తములు. గ్రంథ విస్తృతిని పట్టిచూచినా శృంగారకథే ఎక్కువస్థలమును, ఎక్కువకాలమును ఆక్రమించును. సత్యవతీ పరిణయకథ శృంగారకథగదా. మొదటి అంకము 24 పుటలు (5-28); రెండో దానిలోని విష్కంభము 4 పుటలు (29-32); మూడో దానిలో ఆఖరి రెండు రంగములు 3 పుటలు (65 67)-మొత్తము 31 పుట వీరరసకథ. మిగిలిన 67 పుటలు శృంగారరసకథ. ఇట్లుండగా శృంగారరసకథకు ప్రాసంగిక మనడమెట్లో తెలియదు. పోనీ శృంగారమే ప్రధాన మంటామంటే అదికూడా ప్రేక్షకులు ఒడలు మరచేటట్లు నిండుగా వర్ణితము కాలేదు. దానినైనా బాగాపోషించలేదు. ప్రథమదర్శనమపుడు ఒకిరికిశృంగారము లేనేలేదు. మాళవిని ప్రియంవదానసూయలను, శంతనుడు దుష్యంతుని గంధవతి శకుంతలను, పాంథాశ్రమము కణ్వాశ్రమమును పోలియుండి వర్ణనలోను, పొదచాటున దాగుకొనుటలోను జాతిసంబంధమైన చర్చలోను ఒకరివృత్తాంతము ఒకరికి చెప్పుటలోను ఇట్లుఅనేకాంశములలో ఈభాగము శాకుంతలమును అనుకరించినా, కాళిదాసుపోషించిన ఆ నిండు శృంగారమును శాస్త్రులవారు తేలేక పోయినారని చెప్పినచో శాస్త్రులుగారు క్షమింతురుగాక. శాకుంతలమును మనస్సులో ఉంచుకొని ఈభాగము వ్రాసినట్లు గ్రంథకర్తే అంగీకరించినారు. "శంతనుడు-సుదతీ! నీవు శకుంతలాపరిణయవృత్తాంతము వింటివా."౧ (పుట 47) మూడోఅంకములోకూడా శృంగారవర్ణనకంటె శృంగారవిషయికచర్చ హెచ్చు. ఈతర్కము మరొకరసము కానందున శృంగారమేఅని అన్వయించవలసి ఉంటుంది. శకుంతలకూడా గురుజనులఆజ్ఞ ఆవశ్యకముకాదా అనిచెప్పినప్పుడు దుష్యంతుడు శంతనునివలె తలవంచుకొని "అయితే అడిగివస్తాను" అని ప్రియసఖిని విడిచిపోలేదు. అపుడు; ముందు ప్రతిజ్ఞ జరగవలసిఉన్నదికాబట్టి, గాంధర్వమున వివాహమెట్లు అని శంకించేవారికి ప్రత్యుత్తరముగా

---

౧. శాస్త్రులుగారు ప్రయోగించిన సొగసులను చదువరులు గ్రహించలేరని భయము కలిగికాబోలు, అనేకస్థలములలో ఆసొగసులను శబ్దశః ఉట్టంకిస్తూ ఉందురు.

నేను చెప్పేదిలేదు.౧ నాటకముగా రచించువారు ఎట్లు రసహీనముకాకుండా ఆభాగమును పొందుపరుస్తారో వారిపూచీ. మూలము ననుసరించుమని నియమము లేదు కదా. ఇంతకూ రసస్ఫూర్తికి వివాహమై తీరవలెననే పరతు లేదు. రసప్రాదుర్భావము చేసి, విడిచి, భావవిచ్ఛేదదోషమునకు లక్ష్యముకాకుండా రసమును పోషించకపోతే నాటకముఖ్యప్రయోజనములలో ఒకటి చెడుతుంది. ఇందుకు సహృదయులే ప్రమాణము. ఇక్కడ శాకుంతలను, మొదటిఅంకములో ఉత్తరరామాయణమును, అయోగిశృంగారవర్ణనలో రత్నావళిని నాటకకర్త మనస్సున ఉంచుకొనినారా ఏమి? కావచ్చు. అది మంచిసంగతే.

నాటకములో రసము వెల్తిగా ఉండిపోవుటకు నాటకకర్తగారి నియమములే కారణమని నాసమాధానము. వీరరసప్రధానమైననాటకము వ్రాయవలెనని ఉద్దేశించి, స్వతఃశృంగారప్రధానమైన ఇతివృత్తమును ఎంచుటచేత రసద్వైవిధ్యము సంభవించినది. మూలములో లేని వీరము తెచ్చిపెట్టుకొనుట, సహజముగాఉన్న శృంగారమునుఅప్రధానమనిగానిఅంగమనిగానిప్రాసంగికమనిగాని ఉపేక్షించప్రయత్నించుట, ప్రతిజ్ఞ వీరమునిర్భరపడుట, ఆవీరము చాలదని అత్తని దిగ్విజయములను వీగిపోవుటమునకై ప్రవేశపెట్టుట, మొత్తముమీద ఏరసమును నిండుగా పోషించలేకపోవుట, ఈయిక్కట్లన్నీ సంభవించినవి. వీరరసప్రధానమైననాటకమే వ్రాయవలెనని ప్రతిజ్ఞఅయినచో మరొక ఇతివృత్తము లేకపోలేదే.

ఇప్పటికే విమర్శనము అతివిస్తారమైనదని మిగిలిన అంశములను చర్చించకుండా పేర్కొని విడిచిపెట్టుతాను. నాటకములోని అంకములు నవీనప్రాచీన సంప్రదాయములమధ్య పడినవి. ప్రాచీనులమతములో ఒకఅంకములోని కథ ఒకరోజున ఒకస్థలమున, ఒకతూపున జరిగే ఇతివృత్తము కావలెనని కనబడుతున్నది. అంకము పూర్తియైనదాకా తెరవాలదు. రంగములను నవీనపద్ధతి ప్రకారము కల్పించేటప్పుడు, ఒకొక్కరంగము ఒకొక్కచిన్న చిన్నఅంకమవుతుంది. ఒకఅంకములో తెరవాలని రంగములుఉంటే, ఏసంప్రదాయము పొసగదుకదా. అంతే కాకుండా రంగమునడుపుట ఎట్లో! ఒకటి, మూడు, నాల్గు అంకములలో ఒకరంగమునుండి మరొకరంగమునకు పోవునప్పుడు, ఒకక్రమము లేనందున ముందుకు వెనకకు నడవవలసి వచ్చేటట్లున్నది... నాటకము త్రేతాయుగసంబంధమైన ప్రాచీననాగరకతకు చెందినదైనా కుర్చీలు, పడకకుర్చీలు వార్తాపత్రికలు మొదలైన సామగ్రి వాడుకలోకి కవి తెచ్చినారు. యౌవరాజ్యాభిషేకమప్పుడు శంతనుడు, సామంతరాజ్యపరిపాలనాచర్చ సమయమున దేవవ్రతుడుచేసిన పౌరజనసభలు, ఆ సభలలోని వాద ప్రతివాదములు ఈరోజులలో జరుగుతున్న సభల అనుకరణములా అని అడగవలసి ఉన్నది. అట్టివే కాబోలు నాటకములని విజయోత్సవములు కూడా. ఈ రెండు అంశములు మనస్సులో ఉంచుకొనే కాబోలు "ఆధునిక నాటకరంగమున కిదియెంతయు నర్హమె" అని పీఠికలో వ్రాసినారు. కొన్ని మంచిసంగతులు లేకపోలేదు. పాత్రల వేషములనో గ్రంథకర్త ఎట్లు వారిమనస్సులో చిత్రించుకొనిరో అందుకు సూచనలను నాటకములో పొందుపరచినారు. (చూ. "ఆకావిబట్టగూడకట్టువాడా" పుట 11) మొదటి అంక యుద్ధవర్ణనలో యుద్ధ ధర్మములను చక్కగా సూచించినారు. మొదటిఅంకము ప్రదర్శనమున చాలా చిక్కుపెట్టేదైనా, నాటకకర్తయొక్క వర్ణనలను పొందుపరచి చూపించగలిగినారా ప్రదర్శనము రంజకముగా ఉంటుంది. ఇదే మోస్తరు సుగంధి దేవవ్రత దాశరాజుల సంభాషణ సమయమున ప్రక్కగదిలో పొంచి ఉండుట. అది రంగమున ఎట్లు కుదురునో "దాశకుమారీ ఇటరమ్ము" ఎక్కడ ఉన్నది ఆమె? గదిలో ఉండి ఆడుచున్న స్వగతములు ప్రేక్షకులకు ఎట్లు వినబడును?

౧. మూలములోని గాంధర్వరాక్షస వివాహములచర్చ శాస్త్రులుగారు నాటకములోనికి తెచ్చిపెట్టినారు. గాంధర్వమా నాయిక కిష్టము లేకపోయింది; రాక్షసమా రాజు కిష్టములేదట. తండ్రి అనుజ్ఞ లేక పోవుటచేత నాయిక గాంధర్వము అంగీకరించలేదు; పోనీ వలచిన హృదయమున్నదా? ఉన్నప్పుడు రాజు రాక్షసమంగీకరించుటకు ఆటంకమేమున్నది? క్షత్రియులకు రాక్షసము ప్రశస్తమేగదా! నాయికావిషయమై కారణము చెప్పినట్లు రాజువిషయమై ఏదీ చెప్పలేదు. ఏఉపపత్తీ కానరాదు. ఇంతకూ నాటకమునడవాలిగదా!

పాత్రశీలవర్ణనగురించి కొంత చర్చకు అవకాశ మున్నా గ్రంథవిస్తృతిభీతిచే అన్నిటినివదలి ఒక్క అంశ మును సూచిస్తాను. సత్యవతికి శంతనునిపై మోహముద్భ వించిందో లేదో కాని, దేవవ్రతుని చూడగానే అతనిపై వలపుకలిగిందా, కలిగినదానిని మహాపాతకమని అణచి వేయ యత్నించిందా, ఎంతనిర్మూలముచేయ ప్రయ త్నించినా లీనచైతన్యములోనుండి ఆవలపు ఉబుకుతూ ఉండెనా అనే ప్రశ్నలకు అవకాశ మిచ్చేటట్లు సత్యవతి కొన్నిమాటలు పలికింది చూడండి.

పుట 100. ఇట్టి మహోదారుడవు నీవు రాజ్యము నేయుట కోర్వలేక కోరిన ట్లయినది. (విషాద మభిన యించును.)

101. ఇంకేమి నాయనా నీకోర్కె దీరెగదా? (తొత్తరముతో)

101. ఎంతపని చేసితివి? యిట్లయిన లోకము హర్షించునా? దైవము సహించునా? అకటా దీన నేమి రానున్నదో కదా!

108. ఎంతపని పుట్టెను? ఇప్పుడైన నితడు ఊరకొనునా? ఇన్ని హిరణ్యాక్షవరములతోఁ బెండ్లి యైన నేమిప్రయోజనము? ఇపు డేమిగతి?

(ఆత్మాశ్చర్యముతో) ఆహా! ఇతడు మందాకినీ నందనుడా!

103 (మనోవేదన నభినయించి) హా దైవమా! ఇట్టి లోకోత్తర చరితుడగు కుమారున కిహలోకసౌఖ్య మిసు మంతయు లేకుండ జేసితివా? అకటా!

"పే, కునకొకఁ డెవ్వఁడే నరవరుండను
మాటయ కల్గుగాని యీ
వననిధి వేష్టితోర్విపరిపాలన
మీవె యొనర్తు వెమ్మెయిన్."

ఈ పలుకులన్నీ కరుణావాక్యములే కాక పోవచ్చునని ఆధునిక లీనచైతన్యస్వరూపవేత్తలకు తెలియును. సత్యవతి శంకించిన పొరపాటు ముందుకలిగిన కారణవంశ నాశనముగా పరిణమించెనా యేమి? గ్రంథకర్త ఈ అంశములను కనిపెట్టినచో నాటకములో అట్లు ఉంచి యుండరని వేరే నేను చెప్ప నక్కరలేదు.

నాటకముపైనే వేయవలసినది కాక పోయినా, మొదటిమూల కథకే చెందేదైనా ఒక ప్రశ్న వేయవలసి ఉన్నది. ఒకమారు దేవవ్రతుడు యావరాజ్యాభిషిక్తుడైన వాడు గదా అతడు శంతనుని తరువాత రాజు కాకుండా వేరేవిధమునైనా జరుగుటకు, జరిపించుటకు ఎవ్వరికైనా అధికారము కలదా? ఇది వేరే విషయము కాబట్టి నాటక విమర్శనమును ఇంతతో చాలించెదను. నాట కము గ్రంథమగుటచేత చదువరుల ఆధీనమైయున్నది. దానిరసమును కల్పనా చమత్కారమును విమర్శించి ఆనందించేహక్కు అందరికీకలదని విన్నవించుచున్నాను.



# నా చిం త

పెనుమర్తి వేంకటరత్నముగారు

ఆ మహోదధితీరమునందుఁ గలదు
అమృతఖండము వెన్నెలలచటఁబూయు
వానిసురభిళమాధుర్య మూనినంత
మఱపురాదది జన్మజన్మములకైన.

అచట నొకయమృతగీతము ప్రచురమయ్యె
కొసరుకొనిగండు తుమ్మెదల్ ముసురుకొనియె
విరతినొందదు ప్రళయ విస్ఫురణకేని
దానికొఱకయి యాత్మ చింతల గమించె.



# కాళిదాసు - భవభూతి

ఎ. వి. రత్నముగారు

"నాటకే భవభూతిర్వా వయంవా వయమేవవా,
ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే."

అని మహాకవి కాళిదాసు భవభూతిని ప్రశంసించిన యైతిహ్యము కలదు. కాళిదాసు భవభూతికి ప్రాచీను డను నభిప్రాయమున నిది కాళిదాసు వచించినది కాకున్నను నతని పేర చెల్లుబడియగుచున్న విద్వల్లోకముయొక్క యభిప్రాయ మనుటకు సందియము లేదు. ఆలంకారికులనియమముల ననుసరించి పరీక్షించువిద్వాంసులలో ఉత్తరరామచరితమునందలి ముఖ్యరసమును గురించి భిన్నాభిప్రాయములు గలవుగాని, ఉత్తరరామచరితమునందు భవభూతి యనన్యసామాన్య ప్రతిభుడై సర్వోత్కృష్టముగజయించుచున్నాడను నభిప్రాయమున నెల్లరు నేకీభవించుచున్నారు. అందు పోషింపబడిన ప్రధాన రసము- ఏదయినను - అది యంతహృదయంగమముగ నుండక సామాన్యముగ నున్నచో; "వీరశృంగారయో రేకః ప్రధానం" అను నియమముచే మఱేగుణమున్నను చూడక ఒక్కపెట్టున దానిని త్రోసివేసి యుందురు. కాని భవభూతి కరుణరస మశ్రుతపూర్వముగను, లోకోత్తరముగ నుండుటచే అలంకార శాస్త్రవేత్తలు పలువురు తమసంకుచితదృష్టిని విశాలము చేసికొనలేక యెట్లో బహుప్రయాసమున దానిని కరుణవిప్రలంభ శృంగారమను నొకక్రొత్తపేరున శృంగారములోనికే లాగిరి; కొందఱట్లే ధర్మవీర మనుపేర వీరరసమునకుఁ జేర్చిరి. అంతియకాని దానిని కేవలకరుణరసమని యొప్పుకొనరైరి. ఒప్పుకొన్నందువలన మనకు గల్గుఫలితమును లేదు, దానికేమిపేరిడిన నేమి? నామకరణముకొఱ కాలంకారికుల శుష్కవాద ప్రయాసమేకాని రసచర్చవలన గలుగుఫల మేమియు లేదు. కావ్యము విలువ యందు వర్ణింపబడిన ప్రధానరసమును బట్టి లేదు; వ్యాఖ్యాతలచర్చవలన లభింపదు. కావ్యము జీవితస్పందత నెట్లు సంశీలించుచున్నది, హృదయముతో జీవితాశయములతో నది యెటువంటిసంబంధము కలిగియున్నది, యను గుణములచేతనే కావ్యము విలువను గలిగియుండును. కావున రసమీమాంసవలనగాని, కావ్యమునందిట్టిరసము ప్రధానముగ వర్ణింపబడవలయు ననెడి నియమమువలన గాని ప్రయోజన మతిస్వల్పము. కాని ఒకసంగతి-మనయాలంకారికులు తమ వైదగ్ధ్యము నంతయు వీరశృంగార రసోద్బోధనమునకే యుపయోగించిరి గాని, కరుణారసమునకు జీవితముతోగల

దగ్గఱిచుట్టరికమును బరిశీలించుట యందు వినియోగింపరయిరి. కావున వీరివ్యాఖ్యానములవలన భవభూతివిశిష్టత యెందున్నదో తెలియంజాలదు. ఇక భవభూతిని సన్నుతి సేయనికవులుగాని వ్యాఖ్యాతలుగాని లేరు. అవియు కేవలము ప్రశంసా వాక్యములే యవుట. వానినన్నిటి నిట పేర్కొనుట వల్లను లాభములేదు. అవి భవభూతివిశిష్టతను బ్రతిపాదించునట్టివి గావు.

భవభూతి ఉత్తరరామచరితమునం దెట్లు విశేషించి యున్నాడు? కాళిదాసునిగూడ నెట్లతిశయించుచున్నాడు? ఇది రసపోషణమునందు గలదందుమా? రసప్రధానత్వము రుచిభేద నిబంధనమైనది; కాన నిది నిర్ణయింపబడవలనుపడదు. "ఏకో రసః కరుణ ఏవ" యని కవిచెప్పినట్లు, కరుణరసమునే రసములన్నిటిలోనికి ముఖ్యమైనదానిగ నెంచి దానిచే పరీక్షించినను భవభూతి కవికులతిలకుని మించుచున్నాడని యెట్లుచెప్పగలము? కాళిదాసుని కావ్యములందుమాత్రము హృదమును గరగించునట్టి కరుణాతరంగితములగు ఘట్టములు లేవా? రెండును హృదయంగమముగ నున్నపుడు దేనికి విశిష్టత నొసంగఁగలము? కాళిదాసునికరుణరసము మృదుమధురవీచికలఁదూగు శాంతతరంగిణి; భవభూతిది యన్ననో పర్వతోత్తుంగతరంగసంక్షుభితమగు గభీరమగు పెద్దవెల్లువ. ఒకటి ధ్వనిప్రధానము; ఒకటి వాచ్యప్రధానము. ఒకటి హృదయమును గరగించునది, ఒకటి హృదయమును దహించునది. ఇం దేది యెక్కువ ప్రశంసాపాత్ర మగును? ఎట్లునిర్ణయింపఁబడుట? రెండింట గలభేదము ననుభవింపవచ్చుగాని, అంతమాత్రమున నిదియే గుణవత్తరముగ నున్నదని యెట్లు నిర్ణయింపఁగలము? కాన నిది రసపరీక్షచే నిర్ణయింపబడనేరదు. కాని యెన్నదగినగుణవిశేష మొండు భవభూతియందు గలదు. అది యాదర్శప్రాయమై, ఉదాత్తమైయున్నది. భవభూతియొక్క ఉదాత్తత, ప్రకర్షము కాళిదాసుని కరుణరసమునందు గానము; కరుణరసమునం దేకాదు, కాళిదాసుని శృంగారమునందును ఉదాత్తమైనయావేదనము గానరాదు. అందుచే ఉత్తరరామచరిత్రము హృదయమును చలింపజేయునట్లు కాళిదాసుని యేకృతియు చేయజాలదు. కాళిదాసునియం దీయుదాత్తత యేల లోపించినది? ఇదిలెస్సగవిచారించినచో భవభూతివిశిష్టత యెందుగలదో మనము తెలిసికొనగలము. ఇది బాగుగ పరికించినచో కావ్యవస్తువునందు గాననగును. కాళిదాసుని కరుణయు భవభూతికరుణయు నాయికానాయకుల ప్రేమసంబంధికము లయియున్నవి; ప్రేమనుజుట్టియున్నవి. రెండింటను మూలవస్తువు, అనురాగము. ఈకరుణరసము ప్రేమమూలకమైనది. అయినను భవభూతి పోషించినప్రేమమునకును కాళిదాసు పోషించినప్రేమమునకును స్వర్గమర్త్యములకుఁగలభేదము గలదు. అందుచే వారివారికరుణరసములు తథాత్వము నొందినవి. భవభూతి విశిష్టత యిందు గలదు. కాళిదాసమహాకవి తనకావ్యంబుల నెంతకళామహిమంబుతో జిత్రించినను, భవభూతివలె

హృదయపంత్రులను మీటగలైనా? హృదయాంతరాళమునజొచ్చి యం దాలాపము గావించెనా? పవిత్రమగు ప్రేమస్వరూపమును, ఆజీవితాదర్శమును తాను భావమున గాంచిననే కాని యట్టియుదాత్తత యెట్లు గలుగును? అనగా, భవభూతి చూపినటువంటి ప్రేమాదర్శమును కాళిదాసుని యేకృతి యందును గానము. కాళిదాసుని నాటకములందేమి కావ్యములందేమి ఉత్తరరామచరిత్రమునందువలె స్వచ్ఛంబై, పవిత్రమై,జీవనప్రదమగు ప్రేమరస మొందైనను వెల్లివిరిసెనా? కాళిదాసుని మృదుమధురసుందరవిశాలకావ్యప్రపంచమున నెచ్చటను నిట్టిపవిత్రమగు ప్రేమయావిర్భవింప లేదనుట నిశ్చయము. ఇది వింతగ నుండునుగాని కొంచెము లోతుగ పరిశీలించిన తెలియనగును. కాళిదాసుని నాయికానాయకుల కరుణాలాపములు, విలాపములు, ఆవియోగదుఃఖభారము, కాముకజనహృదయమును వెలిపుచ్చుచుండునుగాని, ప్రేమయొక్క నిర్మలభావమును పవిత్రతను స్ఫురింపజేయదు. కాళిదాసు కృతులను బరికింపుడు. ప్రియావియోగము గల్గును. రా జున్మత్తుడగును. మదనపీడితుఁ డగును. దుఃఖార్తిచేఁ గృశించును. వంతలపా లగును. కారణము-నూత్నప్రియురాలు- ఉపభోగవస్తువు-దగ్గఱ లేదని. ఇంద్రియోపభోగముకొఱకుఁ గాని చో పట్టమహిషి యొకతె యుండ మరల నింకొకతె నపేక్షించుట యెందులకు? మొదటియనురాగమే నిష్ఫలమైనచో, లేదా కాముకబుద్ధియే లేకపోయినచో మరల నింకొకరి మీదకు హృదయము పరుగిడుట యెట్లు కలుగును? అది యటుంచుడు. ప్రియావియోగసమయముననే వర్షాకాలముకూడ ప్రాప్తించును. అంబరము మేఘాడంబర మగును. ఆపదలు సందుచూచికొని ప్రవేశించును. కావున నప్పుడే పంచబాణుడుకూడ వియోగిజనముపై దాడివెడలును. ఇక ప్రియునియవస్థ చెప్పెడిదేమి? ప్రియుడు మదనతాపమున గ్రాలుచుండును. విదూషకుని యనునయవచనముల నూఱడిల్లుచు, చిత్రపటమున ప్రియారూపసందర్శనముచే నువ్విళ్లూరుచు, ఎట్లో మదనతాపము భరించుచుండ వియోగార్తిని సహించుచుండ, అంతఃపురమునుండి యసూయాగ్రస్తురాలైన దేవిగారు వచ్చుచున్నారని వినును; వెంటనే మదనతాపముపోయి భయతాప ముప్పతిల్లును. విదూషకుడు రాజును గాపాడుటయందు యత్నించును. రాజు దేవి హృదయమును సాంత్వనవచనములచే నుపశమింపఁజేసి, యామె వెనుక మరల మదనబాధ నొందుచుండును. ఇట్లు కొంతకాలము లాక్షణికముగ మదనవ్యథను ననుభవించిన తర్వాత ప్రియాసంయోగము గల్గును. అంతటితో సమస్తతాపములు చల్లారును. ఎల్లరకు శుభము చేకురును. (ఈరీతి నుత్తరరామచరితమునందు వియోగదుఃఖము - కరుణ-విప్రలంభశృంగారము—వర్ణింపబడినదేమో కనుగొనుడు) ఇది కాళిదాసునియనురాగము. ఈ యనురాగము కాళిదాసుని కళానైపుణ్యముచే సంస్కారము చెనొందుటయుండుగాక. కాని అనురాగముయొక్క పవిత్రత, ఉదాత్తత

కాళిదాసునియందు లేదు. కాళిదాసునందు ప్రేమయొక్క ఆదర్శమే లేదు. ఎట్లుండును ? అంతఃపురములుగల నాయకులయందు పవిత్రమగు ప్రేమరస మెట్లుపుట్టును ? వారిని చేపట్టునాయికలకుమాత్ర మంతకుమించిన ప్రేమానుభవ మెట్లుకలుగును ? అనురాగమున కాళిదాసునినాయికానాయకుల ప్రకృతి సర్వసామాన్యప్రకృతికంటె విశేషించినది కాదు. వారి యనురాగములు కలయికలు మదనునిఘోకను డీకొనుటకే! కాళిదాసు తననాయికానాయకుల కంతఃపురములు కూర్చదే యుండ లేదు. ఏకపత్నీవ్రతస్థుడు. రాజర్షి యనందగు దుష్యంతున కొకయంతఃపురమును గూర్చనిదే యుండ లేకపోయెను. అది బహుశః రసజ్ఞుల కుండవలసిన లక్షణమేమో! లేదా యాలంకారికుల దండశాసనమో! ఇట్టిది కాళిదాసుని ప్రేమచిత్తరువు! ఇక ఉత్తరరామచరితమును గనుగొనుడు. అందు ప్రేమ యెంతపవిత్రముగ ఎంతవిశుద్ధముగ, ఎంతకరుణముగగూర్పంబడెనో. ఎంతటయుదాత్తముగ నున్నదో చూడుడు. ఇచ్చటి ప్రేమాదర్శము కాళిదాసుని యే నాయికానాయకులయందు గన్పట్టును? కాళిదాసుని ప్రఖ్యాతనాటకమును భవభూతి ప్రఖ్యాతనాటకమును ప్రేమాదర్శమున బరీక్షింపుడు. కాళిదాసుని యుత్తమనాయిక శకుంతల, అట్లే భవభూతియుత్తమనాయిక సీత. ఇద్దఱి ప్రేమస్వభావములను బరికింపుడు. దుష్యంతుడు శకుంతలను నిర్భర్త్సించును. శకుంతలా దుష్యంతుల సంవాదమును గనుడు. ఇందు కవి తనయొక్క చమత్కారమును గనబఱచుటయందే యావచ్ఛక్తిని వినియోగించెనుగాని శకుంతలప్రేమనిర్భరత్వమును నిరూపించుటయందు గాదు. ప్రకృష్టస్వాభిమానహృదయమును ముందుంచెనుగాని ప్రకృష్టానురాగహృదయమును గాదు. దుష్యంతుని తిరస్కారముచే శకుంతల రోషావేశ వివశురాలయ్యెను. దుష్యంతుని 'ఆర్యపుత్ర' యనిపిలుచుట మాని 'పౌరవ' యని పిలువఁజొచ్చినది. తుదకు సామాన్యస్త్రీవలె బేలయై దుష్యంతుని దూషించినది. ఇదియ శకుంతల ప్రేమము. ఇదియ యామెసంస్కారము. సీతయెడగల మధురప్రకృతి, అనిర్భరప్రేమము, వినయము, శకుంతలయందు గన్పట్టునా? ఇంక దుష్యంతుని జూతము. తనకు జ్ఞప్తికలిగిన తర్వాతనైనను దుష్యంతుడు శకుంతలయెడ నెటువంటి పవిత్రానురాగభావమును గనబరచుచున్నాడు? ఎట్టిసంతాపము ననుభవించుచున్నాడు? శకుంతలజ్ఞప్తికివచ్చినప్పటినుండియు నతనిని సూనశరుడు బాణములను వింటదొడగి వెన్నంటి తరుముచుండెను. శకుంతలా ప్రతికృతిని చిత్రపటమునఁ గాంచుకొలది మోహభ్రాంతి యెక్కువగుచుండెను. ఈస్థితిలో హంసపదికాదేవి తన యొద్దకు వచ్చుచుండుటను వినెను; శకుంతల మీదిమోహ మట్టే యెగిరిపోయినది, చిత్రపటము మాయమైపోయినది. రాజును విదూషకుడు కాపాడవలసివచ్చినది. ఇది దుష్యంతునియనురాగము,వియోగదుఃఖము. రాముని యనురాగము చూడుడు: ఎచ్చటనైనను కామ మోహితునివలె విలపించు చున్నా

డేమో! రాముని యనురాగ మిట్టిది యని గ్రహించుటి కుత్తరరామ చరితమునుండి కొన్నిపద్యముల నెత్తి యిచ్చుట చూపినంత మాత్రమున లాభము లేదు. అందువలన నతనికరుణారసపూరితమగు సమగ్రప్రేమచిత్రము లభింపదు. సీతారాముల యనురాగ ప్రదర్శనము ఛాయాంకమున సాటిలేనిది యగుచున్నను, మొదటినుండి చివరవరకు చూచిననేకాని రామునిహృదయమునందలి గభీరావేదనమును, సీతయొక్క ప్రేమనిర్భరమగు మధురప్రకృతిని పూర్తిగ గ్రహింపఁజాలము. అట్టిస్పర్శలు, అట్టిభావనైర్మల్యము, ఉదాత్తత కాళిదాసుని యేనాయకునియందైనను నించుకైనను గన్పట్టునేమో కనుగొనుడు.

తర్వాత, విడువబడినశకుంతల దుష్యంతునిగూర్చి యేమితలపోయుచున్నది? దోష పరిహారార్థము, ఆత్మశాంతికొఱకుతపస్సు చేయుచున్నది. మంచిది. కాని దుష్యంతునియెడ నెట్టియనురాగభావమును పొందియున్నదో, యేది? తపమునందితరరాగములతోపాటు, అనురాగముకూడ బూదికావలసినదే. అయినను చివరకు శకుంతలకు దుష్యంతునితో సమాగమము కలుగుచున్నదిగావున, అనురాగహృదయము పూర్తిగ నశింపలేదని యూహింపవచ్చును. కావున సీతపస్సు పునస్సమాగమప్రాప్తి కొఱకుగూడ నైయుండవచ్చును. కావున తపస్సునందైనను, శకుంతల దుష్యంతునియెడ నెట్టియనురాగమును గలిగియున్నదో మన కెట్లుతెలియును? ఆమె హృదయమునందు ప్రేమ యెంతలోతుగ నున్నదో, అది పొంగుచున్నదో, సన్నగిలినదో, యెండిపోయినదో మన కేమితెలియుచున్నది? మనకు వినుటకుగాని చూచుటకుగాని గోచరింపదు. అది తపోదృష్టిచే తెలియదగినదేకాని మనకు మఱొకలాగున లభ్యముగాదు. అందుకు మనముగూడ తాపసులముగావలె. శకుంతలప్రేమ యంత నిగూఢముగ నున్నది. సీతహృదయ మెటువంటిదియో, ఎంతయుదాత్తమయిన ప్రేమప్రకృతిని దాల్చినదో, అది యెంతపవిత్రముగనున్నదో, సీతానిర్వాసనమున నద్భుతముగ నావిష్కృత మగుచున్నది. ఇంతయనురాగోత్కర్ష మురామాయణమునందైనను లేదు. రాముడు తన్ను నిష్కారణముగ నన్యాయముగ లోకారాధనమునకై ఘోరారణ్యములపాలు సేసెను. ఇది యత్యంత దారుణము! కాని యెన్నండైనను నొక్కపరుషాక్షరము రామునిగూర్చి పలుక గల్గెనా? రాముని నన్యథా మనంబునందైనను నొక్కనిముసము తలంచెనా? వాసంతిక రామునిగూర్చి కఠినముగ బలుకునపుడు సీత 'సఖి, నీవె దారుణురాలుగ నున్నావు. ఆర్యపుత్త్రుడెల్లరకును పూజార్హుడ'ని మందలించును. రామునిగూర్చి యణుమాత్రమైనను కఠినముగ విననొల్లదు. రాముడు తన కపకారము చేసెనన్న భావమే, యామెకు పుట్టలేదు. ఆమె హృదయమంతయు రామునిచే నిండియున్నపుడు మఱొకభావమునకు తా వెట్లుండును? సీతమనస్సు హృదయము, ఆత్మ, సర్వము రామమయము. ఆమె జీవితసర్వస్వము రాముడు. అట్లే రామునకు సీతయు. ఇద్దఱి

యాత్మయు నొక్కటే. ఇట్టు ప్రేమనుండి బయల్వెడలు కరుణరసమునకును, ఇంద్రియోపభోగప్రధానమైన ప్రేమనుండి ప్రభవించు కరుణరసమునకును నెంతయంతరముగలదు! సీతావియోగమున రాము డెట్లువిలపించుచున్నాడు? దుష్యంతునివలె చిత్రపటము నవలోకించుచు ముగ్ధప్రలాపములు గావించుచున్నాడా? సీతను నష్టపడి పండ్రెండు సంవత్సరములైనను రామునిహృదయదావాగ్నియట్లే ప్రజ్వరిల్లుచునేయున్నది. శకుంతల స్మృతికి వచ్చినదిమొదలు పునస్సంయోగము వరకు గలవ్యవధిలో దుష్యంతునిహృదయావేదనము యొక్క తీవ్రతయేమి కన్పట్టును? అగ్నివలె పవిత్రమైన యనురాగమునం దిట్టిమదన సంతాప ముద్భవించుట యెట్లుసంభవించును? దుష్యంతునియందు ప్రేమ పవిత్రాగ్నియొక్క కణము లేశమైనను గన్పట్టునా? రామునకు సీతయందుగల యనురాగ మెట్టిది? సీతావియోగమునకై రాము డేలవిలపింపవలెను? ఈ ప్రేమ యెట్టిది? వాసంతిక చెప్పుచున్నది.

"త్వం జీవితం త్వమసి మే హృదయం ద్వితీయం
త్వం కౌముదీనయనయో రమృతం త్వ మంగే,
ఇత్యాదిభిః ప్రియశతై రనురుధ్య ముగ్ధాం
తామేవ!—శాంత మథవా కిమి హోత్తరేణ."

ఇటువంటిది. సీతయొక్క ప్రేమహృదయమును, ఆమెయుదారస్వభావమును నీప్రకరణమునం గనిపెట్టుఁడు.

వాసంతి, "అయి కఠోర! యశః కిల తే ప్రియం
కిమయశో నను! ఘోర మతఃపరమ్."

అన్నపుడు

సీత 'త్వమేవ సఖి!' వాసంతి! దారుణాకఠోరాచ;
యా ఏవ మార్యపుత్త్రం ప్రదీప్తం ప్రదీపయసి.'

యని తనకారుణ్యమును, అనురాగమును వ్యక్తపరిచినది. అంతటను సీత యీవిధముగనే చేయఁబడినది. సీతావియోగమున రాము డెట్లు జీవించుచున్నాడు?

"దేవ్యా శూన్యస్య జగతో ద్వాదశః పరివత్సరః,
నష్టం సీతేతి నామాపి నచ రామో నజీవతి."

దీనిచే తెలియనగును? ఇట్టిది రాముని యనురాగము; ప్రణయభావము. దుష్యంతుని ప్రణయభావ మెట్లుండునో చూడుడు:

"మునిసుతాప్రణయస్మృతిరోధినా
మమచ ముక్త మిదం తమసా మనః,
మనసిజేన సఖే! ప్రహరిష్యతా
ధనుషి చూతశరశ్చ నివేశితః."

శకుంతలవలన దుష్యంతుడు పొందునట్టి ప్రణయసౌఖ్యము చెఱకువింటి బాధనుండి విముక్తిని గాంచుటే! దుష్యంతుని ప్రణయ మింతకంటె నధికమైనది కాదు. కావున నుత్తరరామచరితమునందలి ప్రేమయొక్క ఉదాత్తత శాకుంతలమునం దెచ్చటను గానరాదు. అట్టి పవిత్రభావమే లేదు. కొలదికాలమైనను సాంగత్యములేని శకుంతలా దుష్యంతులయం దిట్టియుదాత్తమైన ప్రేమ యుద్భవింప నవకాశము లేదనుట యుక్తముగాదు. శాకుంతలము నందుగల యవకాశము కాళిదాసునకు మఱొకకృతియందు లేదనియే చెప్పవచ్చును. కాని యీదృష్టియే యతనికి లేదు; అతని యందాప్రేమసిర వొడమలేదనుట నిక్కము. కాళిదాసునిదృష్టి యంతఃపురమును మించి పోలేదనుట యుక్తము. అతడు రసికశేఖరుడు,

అతనికి ప్రధానమైనది శృంగారమేకాని, అనురాగము గాదు. అతనినాయకులలో నంతఃపురము లేనినాయకు డెవడుగలడు ? దీనినిబట్టియే కాళిదాసుపోషించిన ప్రేమ యెంతవిలువకలిగియున్నదియు తెలిసికొననగును.

ఉత్తరరామచరిత్రమునందు భవభూతి నిజముగ ప్రేమను 'సంజీవనౌషధరసము' గనే సృజించెను. అనురాగమున కింతకంటె పరమావధి యేమిగలదు ? అనురాగము సంజీవనియై నిర్జీవుని సజీవుని జేయుటకంటె దానికి పరమార్థ మేమిగలదు ? అనురాగమిట్లుకదా ఫలింపవలయును ? ఉత్తరరామచరిత్రమునందలి సీత యిట్టిదియైనది. రాముని యందుగల యా ప్రేమచే, కరుణరసమూర్తియై లోకాంతరమందున్నను కరుణరసపూరితములగు వీక్షణములచే రాముని ననుక్షణము కనుగొనుచున్న దానివలెనే యున్నది. ఇది రామాయణమునందు లేనివింత. రామాయణపు సీత కేవలము మానవతియేకాని, ఉత్తరరామచరితమునందువలె, ఆత్మత్యాగినియైన యనురాగవతిగాదు. ఉత్తరరామ చరిత్రమునందలి పునస్సమాగమము నీరసమైన వట్టి పునస్సమాగమము కాదు. తాను మరల రామునేల పునఃపరిగ్రహింపవలె ననెడి సత్యాగ్రహము సీతకు లేదు. అది యామెప్రకృతియం దుండజాలదు. ఆమెహృదయ మెల్లప్పును రామమయమైయుండ హృదయము రామునివైపునకే త్వరపడుచుండును. కాని మఱొకవిధమున విశ్రాంతి నొందజాలదు. రాముని మృతకల్పుని, లేదా మృతుని, పునర్జీవితునిగ జేసి పునఃపరిగ్రహించుటకంటె సీతకు కృతకృత్యత మఱేమికలదు? అంతకంటె నామె యాత్మకు సంతోషదాయకమగునది యేముండును ? అంతర్నాటికయందు రాముడు సీత దుర్భరదుఃఖమును జూచి భరింపలేక, సీత విలయమును బొందునపుడు,

"కథం విలయ ఏవ వైదేహ్యా స్సంపన్నః? హా! దేవి! దండకారణ్యవాసప్రియసఖి! హా! లోకాంతరంగ తాసి!"

యంచు మూర్ఛనొందును. అందుమీద లక్ష్మణుడు,

"భగవన్ ! వాల్మీకే ! పరిత్రాయస్వ, పరిత్రాయస్వ; ఏష కిం తే కావ్యార్థః?"

అని రామరక్షణార్థము పరిదేవనము చేయును. అంత కరుణాస్వరూపిణి సీతవచ్చి తనయమృత కరస్పర్శచే రాముని బునర్జీవితునిగ జేయును. పాతాళమునందున్నను, విలయము నొందినను, అమృతమయమగు నీప్రేమ సీతను రామునికడకు వచ్చునట్లు చేసెను. దగ్ధజీవితుని పునర్జీవితునిగ జేసెను. ఆఁ! ఏమి! యీ ప్రేమామృతము! ఎంతకరుణారస పూరితమైయున్నది! ఇట్టిదిగదా యనురాగమన్న! సత్యవతిప్రేమ మృత్యువుచే జయించుచుండ, సీత ఆతప్తజీవితుని, ఇంకనుగొంచెము కొట్టుకొనుచున్న ప్రాణముగలరాముని, పునర్జీవితునిఁజేయుటయం దాశ్చర్యము లేదు. ఉత్తర రామచరితమునం దిట్టి హృదయైక సంవేద్యమగు మహత్తరమైన గుణవిశేష మొందుండుటంజేసియే భవభూతి యంతటి ప్రశంసకు బాత్రుడయ్యెనని చెప్పవచ్చును. అందుచే కాళిదాసు డత్యుదారబుద్ధిని భవభూతినట్లు సన్నుతించినను సన్నుతింపవచ్చును.

# శ త ప త్ర ము

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

మంద మలయానిలంబులు మలయుచుండ
నిన్నమాపున నా ప్రశాంతిమయ గగన
తటినియందున శశికళాతరణి నెక్కి
చెలిమికాండ్రతో గానంబు సేసికొనుచు
నక్రమములైన ముచ్చట లాడుకొనుచుఁ
బోయియున్నది నీవు కావోయి సఖుఁడ ?
అదిగో ! నిన్నఁటిరాత్రి మేఘాశ్వమెక్కి
తారకాగణోద్యాన రథ్యలను స్వారి
చేయుచున్నది నీవు కావోయిసఖుఁడ ?
మొన్న పున్నమనిసియందుఁ బొడుపుఁగొండ
శిఖరమునఁ గూరుచుండి రసికత వెలయఁ
బశ్చిమాశాంగనామణిపైని మల్లె
చెండువిసరిన దీవెకా చెలిమికాఁడ !
పాఱఁజూచితిఁ గనుచూపుమేరనుండి.

గీ. ఈమహాకాంతి యెచ్చటి ? దెవరులేరె ?
ఆకసంబునఁ జంద్రుఁడా ! అస్తమించెఁ
జుక్కలా ! మబ్బుపిండులోఁ జొప్పదప్పె
నీమహాకాంతి యెచ్చటి దెంతమధుర
మెంతహృదయంగమంబయి యెసరేఁగు !
తావకీనాంగవల్లి సౌందర్యకాంతి
పూరమా ! లేక త్వత్కృపాక్షీరసింధు
ధవళభంగములా లేక త్వన్మనోజ్ఞ
సరసరమణీయమందహాసంబొ ! సఖుఁడ !

గీ. నాదువదన ధారాంబు యంత్రంబునుండి
విధివిరామంబులే కెల్ల వేళలందు
గానపూరంబు ప్రవహించు ; దానిచేత
నీకు నభిషేక మొనరింతు నేను దేవ !

గీ. శాంతిపాలిత మానందకాంతిదీప్త
మైన మామక హృదయ సౌధాంతరమున
రేయుఁ బవలును సంధ్యలు ప్రీతి గదుర
సఖుఁడ ! నీతో వసింప నిష్టంబుగలదు.
త్వద్విమానంబు నాదు సౌధంబుపైకిఁ
బట్టుమోయీ ! సమర్పింతు స్వాగతంబు
నచలితానందమయ హృదయంబుతోడ
బాష్పజలపూర్ణ నేత్రకుంభములతోడ.

గీ. శాంతిమయమైన యానంద సాగరమున
హృదయనౌక నధిష్ఠించి నీదుదరికి
బయలుదేఱితి ; అకట ! తుపాను గొట్టెఁ
బట్టరాక వేఱొక్క ద్వీపంబుఁ బట్టె
చుట్టుపట్టుల వెలుఁగు చూపట్టదయ్యె
దిక్కులందున ; దేవ ! ఏదిక్కు నాకు ?

గీ. ఓ ఆయస్కాంతమా ! సువర్ణోత్కరంబు
మణిసముచ్చయముండిన గణన గొనవు
నాయయఃఖండమందె యనశ్వరమగు
ప్రేమ నీకెట్లుగలిగె భావింపఁజాల.

గీ. ఓమహారాజ ! రజతసముజ్జ్వలములు
కాంచనములగు పాత్రముల్ గలిగియున్న
నాదుమట్టి గలంతియ మీఁద మాత్ర
మేల ? నీ కాశగలిగె నూహింపఁజాల.
ఓయి ! వైణికవాంశిక గాయకాళి
చూపి తమతమ సంగీతనైపుణంబు
నిన్ను నానందపఱచుచు నున్ననేల ?
నాదుకూనరాగమె వినునాదరంబు.




వాసా సూర్యనారాయణ శాస్త్రి గారు

(రెండవ సంపుటము - రెండవసంచిక తరువాయి)

"యత్రాధికృత్య గాయత్రీం — గాయత్రినధికరించుట యారంభమనుకొని" ఇత్యాదివాక్యములను వ్రాసి ఉపోద్ఘాతకర్తయొక్క భ్రాంతిని వెల్లడించిరి. వీరికి "అధికృత్య" పదమునకర్థము కాలేదని చెప్పుట విచారకరముగా నున్నది. అధిపూర్వకకృఞ్ ధాతువునకు ఆరంభార్థకత్వ మున్నట్లు "అధేత్యయంశబ్దో ఽధికారార్థః" అనుమహాభాష్యములో ప్రదీపోద్యోతములను జూచిన విశదమగును.

ఉపోద్ఘాతకర్త మంత్రపరత్వమును చెప్పినను వీరుచేసిన ఖండన సమర్థమగునా? కాజాలదు. మంత్రపరత్వపక్షమందున్నా పౌరాణిక గాయత్రీ మంత్రపరత్వమునే చెప్పునుగాని వైదికమంత్రపరత్వమును సచేతనుడెవ్వడున్నూ చెప్పజాలడు. వేదములో ఏతదాకారమైన మంత్రములేదని యొకవాక్యముతో ఖండింపవలసియుండ "గాయత్రీమంత్రము సకారముతో నారబ్ధము కాదు" మన్న నసంబద్ధ పూర్వపక్షము లేలచేయవలసివచ్చెనో నాకు తెలియరాదు. వ్యాసులు పౌరాణిక గాయత్రీ మంత్రముతో దేవీభాగవతపురాణము నారంభించి యుత్తర గ్రంథములో వైదిక గాయత్రీ వర్ణసంఖ్యాది విశేషములను వివరించి యున్నాడని చెప్పినచో దుర్నివారమయిన విరోధ మెద్దియు కానరాదు. "ఒకభ్రాంతి మరియొకభ్రాంతిని పుట్టించును." వీరి కట్టి యర్థ మెట్లు సిద్ధించునో తెలియరాకున్నది. "గాయత్ర్యా" అనుతృతీయ కర్థమేమి? కర్తృకరణార్థములు వారికభీష్టములు కావు. ఇక సహార్థము చెప్పవలయును. శ్లో॥ హయగ్రీవ.... గాయత్ర్యాచ సమారంభః తద్వై భాగవతం విదుః" అనిరి. గాయత్రితో నారంభము దేనికి? రెంటికి నేకకాలారంభమనికదా సిద్ధించును. ఆరెండవది యెద్ది? మరియెద్దియు లేదు "సర్వచైతన్య" అనునది గాయత్రికాదు

"గాయత్ర్యాచ సమారంభః" అనుదానికి గాయత్రిదేవిచే నారంభముగలది భాగవతమని యాతృతీయ కర్త్రర్థః మయినట్లును, దే. ౧ స్కం. "శ్లోకార్ధేనతయా ప్రోక్తం తద్వై భాగవతం కిల, విస్తారోభవితతస్య...శ్లోకానాంకురు సంగ్రహం." అను నీ గ్రంథముచే మొట్టమొదట గాయత్రీదేవిచేత నీ దేవీభాగవతము సంక్షిప్తముగా నారంభింపఁబడినదయినట్లు స్పష్టపడుచున్నది కావున "గాయత్ర్యాచ సమారంభః" అనుదానికి గాయత్రీదేవిచేత నారంభమని కాని గాయత్రీ మంత్రముతో నారంభమని యర్థముకాదు.'' — అని వ్రాసిరి.

వ్యాఖ్యాతలభ్రాంతిని నిరూపించుటకు పెద్ద శాస్త్రార్థమునకు మనశాస్త్రిగారు గడంగిరి. "హేతౌ" "ఇత్థంభూతలక్షణే" "ప్రకృత్యాదిభ్య ఉపసంఖ్యానం" ఇత్యాది తృతీయావిధాయక సూత్రము లున్నవని శాస్త్రిగారు ఎఱుంగరా? ఎఱింగినచో వాటినుదాహరించి యాయర్థములను ఖండింపకున్న నాక్షేపము సమర్థమగునా?. శాస్త్రసమయమును తెలిసినవాడు ఇట్టి విచారణలో యావత్తృతీయార్థములను స్పృశింపక పరపక్షమును ఆక్షేపించునా?— "కర్తృకరణార్థములు వారికభీష్టములు కావు" అనిరి. ఎందుచేతనో కారణమును నిరూపించలేదు. "గాయత్ర్యాచ సమారంభః" అనుచోట "యస్య" "భవతి" అనే పదముల నధ్యాహారము చేసి, యస్య= దేవీభాగవతస్య సమారంభః, గాయ

త్ర్యాఖ్యాత్మకఛందసా భవతి, అని యోజనచేయవచ్చును. సమారంభక్రియావిషయత్వము గాయత్రీ ఛందస్సునకు గలదు. అది వ్యాపారావిష్టముగ వివక్షించినచో "కరణత్వాత్ తృతీయ" సిద్ధించును. వ్యాపారానావిష్టముగ వివక్షించినచో "హేతుత్వాత్ తృతీయ" సిద్ధించును.

"ద్రవ్యాది విషయో హేతుః కారకం నియతక్రియం, అనాశ్రితేతు వ్యాపారే నిమిత్తం హేతురిష్యతే".

"ద్రవ్యాది" అనుచోట నాదిపదముచే గుణక్రియలు గ్రాహ్యములు భవతిక్రియా ధ్యాహారమును విడచి "జ్ఞాయతే" అనేక్రియ నధ్యాహారముచేసినచో సమారంభవిషయక జ్ఞానక్రియాకరణత్వ వివక్షచే "కరణత్వాత్ తృతీయ" యే సిద్ధించును. "గాయత్రీఛందోలక్ష్యస్సమారంభః" అని వివక్షచేసినచో "ఇత్థం భూతలక్షణే" అనే తృతీయసిద్ధించును. "సహార్థమును చెప్పినచో నేక కాలారంభమని సిద్ధించును. ఆరెండవది యొద్దియు లేదు. కాబట్టి సహార్థము పొసగదని" వ్రాసిరి. వీరికి రెండవది స్ఫురింపలేదు కాబోలు! మొదటిది గాయత్రీఛందస్సు. రెండవది మిగిలిన దేవీభాగవతగ్రంథము సహార్థములలో సర్వత్ర ఏకకాలారంభము లేకున్నను ప్రమాదము లేదు "ఏకేనైవ సుపుత్రేణ సింహీస్వపితి నిర్భయా" "సహైవదశభిః పుత్రైః భారం వహతి గర్దభీ" "తిలవాపోత్తరం మాషవాపే" "తిలైర్మాషానవ్వపతి" అని శేఖరములో నున్నది. ఇత్యాది స్థలములలో సమానకాలికత్వము భాసించలేదు. కొన్ని స్థలములయందు విద్యమానతామాత్ర సాహిత్యమున్నూ, కొన్నియెడల సమానదేశ సమానక్రియాదిమత్త్వ సాహిత్యము నంగీకరించి శాస్త్రజ్ఞులు సహార్థమును సాధించిరి. వీరికట్టి వ్యాకరణ మర్యాద తెలియకున్నను కావ్యనాటకాది వ్యాఖ్యానములయినను చూడలేదా?.

చూ. "స్రగ్ధరయాచ ముద్రారాక్షసస్య సమారంభః"

"అనుష్టుభాచ ఉత్తరరామచరితస్య సమారంభః" ఇత్యాదు లనేకములు సహార్థము లున్నవి. ఈవ్యాఖ్యాతలందరున్నూ భ్రాంతిపరాహతులేనా? శాస్త్రిగారి దృష్టిలో కాలత్రయమందున్నూ అభ్రాంతు డొక్కడున్నూ లేడనియే కాబోలు సిద్ధాంతము. "గాయత్ర్యాచ సమారంభః" అనుచోట "కరణత్వాత్" తృతీయయే మాకభిమతము. "గాయత్రీనామకఛందసైవ యస్య సమారంభో నతు అనుష్టుభాది ఛందోఽంతరేణ" అని వివక్షించి కరణాంతరవ్యుదాసార్థమై గాయత్రీఛందస్సునకు కరణత్వమును చెప్పెదము. "ప్రకృత్యాచారుః" అనేచోట తత్త్వబోధినిని చూడుడు-"చారురితి; అభిరూప ఇత్యర్థః. క్రియాయా అశ్రవణాత్ కర్తృకరణయో రభావాత్ షష్ఠీహ ప్రాప్తా ఏతచ్చ గమ్యమానకరోతిక్రియాకరణత్వాత్సిద్ధం కరణాంతరవ్యుదాసాయహి ప్రకృతేరేవహి కరణత్వం వివక్షితం. స్వభావేనా య మభిరూపః కృత్రో నత్వలంకారాది నేత్యర్థాత్" అనియున్నది. ప్రకృతములోగూడ "గమ్యమానకరోతిక్రియా కరణత్వేన" తృతీయ సిద్ధించును. శాస్త్రిగారి మతములో "గాయత్ర్యాచ సమారంభః" అనేచోట గాయత్రీదేవిచే నారంభముగలది అని చెప్పిరి. దానిని విచారింతము. "సమారంభః" అనే పదమునకు ఆరంభముగలది యనే బహువ్రీహ్యర్థము ఎట్లువచ్చును? వచ్చినను "సమారంభః" పుంలింగాంత శబ్దము. "భాగవతం" నపుంసకలింగాంత శబ్దము. వీటికి విశేషణవిశేష్యభావ మెట్లు పొసగును. ఈయర్థమునకు గమకముగా "శ్లోకార్ధేనతయా ప్రోక్తం తద్వై భాగవతంకిల" అనే దేవీభాగవత శ్లోకార్థము నుదాహరించిరి. దీనిలోనున్న "తయా" అనే సర్వనామ గాయత్రీపరమని యెట్లు చెప్పగలరు? పూర్వాపర సందర్భములను గమనింపుడు. దేవీ భా. ప్రథమస్కంధము ౧౫ అధ్యా. ౪౬ శ్లో. వ్యాసః, "పరపుత్ర మహాభాగ! మయా భాగవతం కృతం,........వటపత్రశయానాయ విష్ణవే బాలరూపిణే. కేనాస్మి బాలభావేన నిర్మితోఽహం చిదాత్మనా,...ఇత్యేవం చింతమానాయ ముకుందాయ మహాత్మనే శ్లోకార్థేనతయా ప్రోక్తం భగవత్యాఖిలార్థకం, "(సర్వం ఖల్విద మేవాహం నాన్యదస్తి సనాతనం)" తద్వచో విష్ణునా పూర్వం సవిజ్ఞాతం మనస్యపి, కేనోక్తా వాగియం సత్యా చింతయామాస చేతసా, ......ప్రాదుర్బభూవతస్యాగ్రే విష్ణో రమితతేజసః, మన్దహాస్యంప్రయుంజానా మహాలక్ష్మీశ్శుభాననా."

అని ౧౫ అధ్యాయములో నున్నది.

పిమ్మట ౧౬ అధ్యాయములో నిట్లున్నది. దే. భా. ౧ స్కం. ౧౬ అ. ౧౩ శ్లో. "మహాలక్ష్మీః శృణు శౌరే! వచో మహ్యం సగుణాహం చతుర్భుజ! ... ..త్వం జానీహి మహాభాగ! తయా తత్ప్రకటీకృతం; పుణ్యం భాగవతం విద్ధి వేదసారం శుభావహం....... శ్రీహరిః: మయి త్వయి చ యా శక్తిః క్రియాకారణలక్షణా, విచారయ మహాభాగ! యా సా భగవతీ శివా, ......శ్లోకార్థేన తయా ప్రోక్తం తద్వై భాగవతం కిల, విస్తారో భవితా తస్య ద్వాపరాదౌ యుగే తథా." అనియు న్నది. పూర్వోత్తరప్రకరణసందర్భమును బట్టి "తయా" అనే సర్వనామము మహాలక్ష్మీపరముగాని గాయత్రీ పరముకాదని స్పష్టముగా తెలియును. ఈసందర్భములో గాయత్రీపదమే లేదు.

శ్లోకార్థముకూడా "సర్వం ఖల్విద మేవాహం నాన్యదస్తి సనాతనం" అనునదికాని వేరుకాదు. దీనినేల యుదాహరింప లేదో చదువరులు గమనింతురుగాక! "తయా ప్రోక్తం" అనుచోట "తయా సమారబ్ధం" అనునర్థ మెట్లు పొసగును? దేవీ భాగవతారంభమందు "అహమేవాఖిలం సర్వం" అను శ్లోకార్థమును వీరు చూపగలరా? సమారంభ, ప్రోక్త శబ్దములకు తుల్యార్థకత్వమెచ్చటనైనను చెప్పబడినదా? అట్లయినచో "వ్యాసప్రోక్తము" "అగ్నిప్రోక్తము" ఇత్యాదిస్థలములలో "తదారబ్ధము" అనే యర్థమును చెప్పిన సరిపడునా?. "బ్రహ్మణా ప్రోక్తం బ్రాహ్మం" "అగ్నినా ప్రోక్తం ఆగ్నేయం" అన్నట్లు "గాయత్ర్యా ప్రోక్తం గాయత్రం" అని భాగవతపద పర్యాయముగా "గాయత్ర" శబ్దమును నొక పురాణమందైనను మహర్షులు వాడియున్నట్లు వీరు రుజువుచేయగలరా?. అది యట్లుండుగాక "యత్రాధికృత్య గాయత్రీం" అనుమాత్స్యవచనములో "గాయత్రీం అధికృత్య = గాయత్రీదేవతను ఉపక్రమించి" యను నర్థము చెప్పుటకు నవకాశముగలదా? అర్థాంతరమునే స్వీకరింతురేని భాగవతమునకు లక్షణమును ప్రతిపాదించుటకై ప్రవర్తించిన—రెండు పురాణవచనములకు భిన్నార్థకత్వము నుపపాదించి యర్థ జరతీయత్వమును సంపాదింతురా? పోనిండు విష్ణుభాగవత విషయములో "గాయత్ర్యా చ సమారంభః" "యత్రాధికృత్య గాయత్రీం" అనే లక్షణముల నెట్లు సమన్వయింతురు? విష్ణుభాగవతమున్నూ గాయత్రీదేవిచే నారబ్ధమయినదా? అట్లు ప్రమాణములను చూపగలరా? లేనిచో దాని గతియేమి?—

"సర్వచైతన్య" అనునది మంత్రపరమా? లేక దేవతాపరమా?, అని వికల్పించి దేవతాపరత్వమును గూర్చి నిర్ణయింపక విడుచుట న్యూనతాపాదనము కాదా? వీరు మంత్రపరమయినది దేవతా పరముకాదని భ్రమసియుందురు. "ప్రసు. అగ్నిర్జ్యోతి ర్జ్యోతి రగ్నిస్స్వాహా" ఇత్యాది మంత్రములు దేవతాపరములగుట చేతనే మైమాంసికులు అగ్ని దేవత మాంత్రవర్ణికమని నుడివిరి. కాబట్టి వీరుచేసిన వికల్పము అనభిజ్ఞతామూలకమే యగును. ఇంకొక్క విషయమును పరికింపుడు. "గాయత్ర్యా చ సమారంభః." "యత్రాధికృత్య గాయత్రీం" అనే పురాణాంతరవచనములు భాగవత లక్షణప్రతిపాదకములు. లక్షణ మెప్పుడున్నూ ఇతర వ్యావర్తకమయి యసాధారణధర్మములను ప్రతిపాదింపవలయును. మా పక్షములో గాయత్రీఛందస్సమారబ్ధత్వరూప లక్షణము అనుష్టుభాది ఛందస్సమారబ్ధములయిన పురాణాంతరములకు వ్యావర్తకమయి దేవీ భాగవతమునకు అసాధారణ ధర్మవత్త్వమును ప్రతిపాదించుచు లక్షణ ఘటకత్వమున కెంతయు సమర్థమయి యున్నది. శాస్త్రిగారిమత ప్రకారము గాయత్రీదేవతాపరత్వమును చెప్పినచో నది లక్షణఘటకము కాదు. కేవలమాహాత్మ్య ప్రతిపాదకమేయగును. "హయగ్రీవ బ్రహ్మవిద్యా యత్ర వృత్ర వధ స్తథా, గాయత్ర్యా చ సమారంభ స్తద్వై భాగవతం విదుః" "యత్రాధికృత్య గాయత్రీం" అను పురాణవచనములు భాగవతలక్షణ ప్రతిపాదనకై ప్రవర్తించినవిగాని మాహాత్మ్య ప్రతిపాదనకు కాదు. ఈమాత్రమయినను తర్కశాస్త్ర మర్యాదను ఆలోచింపక యపార్థములను ఇష్టానుసారము పామరవ్యామోహకముగా ప్రతిపాదించి గుప్తవతీటీకాకారాది మహాపండితశిరోమణులకు భ్రాంతిదోషమును కల్పించుట తగదు.

"అట్టి యర్థవిభ్రాంతియే నాల్గుపాదములు గల్గియనుష్టుప్ ఛందస్సుగల "సర్వచైతన్య" అను శ్లోకము త్రిపాదిగాజేసి నాల్గవ పాదమును మూడవదానిగా బెట్టి

"అనుష్టుప్ ఛందస్సు"ను "గాయత్త్రి" యని చెప్పి పాదనిర్ణయములేని ఛందస్సు త్రిపాదియని చెప్పి ఛందోభంగమునయినను గానలేనంతటి వ్యామోహమునకు మూలమగుచున్నది" అని వ్రాసిరి—

ఉపోద్ఘాతకారుడు కొన్ని యాధునిక గ్రంథముల యందే చతుశ్చరణ శ్లోకముకలవనిన్ని, త్రిపాచ్ఛందస్సు ప్రాచీనగ్రంథములలో సార్వత్రికముగా కలవనిన్నీ చెప్పి ప్రామాణికప్రాచీనపండితులయిన గుప్తవతీటీకా కారులచే త్రిపాచ్ఛందస్సే వ్యాఖ్యాతమగుటచే నదియే ప్రమాణమని సహేతుకముగా నిరూపించియున్నాడు. శాస్త్రిగారు తమ చతుశ్చరణ శ్లోకమును ప్రామాణిక గ్రంథములలో చూపకుండ వ్యాఖ్యాతల నెట్లు నిందించెదరు? మూడు పాదములుండిన ఛందోభంగమగునట! ఆహా! వీరి సాహసమే సాహసము! వీరు ఛందోగ్రంథమును ఒకదాని నయినను స్వప్నమందైనను చూచి యెరుంగుదురా? ఎరుంగరు. శాస్త్రకారులు అనుక్తఛందస్సులకు గాథలందురు. పింగళ. సూ, "అత్రానుక్తం గాథా" వ్యా. అత్రశాస్త్రే నామోద్దేశేన యన్నోక్తం ఛందః ప్రయోగేచ దృశ్యతే తద్గాథేతిమంతవ్యం" అని యున్నది. దీనిచే నీత్రిపాచ్ఛందస్సుకు గాథయని పేరు.

"గుప్తవతీ టీకా." యా దేవీ సర్వభూతేషు విష్ణు మాయేతిశబ్దితా, నమస్తస్యై నమోనమః" ఇతి చతుర్వింశత్యక్షరోఽష్టాక్షరైస్త్రిభిః పాదైరేకో గాయత్రీఛందస్కో మంత్రస్సిద్ధః."

అనియున్నది. ఇట్టి త్రిపాచ్ఛందస్సులు తాంత్రికగ్రంథములలో వేనవేలు గలవు. శాస్త్రిగారిమతప్రకారము వీటికి మనము జలాంజలి నివ్వవలయునా?. లేనిచో గతియేద్ది?

గుప్తవతీ టీకా, దేవీ భాగవతేఽపి "శ్లో. వటపత్త్రిశయానాయ విష్ణవే బాలరూపిణే, శ్లోకార్ధేన తయా ప్రోక్తం భగవత్యాఖిలార్థకం, ఇత్యుపక్రమ్య, "సర్వంఖల్వి హమేవాహం నాన్యదస్తి సనాతనం" ఇతి సంక్షిప్త భాగవతస్యోక్తిః. అత ఏవ తత్పురాణాదిమ పద్యే త్రిచరణాత్మకే "సర్వచైతన్య......ప్రచోదయా దిత్యాత్మకేఽపి గాథాత్మకః శ్లోక ఇతి వ్యవహారోఽపి గౌణ ఏవ; అతఏవ మాత్స్యేఽదా వస్యశ్లోకస్య "గాయత్ర్యాచ సమారంభః"..."యత్రాధికృత్యగాయత్రీం" ఇత్యాదిరేవ వ్యవహారో నశ్లోకత్వేన, శ్లోకత్వాపాయేఽపి చతుర్వింశత్యక్షరాత్మకతయా గాయత్రీత్వానపాయాత్, తస్మాచ్చతురూనాధికచరణాసు గాథాసు శ్లోకత్వాభావఏవ." ఈవ్యాఖ్యచే "సర్వచైతన్య" అనునది గాథాత్మకమనిన్నీ శ్లోకత్వముగౌణమే అనిన్నీ, అయినను గాయత్రీత్వ మనపాయమే యనిన్నీ సాధించి యున్నారు. నేనీవ్యాఖ్యలనుచూపుట పాఠకమహాశయ ప్రత్యయమునకే కాని శాస్త్రిగారినిమిత్తము గాదు.

"దే. భా. ౧౨ స్కం. ౨౭ "శ్లో. సచ్చిదానంద రూపాం తాం గాయత్రీ.— ధియోయోనఃప్రచోదయాత్" అనియున్నది కదా. ఇదియు గాయత్రీ మంత్రమే యగునా? కాదా? అయినచో గాయత్రితో నారంభమను నర్థమెట్లు సిద్ధించును? కావన్నచో నేలకాదు? ఇదికానిచో "సర్వచైతన్య" అనునది మాత్ర మెట్లగును? అనివ్రాసిరి.

ఇచట శాస్త్రిగారి నిగూఢాశయము తెర బయలుదేరినది. "గాయత్ర్యాచ సమారంభః" అనేచోట గాయత్రీమంత్రముచే నారంభమని ఉపోద్ఘాతకర్తలుగాని వ్యాఖ్యాతలుగాని యెచ్చటను వ్రాసియుండలేదు. ఆవిషయమును నేను పంతమాడి చెప్పగలను. "సర్వచైతన్య" అనునది గాయత్రీ ఛందోబద్ధమున్నూ, గాయత్రీ మంత్రార్థప్రతిపాదకమున్నూ, అనిమాత్రమే చెప్పియున్నారు.

ఉపోద్ఘాతములో గాయత్రీమంత్ర పరత్వమును వారు చెప్పలేదని నిరూపించియేయున్నాను. ఇక వ్యాఖ్యను చూడుడు :

"సర్వచైతన్య రూపాంతా మాద్యాం విద్యాంచ ధీమహి, బుద్ధిం యా నః ప్రచోదయాత్" వ్యా. యాఏతాదృశీ సేయంధ్యాతా భగవతీ మాయావిశిష్ట బ్రహ్మరూపిణీ నోఽస్మాకం బుద్ధిం ధ్యానం కర్తుంప్రచోదయాత్ ప్రేరయేత్.......గాయత్ర్యాః అంతర్యామి బ్రహ్మప్రతిపాదకత్వస్య సర్వవేదసమ్మతత్వేన గాయత్రీపర గాయత్రీ ఛందోఘటిత మంగలాచరణేన ఏతద్భాగవత ప్రతిపాద్యమపిస్తు మాయావిశిష్టాంతర్యామి బ్రహ్మరూప మితిబోధితం" అనియున్నది. ఈవ్యాఖ్యయున్నూ

"సర్వచైతన్య" అనునది గాయత్రీప్రతిపాదకమున్నూ, గాయత్రీఛందోఘటితమున్నూ అనియే చెప్పినదిగాని గాయత్రీమంత్రమని చెప్పియుండలేదు. ఒక వైదికమంత్రమునకు తదర్థ ప్రతిపాదకములగు పురాణశ్లోకములు అనేకములుండిన వాటికి పరస్పర విరోధము లేదు. "సచ్చిదానంద" అనునది పౌరాణిక గాయత్రీమంత్రమని నిరూపించినను నెవ్వరికిని విరోధము లేదు. వైదికమంత్రచ్ఛాయగలిగి తదర్థప్రతిపాదకములగు నార్ష వచనములనే పౌరాణిక మంత్రములుగా గ్రహించి పౌరాణికకర్మల యందు వినియోగింతురు. "తానేవ వైదికాన్మంత్రాన్ భారతాదినివేశితాన్, విహాయ మంత్రనియమం లోకబుద్ధ్యా ప్రయుంజతే" అను ప్రమాణము పైయర్థమునే చెప్పుచున్నది. అట్లుకానిచో పౌరాణికమంత్ర స్వరూపమును శాస్త్రిగారు నిర్ణయింతురుగాక. నా "పౌరాణిక ప్రయోగపద్ధతి" యుపనయన ప్రకరణమందు "సర్వచైతన్య" అను దానిని పౌరాణికగాయత్రిగా పండితాను మతిని బడసి సంతరించియున్నాను. ఇది యిరువది నాలుగక్షరములున్నూ త్రిపాదములున్నూ కలిగి గాయత్రీఛందోబద్ధమయి గాయత్రీమంత్రార్థ ప్రతిపాదకమయి అత్యంతము వైదికగాయత్రీ ప్రతిచ్ఛాయగలిగి యున్నది. దీనికంటె నుత్తమమయినదాని శాస్త్రిగారు చూపింతురేని దానినే సంగ్రహించి దీనిని మమ్మాటికిని విడుచుదును. లేక శాస్త్రిగారికి పౌరాణికోపనయనమే అశాస్త్రీయమని తోచినచో నీడొంక తిరుగుడు వ్రాతలను కట్టిపెట్టి ధారాళమయిన వ్రాతలకు గడంగుదురుగాక. లేనిచో తాటస్థ్యము నవలంబింతురు గాక.

"లోకమందొకరు తాముపొందిన భ్రాంతిని నంతతో నుంచక గ్రంథకర్తలకు గూడ నాభ్రాంతి గలుగునట్లు చేయుచున్నారు ఇట్లువారి విజృంభణమునకు విచక్షణుల యుపేక్షయే మూలమగుచున్నది." అనిరి.

గ్రంథకర్తలు ప్రాచీనవ్యాఖ్యాతలు ఉపోద్ఘాతకర్తలు తన్మతావలంబకులగు పండితులు నెవ్వరున్నూ భ్రాంతిపరాహతులు కాలేదు. ఈ రామశాస్త్రిగారే సర్వవిషయములయందు భ్రాంతిపరాహతులగుచు స్వదోషమును పరులయందు నారోపించుచున్నారు. విద్వాన్ కే. వి. సుబ్బారావుగారు 'జ్ఞ'ను గూర్చి వీరితో చర్చించి సారస్వతానుబంధములో మహాపండితులచే సాక్ష్యము నిప్పించి ఛందోవ్యాకరణములయందు వీరికిగల భ్రాంతిని వెల్లడించియున్నారు.

ఈఛందశ్శాస్త్ర వాదమందుకూడా శ్రీరామశాస్త్రిగారు, నాకట్టి యవకాశమును గలిగించిన మిగుల సంతసించెదను. వీరు నూతనసదుద్యమములను సహింపలేక తదనుగ్రాహకులగు ప్రాచీన ప్రామాణిక వ్యాఖ్యాతలనుకూడా మితిమీరి నిరసించుచున్నారు. అయ్యది దుస్సహమగుటచే నే నింత విపులముగా విమర్శించితిని.



# విశ్రాంతి

పెమ్మరాజు లక్ష్మీపతి గారు

గీతమాలిక

మధుర చైతన్యమయ మధుమాసవాస
రమున సూర్యాస్తమయమగుసమయమందు
ఊరి కన్నెల బాల్యారుచున్న పొలము
లందు స్వచ్ఛంద విశ్రాంతి నందగోరి
పోయి హృదయంగమములుగ బూసి సౌర
భముల వెదచల్లు నింబవృక్షముల నీడ
లందు విలువోలె వంగియున్నట్టి యొక్క
వేరు పీఠముగా పైన గూరుచుంటి.

జవము నింకింపజేయు సంసార సమర
పతితమై డస్సి తూగాడు స్వాంత మంత
ప్రాణములు వచ్చి తలయెత్తి యాడ దొడగె
పలుకు నాగస్వరము విను పాముబోలె.

ఆకుగొమ్మల సందులయందు దూరి
పైబడెడు సాంధ్యరాగసంపదల బొదలి
ప్రాణములు లేచి వచ్చెడు నట్లు సోకు
దక్షిణానిలవీచికాతతుల దేలి

భువన సంతోషకరణ ప్రఫుల్లమాన
మహిత పికగాన మకరంద మహిమ గ్రోలి
నిర్మలానందరస మెద నిండుకొనగ
తన్మయుడ నైతి నొకముహూర్తంబు గడచె.

* * * *

కెరలి పైబడి యాడెడు కిరణముల న
దెట్టిదో యొక్క తేజంబు దృష్ట మయ్యె
మేను మరపించు కమ్మతెమ్మెరలలో న
దెట్టిదో యొక్క మృదులత స్పృష్టమయ్యె.

తీపి వర్షించు కోకిలాలాపమున న
దెట్టిదో యొక్క నాద మింపెనయ నెసగె
అవల నన్నియు నొకచోట నైక్యమందె
నదియు నొకకొంతవడి కదృశ్యంబు జెందె

అఖిల మానందమయమైనయట్లు దోచె
హృదయ మెటకొ రెక్కలువచ్చియెగిరిపోయె
ఏదియును గానరానియయ్యెడను నాకు
సర్వమును గల్గియున్నట్టిసరణి దోచె.

* * * *

కోయిలలపాటలం గూడిపోయెనేమొ?
మలయవాయువీచికలందు కలసెనేమొ?
తరళకిరణాళి లీనమై దాగెనేమొ?
శ్రమము మెల్లమెల్లగా దిగజారిపోయె.

* * * *

మైమరపు దెచ్చునావేశ మావహిల్లె
నంతవర కెం దడంగెనో యరయ నైతి
వెనుక కేతెంచి బట్టి కప్పెడు విధాన
పట్టుకొనియె కవినను నహంభావ మపుడు.

ప్రకృతి సౌందర్యవర్ణన వాంఛ యొదవె
భావములపైన భావముల్ ప్రాక జొచ్చెఁ
వళుల ప్రాసమ్ములకు వచోవధల జేసి
పాడదొడగితి కూర్చినపాట లెల్ల.

పదములే లేని కోకిల పాటలకును
శబ్దమే లేని వాయుసంచారములకు
శ్రుతియొసగె ప్రకృతి నా కర్మగతి యదేమొ
కలుపుకొన నొల్ల దయ్యె నా గానరవము

తేనెలో తీపి కలసినతీరు గాఁగ
పాలు తెలుపును కలసినపగిది దోప
పూవు తావియు నేకమై పోవునట్లు
వానిగతు లెల్ల ప్రకృతిలో లీనమయ్యె.

* * * *

ప్రకృతి కనుగుణమగుపాట పాడ నెంచి
మాటిమాటికి రాగముల్ మార్చిమార్చి
పాడదొడగితి నదియు నిష్ఫలమ యయ్యె
హృదయమున కింక విశ్రాంతి యెట్లు కలుగు?

హృదయమున పాలుపొంగినరీతి పొంగు
భావసముదాయ మెగబోయు పాట ప్రకృతి
కైకొనెనయేని స్వర్గసౌఖ్యంబె కవికి
కైకొనద యేని లేదంతకంటె బాధ.

జగము మరపించు పారవశ్యమును గప్పి
మచ్చుమందుల జల్లెడి మాయలాడి
ప్రకృతిలీలలు తను నంటరానియట్టి
మధురవిశ్రాంతి భావ మే మహిని కలదొ?




కాశీ సోమయాజుల సుందరరామమూర్తి గారు, ఎం. ఏ.

(రెండవ సంపుటము రెండవసంచిక తరువాయి)

## నాలుగవ రంగము

స్మశానము, ప్రవేశము, వస్తూ వీరబాహుఁడు, పడుకొన్న హరిశ్చంద్రుడు.

వీర:—ఒరే, ఒరి పందా!—మొద్దా, పలకవేం, పిలుస్తాఉంటే? తొంగున్నావా ఏటి? నెగు, నెగు. ఇక్కడ తొంగోడాని కట్రా నిన్నెట్టుకొన్నాను? నెగమంటేనీ?

హరి:—తెలిసే యున్నానే?

వీర:—తెలిగేశే పలకనేదేంరా? నాకాడికి వచ్చిన కాడనుంచి కూడుతిన్నేదు, నీళ్లైనా తాగనేదు, సచ్చావనుకొన్నానూ. సచ్చేవుసుమా! నీయెత్తు కాసులెట్టి కొనుకొన్నాను.

హరి:—రాత్రి ఇక్కడ ఒకపని జరిగినది. మనస్సంతా చెడిపోయినది—

వీర:—ఆఁడదిగాని ఒచ్చిందేటి ఇక్కడికి? పని అంతా ఉన్నావులే.

హరి:—వచ్చింది—

వీర:—ఆఁ, ఆఁడది రావడమే! అవును, ఎర్రగా బుర్రగా ఉన్నావుకాదూ! ఓళ్లైనాబస్తారు. మాటాడిందా?

హరి:—మాట్లాడింది—

వీర:—ఆఁ హాఁ! ఆలాగు శెప్పా! నువ్వెప్పుడూ అబద్దం శెప్పవుకాదూ, ఒల్లకాఁట్లోకాపైనా ఉంతావుకానీ! కాని, ఇక్కడికి ఓళ్లూ రానేదంతే, మరి సూసుకో, ఈశటమే నిన్నాగ్గేస్తానూ, మళ్లీ గుర్రాలేటి, బళ్లేటి, నవకర్లేటి, శాకర్లేటి, రాజ్జంపల్తావు! ఏటంతావు?

హరి:—అబద్ధము చెప్తానా?

వీర:—ఓడికైనా నట్టంబస్తేగదా, అబ్బద్దం? నువ్వలాఅంతే, ఓడు శెడిపోయినాడు? పోనీ, నాకేం? నీకోసమే శెప్పాను. ఆ ఆఁడదాన్నెట్టుకొని కూఁకుపున్నావేటి? నువ్వోటో మంచోడ వనుకొన్నాను. నువ్వూ మాలాంటోడివే ఆఁడోళ్లంతే!

హరి:—ఆడదొకర్తె తనపిల్లవాని శవాన్ని తీసుకొని వచ్చింది—

వీర:—తీసుకొస్తే?

హరి:—సుంకం అడిగినాను.

వీర:—ఇచ్చిందా?

హరి:—లేదు—

వీర:—నేకుంటె పల్లకున్నావేటి, ఆఁడదనా? నిన్నెట్టుకొన్న కాడనుంచి, ఒకచవమైనా

రానేదు, నీకాపెలాంటిదోగాని! ఆఁ! ఓడూ నవ్వనేదేటోగాని, ఓ కాసైనా నేదు చుంకం! దానబ్బాడి చిక్కోసింది, ఏం కట్టమంతావురా చల్కార్కీ? మునుపేటి, చవాలొచ్చే యీ, రేత్రినేదు పగలునేదు చుంకం అందుకొందికి యాల్లేక పోయేదిరా! అందులో చగంమంది ఆడోళ్ల గుమ్మాలకాడ శచ్చినోళ్లే! ఉప్పుడు చవ్వాలు నేవేనేమో, ఉంతే ఇంటికాడ కాల్సేస్తా ఉన్నారో, ఒకచవ్వమైనా రానేదు? చవం రాకరా కొస్తే ఒగ్గేశినావు, నువ్వెందుకురా? నువ్వెందుకు పనికొస్తావ్రా, అంతాను. ఒక్కటేతునా దవడమీద?

హరి:—శవాన్నిదహనంచేయనీలేదే. సుంకం తమ్మని పంపించివేసినాను. ఆమని పింకా రాలేదు, ఎందుచేతనో. రెండుఝాముల రాత్రైనట్టున్నది, ఎప్పుడొస్తుందో గాని?

వీర:—చవ్వా నోట్టుకపోయిందా?

హరి:—అల్లదుగో శవం!

వీర:—అదా? నానుశూశిందే ఒస్తప్పుడు. ఏంకుర్రోడుగదా! ఓడోగాని, రాచోడు నాగున్నాడు! చవమైతే అయిందిగాని, ముద్దెట్టుకోవాలనుకొన్నాను. ఏంతటోణ్ణి కాల్సేయడమే గదా, నస్తేనీ! ఆఁ, ఏటో బగమంతుడూ, ఆడిమాయా! కాని, ఇటుసూడూ, ఓమాట శెప్తానూ.

హరి:—ఏమిటిది?

వీర:—ఏటీనేదూ. ఎవత్తో, రాజుకొడుకిని, నగలకోసం సంపేశిందంట— శేతులెలా గొచ్చాయోగాని—

హరి:—ఎవరూ? ఎప్పుడూ?

వీర:—ఒళ్లైతే నీకేం? ఒప్పుడైతే నీకేం? కాని, నక్కంది, మానక్కంది కాదూ! కూడూ, గుడ్డా, నేకుంతేనే,ఆలాగున్నాది; ఉంతే, ఇంకా ఎలాగుంతాదో? అలాంటిదెలా సంపిందో గాని.

హరి:—(తనలో) ఎవరదీ? ఇంకా నాకేమి రానైయున్నదో?—చంపుతే?

వీర:—దాన్ని నువ్వు సంపాలా, మరేటి? రాజుగాని ఒల్లకుంతాడేటి? ఇదుగో చర్కారుకుం, సదువుకో, (చేతికిచ్చును) రేపూ, తెల్లారకుండా,—అల్లదుగో శూశినా, కాళికామ్మోరు గుడీ?—అక్కడికొస్తాదీ, దాన్ని నువ్వు సంపేయాల.ఒక్కేటునే శేయగలవా,యాటపోతునేశినట్టూ? నానేశీగలనుచుమా, పుంజెడు మెడకాయలు ఒక్కేటుకి. ఇటు సూతో! ఏలమ్మోర్కి మొనుపోతునేశినా, నానే మొల్లాలి గదా! సర్రనియేస్తే, జిల్లని రత్తం అమ్మోరుపాదాలకాడ పడ్డమే! ఆఁ! మరేటనుకొన్నావ్, ఈరబాహులుడంతే?

హరి:—ఎవరనీ? ఆడమనిషినా?

వీర:— నీకేం ఇనబడనేదేటీ? ఆఁడమనిసినే, ఆఁడదాన్నే—ఆఁ, ఆఁ,బోదపడ్డది. ఆఁడదాన్ని సంపుతావా? దాన్నెట్టుకొని కూకుంటంతావుగాని. రేపుపొద్దు రాకుండానే ఒస్తాది గుడికాడికీ-అదేంటో సూసుకో,

నా నెల్తానూ. జాగత్త, ఒగ్గే శేవుసుమా, డబ్బుచ్చుకోసి! నాను మంచోడ్నిగాను. (తెర)

## అయిదవరంగము

కాళికాలయమువద్ద ప్రవేశము; హరిశ్చంద్రుడు

హరి:—సూర్యోదయము కావచ్చినది, ఇంకా రాలేదేమీ ? ఆమనిషెవరో ? చాలా చక్కనిదన్నాడే, వీరబాహుడు? కూటికి గుడ్డకి లేనిదట! ఎవరై ఉండవచ్చునో? (ఆలోచించి, తలఊపి "ఉఁహూఁ" అని నవ్వును) కానీ, అన్నిటికి నడిపట్టినాను.

చంద్రమతి అప్పుడనగా వెళ్లి ఇంకా రాలేదు! సుంకం దొరక్కనా ? యజమాన్ని అడిగితే, మరి వెళ్లవద్దన్నాడా? లేక, దుఃఖం చేత, బడలికచేత, ఎక్కడైనా ముఖం తిరిగి పడిపోయినదా? అదుగో శవం కనిపిస్తున్నదే? వచ్చిఉంటే, కనిపించదా ? నాకేమి పాలుపోకున్నది !

ఆడదానిని చంపెవలెనట! రాజ్యంపోతే, పోనీయన్నాను. చండాలునివద్ద సేవంటే, సరేఅన్నాను. వల్లకాట్లో కాపలా అంటే, సిద్ధపడ్డాను. అటువంటి భార్యను, అటువంటి కుమారుని అమ్ముకొన్నాను. కాని, నాకు ఏదీ ఇంతకష్టమనిపించలేదు. స్త్రీహత్యా! నేను తలారినా! అబ్బా! అబ్బా! ఏమీ! నాచేతులారా, యుద్ధమధ్యమందు శత్రువుల తలలతో చెండాడిన చేతులారా; ఎవరి యాలింగనమున పరవశమందినారో, అట్టి బిడ్డ శవమును, అట్టిమోహనాకారుని శవమును, అట్టి సత్యసంధునిశవమును, దహనము చేయకుండ అడ్డిన చేతులారా; నాయాలుబిడ్డలను తెగ నమ్మిన చేతులారా; ఇప్పుడొక స్త్రీని చంపుటకు వెనుకదీయుచున్నారే ! వాటికంటే క్రూరకృత్యమా ఇది? (ఆలోచించి నిట్టూర్పు విడిచి) కాని తప్పునా? స్వామి యాజ్ఞమీర వచ్చునా? ఎట్టి చక్కనిదైతేనేమి? ఎట్టి సాధ్వి అయితేనేమి? ఇంతేల, నాభార్య అయితేనేమి? చంపకతీరునా, రాజాజ్ఞ అయినప్పుడు? దోషైతేనేమి? కాకుంటేనేమి? ఆవిచారణ నాపని కాదు. రాజాజ్ఞ మన్నించుటే నాపని. తుదకు తలారిపదవినచ్చినదా?— అబద్ధమాడడము, అబద్ధము చేయడము—విధిని అతిక్రమించడము, అబద్ధముచేయడముకాదా? (తెరలో- ఇటు, ఇటు, అదీ, కాళికామ్మోరుగుడి) ఆ మనిషివచ్చినట్టున్నది! కాని, ఎప్పుడూ లేనిది, ఇప్పుడు నాశరీరము కంపమెత్తుచున్నదేమీ? నావిధిని నెరవేర్చే బలము ప్రసాదించు, శంకరా!

(ఇద్దరుబంట్రోతులవద్య చంద్రమతి ప్రవేశించును.)

బంట్రోతు:—ఇదుగోనోయ్, నీతో ఈరబాహుడుసంపుమని శెప్పింది ఈమనిషేను. మామంచి కత్తోట్టుకొన్నావులే.మరికానీ.

హరి:—హా !

బం:—పడిపోతాడు కాబోలు? శారపడిపోయినాడు ! ఈడేటి సంపుతాడు ?

హరి:—నీవు నిజముగా చంద్రమతివేనా ? లేక ఒకరిని చూచి ఒకరనుకొంటున్నానా!

చంద్ర:—నేను చంద్రమతినే. తమ ధర్మపత్ని, చంద్రమతినే.

బం:—ఏటవుతాదీ? ధర్మపత్తేటీ?

హరి:—రాజుగారి కుమారుని నగలకొరకు చంపినదని నిన్నేనా అన్నారు?

చంద్ర:—నన్నే.

హరి:—అదెలాగు సంభవించినది?

చంద్ర:—సుంకంకొరకు ప్రయత్నించడానికి వెళుచూంటే, ఎవరోకొందరు మనుష్యులువచ్చి, ఒకశిశుశవమును నాకాళ్ల వద్దపడవేసి, కొన్నినగలు నావడిలోవేసి, పారిపోయినారు. నేను నిర్ఘాంతపోయి నిల్చుండగా, కొందరు రాజభటులు వచ్చి, నన్ను ఆశవముతోనూ, నగలతోనూ, తీసుకొనిపోయి రాజుఎదుట ఉంచినారు. ఆ భటుల మాటమీద, విచారణ లేకుండా, నాకు మరణశిక్ష విధించినారు, ఇక్కడికి తీసుకొనివచ్చినారు. నేను నిర్దోషినని చెప్పనవసరమా?

హరి:—నిన్ను దోషి అన్నదోషమునకు క్రొత్తనరకములు కల్పించవలెనేమో?

చంద్ర:—మీరేనా నన్ను వధించవలసినది?

హరి:—అవును.

చంద్ర:—ధన్యాస్మి! ధన్యాస్మి! పుత్రశో—

హరి:—అయిదవ అంకములో చివరరంగము వచ్చినది! దీనితో హరిశ్చంద్రనాటకము సరి! సరి! సరి! దినముతెల్లవారినది, ఇక్కడ నాబ్రతుకు తెల్లవారినది! లోహితాస్యుని పాము చంపినది. చంద్రమతిని నేను చంపవలెను! ఇక నేనేమైతేనేమి? ఏకాకిని!

బం:—ఓళ్లైనా సంపాల. తప్పేతుందేటి? అంతపనిశేస్తే, ఒల్లకుంతారేటి?

హరి:—చంద్రమతీ!

చంద్ర:—నాథా!

హరి:—"నాథా" ఏమిటి? నేను తలారిని.

చంద్ర:—మంచిదే, తలారిభావమే వహించి, కావలసినదానిని కానియ్యండి. పుత్రశోకమికభరించలేను. నన్ను వెంటనే కడతేర్చి, బాబయ్యవద్దకు పంపివేయండి. అదుగో నాచిట్టివానిశరీరము, ఒక్కమారు ముద్దుపెట్టుకొని రావడానికి శలవియ్యండి. (అక్కడికివెళ్లి) బాబా, అమ్మవచ్చేవరకూ ఉన్నావా? నన్ను నీవెవరికీ అప్పగించనక్కరలేదు. కలిసే—

బం:—బేగిరా! బేగిరా! (చంద్రమతి తిరిగీ వచ్చును)

హరి:—మీయిద్దరినీ నేను ఎప్పుడు కలుస్తానో? ఎంతకాలము—

బం:—మాటలెందుకు? కాసీవోయ్! బేగి కాసీ! ఆతలకాయొట్టుకొని నాను ఎంటనే ఎల్లాల రాజుకాడకీ. కాసీ, సూస్తావేం, ఎర్రోడులాగు?

హరి:—ఆలాగే. చంద్రమతీ, ఆమనిషిపనికి మనమెందుకు అడ్డురావలెను? నీవు ఆ దుక్కమీద తలఉంచి భగవద్ధ్యానము చేసుకో.

చంద్ర:—భగవత్సమానుని కట్టుకొన్న నాకా భగవద్ధ్యానము? మోకాళ్లబడి తమ వైపు చూస్తూంటాను, నరికివేయండి. ధైర్యము విడవక, వీరాధివీరులను ఎందరినో వీరస్వర్గమునకుపంపిన ఆచేతితో నన్ను వెంటనే లోహితాస్యుని స్వర్గమునకు పంపండి. ఒక్కమనవి: వీలైతే, మాయిద్దరినీకలిపే దహనము చేయండి.

హరి:—మీ యిద్దరికీ ప్రత్యేక స్వర్గము నిర్మించ—

బం:—ఓహో! ఇదేటిఅల్లరి నీతోనూ? మీమాటలు ఇనడానికిగాని వచ్చాననుకొన్నావేటి? బేగి కానీమంటే, నీక్కాదేటి శెప్పడం?

హరి:—చంద్రమతీ, మరెందు కాలస్యం? మనస్సులో కోరికలేమిఉంచుకోకుండా—

చంద్ర:—ఎన్నిజన్మములెత్తినా, తమవంటి భర్త, చిరం—అయ్యో, చచ్చిపోయినా "చిరంజీవ" నే వస్తున్నదే! లోహితాస్యునివంటి కుమారుడు కావలెనన్న కోరిక మాత్రం ఉండకమానదు. 'యాంతేమతి స్సాగతిః' కదా?

హరి:— విశ్వేశ్వరా, మాతాన్నపూర్ణా, నన్ను వీరితో ఎప్పుడుకలుపుతారో?

బం:—కానీ, బేగికానీ, ఆకత్తుచ్చుకొని, మెడకాయ యేశీసుకొంటే, ఆళ్లతో కలిసి పోతావు. ఒకళ్లు కలిపేదేటి?

హరి:—చంద్రమతీ, ఆనాడు ఏమెడను మంగళసూత్రముకట్టి నాచేయి తరించినదో, ఆమెడను, ఆచేతితో, ఇప్పుడు తెగనరకవలసివచ్చినది! సత్యమా, ఇదుగో, ఈ యాగపశువును నీకు సమర్పించి, నాయాగమును పూర్తిచేసుకొంటున్నాను! మొండికెత్తిన ఏకాకిని! (నరకబోవును)

(విశ్వామిత్రుడు తొందరగా ప్రవేశించును)

విశ్వా:— (హరిశ్చంద్రుని చెయ్యిపట్టుకొని) హరిశ్చంద్రా, హరిశ్చంద్రా, చంపకు, చంపకు! ఏమి కళత్రమును చంపడమా? నీకు మతిపోయినదా యేమి?

హరి:—ఋషివర్యా, నా స్వామికార్యము చేస్తున్నప్పుడు, తమ రడ్డురావచ్చునా? రాజాజ్ఞ అయినప్పుడు, ఎవరినైనా చంపవలసినదే. తమకు తెలియనిదాయేమి?

విశ్వా:—(తనలో) ఏమిసాధనం? *ఏలాగు మాన్పించడం? ఆమెను చంపడముకాదు, నాపేరును చంపడం, నాతపస్సును చంపడం! నాపోతరము ఎంతవరకు తెచ్చినదో! అయ్యో! అయ్యో కష్టాలికి మొండికెత్తి పోయినాడే లొంగిపోతాడనుకొంటే! ఏమిచేతును?

హరి:—ఋషివర్యా, నాచెయ్యి ఆపి, ఏమో ఆలోచిస్తున్నట్టున్నది. నాపనికి అడ్డువచ్చినయెడల, నేను క్షత్రియుడన్నమాట—

విశ్వా:—ఓహో, నేనూక్షత్రియుడనేనోయ్!—

హరి:—సరే, కనపర్చు. ఋషివని గౌరవించినాను. (చెయ్యి విదలకించివేయును)

విశ్వా:—ఏదో మతిపోయి అన్నాను,పోనిస్తో.

హరి:—నేను చేయవలసినపని చేస్తూంటే, నీకేమి మతిపోవడం ?

విశ్వా:—నామాట విను-చంపకు, చంపకు-వినవుకాదూ? నేను—

హరి:—నేను నావిధిని నెరవేర్చిన తరువాత వింటాను- ఇప్పుడు—

విశ్వా:—నేను నీతండ్రికి కొత్తస్వర్గము నిర్మించినాను.

హరి:—దానికి కృతజ్ఞుడనే. కాని దానికీ, ఈ పనికి సంబంధ మేమిటి ?

విశ్వా:—నామాట వినవు కాదూ ? నీకెంత లాభము చేస్తానో చూడు.

హరి:—నాకు యజమాని విధించినపనికి అడ్డు రాకపోవడమే, మహోపకారము చేయడము. చంద్రమతీ, నీఅవసానమున వీరి దర్శనమయినది. నీ యదృష్టమేమని చెప్పేది? సిద్ధముగా ఉన్నావా ?

విశ్వా:—మరి నీయిష్టం. నేనేమిచేయగలను? (తనలో) చంపడంమానివేస్తే, అబద్ధంకింద లెక్క.వచ్చియుండును—అబద్ధం చేయడం అని తానే అన్నాడు—నేనుగెల్చి యుందును. కాని, ఎలాగు నరకగలడో చూస్తాను!

హరి:—నీయిష్టమని చెప్పి అడ్డుగా నిల్చుంటే ఎలాగు? (విశ్వామిత్రుడు వెనుకకుపోవును) (హరిశ్చంద్రుడు కత్తిఎత్తి) జాయ్, విశ్వేశ్వరా! జాయ్, మాతాన్నపూర్ణా! జాయ్ సత్యమా!— ఏమిది? చేయిదిగదేమీ? ఇది విశ్వామిత్రుని పనికాదుగద! కొత్త స్వర్గము నిర్మించినవానికి, ఇది అసాధ్యమా ?

చంద్ర:—నాథా, ఇదేమిది? తలారిభావము మరచిపోయినారా యేమి ? ఇంతవరకువచ్చి, అధైర్యపడుతున్నారా,నన్నుచూచి?

హరి:—ధైర్యముచెడి కాదు. ఏమోగాని ఎత్తినచెయ్యి దిగకుండా ఉన్నది! కానీ, చూస్తాను ఇదేమిటో!

విశ్వా:—(తనలో) మరిచూచేది ఏమిటి ? నాశక్తికి నీవెక్కడ నిలబడగలవు?

హరి:—నేనే సత్యవ్రతుడనైనయెడల—

చంద్ర:—నేనేపతివ్రత నైనయెడల—

విశ్వా:—అన్నా, ఇదేమిటి?

హరి:—వెంటనే, తప్పక, నాచెయ్యి స్వాధీనము కావలెను. (వెనుకనుంచి శివుడు చేయిపట్టుకొనును) ఎవరదీ నాచెయ్యి పట్టుకొన్నదీ? విశ్వామిత్రా, ఇంకా నాచెయ్యి విడవవేమి?—వద్దుసుమా నాతో అల్లరి! శివుడు అడ్డుపడినా, స్వామిద్రోహము చేతునా? విడువు! విడువు!(తిరిగిచూచి)ఎవరదీనాచెయ్యి పట్టుకొన్నదీ?—హా! ఎవరూ ఏమి ? ఆత్రిశూలము, ఆఫాలనేత్రము, ఆ నాగాభరణము, అహా! మహాదేవా! విశ్వనాథా! ఏమినాఅదృష్టము! ఆహా! తమరుకూడా దయచేసినారా, గురువర్యా! విశ్వేశ్వరా, ఇదుగో, నాస్వామికార్యము చేసివస్తున్నాను. జాయ్!

శివుడు:—హరిశ్చంద్రా, నీవు నీభార్యను చంప వద్దు.

హరి:—మహర్షులకు కష్టలభ్యమయిన తమ దర్శనము, నాకు అప్రయత్నముగా లభించినది. కాని—

వసిష్ఠుడు:— అప్రయత్నమేమి, వత్సా? "సత్యంతపస్, శాంతంతపస్" అనిఎరుగవా? ఆ తపస్సులు నీవలె చేసిన మనిషెవడు? ఆతపఃఫలమే విశ్వేశ్వరుని దర్శనము

శివుడు:—దానికి సంశయమేమీ?

హరి:—మహాదేవా, తమరు విశ్వనాథులే, కాని నాకిప్పట్లో వీరబాహుడు యజమానై యున్నాడు. చంద్రమతిని నేను వధించవలెనని వానియాజ్ఞ. దానినినెరవేర్చి—

శివుడు:—నీవది చేయ నక్కర లేదు.

హరి:—ప్రభూ, అల్పజ్ఞుడను. ఆమాటనాయజమానికదా అనవలెను?

శివుడు:—వత్సా, సత్యమూర్తీ, నిన్నుచూచినకొలదీ, వింత ఆనందము కలుగుచున్నదే! వీరబాహుడా, ఏమంటావు? (వీరబాహుడు ప్రవేశించును)

వీర:—ఒరిచందా, సంపనక్కర నేదు.

హరి:—ఎవరిని?

వీర:—శందమతిని.

హరి:—ఎవరు?

వీర:—నువ్వు, నీబారిగా, శందమతిని, ఈ ఆడదానిని, సంపనక్కరనేదు. అన్నీ యేసి శెప్పినాను. బోదపడ్డదా?

హరి:—అయితే, నీవే చంపుతావా ఆమెను?

వీర:—సంపను.

హరి:—నీవు రాజాజ్ఞను మన్నించ నక్కర లేదా?

వీర:—ఓళ్లూ సంపనక్కరనేదూ. ఇదుగో సూడు కాయితం.

హరి:—(చదివి) చంద్రమతి నిర్దోషిగనుక ఆమెను చంపవద్దని వ్రాసినారు. మహాదేవా, ఏమిశలవు?

శివుడు:—చంద్రమతీ, విన్నావుగదా? నీవు లేచి నీభర్తవద్ద నిలువబడు. మీవంటి దంపతులను ఎవరుచూచినారు? (ఆమె అట్లుచేయను)అమ్మా, నీకేమి కావలెను?

చంద్ర:—నేను లోహితాస్యునిచేరి ఆనందిస్తానని ఎంతో ఆశపడినాను.

శివుడు:—ఇప్పుడే చేరగలవు. వానిశరీరమును నాకు అప్పగించి వెళ్లినావు. వానినిష్కళంకమయిన ఆత్మతో వానిని నీ కప్పగిస్తున్నాను. లోహితాస్యా! అని పిలువు.

చంద్ర:—లోహితాస్యా!

(లోహితాస్యుడు) పరుగెత్తివచ్చి: చిత్తం, అమ్మాజీ! మనము ఇక్కడున్నామేమీ? మనము సేవచేస్తున్న ఇల్లేదీ? నాకు అడివిలో పాముకరిచినదే. ఇక్కడికి ఎలాగు వచ్చినాము? నా జట్టుదార్లేరీ?

చంద్ర:—(పిల్లవానిని ఎత్తుకొని శివుని యెదుట మోకాళ్లపడి) మహాదేవా!

భక్తులు తమకుసమర్పించిన దానికంటే, తమరు ఎప్పుడూ ఎక్కువే యిస్తారు. హృదయము అర్పిస్తే, కైవల్యమిస్తారు. సర్పదష్టుడై చనిపోయిన నాపిల్లవాని శరీరమును తమకు అప్పగిస్తే, సజీవునిగా జేసి దయజేసినారు.

లోహి:—అమ్మాజీ, నేనుచనిపోయి, మళ్లీ బ్రతికినానా? కాని, ఆయ నెవరు? బాబాజీవలె ఉన్నారు, వారేనా?

చంద్ర:—అవును, నాయనా, వారేనూ. మనము—

లోహి:—నమస్కారము, బాబాజీ! తమ రిక్కడున్నారేమీ? మమ్మల్ని చూడడానికి దయచేసినారా? అమ్మాజీకి మరి దాస్యములేకుండా చేయరూ? పాపం, ఎంతోకష్టపడుతున్నారు! కాని, తమరేమండి, అంతశుష్కించి పోయినారు?

హరి:—(ఎత్తుకొని) నీకంటే ఎక్కువ శుష్కించి పోయినానా, బాబా? కాని, వారెవరో ఎరుగుదువా?

లోహి:—నేనెప్పుడూ చూడలేదు.

హరి:—వారు—

లోహి:—ఉండండి, ఉండండి, నేను చెప్పకొంటాను. ఇందాకా నేను వారిముఖము బాగాచూడలేదు. మెడలోపాములు పరమేశ్వరునికే కాదూ ఉంటాయి, బాబాజీ?- అదుగో ఫాలనేత్రము, శిరస్సున చంద్రకళకూడాను! నమస్కారము, మహాదేవా!— అదుగో మనగురువుగారు కూడా దయచేసినారే! నమస్కారము గురువర్యా!

(శివుడు వసిష్ఠుడు ఒకరి తరువాత ఒకరు లోహితాస్యుని ఎత్తుకొని ముద్దులాడుదురు.)

విశ్వా:—హరిశ్చంద్రా, నేనోడిపోయినాను. నాతపోధనములో సగము ధారపోస్తాను, చెయ్యిపట్టు.

హరి:—ఓడిపోవడమేమిటి? ధారపోయడమేమిటి? తమతో నేనెప్పుడూ పందెం వేయలేదే?

విశ్వా:—నీచేత అబద్ధ మాడించ గలనని నేనూ, ఆడించలేనని వసిష్ఠు, దేవేంద్ర సభలో పందెము వేసుకొన్నాము. నేను ఓడిపోయినయెడల నాతపఃఫలము సగము నీకు, సగము వసిష్ఠునకు ధారపోస్తానని ఒప్పకొన్నాను. నేను ఓడిపోయినాను. (ధారపోయుటకు కమండలము చాచును.)

హరి:—విన్నావా, చంద్రమతీ?

చంద్ర:—వసిష్ఠ భగవాన్లు వారుండా, ఇటువంటివాటిలో మనకు అపజయము రావడమేమిటి?

వసిష్ఠ:—అమ్మా, ఇందులో మీకు నేనేమి సహాయము చేయలేదు. చేయకూడదని ఒప్పదల.

హరి:—అన్నితపములకు, అన్నిటికంటె, ఎక్కువఫలము పరమేశ్వరుని దర్శనము. అది మాకు వారికటాక్షమువల్ల దొరికినప్పుడు, ఋషివర్యా, మీతపఃఫలము మాకెందుకు?

చంద్ర:—సముద్రమునకు ఉప్పు సమర్పించడము!

లోహి:—బాబాజీ, ఆయనకష్టార్జితమైన తపఃఫలము మనకు అక్కరలేదన్న పుణ్యాంకంటె ఎక్కువా ఆతపఃఫలం ?

వసిష్ఠు:—లోహితాస్యా, నీకెలాగు తోచిందోయ్ అంత చక్కనిమాట ?

లోహి:—మహాదేవుని సన్నిధిని, తమరందరి సన్నిధిని, ఆమాత్రంతోచడం ఆశ్చర్యమా, గురువర్యా ?

వసిష్ఠు:—విశ్వామిత్రా, నాసగమూ ఇయ్యనక్కరలేదు. నాహరిశ్చంద్రుడు నిన్ను గెలవడముకంటే ఎక్కువా అది?

విశ్వా:—మీచేత అబద్ధ మాడించడానికి మీకు పెట్టరాని బాధలు పెట్టినాను. నన్నుక్షమించ ప్రార్థిస్తున్నాను.

వసిష్ఠు:—వత్సా, విశ్వామిత్రమహర్షి అతిదీనుడై మీక్షమాపణ వేడుచున్నాడు. అటువంటి వానిని క్షమించడమే ఔదార్యము.

చంద్ర:—మాసత్యాసక్తిని పరీక్షించడానికి పెట్టినబాధలుగాని మామీద కోపముచేత కాదే? మామామగారికి ప్రత్యేక స్వర్గము కల్పించిన దయామయులు మాకు హానెందుకు చేస్తారు?

వసిష్ఠు:—చాలా ఔదార్యముగా అన్నావు, కుమారీ!

శివుడు:—హరిశ్చంద్రా! నీ కేమి కావలెను?

హరి:—తమదర్శన మైనప్పుడు, మరి మాకు కావలసిన దేమున్నది! ఏమివచ్చినా, మేము సత్యము తప్పకుండా ఉండేటట్టు ప్రసాదించు, మహాదేవా!

శివుడు:—ఆబలముమీకువిశ్వామిత్రమహర్షే ఇచ్చినాడు. అతనిపరీక్షకు నిలబడినవారు మీముగ్గురూ; మీచేత ఎవ రబద్ధమాడించగలరు? నీసత్యవ్రతమునకు నిదర్శనగా, గంగప్రవహించునంతకాలము, మీరమ్ముడుపోయిన బజారు, హరిశ్చంద్రబజారని పిలువబడును, గంగాఘట్టములలో నొకటి హరిశ్చంద్రఘట్టమనిపిలువబడును. నీపేరుసత్యాసక్తికి ఉపమానముగా వాడబడును. చంద్రమతీ, నీకేమికావలెను?

చంద్ర:—నేనట్టిభర్తకు తగినభార్యగా ఉండేటట్టు కటాక్షించు, విశ్వేశ్వరా. మరొక కోరిక:—కాశీ—

శివుడు:—కాశీరాజు కుమారుని బ్రతికించుమంటావు—అంతేనా?

చంద్ర:—చిత్తం.

శివుడు:—వాడు బ్రతికే యున్నాడు. చంపబడ్డశిశువు విశ్వామిత్ర కల్పితముగాని, నిజమైన పిల్లవాడుకాడు. లోహితాస్యా, నీకేమి కావలెను ?

లోహి:—నన్ను తమంతవానిగా చేయనే చేసి నారు—

విశ్వా:—అదెలాగు, చిన్నిహరిశ్చంద్రా?

లోహి:—తమకు తెలియకనా అడిగినారు? నన్ను మృత్యుంజయులు మృత్యుంజయునిగా జేసినారు. నాకేమికావలెనో వారికి తెలుసును.

వసిష్ఠు:—బలే వత్సా! (వానిని ముద్దులాడును)

శివుడు:—మరి మీరు పోయి చిరకాలము మీ రాజ్యము ఏలుకోండి.

హరి:—విశ్వేశ్వరా, నా అజ్ఞానము సహించ వేడుచున్నాను. మేము ముగ్గురమూ బానిసలముగా అమ్ముడుపోతిమే? మా యజమానులను విడిచి ఏలాగు వెళ్లగలము?

విశ్వా:—మీముగ్గురినీ కొన్నవారు, కేవలమూ నాసృష్టి. వారు నిజముగా లేరు. స్వప్నములో ఒకరికి బాకీఉండి, జాగ్రదవస్థలో ఆఋణము తీర్చబోవడమే, వారివద్ద మీరు సేవచేయడము.

హరి:—మరి ఒక్క అజ్ఞాన ప్రశ్న, మహాదేవా:—నాకు రాజ్యము లేదే?

శివుడు:— విశ్వామిత్రమహర్షికి రాజ్యమెందుకు? నిన్ను పరీక్షించడానికి పుచ్చుకొన్నాడుగాని, నీకు తిరిగీ ఇచ్చివేస్తాడు.

హరి:—మహాదేవా, ధారాదత్తమైన దానిని, తిరిగీ ఏలాగు గ్రహించగలను?

వసిష్ఠు:—వారు విశ్వమునకు ప్రభువులైనప్పుడు, వారు నీకియ్యలేని దేమున్నది, వత్సా?

హరి:—విశ్వేశ్వరులు దయచేస్తే, పుచ్చుకోవడానికి అభ్యంతరమేమీ?

విశ్వా:—నేనిస్తే, గ్రహించడు. విశ్వనాథా, నాకు హరిశ్చంద్రుడు ధారపోసినదంతా, తమకు సమర్పిస్తున్నాను. అతన్ని సంతోషపెట్టడానికి చేస్తున్నదిగాని, అంతా తమదే అయినప్పుడు, తమకు నేను అర్పించడమేమిటి?

శివుడు:—విశ్వామిత్రా, బాగా చెప్పినావు. హరిశ్చంద్రా, ఇప్పుడు నీకేమి, అభ్యంతరమా?

హరి:—విశ్వనాథా, తమరు దయచేసినప్పుడు, అభ్యంతరమా? అతికృతజ్ఞతతో అంగీకరిస్తున్నాను.

శివుడు:—పొండి. ప్రజలక్షేమముకొరకు చిరకాలము రాజ్యముచేయండి. విశ్వామిత్రమహర్షి మీకుచేసిన మహోపకారము మరిచిపోకండి.

విశ్వా:—వారివల్ల నేను తరించినాను. తమదర్శనలాభము నాకు వారివల్లనే కలిగినది. యుద్ధములో చంపబడినవానికి, వీరస్వర్గమువచ్చినట్టు, నేను వీరికి ఓడిపోయి, వీరస్వర్గముకంటే, అన్నిటికంటె, ఎక్కువ తమదర్శనలాభము పొందినాను. మహనీయులకు ఓడిపోయినా, లాభమే. జాయ్, హరిశ్చంద్రా! నిరుపమానసత్యవ్రతా!

(అందరు శివుని స్తోత్రముచేస్తూ ఇలాగు పాడుదురు).

నటుసని కిష్టమైనసి ఏదైన పాడవచ్చును.

# నేరహృతీమ్మ




నాదెళ్ల వెంకట్రావు గారు, బి. ఏ.

ఎన్నిదినంబు లేను భవదీయముదావహ సన్నిధానమం
దున్నను దృష్టిలేదు, లసదుజ్జ్వలమూర్తిని నిన్ను వీడి యే
పన్నతఁ బోవుచున్న ననుభక్తునిఁ ద్వత్కరుణాకటాక్షసం
పన్నునిఁ జేయఁగాగదె యపారకృపామతి వేంకటేశ్వరా!

ఎన్నిదినాలకో తిరిగి వీక్షణలాభము నిన్నుఁ జూచుచు
న్నన్నులపండువౌ గతి దినంబులు కొన్నిటినైనఁ బుచ్చుకుం
డ న్ననుఁ గార్యభారము లడావిడిగాఁ గొనిపోవుచుండెఁగా
చెన్నపురంబు; భక్తునెడ! స్నేహము నుంచుమ వేంకటేశ్వరా!

గురువిరహవ్యథాజనిత కోమలబాష్పజలంబులన్ భవ
చ్చిర మభిషేకము న్సలిపి, స్నిగ్ధమదక్షిసుమంబులన్ కరం
బరుదగుపూజనం బహరహంబును జల్పెదనోయి నీదుసుం
దరతరవిగ్రహం బెదుటఁ దార్చి ముదంబున వేంకటేశ్వరా!

కాలము చాలనందునఁ జక్కాపికిగా రచియించినట్టి యీ
లాలితచంపకోత్పలవిలాసవిశేషవిరాజితంబులౌ
మాలల భక్తితోడుత సమర్పణచేసితి, స్వీకరించి నా
పై లలితత్వదీయకృపఁ బాయఁగ నీకుమ, వేంకటేశ్వరా!






[ఉపోద్ఘాతము]

౧

రామచయనులు పూర్వమీమాంసకుఁడు. క్రతువు లన్నియుఁ గ్రమముగా నొనర్చిన కర్మజ్యేష్ఠుఁడు. అతఁ డొకనాఁడు శ్రవణ మొనరింప నెంచి శతవృద్ధైన బ్రహ్మశాస్త్రి కడ కేఁగి వందన మొనర్చి—అయ్యా! కవుల యథార్థవాదులు; సత్యకథ నేదేని చెప్పుదురని తమకడ కరుదెంచితినని మనవిచేసెను.

బ్రహ్మశాస్త్రి యాశీర్వదించి చిఱునవ్వు నవ్వి యిటులు చెప్పెను. నేను సహస్రాధికరణ పరిమితమగు నొక గ్రంథమును విరచించితిని. నాయుపదేష్ట లెవరికి సంబంధించిన యధికరణమును వారికిఁ గృతియిమ్మని యాజ్ఞాపించిరి. అందులకుఁగాను దగువారిని వెదకి వెదకి యాయా యధికరణముల నాయాయివారికిఁ గృతియిచ్చితిని. కాని వా రంతయు విని మాకక్కఱ లేదని లేచిపోయిరి. ఇటులు కాఁగాఁ దొంబదినూటఁ దొమ్మిది యధికరణములను మహాకోపముతో నదిలోఁ బాఱవైచితిని. ఈ మిగిలిన యొకయధికరణము కర్మిష్ఠుల కంకితము చేయవలసియుండఁగా వారిని వెదకికొనుచుఁ బోయి యొకొక్కనికే యంకితము చేయ మొదలిడితిని. వారు మొదటిఘట్టమునుండియు నుపోత్తమఘట్టమువఱకును వినుటకుఁ జెవులు కోసికొనిరి. చివరకు వచ్చునఱకుఁ జిరాకుతో నాచమించి నీరు చల్లికొనుచు లేచిపోయిరి. నాకును విసువు పుట్టి మిగిలిన యధికరణములతోపాటీ యధికరణమును గూడ నదిలోఁ బాఱవైచితిని. ప్రతిపర్యాయము ప్రతి తాటాకుగూడ నెదురీఁత యీఁది నాకడకు వచ్చినది.

రామ—ఎంత మహత్తు! ఐతే యిది ఋషిప్రోక్తమనుకొందును.

బ్రహ్మ—ఔను. దీనిని గౌతముఁడు మనోమహాశయున కుపదేశించెను. మనోమహాశయుఁడు వాఙ్మహాభాగునకు.

రామ—ఈకాలమున క్రీస్తుశకము ౧౬౧రవ సంవత్సరమున వెంకినీఁడు వేఁగిదేశమును బరిపాలించుచుండెనని వ్రాయుదురు. దాని నే ఋషి చెప్పెను? సామాన్యమానవుఁ డేమి ప్రమాణము? సామాన్యముగా వ్రతములలోఁగూడ నాముని యీమునికిఁ జెప్పెను. ఈముని యాఋషికిఁ జెప్పెను. ఆఋషి యీఋషికిఁ జెప్పెను. ఈఋషి ధర్మరాజునకుఁ జెప్పెను. ధర్మరాజు దాని నాచరించి క్రమముగాఁ బండ్రెండేం డ్లరణ్యవాసమాచరించి పిదప నొకయేఁ డజ్ఞాతవాస మొనరించి తుదకు యుద్ధ మొ

నర్చి రాజ్యముఁ బడసె నని యుండును. కథ యూట్టి లే కుండినను ఋషులే కథ. మన యార్యులకు ఋషులే కథకులు. వారి కథ లతిగూఢములుసుమండి! ఏ దేశములో నేమంచి కథ లున్నను నవి ఋషిప్రోక్తములే యనుకొనుఁడు. 'నానృషిః కురుతే కావ్యమ్?' ఇవే కాదు. యంత్రములు? ఇంకను! ఆహా! యుద్ధమో! అధర్వణ మంతయు యుద్ధమే! దాని నుచ్చరించుచో విండ్లలోనుండి తూపులుపోవును అ వన్నియు నతిగూఢములు!

బ్రహ్మ—అయితే యీకథమాత్రము గూఢముకాదు. వాయూదకములవలె నెల్లరకందఁజేయుమని వాఙ్మహాభాగుని యూదేశము.

రామ—నే నీక నగారా యనుకొనుఁడు.

౨

బ్రహ్మశాస్త్రి యిటులు చెప్పెను:

తొల్లి యొకానొక భూఖండమునఁ గొందఱు మేము మనుజుల మని తెలిసికొనిరి.

రామ—ఆహాహా! ఎంత విచిత్రులండీ! తెలిసికొనిరిగా!

బ్రహ్మ—ఔను. మఱియు వా రచటఁగల కొండలను నదులను సరోవరములను వెలుఁగును జీఁకటిని గాలిని మింటిని నిప్పును నీటిని సూర్యుని జంద్రుని నక్షత్రములను నుప్పుబెల్లములవలె నుపయోగించుకొనఁజొచ్చిరి. అపుడు సృష్టి యీశ్వరుని యొడిలో బాలికవలె నుపలాలింపఁబడెను.

రామ—అయ్యా! పూర్వపక్షములలో వాణీకాంచికాఘంటికవలె మ్రోఁగు నా నాలుక స్పందింపకుండఁజాలదు! క్షమింపఁగోరెదను.

బ్రహ్మ—అది నాకును నుపయోగమే. అసలొక యధికరణమే మిగిలినది. అదియు మిగులఁ జిన్నది. లావు కాకితములపై నచ్చొత్తింప నెంచుచున్నానుగాని వెల చాల నెక్కుడుగా నున్నది. ఇపు డాబాధ లేదు. మీ పూర్వపక్షములుకూడఁ గలిపినచో గ్రంథము విపులమయి యొకపుస్తకముగాఁ గూరును.

రామ—ఆ భూఖండము నేఁటికిని గలదా? అటకుఁ బోయినచో నగ్నిహోత్రగృహమునం దున్నటులుండవచ్చును.

బ్రహ్మ—నావికుని బిలుతురుగాని.

రామ—సముద్రయానము నిషిద్ధముకదా!

బ్రహ్మ—ఓహో చిక్కే! కాని మనస్సు శుద్ధి చేసికొన్నచో నీకథ విని మీశరీరమునే నావగా నటకు నడిపింపవచ్చును.

రామ—స్వామీ! మన్నింపుఁడు. మఱియొక శంక. అంతయుఁ దెలిసిన విజ్ఞులుకదా! తామానందనవనమునకుఁ బోవక యీ శ్మశానమున నున్నారేమి?

బ్రహ్మ— నే నీ రెంటికి నడుమ నున్నాను.

రామ—ఇదేమి చమత్కారము? ఆకథ నంతయు నొక గుక్కలోఁ జెప్పుఁడు.

బ్రహ్మ—వారు భూగుహాలో నగ్నమైయున్న సస్యదేవతను గనఁగొనిరి. 'నోరుగలవాని

ములను బిండిగొట్టిరి. అపుడు జనులు విత్తిన విత్తనములను భూమి యావువలెఁ దిని వైచుచుండెను. పోసిన నీరిని ద్రావి వైచుచుండెను. అదిచూచి యొకఁడు నేలను దన్నెను, దున్నెను, త్రొక్కెను, త్రవ్వెను, బుజ్జగించెను. అంతటితో దాని పెంకెతన మంతయుఁ జదునాయెను.

మఱియొకఁడు భగీరథ ప్రయత్నములు చేసి కొండలనుండి వాగులను దెచ్చెను. వారిలోఁ గొందఱు ఋషులుకూడ నుండిరి. ఆయాయి వాగులు నేఁటికిని వారివారి పేరులచే వ్యవహరింపఁబడుచున్నవి. ఈనీరిచేఁ దన పిపాస తీఱి భూమి మనుజులు తమలోన దాఁచికొనిన విత్తులకుసహస్రాధికముగాఫలింపఁ జొచ్చెను. నాఁటినుండియు నగ్నయగు సస్యదేవత పలురంగుల చీరలు దాల్చి భూమి నంతయుఁ దనకుఁ గ్రీడారామముగాఁ జేసికొనెను. దానివాహనమగువృషభము నాఁటి నుండియు సత్కరింపఁబడుచుండెను.

ఆసస్యదేవతనుండియు భూమిలోని లోహములనుండియు లక్ష్మిపుట్టఁగా దానినందఱు నారాధించిరి. కొంద ఱామె నుపాసించి ప్రమ తేజస్సును వృద్ధిపఱచికొనిరి. మఱికొంద ఱధికారము ననూయను సంపాదించికొనిరి. ముఖ్యముగా స్త్రీలు లక్ష్మీసంపన్న లైరి. ఇది వారికి లాలసతను బిఱికితనమును మప్పెను. దీనిచే వారిరాజ్యమున నూతన సింహాసన మేర్పడెను.

పెక్కురు భూధేనువునుండి సస్యక్షీరములఁ బిదుకువారైరి. దానఁ బరస్పరసంఘర్షణముచే జనులు తమశక్తికొలఁది నాఁగాతు చేసికొనవలసినవారైరి. అందుఁ దేఱినవాఁడు శక్తిమంతుఁడై పలువుర నధీనులఁ జేసికొనెను. ఇటులు రైతులోనుండి రాజు వచ్చెను.

అచటి జనులందఱకుఁ గొందఱు తినుబండారము మొదలగు వస్తువుల నందఁజేసి జీవికయేర్పఱిచికొనిరి. ఇటులుకాఁగా జనులందఱు ముఖ్యముగా నలుఁదెఱఁగులగు పనులఁ జేయవలసివచ్చిరి. కొన్నాళ్ల కివియే నాలుగు వర్ణములుగా ముద్రితము లాయెను. రాజ్యము చేయువారును అమ్మువారును దున్నువారును గూడఁ దీరిక చేసికొని కొందఱకడ జ్ఞానము సంపాదించుకొనుచుండిరి.

పని పనిలోనే పరిసమాప్తమగును. జ్ఞానమున కన్నిపనులును నిర్విశేషములు. అది యేలును. అమ్మును. దున్నును. పిదపఁ జ్వాలఁ గాల మాద్వీపాంతఃపురమున సృష్టి ర్యాచక్షన్నవలెఁ బెరిఁగెను.

నీవు బ్రాహ్మణుఁడవే యగుదువుగాక; నీయిల్లు నీవు కట్టుకొన్నచో వడ్రంగివి. నీ వస్త్రమును నీవు నేసికొనుము; సాలెవు. నీనేల నీవు దున్నుకొనుము; శూద్రుఁడవు. నగ్గస్త్రేయు; మగసాలెవు. చెప్పులు కుట్టుము; గొడారివి.

నీరిలో నూనెబొట్టువలె మనుజులలో, బనులపేరులు సంక్రమించును. మనుజునిమోములో వానిపని వాని మత్రము మచ్చలు కట్టును. నిన్నఁగాక మొన్న దిగనో లేదో క్రీస్తుమతము ముఖమున నిలువగట్టుకొని తనను గొండాడుకొనుచున్నది. వైష్ణవుఁడు మాలఁ దాను వైష్ణవుఁడే యయి జన్మించుచో నింక

నతఁడు పంగనామములు తీర్ప నక్కఱ లేదు. 'ఇదుగో స్మార్తుఁ డిదుగో స్మార్తుఁడ'ని బొట్టు అంకెలు వైచును.

పనులు వంశక్రమముగా రూఢము కాఁగా నొకటి నాలుగుగా మాఱుటమాత్రమే కాక నాలు గొకటులుగా ఘనీభవించెను. ఆనాలుఁగును లోహమునవలె భిన్నభిన్నముగా మ్రోగును. ఇంతేకాక వీరిసంతతియే పని చేసి జీవించుచున్నను రక్తముతోపాటు వర్ణముకూడ ననుగమించెను. జ్ఞానముమాత్రము దానియిచ్ఛ. అయితే అచట నిపు డీశ్వరుఁడే కరచరణాద్యవయవములతోపాటు వర్ణములతోఁగూడ మనుజుల సృజించెనని కొందఱును నలుదెగలుగా నున్న యీజను లీశ్వరసృష్టియని కొందఱును అభిప్రాయ పడుచున్నారు.

రామ—అదేమి? ఒకటి నాలుగుగా మాఱినటులు స్పష్టముగాఁ గానుపించుచుండఁగా మొదటనే నాలుగువర్ణముల నీశ్వరుఁడు సృజించు టేమి? అదియుఁగాక వర్ణము కరచరణాదులవంటిదా? వారి కింకను బుర్ర లున్నవా?

బ్రహ్మ—అయ్యా! మన దేశములో?

రామ—నే నాలంకమాట చెప్పుచున్నాను.

బ్రహ్మ—శూద్రునకు వైశ్యరాజన్య విప్రుల యందు ఆయోగవక్షత్తృ చండాలవర్ణములు పుట్టినవికదా! రెంటినుండి కదా మూఁడవది వచ్చినది! ఆమూఁడవదాని కీరెంటికంటె వేఱుగా నునికి కలదా? శూద్రుఁడేకదా యీక్రొత్తవర్ణముల కుపజ్ఞము!

రామ—ఇది తర్కదూరము. ఇక్కడిసంగతి యెందులకు? ఆద్వీపపు సంగతి చెప్పుఁడు.

బ్రహ్మ—పని మనుజుల యెక్కువ తక్కువలకుఁ గొలబద్ద. రాజునకు లెంకలైనను నొకనిని బ్రగడగను వేఱొకని వేగుగను నొనర్చిన దీపనియే. రాజుగద్దెపైఁ గూరుచుండును. ప్రగడ దాపున వేగెడముగా నిలువఁబడును. జ్ఞానమే బహుశా పనిని నియమించును.

తమతమ నియతములగు పనులతో వారంద ఱేకకుటుంబములోని వారయ్యుఁ దమలోఁదాము భోజనవివాహాదుల మానివేయవలసినవారైరి. కొందఱు బుద్ధిజీవులు మాంసము మానివైచిరి. ఈ రెండును వారికిఁ బరస్పర మొకజములు చీనాగోడఁ గట్టెను.

రామ—ఔరా! ఎంతటి కుటుంబకలహము! కానఁబడు చుండఁగనే యొకటి రెండై రెండు మూఁడై మూఁడు నాలుగై, నాలుగు నాలుగై పోయినవే! ఇంకను నెన్నియగునో?

బ్రహ్మ—తలవెండ్రుక లన్నియాయెను.

రామ—కాని సులభముగా వారికి సంధి కుదుర్పనగును.

బ్రహ్మ—మీబోంట్లు కలహము నాఁపలేరు కదా మఱికొంచె మెక్కువ చేయుదురు.

రామ—ఆ. విరోధముతో మన కేమి? ఇఁకఁ జిటికెలోఁ దెలుపుఁడు.

బ్రహ్మ—మనస్సున కిచ్చ సారథి. దాని నిలయము నియమమున కావల. దాని నలుకుము. చిగుర్చును. ఇంతవట్టు దాని కట్టుద్రాళ్లెవరికిని దొరకలేదు. అది యీశ్వరుని యపత్యము. దాని జీవిక గుణలావణ్యములమీఁద. రజఃకణములవలె దుఃఖములు దాని కంటుకొనును గాని యది గోటియవలె నొక్కసారి దులపరించును. అది రెక్కలు విప్పుచో విభాగము మూసికొనుచో ముద్ద. అది విభాగము నుండి యైక్యములోనికిఁ బరువిడును. వర్ణములయెడ నది గ్రుడ్డిది. కత్తులబోను పెట్టినను నది రాక్షసవివాహము చేసికొనును. కంటక ద్రుమముకదా యని పూవును బాఱవైవదు. చంద్రుఁడుకదా యని మచ్చను మాటుకొనదు. దాని కొక కన్నుకలదు. అది దానికర్ణికచే నను రూపమగుదాని నేఱికొనును.

ఆ ద్వీపమున వర్ణనియమమునెడ నతి జడమగు మనస్సు స్త్రీపురుషుల గుణలావణ్యములలోఁ గలసిపోయెను. నాఁటనుండి కేవలము పనులనుండి కాక జన్మమునుండికూడ వర్ణములు తెగలుతెగలుగాఁ బొడమెను. ఆవర్ణముల యాదిపురుషులను దమతండ్రులుగాఁ జెప్పికొనుటకు వారు జంకిరి. వారి కరణ్యమే యనాథశరణాలయము. పిట్టలు శకుంతలను వలెనే కొన్ని మృగములు వారిని బెనిచి యుండును. తొలుతటినుండియు నారణ్యకులుగా నున్నవారి కిశిశువులు దైవప్రసాదము.

మనుజుఁడు జంతు శవమునుండియును దోలు నుపయోగించుకొనును. పనికి వచ్చునదుండు నెడలఁ దిమింగిల శయనమగు సముద్ర నిమ్నపల్వలమునఁ గాఁపుర ముండఁబోవును.

శిశువు బాలుని బాలుఁడు కుమారుని కుమారుఁడు యువకుని యువకుఁడు వృద్ధుని ననుసరించుటలో గోటియలు. స్వభావము జాతిని దనముడిలో ముడిచి ముద్రవేచుచున్నది. మాలనియందు మనుజులలో లేని జంతుస్వభావము కలదా?

ధూమము గాలిలోఁ దనకు వలయు నంతచోటు నాక్రమించును. అస్పృశ్యులైనను నొక యుసిళ్ల పుట్టయగునేని కొంత తావును బలాత్కరింతురు. శిష్టులుగూడ వారినుండి తమకుఁ గావలసిన పనిని సుంకము కొందురు. ఇటులు వారికిఁ గలయిక కలుగదేని ప్రలయము సంభవించును. ఆసంబంధ విఘటనములే ధర్మశాస్త్రమునందలి విషమ ఘట్టములు.

ఆద్వీపమున నట్టి సంఘు మెక్కుడైన కొలఁది ధర్మశాస్త్రము మాఱెను. ఒకదాని కింకొకటిపోల నంత మాఱుపులు జరిగెను. హీనవర్ణములవా రొకగుఱుతుతో గ్రామము లోనికి రావలసియుండెను. గ్రామములోనికి వచ్చునెడ మెడ కొకకుండఁ గట్టుకొని యుం దుమియవలయును. వాని జూచుచో బాఁపఁడు సచేలస్నానము చేసెను. వాఁడు శ్మశానమునకు మంత్రి. జంతుశవములకు రాజు. నడచు కంకాళము.

సస్యదేవత యొకతెమాత్రమే యతనిఁ బ్రేమించెను. పరిత్యాగము ప్రసాదించిన రమణీయమగు మోటుఁదనమునకును విశ్వసింపఁ

దగిన బలమును పుస్తకమును దగిన యుద్యోగ మతఁడు గ్రహింపించెను. అతఁడు పోటియాడెనా? హరిశ్చంద్రుఁడు. ప్రతిఘటించెనా పరశురాముఁడు. కొంతకాలమున కతఁడు కాఁడి యెడము పుడికి పుచ్చుకొనఁ గలిగెను.

రామ — ఇది యంతయు మగ్గములోఁ దెగిన దారముల ముడివలె నున్నది. అక్కడఁ గూడ ననులోమసంకీర్ణాది జాతులు కలవు కాఁబోలు. ఏమి యీముడి?

బ్రహ్మ — ఈముడి యాదారము లదేనా?

రామ — మఱియెట్లనుండి యూడిపడినది? సరి కాని, అయ్యా! అటఁ జండాలురు, ఆదిమాంధ్రులు కలరా?

బ్రహ్మ — అబ్బా! ఎంతబలువుగా నుచ్చరించితిరి? సరస్వతీదేవి నక్కళ్లు నొక్కికొని పోయినవి. ఔను. ఆముడిలోనిదారములే.

రామ — కొంప తవ్వి—

బ్రహ్మ — ఇపు డచటఁ బెద్దయుద్ధము వచ్చినది. ఈకుటుంబ కలహమును మాఁపుకొనవలెనని కొందఱును అటులే యుంపవలెనని కొందఱును బయలు దేరిరి.

రామ — మాఁపవలె నని?

బ్రహ్మ — ఆద్వీపమునందు — మాలఁడైనను సరియు; బాపఁడైనను సరియు నా కతఁడు గురువని యొకఁ డనెను. కొండొకఁడు వారిని బాహిరపెట్టినందుల కాతప్పంతయుఁ దనతలఁదాల్చికొని విరియఁబాఱిన వెంట్రుకలే చీపురుకట్టగా వారి వాకి ళ్లూడ్చెను. ఇంకొకఁడు తనకిపుడే ముక్తి కలుగునెడలఁ జండాలజన్మముపొందికాని దాని నిచ్చగింపననుచున్నాఁడు.

రామ — అబ్బా! విసువుగా నున్నది. బ్రాహ్మణులు మాత్రమే కల కృతయుగ మెన్నఁడేని వచ్చునా?

బ్రహ్మ — అది యెపుడును సిద్ధమయియే యున్నది. మాల మాదిగ డెక్కల మొదలుకొని శూద్ర వైశ్య క్షత్రియ బ్రాహ్మణుల వఱకుఁ గల వర్ణవస్త్రము లన్నియు నొక యేకులోనుండియే వచ్చినటులు తెలిసికొన్న లిప్తలోఁ గృతయుగ మున్నది.

రామ — ఔరౌరా! మీకును ఈపుండే పుట్టినదీ! గౌతముఁడు చెప్పెనంటిరి. ఏదో ద్వీపమంటిరి. తుదకు మాలగూడెమునకు బ్రాహ్మణపల్లికి నాచే వియ్య మిప్పింపఁ దలఁచితిరా? మోసపెట్టి గుంటలోఁ ద్రోయ నెంచితిరిగా! మిగులు ప్రకరణములతో పాటీప్రకరణముగూడ నదిలోఁ బడుఁగాక!

బ్రహ్మ — పాఱవైచితిఁగాని ప్రతి పర్యాయ మెదురు కొట్టుకొని వచ్చుచున్నది. అయ్యా! వినుఁడు! అది వలదని నిషేధించినను దమకు మనఃపూర్వకముగాఁ గృతి నిచ్చుచున్నాను.

రామచయనులు కమండ లూదకము బ్రహ్మశాస్త్రి మీఁదను దనకృతిమీఁదను బోసి—ఇదిగో శపించుచున్నాను. నీవును నీపుస్తకమును మాసిపొండు! అనుచుఁ బరువెత్తుకొని పోయెను.

పిదపఁ గొన్నాళ్లకీకృతి యచ్చొత్తింపఁబడి ప్రచారములోనికి రాఁగా 'వీరే యీకృతి కథిపతులు'ని లోకులు చెప్పికొనఁగా నభిమానపడి తన పేరిమార్పుదలకై రామచయను లొక క్రొత్త క్రతువు నొనరుప యోచనకు బయలు దేరెను.

# పెద్దనకవీంద్ర! నీవెట్లు పెద్దవైతి?

శ్రీమాన్ కో. వేం. కృష్ణమాచార్యులు గారు

శ్రీమహాభారతమ్మును జేతఁబూని
యమృతమునుఁబోలు తద్రసమానియాని
విష్ణువర్ధను వీనుల విందుచేసి,
మూలగ్రంథమ్ముఁ గొండొకమూల వైచి,
యుచితముగ నితివృత్తమ్ము లురలఁ బాఱ,
రక్షకుండగు నలరాజరాజరాజుఁ
బ్రభునిఁగాఁ జేసి తొలిమూఁడుపర్వములను
బ్రతిభ యతివృద్ధమై తోడఁ బరువు లెత్త
సంతరించితి; వాగనుశాసనుఁడను
నను 'స్వతంత్రప్రబంధకర్తనుఁ' గనుముని
నన్నపార్యుండు దేవరాణ్ణగరమందు
హస్తములు రెంటిఁ బైకెత్తి యఱచుచుండ,
నీవె యని లోకమనినంత నావులించి,
పెద్దనకవీంద్ర! నీవెట్లు పెద్దవైతి?

౨

మామయని మమ్ముఁ బిలిచెడు మనువసిద్ధి
మాట నిక్కము నొనరింప, నీటుగులుకు
కలికిపలుకుల నుత్తరకాండమందుఁ
గొన్నికతలను మాఱిచి కొన్ని చేర్చి
కొన్నిటిని మూలముట్టుగఁ గోసివైచి
మేమె 'నిర్వచనోత్తర రామచరిత'
మను 'స్వతంత్రప్రబంధమ్ము' నాంధ్రభాష
గల్పన మొనర్చితిమి; స్వప్నకథ మొదలగు
వానికిం బోలె దీనికి బాటఁ జూపి
నట్టివారము మేమె, యీాయవనియందు
మా'కవిబ్రహ్మ' యనెడునామమును దీన
నలుదెసలఁ గ్రమ్మె జన్నంపు నాఁటికన్నఁ
దొలుత నేయంచు నాకేశుకొలువులోన
నుభయకవిమిత్రుఁ డొకమూల నుఱుముచుండ
'మనుచరిత్రంబె' యని లోక మనినయంతఁ
బెద్దనకవీంద్ర! నీవెట్లు పెద్దవైతి?

3

ఉభయభాషాకవీంద్రుల కుభయులకును
సంభవించినయెడ బాటు జారిపోయి
యొండొరులపల్కులును జతనొందునటుల,
భారతమ్మునుఁ బూరించి ప్రాజ్ఞులిడఁ 'బ్ర
బంధపరమేశుఁ' డనునాఖ్యఁ బడసి, తాత
గారు కలలోనఁ గాన్పించి 'కావ్యమున న
హోబలేశునిఁ గీర్తించి యోమనుమఁడ!
యపరిమితహర్షమును గూర్పుమనుచుఁ దెలుపఁ
బ్రతిభకొలఁది బ్రహ్మాండపురాణమందుఁ
దీర్ఘభాగము నంతయు దేవులాడి,
దాన నొకయింతఁ గొండొక దాన నింతఁ
దార్చి, 'లక్ష్మీనృసింహావతార' మనుపు
రాణకథ రచియించితి, జాణ లాద్య
కవులు చూపని యొకక్రొత్తకాలిత్రోవఁ
జూపినాఁడను, నాదుయశోహరణము
నేయఁబూనకు' మని నీదు చేతు లూని

నను ‘స్వాతంత్ర్యప్రబంధకర్త’నుగఁ దెలుపు
వాన్న! భూజనమున కంచు నాకమందు
వేఁడుకొనుచుండ నెఱ్ఱన వెఱ్ఱిఁ జేసి
పెద్దనకవీంద్ర! నీ వెట్లు పెద్దవైతి?

౪

నన్ను నూనూగుమీసాలనవ్యయావ
నమ్మున మరుత్తరాట్చరిత్రమ్ముఁ జేసి,
పురుగులకుఁ గాన్క నిడుఁడంచుఁ బురుషవరుల
కాజ్ఞ నొసఁగిన బుద్ధిమదగ్రగణ్యు
మఱచినను మఱచెదవుగాక! మనుచరిత్ర
మును ‘స్వతంత్రప్రబంధ’మం చనుట కేమి
కారణం? బద్దియు ‘బురాణకథయ’ శంభు
దాసుకావ్యమ్ము నట్టిద, తథ్యమరయ
నిదియు నదియునుఁ గానంచు నెంచెదేనిఁ
గృష్ణరాయమహీశుండు విష్ణుభక్త
చరితములనుండి కైకొని చతురరచన
విష్ణుచిత్తీయమునుఁ జేసె విడుము దాని,
వసువనెడుపేరు భారతవర్తి యగుట
దానికిని నున్న నోసఁగి, మోదమ్ముతోడ
సూరనార్యు కళాపూర్ణశుభచరిత్ర
మును స్వతంత్రప్రబంధమం చనియుఁ గల్పి
తప్రబంధమ్ము నాస్తి యీధరణి ననుచుఁ
ద్వాత్పరాయణులకుఁ దెల్పఁ దరలుమనుచు,
వాసవుని మ్రోల శ్రీనాథభట్టసుకవి
సార్వభౌముఁడు వాదమ్ము సలుపుచుండ
నాంధ్రకవితాపితామహా! యల్లసాని
పెద్దనకవీంద్ర! నీ వెట్లుపెద్దవైతి?

౫

ఆంధ్రలోకమ్ము హర్షము నందునటుల
వృత్తరీత్యాదు లెసఁగ శిరీషకుసుమ
పేశలసుధామయోక్తుఁ బెద్ద వగుచు
మనుచరిత్రమ్ముఁ బొసఁగింపు మనుటకన్న
మున్నె కావ్యమ్ములొకకొన్ని ముద్దులొలుక
రచన మొనరింప శ్రీకృష్ణరాయసుకవి
‘పారమెఱుఁగని కావ్యసంసారమందు
సాధువుల్కవిరేవప్రజాపతి’ యని
పలుకుపలుకులు తనమది వఱలుచుంట
‘నాంధ్రకవితాపితామహ’ యనెడుబిరుద
మొసఁగె వేఱొకతీరుగా నూహఁ జేసి
నిను ‘స్వతంత్రప్రబంధకర్త’నుగ జేయ
నఖిలకవిలోకసంసేవ్య! యల్లసాని
పెద్దనకవీంద్ర! నీ వెట్లు పెద్దవైతి ?





# ఆలోచన.

శ్రీ వాసుదేవరావు గారు

ఇది మా పెండ్లికి పూర్వం జరిగినవిషయం. చైత్ర మాసం. పగలు రెండుజాములై వుంటుంది. బి. ఏ. పరీక్షలు జరిగి కొన్నాళ్ళే అయినవి. నాకు చదివేపని వుండలేదు. అప్పుడే భోజనంచేసి నాగదలో 'ఈజీ ఛేర్' లో మేను వాల్చాను. నాచేతులో సంస్కృత 'అభిజ్ఞాన శాకుంతల' ముంది. ఈశాకుంతలను నేను చదవటమిది యెన్నెతో మ్మిదోసారి. పరీక్షలకైతేనేమి — ఆగ్రంథంలో వున్న సౌందర్యాన్ని బట్టి యేమి—నాకు దానియందూ, దాని రచించిన మహాకవియందూ వున్న అభిమానాన్ని బట్టియేమి—ఏలాగైతేనేమి ?—ఆ గ్రంథమంతా కంఠపాఠం చేయాలెనని ఆశకలిగింది. చాలావరకూ ఆలాగే చేశానుకూడాను. ఆమామూలును అనుసరించే ఈనాడు కూడా వల్లేవేస్తూన్నాను. కణ్వమహర్షి శకుంతలను దుష్యంతుని రాజ్యానికి పంపిస్తూ ఆమెకు ఉపదేశం చేస్తూన్న పట్టులో వున్నాను. ఒక్క శ్లోకంలోని భావం నాలోనే ఆలోచిస్తూ కళ్లుమూసికొని వున్నాను. అంతలో మా అమ్మనన్ను పిలుస్తూ గదిలోకి వచ్చింది. మా అమ్మయెదుట నేనెప్పుడూ కాళ్లుచాచుకుని కుర్చీలో పడివుండటమెరగను. లేచి సరిగా కూర్చొన్నాను. ఆమె చేతిలో ఒక జాబుంది. చూచాను.

"ఏమమ్మా ? ఎక్కడిదాజాబు ? మామయ్య వ్రాసిందేనా !" అని నేనడిగినాను. ఆజాబు మామయ్య వ్రాసిందే అని నాకు బాగా తెలుసును. ఈమధ్య ఆయన తరుచుగా వ్రాస్తూన్నాడు.

"ఆఁ, పరీక్షలుకూడా ముగిసినవికదా. ఇంకా ఆలస్యమెందుకురా బాబూ? ఈ రెండు నెలలబట్టే పరీక్ష



"ఏమమ్మా?ఎక్కడిదాజాబు? మామయ్య వ్రాసిందేనా!" అని నేనడిగినాను.

రోజులనీ – చదవవలెననీ – ఏవేవో చెప్పి కాలక్షేపం చేశావు. ఇప్పుడన్ని ఆటంకాలూ తీరినవి కదా. ఇప్పుడేదో వకటి నిశ్చయం చేసుకుందూ" అని మా అమ్మ జాలికలిగేలా గన్నది.

"కానీలే, ఇప్పుడంత తొందరేమి వచ్చింది ? కానీలే. ఈ బీ. ఏ. ఫలితం తెలిసినతర్వాత యం. ఏ., కావాలికదా-అదికూడాకానీ—."

"నీవీలా గంటావు. అన్నయ్య చూడబోతే వృత్తరాలమీద వుత్తరాలు వ్రాస్తూంటాడు. సంబంధం మంచిది. నీయిష్టానుకూలం. మించిపోతుందేమో అని ఆయ నకుభయం. చూస్తూ, ఇంత పెద్దపిల్ల నెవరైనా పెండ్లి చేయకుండా వుంచుతారా? ఇంతకాలంనుంచీ నువ్వు చిన్నపిల్లను చేసుకోనని పట్టుపట్టినావు. నాకూ మావాళ్ళకూ యిష్టంలేనిపని చేస్తానన్నావు. శాస్త్రాధారాలు చూపినావు. ఎంతో ఆలోచించి విద్యాసాగరు నంత వానితల్లి కేవలం శాస్త్రాధారాలు విని వితంతూద్వాహానికి సమ్మతి యిచ్చివుండగా మూర్ఖురాలిని నేను మాత్రం నీసౌఖ్యానికి భంగ మెందుకు కలిగించాలనా అనుకుని అన్నయ్యతో చెప్పి అందరినీ మెప్పించి నీ యిష్టానుసారం రజస్వలానంతరవివాహానికి సమ్మతించానుగదా. ఇప్పుడు నీకు, నీ అపేక్షలకు, తగినపిల్ల దొరికివుండగా యింకా 'కానీలే' నా? ఈకాలంవాళ్లు మీరు. పోనీలే-మీయిష్టాల కనుకూలంగానే ప్రవర్తిస్తామని నిశ్చయించి యింతవరకూ వూరకున్నాను. నీ'కానీలే' చెల్లించాను. అప్పటి నీకారణాలు బాగానే వుండేవి. ఇంకా 'కానీలే' యేనా? ఇంక నీ 'కానీ' చెల్లదు. నీయీడువాళ్ళందరూ పెండ్లిండ్లు చేసికొని ముద్దు ముచ్చటగ కాపరాలు చేస్తూంటే-ఇదేమి నాకర్మమూ అని నాకెంత దుఃఖమౌతున్నదో నీకెందుకు తెలియదా అనుకుంటాను. పెద్దదానను గదా-ఇంకెంతకాలమని బతికి వుంటాను? ఒక్క యింటివాణ్ణి చేసి చూచినతరువాత ఏలాగైనా మంచిదే అని నేనహోరాత్రాలూ పరితపిస్తూంటే-ఇప్పటికైనా నీ 'కానీలే' కు అంతంలేదు కదా. కాదు-బాబూ, ఇప్పుడు నీమాటలు వినను చూడు. ఈజాబులో అన్నయ్య ఆపిల్ల నెంతగ వర్ణించాడో. నీకూ-నీ అపేక్షలకూ తగినపిల్లే." అని సంభ్రమ సంతోష విషాదాలతో నన్నది.

మా అమ్మయేకారణం చేతనైనా కోపంతోగాని విచారంతోగాని వుండడంతోటే ఆమెను సంతోష పెట్టడానికి నేను పరిహాసం ప్రారంభించే వాణ్ణి. ఆవిధంగానే యిప్పుడుకూడా పరిహాసానికే దిగినాను. మరేమి చెప్పినా లాభముండదని ఆమె కంఠస్వరాన్నిబట్టి కన్నీటిని బట్టి నేను తెలిసికొన్నాను. పరిహాసంవల్ల సంతోషిస్తుందా అని నాకనుమానంకలిగింది. అయినాప్రయత్నం చేసి చూదాము. అంతగా పట్టుపట్టితే చూదామని నిశ్చయించాను. 'ఆపిల్లని యెంతగా వర్ణించాడో చూడు' అని మా అమ్మ అనడంతోటే నాకు నవ్వు వచ్చింది. ఈవర్ణనలు నేడు క్రొత్తలుకావు. ప్రతివుత్తరంలోను ఉన్నవే. అయినా ఈవూటవచ్చిన జాబులో ఇంకా విశేషాలేమి వర్ణించాడో విందామనుకున్నాను.

"ఏమి వర్ణించాడు మామయ్య?" అని ఆత్రంతో అడిగినాను.

"పిల్లని వర్ణించాడు" అన్నది అమ్మ.

"ఏదీ వినిపించు" అన్నాను.

"నీవే చదువుకో" అని అమ్మ జాబునాకీయ వచ్చింది.

నాకు తెలుగుజాబులు చదవడమంటే యెంతో కష్టంగావుండేది. నేను నిజాం రాష్ట్రంలో వుండడంచేత నేనక్కడివాడనే అనిపించుకోవడంలో అభిమానంగావుండేది. 'ఆంధ్రుడైవుండి తెలుగంటే అసహ్యించుకొనేవాడు' అని నన్నదూషించేవారు మావారు. అదీ నాకభిమానంగానే వుండేది. అమ్మకు ఇంగ్లీషు రాదని యెంతోకష్టంతో అమ్మతో మాత్రమే తెలుగు మాట్లాడేవాడను. యథార్థం చెపుతున్నాను. ఎవరికి కోపం వచ్చినా యథార్థవాదినని క్షమించండి!

మా అమ్మతో నేను 'నీవే చదువుమూ' అన్నాను.

"అయితే, విను" అని మా అమ్మ జాబు చదవ సాగింది.

"ఈతరుణము మీరనలదు. రాబోవు, ప్రథమ ముహూర్తమున ముడిపెట్టక తప్పదు. ఇంతకన్నను జక్కనిసంబంధమిక——"

అంతలో నేను "ఈరోకంటిపాట వినీవినీ విసుగు పుట్టింది. ఆవర్ణనలేమిటో అవిమాత్రం వినిపిద్దూ——" అన్నాను.

"విను" అని నిలిపినచోటు మొదలుకొని చదవ సాగింది. "మన అబ్బాయికి దుర్లభము——"

"ఆహాహాహా! దుర్లభమేమిటి? దొరకనే దొరకదంమూ" అనినవ్వాను. "ఆ ——వర్ణనలు చదవమ్మా!" అన్నాను.

మా అమ్మ చదవింది.

"'గుణవతి'—"

"చిత్రాంగివంటి—" అన్నాను.

"సీ- విందూ, 'విద్యావతి'—"

"ఆహాహా! అపరసరస్వతీ!"

"మూద్దూ నోరు, 'వయోవతీ'—"

"శతవత్సరపూర్ణ —"

"చాలించు నీవాగుడు. నాలుకకడ్డం లేదుకదా. 'శీలవతి'—"

"ఆహాహా! అహల్యా, తారా—"

"బాబూ, బాబూ! నీపాండిత్యం ముదిరిపోతున్నదే."

"అమ్మా, మామయ్యకంటే పండితుడనా? చూడు ఎన్ని 'వతీ' లేరితీశాడో. పోనీలే! పోనీలే! ఇంకా యెన్ని 'వతీ' లున్నవో చదువు" అన్నాను.

అమ్మకు కోపంవచ్చింది. అంతలోనే నవ్వు తెచ్చుకుంది. జాబుమడిచింది. "ఎగతాళికీ వేళా కాలాలుండేనా?" అన్నది.

"అమ్మా, లేదులే. ఇంకా యేమున్నదో చదువు" అనిబతిమాలినాను.

"మంచీ చెడ్డా తెలీక యెల్లకాలం పిచ్చిపిచ్చిగ వేళాకోళా లాడే నీవద్ద చదవడం కూడానా?" అని మెల్లగ మందలించి మాయమ్మ జాబు మడత విప్పి చదవ సాగింది. "వినయవతీ"—

నేను బిగ్గరగా నవ్వుతూ "అమ్మా, నాకీపిల్లవద్దు బాబో" అని అన్నాను.

"ఎందుకు బాబూ? వినయం నీకు పనికిరాదా యేమిటే?" అన్నది అమ్మ.

"'అతివినయం ధూర్తలక్షణం' కాదా?" అన్నాను.

"నీపాండిత్యం ముదిరి పాకాన బడుతున్నదే! అయినా నీకీలాటిదే కావాలె. అప్పటికిగాని నీకు బుద్ధి రాదు. 'విను రూపవతి—'"

"ఇంకెందుకమ్మా? ఇంకేమికావాలె, నేనీపిల్ల నేమాత్రం చేసుకోను. 'భార్యా రూపవతీ శత్రుః' అన్నాడు హితోపదేశకుడు. ఇంకా కొంతకాలం నన్నీలాగే బ్రతికివుండనీ—"

"ఛీఛీ- నేనన్నట్లు నీలో అర్ధపండిత లక్షణాలన్నీ నిండివున్నవి. మాటకుమాటకూ వెక్కిరింపులేనా? నీచదువంతా పెడత్రోవ పట్టుతున్నది"

"అమ్మా, మాటిమాటికీ పండితుడవ్వూ, అర్ధ పండితుడవ్వూ అని నన్నెప్పుడూ అంటూవుంటావు. పండిత వంశంలో పుట్టినాను. తండ్రి వేపువారూ పండితులు, తల్లి వేపువారూ పండితులు. నిదర్శనం నీవ్వూ మామయ్యా. నీవు పెద్దపెద్ద 'లెక్చ'ర్లిస్తావు; బి. ఏ., చదివినవాడికి నాకు నీతులు నేర్పుతావు; పండితుడవని పోటుమాటలంటావు. ఇంక మామయ్యా, చూడు-ప్రతిజాబులోనూ వ్యాకరణ యుక్తంగా వ్రాస్తాడు. పెద్దపెద్ద సమాసాలు పెడతాడు; నిఘంటువు లన్నీ తిప్పి తిప్పి డెబ్బైయారు 'వతీలు' పెడతాడు. రెండు వేపులవారూ పండితులు. నేనుమాత్రం పండితుణ్ణెందుకు కాకూడదు? మరోవిశేషం నాలో, వాళ్ళకెవరికీ నింగ్లీషురాదు. ఒక్క తెలుగు సంస్కృతం తప్ప వేరే భాషరాదు. నాకో - యెన్ని భాషలు వచ్చునో చూడు. కాబట్టి నేను వాళ్ళందరికంటేను గొప్పపండితుడను. ఇంకా యింతేకంటే నెక్కుతాను యం. ఏ., కానీ—"

"ఆఁ, సరిపోయింది. యం. ఏ. అయితే పూర్ణపండితుడవు. అయితే యిప్పటికి అర్ధపండితుడ వనే వప్పుకున్నావు. కాబట్టే యీలాటి పిచ్చిమాట లొస్తూన్నవి నోట."

"అవుతాను పూర్ణపండితుడను. పోనీలే - ఈ వాదన యెందుకుగాని - అమ్మా! మామయ్య ఆపిల్ల పేరేమన్నాడు?"

"మనోహరియట."

"నయమే. ప్రాణహరి కాదుకదా! గుడ్డిలో మెల్లశ్రేష్ఠం."

"అయితే, బాబూ, నువ్వేమంటావు? పిల్లను చూడడాని కెప్పుడు బయలుదేరుతావు?"

"ఇప్పుడు చెప్పాల సిందేనా."

"ఆఁ, ఇప్పుడు చెప్పాల సిందే. ఇంక నేనాలస్యం వోర్చుకోను. ఏదోవకటి యీపూట-యిప్పుడే- తేలాలే. "సోక్షమో మోక్షమో తెలియాలె." అని మా అమ్మ ఖండితంగా- నిర్మొగమోటంగా- అన్నది.

ఇప్పుడేమిచేయాలె? యం. ఏ. అయ్యేవరకూ పెండ్లివద్దనినాకు, చేసుకొంటేనేగాని కాదని మాఅమ్మకు. ఆమెచెప్పిన కారణాలు బాగానేవున్నవి. నాకారణాలూ బాగానేవున్నవి. ఏమిచేయాలె? అయినా యింకాకొంతవరకూ వాదిస్తామని తలచినాను.

"అమ్మా, నీవీపూట యింత గట్టిపట్టుపట్టినావు. కాబట్టి నామనసు విప్పి చెప్పుతూన్నాను. విను-"

"ఆఁ. ఈపూట కొత్తవేమి సృష్టించావు? అన్నీ వినీవినీ విసుకు పుట్టినవేనా? ఇంకనువ్వు చెప్పనూవద్దూ- నేను—"

"అదికాదు. కొత్తవేమిలేవు. చెప్పినదే నాలుగైదుసార్లు చెప్పితే చక్కగా బోధపడుతుంది. ఆలోచనలో దిగుతుంది, సరైనమార్గానికి వస్తుంది. విను. పెండ్లివంటి మహాపవిత్రకార్యంలో, జీవితకాలమంతా తోడునీడలుగా సంసారయాత్ర జరుపవలసినవారిని యేలుకోవడంలో- అంతంగాని, యితరులు జోక్యం గలిగించుకోవడంలోగాని, అర్థంలేదు. మధ్యవర్తులు- ఎవరైతే మాత్రమేమి?- పనికిరారు. ఎందుకంటావా, నూరుబొంకులైనాబొంకి ఒక్కముడిపెట్టమన్న శాస్త్రం వారికాధారం. అదయేమాత్రమూ పనికిరాదు. ఆలాటివారికి ముడిపెట్టడమంటేనే అర్థంతెలియదు. డబ్బుముడిపెట్టమనే వాళ్ల భావం. తరువాత, పదిమందీ కలుసుకోవడం. మంచిమంచి నగలూ బట్టలూ ధరించడం- బాజాబజంత్రీలు- మేళతాళాలు- విందులూ పిండివంటలు- పల్లకీలలో వూరేగింపులు- సంబరం- ఇంతకంటే మరేమీ వాళ్లకి తెలీదు. అందులోనూ మామయ్య విషయం నీకూతెలియందికాదు. డబ్బుకిప్రాణాలిస్తాడు. ఆయనఒక్కడబ్బును మాత్రమే చూస్తాడు. అదుంటేనేచాలు. తక్కిన అన్ని అవలక్షణాలూ మూసిపోతవి. పిల్లతండ్రి ధనవంతుడన్నాడు; తనకు బాల్యస్నేహితుడూ సహపాఠీ అన్నాడు. ఈకారణాలే ఆయనకుచాలు. మొగమోటం- ఇష్టమైంది. అంతగా వర్ణించాడు"

"అయిదువేలేనా కట్నమిస్తాడంట—" అని మా అమ్మ తటాలుననన్నది.

నాకోపలు భగ్గున మండింది.

"ఆమాటే నాకు పనికిరాదు. అయిదువేలేనా యిస్తాడు—పదేనువేలేనా యిస్తాడు. కాని యెవరికి కావాలి? ఆ అయిదువేల కాసించి యేహిడింబినో- యే శూర్పణఖనో- యేపూతననో-కట్టుకోమన్నావా? ఆహా! నీవు నిజంగా ఆ అన్నయ్యకు తగిన చెల్లెలివే! నేను మామయ్యను దూషిస్తూన్నాను అని కోప్పడవద్దు. యథార్థంచెపుతూన్నాను. ఆయన మహాలోభి; ఒక్కడబ్బును మాత్రమే చూస్తాడు. తక్కినవేవీ ఆయనకు కనబడవు. నాకుడబ్బువద్దు. పిల్లపేదదైనాసరే. పెద్దదై వుండాలె. నామనసుకు నచ్చాలె. మా మామయ్య చూచాడంటే- చూచాడు. మామయ్యకళ్లు నా కళ్లుకావు. మామయ్యకాంక్షలు నాకాంక్షలుకావు. నారుచులు మామయ్యరుచులుకావు. ఒక్కొక్కడికి ఒక్కొక్కటి యిష్టం. మామయ్యయందు నాకు నమ్మకంలేదు. అందులోనూ యీవిషయంలో నాకు బొత్తుగా నమ్మకంలేదు—"

"నమ్మమని నేనుమాత్ర మన్నానా? కాబట్టే నీవు స్వయంగావెళ్లి చూచిరా. ఇష్టమైతే చేసుకో- లేకుంటే మానేయి. ఇందులో తప్పేముంది? పిల్ల హార్మోనియం- వీణా వాయిస్తుందట. మెట్రిక్లేశం దాకా చదువుకుందట. కుట్టుపనులూ చేస్తుందట. ఈకాలంవాళ్లకి కావలసిందదేనా! ఇన్నిలక్షణాలూ నీయిష్టప్రకారంగా వున్నపిల్లనే చూచాడు గాని అన్నయ్య—"

"అదే చెప్పాను కాదమ్మా. మామయ్య కళ్లు నాకళ్లుకావు. నారుచులు మామయ్యరుచులూకావు. తరువాత యింకాకొన్ని విషయాలూ ఆలోచించుకోవాలె. ఈపిల్ల చూడబోతే కన్నడదేశంలో వుందిప్పుడు. అక్కడి ఆకన్నడదేశాచారవ్యవహారాలే పట్టుబడి వుంటవి—"

"ఇక్కడి యీ హైద్రాబాదీ తురకాచారవ్యవహారాలు పట్టుబడలేదా—" అని నవ్వింది అమ్మ.

"ఆఁ, అవును. తనమనసును బట్టే యెదటివారి మనస్సులు తెలుసుకోవాలె. నాకింగ్లీషువాళ్ళ డ్రెస్సు నచ్చినట్టు ఆపిల్లకు అక్కడివాళ్ళలాగ డ్రెస్సే అభ్యాసమై వుంటుంది. కుంభకోణం, కంచీ, శేలం, మధురా, కొర్నాటి పట్టుచీరలే రోజూ కట్టుచీరలు. జత ఒక్కంటికి డెభ్భై యెనభై—"

"నీదేమి మునిగింది? నీవు మాత్రం పెట్టడంలేదా- ఒక్క- 'సూటు' కు అరవై డెభ్భైలూ? 'నెక్ టైలూ' కాల్లకే బోలెడు పోస్తున్నావే! అలాగే! నాకాలాటిదే కోడలు కావాలె." అని అమ్మ నిశ్చయ పూర్వకంగా అన్నది.

"ఇప్పుడింత కర్చుపెట్టి చదువుతున్నాను. పైన సంపాదన యేముంటుందో. ఇంకా యింగ్లండుకు వెళ్ళి 'సివిల్ సర్వీసు'కు చదవాలె ననుకుంటున్నాను. ఉండనీ పైగా పిల్ల చదువుకున్నదన్నావు. ఆ లేసులకూ, ఆ జాకెట్లకూ, ఆ కాస్మొటిక్కులకూ, ఆ ఫేజ్ పౌడర్లకూ- అన్నిటికీ డబ్బుగల్ల చదువుకున్న పిల్ల సంసారం దిద్దుకోనవ సెరగదు——"

"అబ్బబ్బబ్బా! నీ వుపన్యాసా లింక చాలించు. ఆడవాళ్ళకు చదువు కావలెనో అని మొరపెట్టేవాడవే - స్వంతవిషయంలో ఈలాంటి అనుమానాలా?"

"నిజమే-చదువుకావాలె; ఇప్పుడుమాత్రం నేను వద్దన్నానా?"

"ఇంక నీమాట చాలించు ఏమైనాసరే; నాకీ పిల్లే కోడలు కావాలె. నాకోడలు - నీడబ్బు వద్దు, నీవుపన్యాసాలూవద్దు-నాయింటి దీపం, నాగృహలక్ష్మి. నాకీలాటిదే - యిదే-కోడలుకావాలె. నువ్వు నీడబ్బును ముడివేసికొని కూర్చో. నాకిష్టమైనంత నాకోడలికోసం కర్చు పెడతాను. రోజూ 'శికా'ర్లకు తీసికెళతాను. అప్పుడు నీవేం చేస్తావో చూదాము. ముందుగా తెచ్చి నాకప్పజెప్పుమూ" అన్నది అమ్మ మహానంద సంభ్రమం తోటి.

నాకు నవ్వొచ్చింది. నిజంగా అలాచేసేదే మా అమ్మ. ఆమెకంత సంబర మున్నప్పుడు - అన్నికోర్కెలున్నప్పుడు-ఎందుకు తీర్చక పోవాలెనా అనిపించింది నామనసు. నాకళ్ళు నిండివచ్చినవి! జొటజొట నాలుగు బొట్లు చెంపలమాదికి జారివచ్చినవి. ఇవి కృతజ్ఞతానందాశ్రువులుకావా? మాఅమ్మ యందునాకు మహాభిమానం. ఎప్పుడూ నేనామె ఆజ్ఞలు మీరి యెరగను. ఆమెకూడా నామనసును గుర్తించే నడచుకొనేది. ఇప్పుడా అభిమానం మరింతగాఢంగా నాటుకున్నది. ఇంక నీవిషయంలో కూడా మీరరాదని నిశ్చయించుకున్నాను. ఆమె కోర్కె యీడేర్చ వలసిందే-తప్పదు.

నాకన్నీరుచూచి అమ్మకూడా కన్నీరుకార్చింది. లేచి నావద్గరికివచ్చి కన్నీళ్లుతుడిచి ప్రేమతో "బాబూ, నాయీకోర్కె తీర్చవూ? నీవు యం. ఏ., అయ్యేదాకా వోరుస్తును గాని యిప్పటికే పిల్ల పదారేండ్లది. అన్ని విషయాల్లోనూ నీకు అనుకూలంగా వున్నది. ఇప్పుడు మించితే యింకా రెండేండ్లదాకా ఆపిల్ల నుంచుతారా? నీవంటి సంస్కర్త లిప్పుడెందరు బయలుదేరారో! ఆపిల్ల కోస మిప్పుడే యెన్ని పోటీలున్నవో. ఇవన్నీ ఆలోచించే యీపూట నే నీపట్టు పట్టినాను. మరే ఆలోచనచేయక వెళ్ళిచూచి నచ్చితే తెచ్చి నాకప్పజెప్పు. అన్నిటికీ నేనున్నానుగదా!" అన్నది.

ఇంక తప్పదు. అప్పటికీ నాపరిహాసప్రియస్వభావమన్నువకల లేదు.

"సరే. నీకిష్టమేలాగో ఆలాగేకానీ. వెళ్లి, ఆ బరువును మోసుకునివచ్చి నీమీద విసరేస్తాను. ఏంజేసుకుంటావో,తరువాత, చేసుకో; కానీ అమ్మా, ఇప్పుడే ముందుగా చెప్పుతున్నాను; ఆలోచించుకో మీయిద్దరిలో నేవైనమనస్తాపాలూ, కలహాలూ, కలిగినవా, నేను మాత్రం బుర్ర శుభ్రంగా నున్నగా గొరిగించుకొని యీ మీసాలుగడ్డానికి శెలవచ్చి కాషాయవస్త్రాలువేసి కొని 'జై పరమేశ్వరా' అని కాశీ,రామేశ్వరం, ప్రయాగ మొదలైన దివ్యక్షేత్రాలకి వెళ్లిపోతాను——" అనినేనూ నవ్వినాను.

అమ్మ వణికింది. మొగం నిస్తేజమైంది. కళ్లుటపటపమని నీళ్లుకార్చినవి. మళ్లీ నాదగ్గరికివచ్చి మాఅమ్మ మృదుస్వరంతో "కానీలే- అప్పటిమాట లిప్పుడెందుకూ! అయినా పెద్దదానను —— దీవిస్తూన్నాను. మీరిద్దరూ సుఖం సంతోషంతో కాపురం చేస్తూంటే నాలుగు రోజులు చూచి సుఖంతో నేనూ కళ్లుమూసుకొంటాను. నీకు మంచి భార్యదొరకాలెనని యీ బ్రహ్మాండమైన సంసారసాగరం సంతోషనౌకలో సుఖంగాప్రయాణం చేయడానికి మిమ్ముల దీవించుమని పరమేశ్వరుని ప్రార్థిస్తూన్నాను." అంటూతనకుడిచేయి నాతలమీదపెట్టి దీవించింది. ఆహస్తం వరదహస్తమే !

నేను నాలోనే అనేకవిధాలాకృతజ్ఞతను తలచి పరమానందం పొందినాను. అప్పుడు మా అమ్మవంటి

అమ్మలు లోకంలో మరెవ్వరికీ లేదనుకున్నాను. ఈలాటి అమ్మకడుపులో పుట్టినందుకు నేను ధన్యుణ్ణి అనుకున్నాను. ఆమెకోర్కె తీర్చడానికి సంకల్పించుకున్నాను.

నిజానికేమిగాని నాకిప్పట్లో పెండ్లి యిష్టం లేదు. యం. ఏ., అయ్యేదాకా చేసుకో కూడదని నామతం. భార్యను సకలవిధాలా భరించడానికి శక్తికలిగి యితరుల సహాయ మేమాత్ర మపేక్షించకుండా స్వతం త్రంగా సంపాదించే శక్తి కలిగేవరకూ పెండ్లి మాటే తలపెట్టకూడదని నా అభిప్రాయం. ఆలాగే అమ్మతో యెన్నివిధాలో చెప్పినాను. ఇప్పటికి నాల్గేండ్లవరకూ కాలక్షేపంచేశాను. నాకుడబ్బు లేకపోలేదు. కాని, యెంతైనా పిత్రార్జితమేకదా! ఇప్పుడు నా ఆలోచన లన్నీ కట్టిపెట్టాను. అమ్మమాట త్రోసేయలేను. ఇప్పుడు పరీక్షకూడా అయింది. ఆమె యిందాక చెప్పినకారణాలు బాగావున్నవి. నిజమే, అంతధైర్యంచేసి పిల్లను పదా రేండ్లవరకూ పెండ్లిచేయకుండా పెంచేవారు అరుదు. నిజంగానే నావంటివాళ్లెందరో బయలుదేరివుంటారు. ఇప్పుడు నే నొప్పితే మామయ్యను అమ్మనూ సంతోష పెట్టిన వాణ్ణి అవుతా. ఇంకా అనేకవిధాలా ఆలోచిస్తూ న్నాను. ఇంతలో అమ్మ-

"ఏమిరా బాబూ! మౌనం దాల్చినావు? ఏమం టావు?" అనిఅన్నది.

నేను "సరే, నీయిష్టప్రకారమేకానీ అమ్మా" అన్నాను.

"అయితే యెప్పుడు బయలుదేరుతావు?" అనిపట్ట రాని సంతోషంతో అన్నది అమ్మ.

"రేపు బయలుదేరుతాను బళ్లారికి-" అన్నాను.

"రేపే? బాబూ, అన్నయ్య యీజాబులో యేం వ్రాశాడో చూచావా? పిల్ల బళ్లారిలో లేదట, పెద్దన్నయ్యగారు బెజవాడకు తీసుకొచ్చారట మనకు దగ్గరేకదా. బెజవాడకువెళ్లిరా"

"అమ్మా, పూల అందం చెట్లమీదనే చూడాలె. ద్దపులిరూపం పౌరుషం అడవిలోనే చూడాలె. చంటిబిడ్డల ముద్దులూ మురిపాలూ తల్లి వళ్లోనేచూడాలె. ఏదేశంలోవారిని ఆదేశంలోనేచూడాలె. అప్పటికిగాని నిజమైన విలువతెలియదు, అంతేకాకుండా పిల్లను పకళ్ల యింట్లో చూడడం బాగుండదు. అన్నయ్య అయితే మాత్రమేమి? తల్లితండ్రులవద్ద వున్న ట్టుంటుందా అక్కడ స్వతంత్రం? ఏదో ఒకటిరెండు మాటలాడవలసి వస్తుందనుకో- అన్నలయెదటా వదినెల యెదటా పిల్లలు సిగ్గుపడుతారు. అందులోనూ వదిన అంటే యింక పరి హాసానికేం తక్కువుంటుంది? పిల్లమనసూ రుచీ తెలిసి కోవడం కష్టం - ప్రాణాంతంవరకూ వున్న సంబంధం- ఎడతెగని సహవాసం- వారిమనసులు కుదరకపోతే యేం లాభం? అమ్మా, పెండ్లి విషయంలో నామతం విచిత్ర మైంది. అనమపక్షం మూడునాలుగు రోజులైనా పట్టు తుంది మనసులు కలియడానికి. ఒక్కమారు చూస్తే చాలదు. తొలిచూపుతో పుట్టే వలపు మోసం - అదే మాయ. అది వలపుకాదు. భ్రమ. ప్రేమగానే కనపడు తుంది. ఏవిధంగా ఒక్కసారే వలపు కలుగుతుందో ఆవిధంగానే నశింపు. ప్రేమ క్రమంగా వృద్ధికావాలె. అదే నిజమైనప్రేమ. ప్రతిఫలాపేక్ష వుండదు. స్వార్థం వుండదు. ఈర్ష్యాసూయలుండవు. కాబట్టి కాబోయే భార్యాభర్తలు అనమపక్షం నాలుగైదు రోజులయినా తరుచుగా ఒండొకళ్లను చూస్తూవుండి మాట్లాడుకుంటూ వుంటేమంచిది. కాబట్టి, నేను రేపేబళ్లారికి పయనమా తాను" అని నేను నిశ్చయాత్మకంతో అన్నాను.

నాయీమాటలన్ని మాయమ్మ చిరునవ్వు నవ్వు తూవిన్నది. కడకు 'పెద్దదొరవై పోయినావే బాబూ' అని అన్నది. "కానీ, నీయిష్టమేలాగున్నదో యాలాగేకానీ- కాని, పిల్ల బెజవాడలో వున్నదికాదా, నీవు బళ్లారికి పోయి చేసేదేముంది?"

నేను గర్వంతో "బెజవాడలో వుండనీ ఢిల్లీలో వుండనీ- రేపురాత్రిబయలుదేరుతున్నానని యీపూటే మామయ్యకు 'టెలిగ్రాం' మిస్తాను; మామయ్య పిల్లతండ్రికి తెలుపుతాడు; ఆయన బెజవాడకు 'టెలిగ్రాం'మిస్తాడు. వాళ్లూ బళ్లారికి వెళ్తారు- అంతేగాని, ఒకళ్ల యింట్లో నేను పిల్లను చూడను.

"అప్పుడే నీ అల్లుడితనం చూపిస్తూన్నావే- వాళ్లనంత కష్టపెట్టడం నీకు న్యాయమేనా? పిల్లవేపువార లేకాదు వాళ్లకీ ఆయాసం? పిల్లఅక్కడికి వచ్చినప్పుడు

ఇంకా యెన్ని పరీక్షలు చేస్తావో! వాళ్లనింకా యెంత కష్టపెడతావోకదా ?" అనిమాయమ్మ నవ్వుతూనన్నది.

"అమ్మా, దేనికమ్మా కష్టం ? ఇదీ కష్టమేనా ? నాకు కట్నం మక్కరలేదు, మరేమీ అక్కరలేదు. ఈ మాత్రం కష్టాలకైనా ఓర్చుకోలేకపోతే మరేలాగా ? కష్టమైతేపోనీ- అందుకనే నాకాపిల్ల—"

"వద్దురా బాబూ ? నాకాపిల్లే కోడలుకావాలె. ఇంకనైనా నోరుమూసుకోంపూ, నీవు మాత్ర మేదేశపు వాడవో ?"

"నేనా ? నేనా ? నేను హైద్రాబాదీ-దక్కనీ ! నాహృదయంవేరే- వాళ్లహృదయాలువేరే; నేనూ వాళ్ల వంటి వాణ్ణేఅయితే అయినుకాదు- పదేను వేలిస్తేనే గాని పెళ్లిచేసుకోనని పట్టుపట్టి కూర్చుందును. పెద్ద పెద్ద సభలలో వేదికలమీదనెక్కి- సంఘసంస్కర్తలని పేరుపెట్టుకొని, సంస్కార విషయాలు పెద్దపెద్ద 'లెక్చ'ర్లిచ్చి (బహిరంగంగా) లోలోపల వందలువేలూ కట్నాలు పుచ్చుకొనే ఆంధ్రబ్రాహ్మణులెక్కడ, నేనెక్కడ ? ఈవ్యత్యాసం నీకు కనబడలేదమ్మా ?" అని అన్నాను.

"ఆఁ, ఇంక చాలించు నీ ఆత్మస్తుతి ? ఇతరులను యెన్నైనా అనవచ్చును,"

"ఆఁ- ఆఁ- నేనన్నదీ అంతే- తమవంతు వచ్చి నప్పుడే మనుష్యుని నిజమైన విలువ తెలుస్తుంది."

"తెలుస్తుందిగా- తొందరెందుకూ ? బాబూ, వాళ్లు నిన్నేమైనా అడిగినప్పుడు నెమ్మదిగా జాగ్రతగా జబాబిస్తూవుండు. ఇక్కడ నాదగ్గర మాట్లాడినట్లు పిచ్చిపిచ్చిగా మాట్లాడకు. హైద్రాబాదీ బడాయీలు చూపకూ."

"నన్నేమడగాలె వారు ? వారు నన్నడగవలసిం దేముంటుంది ? నాకుతెలీని దేముంటుంది ? ఇంతపెద్ద 'బి. ఏ' ను కాదు."

"బి.ఏ., యం. ఏ. అయినంతమాత్రమున నేమి ? పేరుకు రెండక్షరాలు తగిలించుకోడానికి పని కొస్తుందిగాని, లోకజ్ఞానం కలగద్దూ ? అందుకు మీ పుస్తైడు పుస్తకాలూ పనికిరావు; అనుభవంకావాలె. మంచి స్వభావం, శీలం, సభ్యత్వం, మర్యాద, అణకువ, ఇవన్నీ కావాలె లోకం మెచ్చడానికి."

"అమ్మా, అమ్మా! నీకుకూడా ఆ ఆంధ్రబ్రాహ్మణుల స్వభావమే పట్టుపడ్డదే. మీ వంశంలో నీవొక్కతెవే తప్పపుట్టినావను కున్నాను. ఆంధ్రబ్రాహ్మణులవలె పెద్దపెద్దవుపన్యాసా లిచ్చేగుణం నీకుకూడావున్న దే!" అని నవ్వి నేను "పోనీ లే-ఆలస్య మెందుకు? వెళ్లి 'టెలిగ్రా' మిచ్చివస్తాను- 'టైం' అవుతూవుంది."

"ఏమని ? ఎవరికి ? "

"మామయ్యకు- రేపు బల్లారికి వెళ్లుతున్నాను 'టెలిగ్రా' మిచ్చి బల్లారికి తెలియజేయాలెనని-"

"రేపే ? రేపే బయలుదేరుతావా? బాబూ, పిల్లనుచూడ బోయ్యేవాడవు- సంబంధం కుదుర్చుకునే వాడవు. మంచి రోజు చూచి బయలుదేరుమూ."

"అమ్మా, నీకింకా యీకాలపు నాగరీకత అలవడకుండా పాతకాలపు మాటలు మాట్లాడుతూన్నావే. మంచిరోజేమిటే ? మంచిరోజనీ చెడ్డరోజనీ భగవంతుడు వేరేవేరే సృష్టించాడా! అన్నీ మంచిరోజులే. మనప్రయత్నాలనుబట్టే, మనపట్టుదలనుబట్టే లాభాలాభాలు కలుగతవేకాని రోజేంజేస్తుంది ?—"

"ఇదే మూర్ఖం- ఈకాలపు యీపాడు చదువుల వల్లపుట్టే దుర్బుద్ధులు- శాస్త్రాలంటే ఒప్పరు- జ్యోతిషం—"

"ఆమాటనకు; నాకు శాస్త్రాల్లో నమ్మకం లేకపోలేదు. మూలశాస్త్రాలు శ్రేష్ఠములైనవే; కాని, శాస్త్ర పండితులమని శాలువలు కప్పుకుని, కుండలాలు తగిలించుకుని, శాస్త్రాల కపార్థాలు కల్పించి, ఆచారాలన్నీ పాడుచేస్తూ, పొట్టకోసం తిప్పలుపడే వారివల్ల శాస్త్రాలు చెడిపోయినవి. అందువల్ల నమ్మకం లేకపోయింది.పోనీ, మంచిరోజనీ, మంచిలగ్నమనీ, పంచాంగాలుతిప్పితిప్పి, మీనమేషాలు లెక్కపెట్టి, మంచిముహూర్తాల్లో చేసిన పనులన్ని బాగానేవున్నవా ? అన్నీ ఆటంకాలు లేకుండా – కష్టాలులేకుండా – శుభప్రదంగానే జరుగుతూన్నవా ? మనమెన్ని చూస్తూండలేదు వ్యతిరేకాలు. ఏదే

నా మంచిపనిచేయాలెనని భగవంతుడెప్పుడు మనకు పుట్టిస్తాడో అదే మంచి ముహూర్తం- అదేమంచిరోజు."

"ఓరిబాబో, యెంతటి శాస్త్రవేత్తవు బయలు దేరావు! బాబూ, నీ యిష్ట మెట్లోకాని- నేవద్దనను?"

ఇంతలో గడియారం నాలుగుకొట్టింది.

"అమ్మా, 'టైం' అయింది- మామయ్యకు 'టెలిగ్రా'మిచ్చి వస్తాను-"

అని లేచి డ్రెస్సువేసుకుని పోయి మామయ్యాపేర తంతివార్త యిచ్చివచ్చినాను. ప్రయాణానికి కావలసిన వన్నీ సిద్ధంచేసు కున్నాను. ఆరాత్రి అంతా యింకా యేమేమో నేనూ మా అమ్మ నడిరేయి మీరేవరకూ ఆలోచన చేశాము. అనంతరం నాకెప్పుడు నిద్రపట్టిందో నాకు తెలీదు. ఆనిద్రలో నానావిధాలా సుఖస్వప్నములే కన బడినవి.

తరువాత 'ప్రయాణం.'



# బావకత్తె

విశ్వనాథ సత్యనారాయణ గారు

మొల్లపూలంటెను
ముడుసుకుపోతావు
బంతీపూవులంటే
గంతేసి వత్తావు.
ఎంతసోకులాడివే
నీకాడ ఎంతబావమున్నదే.

చన్నీల్లు నామీద
సల్లి నవ్విత్తావు
శీరకొంగట్టితే
శిర్రుబుస్సంటావు.
ఎంతటక్కులాడివే! నీకాడ,
ఎంతబావమున్నదే.

సామివోరికిదణ్ణం
సాస్తూ, నామొంకేసి
సూత్తూ నవ్వులకళ్లు
సుళ్లు తిప్పేస్తావు.
ఎంత వింతకత్తెవే! నీకాడ,
ఎంత బావమున్నదే.

నిద్దట్లోనా కేశి
నిలిసిసూత్తుంటావు
దొంగనిద్దుర తెలిశి
దూశిత్తావు నన్ను.
ఎంతచాటుకత్తెవే! నీకాడ
ఎంత బావమున్నదే!

ఈతముల్లూ యిరిగి
యింత నడవనీక
కాలు వాశిందంటే
కంట నీరెట్టావు
ఎంత యింటిదానవే! నీకాడ.
ఎంత బావమున్నదే.

కన్నుల్లో కన్నుంచి
కదిలించియేస్తావు
నన్నుముంచేత్తావు
నన్ను తేలుత్తావు.
నీవేనాకురాణివే! నిను గూడి
నిలువు నీరయిపోతినే.



# పూర్ణిమ

పోడూరు రామంద్ర రావు గారు. బి. ఏ.,

౧

సీతాపతి పదునెనిమిదివత్సరముల ప్రాయము వాఁడు. చామనచాయశరీరమువాఁడు. ఇంచుక పొడగరి. అతఁ డందగాఁడనియే చెప్పనొప్పును. చూచువారిహృదయములను చూరగొనునట్టి యాతని విశాలనేత్రములు సిరి కాటపట్టులని చెప్పనగును.

నాఁడు పూర్ణిమ. సాయంకాల మాఱు న్నరగంట లయ్యెను. అప్పుడే శరచ్చంద్రుఁ డాకసము నలంకరించెను. సమీపమందలి గౌతమీసైకతములపైనుండి వీతెంచు చల్లని పిల్లగాలులు దేహములఁబులకితములొనరించు చుండెను. బాలు రెల్లరు నిసుకతిన్నెలపై వివిధగతులఁ గ్రీడించుచుండిరి. ఒకచోట నీలాటిరేవున కనతిదూరమునఁ గట్టబడిన యొక చిన్నపడవపైఁ గూర్చుండి, సీతాపతి వచ్చుచుఁ బోవుచునుండు వారిని గాంచుచుండెను. ఇంతలో నొక పదిరెండువత్సరములబాలిక యొర్తు భుజమున నొక బిందెను దాల్చి నీరు గొనిపోవుటకై వచ్చెను.



ఆమె యాకృతిఁ గాంచినంతనే సీతాపతియొడలు గగుర్పొడిచెను

ఆమె యాకృతిఁ గాంచినంతనే సీతాపతి యొడలుగగుర్పొడిచెను. ఆ బాలికమోము పూర్ణచంద్రుని హసియించుచుండెనా యను శంక వొడమెను. చక్కఁగఁదీరియున్న సర్వావయవములుగల యీ సుందరి నేర్పరి యగు శిల్పిచేఁ గల్పింపఁబడిన పుత్తడిబొమ్మ యను భ్రమ గొల్పుచుండెను. "ఆహా! ఇట్టి మృదు మృణాళగాత్రి, రాజాధిరాజుల

దివ్యమందిరముల నలంకరింపవలసిన యీబంగరుబొమ్మ యెవరితనయయొకదా? ఈమె నిట్లు దయఁదలంపక, జలంబుగొని తేరఁ బంచినవారి మన సెటులొప్పెనోకదా? గ్రంథములందువర్ణింపఁబడుపద్మినీజాతిస్త్రీలసౌందర్యప్రశంసఁజదివి పృథ్విపై నిట్టివనితలుగలరా యనుచు శంకించుచుండెడి నాకు, నేఁడట్టి సందేహనివృత్తి గావింపనెంచి విధి యీమె నిచటికిఁ బంచెనేమొ? ఇన్ని దినములనుండియు నేనిచటికి వచ్చుచుంటినిగాని మున్నెన్నఁడు నిట్టిముద్దుగుమ్మల నీపురమునఁ గాంచియుండ!" నని సీతాపతి యూహించుకొనుచుండెను.

సీతాపతి కళాశాలయందుఁ బట్టపరీక్షకుఁ జదువుచుండెను. అతఁడు శిష్టాచారపారీణులగు బ్రాహ్మణ దంపతుల కేకపుత్రుఁడు. వాని తలిదండ్రులు సామాన్యకుటుంబికులు. విశేష ధనవంతులుగాకుండినను గౌరవప్రపత్తిగలిగి, తోడికుటుంబములయందు మన్ననవడయుచుఁ గాలము గడపుచుండిరి. కుమారున కాంగ్ల విద్యఁ జెప్పించినయెడల నాతఁ డథమ మొక జిల్లాయధికారియైనఁ గాఁగలఁడను మూఢ విశ్వాసమునను, విశేషధనమార్జించి తమవంశమునకును జననీజనకులకును బేరుప్రతిష్ఠలు తేఁగలఁడను వెఱ్ఱియాసలతోను సీతాపతి జనకుఁ డాతని కాంగ్లవిద్యఁ జెప్పించుచుండెను. సీతాపతియు జాగరూకతతో విద్యగఱచుచు, తరగతియందు మొదటివాఁడుగఁ గాకుండినను ఎన్నఁదగినవారిలో నొకఁడుగ నిలుచుచుఁ, గ్రమముగఁ బట్టపరీక్షాతరగతిలోనికి వచ్చెను.

అతఁడవివాహితుఁడు; తలిదండ్రులు వైవాహికప్రశంసఁ దెచ్చినపుడు, విద్యాపరిపూర్తియైనఁగాని పెండ్లి జేసికొనననని చెప్పితప్పించుకొనుచుండును. సీతాపతికి నేఁటివఱకును బరిణయ వాంఛ లేకుండెను. వివిధగ్రంథములయందుఁ జదివియుండిన వింతవలపునుగూర్చి యాలోచించినకొలఁది వానికి హైందవనారీమణులను జేపట్టినవారి కట్టినిక్కమగు ప్రణయ సుఖమలవడుట కష్టసాధ్యమను నిశ్చయమగు తలంపు కలిగెను. ఆంగ్లదేశాచారానుసారము ప్రాయమువచ్చినయువతీయువకు లొండొరులనుగాంచి ప్రేమపాశానుబద్ధులై ఇరువురును ఒకరియభిమత మొకరెఱిఁగి నిక్కమగు ప్రేమగలిగియుండుట గుర్తెఱిఁగి, పెండిలిగావించుకొనిననేకాని, సతీపతులకుచితమగువలపు కుదురదని వానితలంపు. హిందువులయాచారముల ననుసరించి బాల్యముననే పరిణయమగుటయు, జ్ఞానాభివృద్ధియైనపిదపఁ దనకుఁ బెద్దలు చేకూర్చినపడఁతిని బ్రేమించుట యవశ్యకర్తవ్యమని గుర్తెఱిఁగి, తదనుగుణ్యముగ భార్యయే పరమసుందరియని భావించి, యనురాగమునంతయు నామెపైఁ బ్రవహింపఁజేసి, జీవితము నానందదాయకముగ నొనరించుకొనుట యసంభవమనియు నాతఁ డెన్నుచుండెను. ఎన్నఁటికైన వివాహమాడుటావశ్యకమైనచో, స్వయముగా నొకకన్నె నారసి, యామె గుణగణముల గమనించి, యామెను జేపట్టవలెనని వానియూహ. ఇట్టియాలోచనలతోఁ గాలముగడుపుచు, సీతాపతి యింతవఱకును దలిదండ్రులకోరికల సరకుగొనక, తనయూహల

నెన్నఁటికైనఁ గార్యరూపమునఁ బెట్టుటొండె, యవివాహితుఁడై నిరంతర బ్రహ్మచర్యవ్రతమును సల్పుటొండె, యొనరింపవలెనని దృఢనిశ్చయుఁడై యుండెను. అతఁడింత వఱకు నెందఱిఁగాంచినను, ఏరిపైనను విషయలాలసత్వసంబంధములగునాలోచన లాతనికి స్ఫురింపలేదు. నేఁడేలొకో వాని కీబాలికామణినిగాంచినంతనే హృదయ మారాటపడ సాగెను. శకుంతలను పొడగాంచిన దుష్యంత నృపాలునివలె సీతాపతియుఁ దనజీవితయాత్ర యం దీమె కేదియో సంబంధముండఁగలదని తలంచెను. ఏవిధముగ నీయపరిచితయగు బాలిక తన జీవితపరిణామమునం దొక పాత్రధారి కాఁగల దని యాతఁ డెంచఁ జొచ్చెను. ఈమెకును దనకు నెట్టిసంబంధమునులేని యవస్థయం దీయపరిచితవ్యక్తిసందర్శన మాత్రమునఁ దన కిట్టియుత్తలపాటు గలుగనేల యని యాతఁ డూహింపసాగెను.

ఇంతలో నాబాలిక బిందెతో జలమును స్వీకరించి, గృహాభిముఖియయ్యెను. ఆమె పోవుచున్నపుడు సీతాపతి చూపానినంత వఱకు నామెగమనము నుపలక్షించుచుఁ, దన యాసనమున నిశ్చేష్టుఁడై కూర్చుండి, యామె దృష్టిపథమును బాసినంతనే తనస్వప్నావస్థ నుండి మేల్కాంచి, యాబాలిక రూపపటమునే మనఃఫలకమునందుఁ జిత్రించుకొని స్వగృహము చేరెను.

౨

ఒక్కొక్కప్పుడు మానవుని జీవితమున నల్పవిషయములే వింతమార్పులు గలిగించుచుండును. సరసులో నొక చిన్నరాయి రువ్వినచో దానివలన జగత్తంతయుఁ గలత జెందునని యొకానొక తత్త్వవేత్త నుడివి యున్నాఁడు. అట్లే యణుమాత్ర విషయములును మనుష్యజీవితముల నధికములగు మార్పు లొనరించుచుండును.

విద్యాభ్యాసముతక్క యితరచింతలు లేని సీతాపతిహృదయమందు రూపవతియగు నొకయపరిచిత బాలికాసందర్శనము విశేష పరిణామమున కాస్పదమయ్యెను. విద్యార్థి వసతిగృహముఁ జేరిన సీతాపతి వివిధచింతా వాగురలఁజిక్కి యాందోళనముఁ జెందుచుండెను. నాఁడతని కాహారమైన హితవుగాకుండెను. అతఁడు తిన్నఁగాఁ దనగదిఁ జేరి దీపారాధన నుగూడ మఱచి శయ్యపైఁ బరుండి యిట్లు యోజింపసాగెను.

ఈమెయెవ్వతె? ఎవరి తనయ? ఈమె విషయమునుగూర్చి తెలిసికొనుటెట్లు? కనుఁగొంటినిపో, ఈమెకును నాకును గలుగఁబోవు సంబంధమేమి? ఈమె యవివాహితయో, వివాహితయో? ద్విజకులజయో, కాదో? ఎట్టివారితనయయో? ఈమెను నాకిత్తురనుటెట్లు? అదియుఁగాక నాతలిదండ్రులు సమ్మతింతురా? తలిదండ్రులమాట త్రోసిపుత్త మనుకొన్నను బిల్లనిచ్చువారి యభిమత మెట్లుండునో? ఆమె స్వతంత్రురాలు కాదు గదా? పరులపోషణపై నాధారపడియున్న బాలిక యేమిచేయఁగలదు? నేనైన నట్టియవస్థలోనున్నవాఁడనే కదా? ఇరువురును వివేకవంతులై,దృఢబద్ధానురాగులైయున్నచో

లోకమునకైన శంకింపఁ బనిలేదు. కాని యీామెకట్టివివేచనాశక్తి, నాపై మోహపారవశ్యము, మనోద్రఢిమయుఁ గలుగనేర్చునా? బాలిక, మోహమన్నది యెఱుఁగనేరనిది; హైందవాచారానుసారముగఁ బెరుగుచున్నది; వైవాహికోచిత వయస్సు ప్రాప్తించినది; యింకను అవివాహితగ నుండనేర్చునా? అదియుఁగాక, నావంటివానికై యొకయబల బంధుగులను,స్వసంఘమును ద్రోసిపుచ్చ నంసిద్ధురా లగుననుట కేమి యవకాశమున్నది? నేను రాజాధిరాజునా? జితమన్మథుఁడనా? నాకేమి యాధిక్యము కలదు? నాకన్నుల కామెయనర్ఘరత్నమట్లు గాన్పించినను, నా వలపు, నాపట్టుదల, నామనఃస్థైర్యము నా విశ్వాసము, నావిచక్షణశక్తి, నాయపూర్వమగు ఊహాసరణియు నామె కెట్లు బోధపడఁ గలవు? ఇన్నివత్సరములు విద్యాభ్యాసమొనరించినపిదపఁగదా నాకింతమాత్రపు టూహ లేర్పడినవి? బాలిక, విద్యావిహీనయో, అల్పవిద్యావతియో యైయున్న యీామెకిట్టి నవీనాభిప్రాయము లుదయించుటయు, బోధపడుటయు నెట్లు? ఏమి నాకీవెఱ్ఱియూహలు? ఆకాశమున రమ్యహర్మ్యములు నిర్మించుకొని యానందించుచుంటినేకాని, యిట్టియూహల కీషణ్మాత్రావకాశము లేదని తలంపనైతినిగదా? ప్రపంచమున నీలాటిరేవుల కెందఱు స్త్రీపురుషులు వచ్చుచుబోవుచునుండరు? వారి నొకవ్యక్తిచూచి వృథావ్యథకు లోనగుట వానియవివేకమునే సూచించును గాని, వారా తనిని జూచునట్లు చేయునని యెట్లు తలంప వచ్చును? విషయలాలసుఁడు, పరులఁగాంచి భ్రమించుచుండువాఁడు, పరులెల్లరు తన్నుఁ జూచుచుందురనియు, నందఱును దన్నుఁ జూచుటయే తనకువలెనే ముఖ్యకర్తవ్యముగఁ గలవారనియుఁ దలంచునేకాని, వారితలంపుల కేమాత్రమును దానాస్పదుఁడు కాకపోవచ్చునని తలంచునా? చక్కఁగ శిరోజముల నలంకరించుకొని, వలెవాటుగఁ బట్టుదుప్పటముఁ దాల్చి, మాటిమాటికి నూనూగుమీసముల దువ్వుకొనుచు వీథులవెంబడిఁ దిఱుగు వివేకహీనులు, విలాసపురుషులు, వెడఁగులు, పరభామలు తమ సుందరాకృతిగాంచి,విరహవేదనచే సొక్కుచుందురని తలంచి లోలోనఁ దాము కులుకుచుందురేకాని, లెక్కలేని, పనికిమాలిన వ్యర్థడాంబికులను, ఆడంబరజీవులను, అహంభావస్వాములను, అప్రయోజకులను గాంచి మూర్ఖులనంతటి మూర్ఖు లెవరుందురని తలంతురా? వెఱ్ఱికి వేయివిధములు. అందిదియు నొకటి. ఇట్టివ్యర్థప్రలాలోచనలతోఁ గాలము నెచ్చపుచ్చుటకంటె, వేరుపని చేసికొనుటయే కర్జము. ఆబాలిక నన్నేటికిఁ జూచును? చూచినను నన్నామె యేటికి సరకుగొనును? ఇదియంతయు మతిభ్రమణము; చిత్తచాంచల్యము. నేనిట్లే యుంటినేని తోడివిద్యార్థులు నన్నుఁగాంచి, నాయందు మార్పుగమనించి, నన్ను గేలిసేయుదురు. మదనార్తి యెట్లున్నను, పదనైనచెలికాండ్ర పదజాలముల ధాటికోర్చుట దుర్భరము. నేనిట్టి తలంపులను వీడి, తిన్ననిమార్గమున సంచరింపనైతినేని లోకాపవాదమునకు గురియగుదును. అంత

కన్న వేరులాభ ముండఁజాలదు. కాని యీ బాలికావిగ్రహమును నా మనఃప్రదేశము నుండి తొలఁగించుకొనఁజాలుదునా! అదియే గొప్పచిక్కు. రొంపిలో కాలు పెట్టవచ్చును. కాని యూడఁదీసికొనుటయే కష్టసాధ్యము.

ఇట్లు చింతించుచు శయ్యపైఁ బొర్లాడి, నిద్ర రాకుండుటచే నొకానొక ఆంగ్లనవలఁదీసి చదువనారంభించి, యందుఁ గృతకృత్యుఁడు గానేరక, గోదావరీతీరమున కేఁగి, యందు గొంతతడవు గడపి, తెలతెలవారు సమయమున నచటనే యిసుకయందుఁబడి సీతాపతి నిద్రావివశుఁడయ్యెను.

3

సూర్యోదయమయ్యెను. ఇసుకతిన్నెపైఁ బవ్వళించిన సీతాపతికనులలోఁబడి సూర్యకిరణము లాతనిని మేల్కొల్పెను. వెంటనే యాతఁడు లేచి వసతిగృహాభిముఖుఁడై నడచి పోయెను.

సీతాపతి యెంత ప్రయత్నించినను వానికిఁ బూర్ణిమనాఁడు కనులఁబడిన యాబాలికయాకృతి మఱపు రాకయుండెను. క్రమక్రమముగ వానికి విద్యయందిచ్ఛయు దూరమయ్యెను. అతఁ డెల్లపుడు నేదియో యొకటి యాలోచించుకొనుచునే యుండెను. పాఠశాలయందును బైటకూడ వానికిఁ బరధ్యానమే. ఇట్లు కొంతకాలము గడచునప్పటికి వానికిఁ బరీక్షలు సమీపించెను. అతఁడు పరీక్ష కిసుమంతయైన కృషిసలుపకయే పరీక్షకుఁ బోనెంచెను.

తగినకృషి సలుపక పరీక్ష కేగుట కడుం గడు సాహసము. పోయి కూర్చుండినపిదపఁ జేయునదిలేనిపట్టున దురూహాలు జనించుచుండును. పనిలేనివానికి దురూహాలుమెండు. సీతాపతికి సమీపమున వేంకటరావను నొకయువకుఁడు కలఁడు. ఆతఁడు పుస్తకములుచూచి వ్రాయుటలో నిపుణుఁడు. ఎంతటివారికైనను వెఱవక కాళ్లనడుమ పుస్తకములనుంచి యుత్తరములు వ్రాయుచు, దగ్గరకు వచ్చినవారినెల్లరను దనకుఁ బ్రతిబంధకముగ నున్నదని మందలించుచు నిరాఘాటముగ నాతఁడు పరీక్షాపత్రములను ముగించుచుండును. వీనిని గాంచిన సీతాపతికిఁ దా నిదివఱకెన్నఁడు నట్టిపని సేయకున్నను నాఁడు ప్రయత్నింపవలెనను దురూహ జనించెను. ఆమధ్యాహ్నమాతఁడు కొన్ని కాగితములు చొక్కాయి క్రింద నిడుకొనిపోయి, యెట్లో వానిని గాగితములలోఁ జేర్చి వ్రాయఁజొచ్చెను. వాని యప్పటిమానసికావస్థ వర్ణనాతీతము. చేతకానివానికిఁ జెడుపనులు చేయునప్పుడు గలుగు నాందోళనయుఁ, గష్టము ననంతములు. నేర మొనరించువాని కెల్లరును దన్నే గమనించుచుండిరనియే తోఁచుచుండును. ఇట్టియవస్థలో నెట్లో చూచి యొకకాగితము వ్రాయుట ముగించునప్పటికిఁ బరీక్షాధికారులలో నొకఁ డచటి కేతెంచెను. వానినిఁ గాంచినంతనే సీతాపతిముఖము వైవర్ణ్యమునొందెను. దేహము కంపించెను. ముచ్చెమటలు వోసెను. వాని లేఖినియు గాలితాకుడునవోలె గంపించెను. వానిపైఖరిఁ గాంచిన యుపాధ్యాయున కాత

నిపై ననుమాన ముదయించెను. అతఁడు సీతాపతిదగ్గరఁజేరి వానికాగితములను బరీక్షింపఁబోయెను. సీతాపతి మోమునకత్తివాటువైచినను రక్తపుచుక్క లేకుండెను. అతని ధైర్యము పూర్తిగా సడలిపోయెను. పలువురిలోఁ దనకుఁగలుగఁబోవుచున్న యవమానమును దలంచినంతనే వానితల తిరుగుచున్నట్లయ్యెను. ఇఁక నచ్చట నిలచిన కార్యము లేదని తలంచి, చేయిమీఱిన వెనుకఁ జేయునది లేదని యెఱింగి, పరీక్షకాగితములచటనేవిడచి యాతఁడు వెడలిపోయెను. దయార్ద్రహృదయుఁడగు నాయధికారి వాని వెంటనేఁగి తానాతని కేయపకారమును జేయనని తెల్పినను వినక సీతాపతి వేవేగ నడచి యింటికేఁగెను.

* * * *

నేఁడు విద్యార్థివసతిగృహమంతయు నల్లకల్లోలముగ నుండెను. సీతాపతి మిత్రులాతఁ డెచటికేఁగినదియుఁ దెలియరాకున్నదనియు, నాతనిగది మూయఁబడియున్నదనియు నాతఁడు తనగదికి మఱలివచ్చిన చిన్నెలెవ్వియుఁ గానరావనియుఁ బాఠశాలాధికారి కెఱింగించిరి. బాఠశాలాధికారియు నాతఁడు స్వగ్రామమున కేగియుండనోపు నని యూహించి మిన్నకుండెను. కాని వాని కనుంగు మిత్రుఁడగు దీక్షితులను నొకసహపాఠి వాని యుదంతమును తెలసికొనుటకు నిశ్చయించి వానితలిదండ్రులకుఁ గుమారునిజాడ లెఱుంగఁ జేయవలసినదని తంతివార్త నిచ్చెను. నాఁటి సాయంకాలమే సీతాపతి స్వగ్రామమునకు వచ్చియుండలేదని ప్రత్యుత్తరము వచ్చెను.

అవమానితుఁడగు సీతాపతి యదృశ్యుఁడయ్యెనో, ఆత్మహత్యగావించుకొనెనో యని భయపడి దీక్షితులు రక్షకభటులకు సీతాపతి నన్వేషింపవలసినదని తెలిపెను. రక్షకభటులు నొకవారము దినములు శక్తివంచనలేకుండఁ గృషిసల్పి, కృతకృత్యులు కాలేకపోయిరి.

చిట్టచివర కాయూరివారెల్ల రాతఁడు విదేశములకుఁ బలాయితుఁడయ్యెనో, యెందైన దాఁగియుండెనో, యనుచు వివిధవిధములఁ దర్కించుకొని వానిసంగతి యోచించుకయుఁ దెలియకుండుటచే నా ప్రశంస విస్మరించిరి. ఇది మానవులకు సహజము. ఎంతటియాప్తుఁడు మరణించినను, స్వల్పకాలములో వానిని మఱచిపోవుదురు. లేనిచో నీజగన్నాటకమెకింతయు సాగనేరదు. మఱపనుమాయావాగురలఁజిక్కి భూతకాలమునంతయు విస్మరించిననే కాని మానవుఁడు దైనికవ్యాపారములయందుఁ బాల్గొనఁజాలఁడు. స్మశానవైరాగ్యము, పురాణవైరాగ్యము, ప్రసూతివైరాగ్యము తాత్కాలికములేకాని చిరకాలము నిలువఁజాలవు. అది లేనినాఁడు ప్రపంచ మంతరింపవలసినదే.

* * * *

సుతునియదృశ్యవార్త వినిన సీతాపతి జనని బెంగచే మంచముపట్టెను. వృద్ధాప్యమందేకపుత్రవియోగదుఃఖము దుర్భరము దుస్తరము నగుఁగదా! సీతాపతి జనకుఁడుమాత్రము పురుషుఁడగుటచే భార్య నూరార్చుచుఁ దన దుఃఖమును బయలుపఱుపక కాలము గడుపుచుండెను.

## ౪

ఈమధ్య నీపురమున జనులెల్లరు నిచటికి విచ్చేసియున్న బాలభారతీస్వామివారినిగూర్చి పలువిధములఁ జెప్పుకొనుచుండిరి. ఆయన బాలస్వామియనియుఁ దత్త్వార్థరహస్యకోవిదుఁడనియు, విజ్ఞానియనియు, కందమూలాదులే కాని తక్కినవారివలె మాపచక్రములు, క్షీరాన్నమాదిగాఁగల యాహారములను స్వీకరింపఁడనియు, నాయన మహత్త్వమునుగూర్చి వేనోళ్లఁ బొగడుచుండిరి.

నాఁడు భారతీస్వామివారు కరుణనుగూర్చి యుపన్యసించుచుండిరి. ఆయన యుపన్యసించునప్పుడు వినువారి హృదయములు ద్రవీభూతము లగుచుండెను. కర్కశహృదయములు గలవారుకూడఁ గనుల నీరిడిరి. అచటికేతెంచిన ప్రేక్షకులలో నత్యంతోత్సాహముతో వినుచుండిన యొక పదునాఱువత్సరముల బాలిక, స్వామిదృష్టి నాకర్షించెను. ఆ యువతి యెల్లరును సభనువిడచిపోవునందాఁకనచటనేకూర్చుండి, పిదప మెల మెల్లఁగా స్వామినిఁజేరి సాష్టాంగ దండ ప్రణామములు గావించి, వినయముగఁ జేతులను జోడించి నిలచి తనజీవితము దుర్భరమనియు, దుఃఖకర మనియుఁ, దానొక వితంతువనియుఁ, దలిదండ్రులు తన్ననాదరభావముతోఁ జూచి పలు బాధలఁ బెట్టుచుండిరనియుఁ, దనకి దుఃఖోపశమన మొనరించునదియు, బాధా విముక్తి గావించునదియు, మోక్షసాధకము నగు తరణోపాయము నెఱింగింప వలసినదని స్వామిని బ్రార్థించెను. దీనమగు నామెచరిత్ర వినినంతనే స్వామి హృదయము కరగి పోయెను. ఆయనకుఁ బూర్వస్మృతిగలిగి కనులనుండి యశ్రులు స్రవించెను. ఆయన యెట్టకేలకు ధృతిని దాల్చి తనయాందోళనముఁ గనుపడనీయక, యాబాలవితంతువు నవలోకించి యిట్లుపన్యసించెను.



" అది దైవభక్తి ... అదియే సర్వార్థసాధనము. "

"సోదరీ! నీదశనుగూర్చి వినినప్పటినుండియు నాకుఁ జాల విచారము గలుగుచున్నది. నీవు నన్నుఁ దరణోపాయము నెఱింగింపుమని కోరితివి. వెఱ్ఱిదానవు. సన్న్యాసాశ్రమమును స్వీకరించినవారలేగాని తరణోపాయము నెఱింగింపరాదను భ్రమకు లోనగు

చున్నదానవు. ఒకరు బోధింపనేల? హైందవ మతమునం బుట్టి పెరిగిన సమస్తజీవులకును దెలిసియున్నదే యాధ్యాత్మికరహస్యము. అది దైవభక్తి. దానికిఁ బ్రాముఖ్యమగు అంగము పాపకార్యవిముఖత. వేదాంతులమని విఱ్ఱవీగు జ్ఞానులను అహంభావస్వాములెల్లరును సుకరమగు దానిని వ్యర్థపదజాలములచే దుష్కరము నొనరించుచున్నారు గాని, యందుగల విశేషమేమి? హిందువులరక్తము స్రవించు ప్రతిప్రాణికి నీవిషయము తెలిసియున్నదే. వ్యర్థతర్కములతోఁ గాలము వెచ్చపెట్టుటకేకాని, ఆడంబరయుతము లగు పదజాలములయొక్క ప్రయోజన మిసుమంతయు లేదు. భక్తితో హరినామస్మరణయొనర్చువానికిఁ బరమార్థము కరతలామలకము. మనసునకుఁ బాపమని తెలిసినపనిని మానుకొనుటయే మరియొక ముఖ్యవిషయము. ఈ రెండు పనులను నెరవేర్చుటకన్న మోక్షసాధనము వేఱొండులేదు. ఇదియే యిహపరసాధనమునకు మూలసూత్రము. తక్కినవానికై వ్యర్థముగాఁ గష్టపడక వీని నాచరించు జీవియే ధన్యజీవి. నేను నాల్గువత్సరములు గురువునొద్ద శుశ్రూషయొనర్చి తెలిసికొనినసంగతి యిదియే." అని ముగించుటయు నావితంతువు ప్రమోదబాష్పము లొలుక "స్వామీ! పాపపంకిలమగు నీజీవితమునందు నాకిష్టములేదు. నాకుఁ దమరు సన్న్యాసాశ్రమమును బ్రసాదింపుఁ" డని ప్రార్థించెను. అంత భారతీస్వామి "అమ్మా! నీవింకను జిఱుతవయసుదానవు. నీకుఁ గష్టనిష్ఠురములు తెలియవు.

ఈయాశ్రమము సుకరమని తలంచుచుంటివి గాఁబోలు. అది వట్టికల్ల. అన్నియాశ్రమములకును గష్టము లుండును. అన్నిటికన్న సుకరము గృహస్థాశ్రమమే. కావున నీతలిదండ్రులగృహముననుండియే యీశ్వరు నారాధించుచుండుము. తగినభక్తి యలవడినంతనే మనఃస్థైర్యమును, దాన నద్భుతమగు మానసికశక్తియు నంకురించును. దానిచేఁ గష్టములన్నియుఁ దొలఁగిపోవును. ఇంతియేకాని సన్న్యాసిని వగుటకుఁ బ్రాకులాడకుము. కాషాయాంబరధారణము, గురునాజ్ఞయు నాశ్రమస్వీకారమున కంగములని తలంపకుము. అది వట్టిమిథ్య. మనస్సే సర్వాశ్రమముల నొసంగఁగలదు. నే నిచ్చుటేల? నీవే పుచ్చుకొనవచ్చును. ఒకరిచ్చినఁ బుచ్చుకొనున దేపాటి? అనేకులు వీథులవెంబడిఁ గాషాయాంబరములుదాల్చి స్వాములమని చెప్పుకొనుచుఁ దిరుగుచుండినవారి నెందఱిని జూడలేదు. వారెల్లరును నిక్కముగ స్వాములనియేనీయభిప్రాయమా? కాషాయాంబరములు కాపురుషుని ఘనునొనర్పఁజాలునా? వారు కుహనాసన్న్యాసులగుటచే నెల్లరు నట్టివారనినాయభిప్రాయముకాదు. కానిచాలమంది కపటనటకులు. కుక్షింనింపుకొనుటకు భిక్షులు లభించుననియు, నెల్లరును నమస్కరించి పూజింతురనియుఁ దలంచి వారట్టి యాశ్రమమును స్వీకరింతురేకానివాంఛాసమూహములఁ బారఁద్రోలి సర్వసంగపరిత్యాగ మొనరించుకొనినవారు కారు. కొందఱు సన్న్యాసులకుఁ జెన్నపురినస్యము, కొందఱికి సబ్బుబిళ్లలు, కొందఱికి భోజనమైనంతనే తమలపాకులును

గావలసివచ్చుచున్నవి. నిజముగ నైహికసుఖములను రోసినవారి కీవ్యసనము లేల? ఇట్టి వ్యసనములుగలవానికి సన్న్యాసాశ్రమమేల? కొందఱు ధనార్జనముకూడ నొనరించుచున్నారు. వీరెల్లరును దమకు జీవనోపాధిగ నీయాశ్రమముఁ జొచ్చుటేకాని దైవభక్తిచేతఁ గాదు. ప్రాపంచికవిముఖతచేఁ గాదు. కావున నిట్టివానికై పరితపింపక నీవు స్వగృహమున నిల్చి బీదసాదల కుపచరించుచు భూమిపైఁ బుట్టినందులకు సాధ్యమయినంతయుపకారము నొనరించుచు, నిరంతర హరినామస్మరణచేఁ గాలము గడపుకొనుము. అదియే సర్వార్థసాధనము" అని బోధించుటయు స్వామివారికి మరల నావితంతువు ధన్యవాదములును నమోవాకంబులు నర్పించి యింటి కేగెను.

౫

మఱునటి దినమునఁ బురమందిరమున బాలభారతీస్వామి 'సమత్వమును' గూర్చి యుపన్యసించుచుండెను. అచటి కేతెంచినవారిలో నిరువురు వృద్ధదంపతులు వేదికసమీపమున నిలచి స్వామిని గాంచి యశ్రులు రాల్చుచు బదింబదిగనమ్మహాపురుషుని వదనమునుగాంచి యుస్సురనుచుఁ దమలో దామేదియో ముచ్చటించుకొనుచుండిరి.

ఉపన్యాసము ముగిసిన వెంటనే స్వామివారు మరునాఁ డాపురమును విడిచి పోవుచుండిరి గావున నేరి కేసందియములున్నను వారిని మకామునఁ గలసికొని సందియముల నివారించుకొనవచ్చునని హిందూసమాజ కార్యదర్శిగారు తెలిపిరి.

ఆరాత్రి యావృద్ధదంపతులిరువురును స్వామి దగ్గర కేఁగి "స్వామీ! మిమ్ములఁజూచినప్పటినుండియు మాకుఁ బూర్వస్మృతియు, బుత్రవాత్సల్యమును గలుగుచున్నవి. తమరి నావిషయముఁగూర్చి ప్రశ్నింపఁదలఁచియునను వుగాదనియు, మనుజులను బోలినమనుజులుండఁగూడదాయనియు నెంచియూరకుంటిమి. తమరు మాకట్టిభావ మంకురించుటకుఁ గారణమేదియో తెలిపి మాసందియము నివారింప 'వేఁడెద'మనుటయు, స్వామి విషాదావనతవదనుఁడై "పూర్వాశ్రమసంస్మృతిమాబోంట్లకసంగతము. కాని మీర లిట్లుకోరుటచేఁ జెప్పుచున్నాను. నేను సంగపరిత్యాగమున



"హాపుత్రా! సీతాపతీ! మమ్మునిట్లు దిక్కుమాలినవారిగ నొనరించితివా?"

ఖీ యెడఁగల ప్రేమపాశమును ద్రెంచుకొనఁ జాలితిని గాని, వాస్తవముగ మీరు నాజననీ జనకులు. వందనీయులు." అని చెప్పబోవు చుండగనే "హాపుత్రా! సీతాపతీ! మమ్మునిట్లు దిక్కుమాలినవారినిగ నొనరించితివా?" యని యావృద్ధులు వాపోవఁదొడంగిరి. స్వామియుఁ జేలాంచలమున నశ్రులఁదుడిచికొని "తలిదండ్రు లారా! ఏటికిట్లువాపోయెదరు? ఋణానుబంధము చెల్లినంతనే జీవులకుఁగల సంబంధమును విరమించును. మీపుత్రుఁడు లోకము దలంచినట్లు మరణింపలేదు. ఆనాఁటి సీతాపతియే నేఁడిట్లు సన్న్యాసియై యిచటికివచ్చినాఁడు. కానియిఁక ముందు మనసంబంధము త్రెళ్లిపోయినది. ఇదియే కడసారిచూపుగఁదలంచి సంతోషించుఁ" డనుటయు నాముదుసలులు "హా! నాయనా! మాకింక నీముదిమినెవరినిదిక్కుగఁజూపితి"వని గోలుగోలున నేడ్చుటయు, స్వామి "అమ్మా! ఇట్లు భీరువులగుటచేఁ గార్యమేమి? కడచిన దానికి వగవనేల? మరల మీపుత్రుని స్మరింపకుఁడు, మీకులేఁడనియే తలంచుఁడు. ఆపరమాత్మయే దిక్కుకాఁగలఁడు. ఇఁక మీరిట్లు విలపించుచుండినచో నేనును విచారింపవలసి వచ్చును. అది నాయాశ్రమమునకుఁ దగనిపని కావున నిఁక నీప్రస్తావన విరమింతము. ఇది యెల్లరకును దుఃఖభాజనమే. ధైర్యమే యిందుకుఁ బ్రతీకారము. కావున నిఁకఁబొం"డని వారినెట్లో సాగనంపి, వెంటనే స్వామియు, నాపురముననుండనొల్లక, దండకమండలువులను గైకొని యథేచ్ఛం జనియె.

* * * *

వృద్ధులును బోయినసుతుఁడు మనియుండెనను సంతసమును, తమకుఁ గాఁడయ్యెఁగదాయను విషాదమును బెనఁగొన నింటకేఁగి, యిఁక నీపురమున నుండనేలయని "కాశ్యాంతు మరణాన్ముక్తిః" యను నార్యోక్తి ననుసరించి, కాశికాపురికేఁగి, యచట విశ్వేశ్వర సన్నిధానవర్తులై కాలము గడపిరి.

* * * *

పూర్ణిమాదినమున సీతాపతి కగపడి యాతనిజీవితమునకు మార్పుగలిగించిన యాబాలవితంతువును 'పూర్ణిమ'యేయని వ్యవహరింతము. పూర్ణిమస్వామిబోధనలచేఁ బ్రఫుల్ల హృదయయై భక్తురాండ్రలో నగ్రస్థానమలంకరించెను. ఆమె చేయు మంచిపనులు వర్ణనాతీతములు. పగలంతయుఁ దమయింటఁగల పనులన్నియు నిర్వర్తించి, యనాథలకును, బీదలకునుఁ జేతనగుసాయముచేయుచు, మనోదర్పణమున శ్రీరామవిగ్రహమును బాదుకొల్పి, విరామములేక రామమంత్రోచ్చారణ మొనరించుచుఁ బెక్కేండ్లు కాలముగడపెను. తుదకొకనాఁ డామె శయ్యపైఁబరుండి శ్రీరాముని ధ్యానించుచు, నసువులఁబాసి, శ్రీరాము సాన్నిధ్యమున కేఁగెను.





# శ్రీ కాళహస్తి - శివరాత్రి

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

కన్నప్పగించిన కన్నప్పగుడిపట్టు, కన్నప్పగించి యుత్కంఠఁ గంటి
దక్షిణకైలాస ధరణీధ్రమునికడుఁ, గొండాడఁబడు వెల్లకొండఁగంటి
విమలజలప్రవాహముగల్గు మొగలేటి, తెలినీటి తీపారు తీరు గంటి
అత్యున్నతంబు నత్యాయామ మతిరమ్య, మగు కాళహస్తీశునగరుగంటి
గీ. కంటిఁ గనులు తనియ జ్ఞానప్రసూనాంబి కా, మనోజ్ఞమూర్తిఁ గాళహస్తి
లింగమూర్తి నొడలు పొంగ నలోకికా, నందసౌఖ్యవశత నందఁ గంటి.

సీ. జానుదఘ్నమ్ముగా జలజలఁ బాఱు నీ, తెలివాఁక రేపాడి జలకమాడి
ధూర్జటి కవనమాధురిమీఱు నీనీరు, దోయిళ్లతో డప్పి వాయఁ ద్రాగి
పాపతాపముఁ బెడఁబాపు నీపావన, సైకతస్థలుల విశ్రాంతిఁ బడసి
నెమ్మేన వలినాలి తెమ్మెరల్ వొలయ నీ, దరిఁ గూరుచుండి సద్గురు నుతించి
గీ. అననుభూతసంతోషమ్ము నందితిని సు,వర్ణముఖరీనదీ, నీకు వందనమ్ము!
శుచియు నారోగ్యసంపద రుచియుఁగల్గి, సాగునీదుస్వర్ణశ్రీకి జయముగాత!

శా. ఏకాలమ్మున నిమ్ముదర్క వెలసితో, యేభూపు లేతాపసుల్
నీకైంకర్యము లాచరించి చనిరో, నీవేమివింతల్ సమా
లోకింపించితొ నాఁడు, నేడఖిలముల్ లోపించె, నైనన్, భవ
చ్ఛ్రీకభ్యచ్ఛ్రయమే కదయ్య, యిపుడున్ శ్రీకాళహస్తీశ్వరా!





# వేంగిచాళుక్యులు

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు

## ౧

వీరి చారిత్రమును తెలిసికొనుటకు పూర్వము వీరి పుట్టుపూర్వోత్తరములను గుఱించి తెలిసికొనుట ఆవశ్యకము.

మొట్టమొదట మాఱు చాళుక్యులు సేతు నర్మదామధ్యస్థమయిన సార్ధసప్తలక్షదక్షిణాపథమున క్రీస్తుశకము ఆఱవశతాబ్దారంభమునఁ గన్పట్టుచున్నారు. బొంబాయి రాజధానిలోని విజాపురమండలమునందలి బాదామితాలూకాకు ప్రధాననగరముగనున్న 'వాతాపి' యనంబరగిన యిప్పటి బాదామి మొట్టమొదట వారికి రాజధానిగ నుండెను. ఈకారణముననే మొదటిచాళుక్యప్రభువులను చరిత్రకారులు బాదామిచాళుక్యులందురు. బాదామి చాళుక్యవంశవృక్షమునఁ గాన్పించు మొదటి పేరు జయసింహావల్లభునిది. ఈజయసింహుని కుమారుఁడు రణరాగుఁడు. ఇతని తనయుఁడు పులకేశివల్లభుఁడు. ఈమువ్వురు రాజులయొక్క దానశాసనములేవియు నింతవఱకుఁ గాన్పింపలేదు. క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దము నాఁటి యొకచాళుక్యశాసనమున నీజయసింహవల్లభుఁడు ఎనిమిదివందల గజసైన్యమున కధిపతియు, కృష్ణునికుమారుఁడునగు రాష్ట్రకూట రాజగు ఇన్ద్రుని నోడించి దక్షిణాపథమున చాళుక్యరాజ్యమును ప్రతిష్ఠాపించెనని తెలుపఁబడినది. ఇంతకంటె మొదటి యిరువురు చాళుక్యరాజులనుగుఱించియు మన కేవిధమైన యితరచరిత్రాంశములును దెలియరావు. మహారాజబిరుదమును పులకేశి వహించియుండుట వలనను, ఆతనిరాజధాని వాతాపినగరమని శాసనములు తెలుపుచుండుటవలనను నిజముగా చాళుక్యాధికారమును దక్షిణాపథమున స్థాపించినవాఁడు పులకేశియేయైయుండునని యూహించుటయే సమంజసము.

పులకేశికి సత్యాశ్రయ, శ్రీపృథివీవల్లభ బిరుదములుకలవు. ఈతఁడు వాతాపి నగరము రాజధానిగాఁ బరిపాలించె నన్న విషయము తక్క యీతనిని గుఱించిన యితరచరిత్రాంశములేవియు మనకుఁ దెలియవు. ఈతని కుమారుఁడు కీర్తివర్మ. ఈతఁడును తండ్రివలెనే సత్యాశ్రయ, పృథివీవల్లభ బిరుదములను ధరించినవాఁడు. ఈతఁడు నలులను, మౌర్యులను, రాష్ట్రకూటులను, కదంబులను జయించి చాళుక్యరాజ్యమును విస్తరింపఁజేసెను. మహాకూట ధర్మజయస్తంభశాసనమున ఈతఁడు అంగ, వంగ, కళింగ, వట్టూర, మగధ, మద్రక, కేరల, గంగ, మూషక,

పాండ్య, ద్రమిళ, చోళ, ఆళుక, వైజయంతు లను జయించెనని కలదు; గాని యందెంతవఱకు సత్యము కలదని సంశయింపవలసియున్నను చాళుక్యరాజ్య మీతనివలన బాగుగ విస్తరించినట్లును, ఈతఁడు చాల పరాక్రమవంతుఁడైనట్లునుమాత్ర మంగీకరింపక తీరదు. ఈతనిపిదప రాజ్యమునకు వచ్చినవాఁడు ఈతని కనిష్ఠ సోదరుఁడయిన మంగలీశ్వరుఁడు. ఈతనికి రణవిక్రాంతుఁడనియు, పృథివీవల్లభుఁడనియు బిరుదములు కలవు. కలచురి ప్రభువులను జయించుట, రేవతీ ద్వీపమును ముట్టడించుట అను రెండు విషయములు తక్క ఇతనిని గుఱించి మనకెక్కువ తెలియదు. ఈతని తరువాత వాతాపినగర చాళుక్యసింహాసనము నధిష్ఠించినవాఁడు పులకేశి. ఈ నామమును ధరించిన చాళుక్యులలో నీతఁడు రెండవవాఁ డగుట నీతనిని రెండవపులకేశియందురు. ఈతనికి సత్యాశ్రయ, పృథివీవల్లభ బిరుదములుకలవు. సర్వలోకాశ్రయబిరుదముచే పూర్వచాళుక్యరాజగు మంగియువరాజు ఎట్లు ప్రసిద్ధుఁడో అట్లే సత్యాశ్రయబిరుదముచేత నీతఁడును సుప్రసిద్ధుఁడు. ఈతఁడు తనతండ్రియైన కీర్తివర్మకంటెను మహాపరాక్రమవంతుఁడై కదంబులు, ఆళుపులు, మౌర్యులు, లాటులు, మాళవులు, ఘూర్జరులు, కాళింగులు, కోసలులు, పల్లవులు, చోళులు, కేరళులు, పాండ్యులు—వీరి నందఱిం జయించి దక్షిణాపథమునంతను ఏకఛత్రముగఁ బరిపాలించినవాఁడు. విజిగీషామనీష దక్షిణాపథముపై దండెత్తివచ్చిన శ్రీమన్మహారాజాధిరాజ శ్రీహర్షవర్ధనచక్రవర్తి యొక్క యుత్తరదేశదిగ్విజయగర్వముం దూలించి యాతనినోడించినవాఁడు. శ్రీమన్మహారాజాధిరాజ బిరుదాంచితుఁడు. ఈతఁడు పూర్వ, దక్షిణదేశదిగ్విజయమునకుం బూనుకొనినప్పుడు తనప్రియానుజుఁడైన శ్రీసత్యాశ్రయ పృథివీవల్లభ విష్ణువర్ధన విషమసిద్ధిని యౌవరాజ్యంబునకుంబట్టాభిషిక్తుంజేసి, వేంగీ, కళింగరాజ్యములను జయించినపిదప వాటికాతనిని ప్రభువుంగావించెను. ఈవిష్ణువర్ధనుఁడే వేంగీ చాళుక్యులకు వంశకర్త. ఈతఁడే కుబ్జవిష్ణువర్ధనుఁడని ప్రఖ్యాతి వహించినవాఁడు.

వేంగీ చాళుక్యులకు పూర్వపు రాజులను గుఱించి తెలిసికొనిన పిదప ఇఁక నీ చాళుక్యులెచ్చటివారు, ఎవరు అను విషయములను గుఱించి విచారింతము.

ఇందు నిమిత్తము ముందు చాళుక్యవంశము లెచ్చటెచ్చటగలవో, ఆవంశము లొకదానికొకటి సంబంధముకలదో లేదో తెలిసికొనవలసియున్నది. వింధ్యాచలమునకుత్తరమున పరిపాలించిన చాళుక్యవంశములు కొన్ని; దక్షిణమున రాజ్యమేలిన వంశములు కొన్ని. లాట (దక్షిణఘూర్జర) దేశపు సోలంకివంశమును, రాజపుత్రస్థానమందలి సోలంకి వంశములును, అనహిల్‌వాడపట్టణపు సోలంకివంశమును వింధ్యోత్తరదేశమున పరిపాలనము నెఱపిన చాళుక్యవంశములు. బాదామిచాళుక్యవంశము, కళ్యాణపురచాళుక్యవంశము, వేంగీ చాళుక్యవంశము—ఇవి దక్షిణాపథములోనివి. దక్షిణాపథమున చరిత్రకందిన

మొదటి చాళుక్యవంశము బాదామిలోనిదని మన కీవఱకుఁ దెలిసియేయున్నది. ఇఁక వేంగీ చాళుక్యులకు వంశకర్తయైనవాఁడు బాదామి చాళుక్యవంశజుఁడైన రెండవపులకేశి సోదరుఁడగు కుబ్జవిష్ణువర్ధనుఁడనియు మన మెఱుంగుదుము. ఇట్లే లాటదేశ సోలంకి వంశకర్తయైనవాఁడు పైనుడివిన రెండవ పులకేశి యొక్క కుమారులలో నొకఁడు. అనహిల్ వాడ పట్టణపు సోలంకులవంశకర్త కళ్యాణపుర చాళుక్యవంశీయుఁడు. రాజపుత్రస్థానము నందలి సోలంకులు ఘూర్జరదేశ చాళుక్య వంశజులు. ఇఁక కళ్యాణపుర చాళుక్యులు తమ దానశాసనములలో తాము బాదామి చాళుక్యుల సంతతివారమని చెప్పుకొనియున్నారు. ఈవిధమున చాళుక్యు లెచ్చటెచ్చట నున్నట్లు, ఎచ్చటెచ్చట పరిపాలించినట్లు కాన్పించినను వారందఱు బాదామిచాళుక్య వంశమను మూలవృక్షమునుండి చీలిన వేఱు వేఱు శాఖలవారని విస్పష్టమగుచున్నది.[1] వింధ్యాచల దక్షిణభాగమున దక్షిణాపథమున వేరుతన్నిన బాదామి చాళుక్యవంశాంకురము శాఖోపశాఖలై విస్తరిల్లి వింధ్యాచలమున కుత్తరమున కంట వ్యాపించి వృద్ధిపొందినదనుట నిర్వివాదాంశము.

ఈవిధమున చాళుక్యుల వంశచారిత్రము ననుసరించి వారు దాక్షిణాత్యులేయని మనకు రూఢిగాఁ దెలియుచున్నను కళ్యాణపురచాళుక్యులును, వేంగీ చాళుక్యులును, క్రీస్తుశకము పదునొకండవశతాబ్దినుండి తాము అసలు అయోధ్యాపురనివాసులమనియు, అయోధ్య సింహాసనముఁ దమ పూర్వులలో నేఁబది తొమ్మండ్రు భూపాలురు రాజ్యమేలిన పిదప తాము దక్షిణాపథమునకువచ్చితిమనియుఁ జెప్పుకొనియున్నారు. అయోధ్యాపురసంబంధమును దెలుపునీగాథ మొట్టమొదటిమాఱు కళ్యాణపురచాళుక్యులలో నయిదవ విక్రమాదిత్యుని క్రీ. శ. ౧౦౦౯ నాఁటి కౌతేమ్ శాసనమునను, వేంగిచాళుక్యులలో విమలాదిత్యుని క్రీ. శ. ౧౦౧౧ నాఁటి రణస్థిపూండి శాసనమునను కాన్పించుచున్నది. ఇది అంతకుపూర్వ మీ రెండువంశములవారి శాసనములలోను కూడ గానరాదు. అంతియేకాదు. లాటదేశ సోలంకులుగాని, అనహిల్వాడ పట్టణపు సోలంకులు గాని యిట్టిగాథను కల్పించియుండలేదు.

అయోధ్యసంబంధమును దెలుపు నీకళ్యాణపురచాళుక్య, వేంగీచాళుక్యగాథ లొకదానికొకటి అతుకు కలియక చాలవ్యత్యాసముగ నున్నవి. ఎట్లన పైనుడివిన అయిదవ విక్రమాదిత్య శాసనమున అయోధ్యాసింహాసనమున నేఁబదితొమ్మండ్రుచాళుక్యప్రభువులు పరిపాలనము జరిపినపిమ్మట ఏతద్వంశజులు దక్షిణాపథమునకు వచ్చిరనియు, అచ్చట పదునాఱుగురు చాళుక్యభూపాలురు రాజ్యమేలిన పిదప కతిపయపురుషాంతరముల చాళుక్యుల సంపదదుష్టావష్టంభము నొందగా కొంత కాలమునకు జయసింహుఁ డుజనించి చాళుక్య

1. 'చాళుక్యులుదాక్షిణాత్యులే'యను వ్యాసమున మాననీయులును, కీర్తిశేషులునైన శ్రీకొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు పంతులుగారీవిషయములన్నియు సమగ్రముగఁ జర్చించియున్నారు.

క్యరాజ్యము నుద్ధరించెననియు కలదు. విమలాదిత్యుని రణస్థిపూండిశాసనమున నీగాథయంతయు లేదు. అందున్నక్రమ మిది. అయోధ్యా సింహాసనము నధిష్ఠించి ఏఁబది తొమ్మండ్రు భూపాలురు రాజ్యమేలినపిదప వారిలో కడపటివాఁడైన విజయాదిత్యుఁడు విజిగీషువై దక్షిణాపథమునకు వచ్చి త్రిలోచనపల్లవునితో జరిగిన సంకులసమరమున నిహతుఁడయ్యెను. పురోహితునిం దీసికొని గర్భవతియైన యాతని మహాదేవి ముడివేము అను నగ్రహారమును జేరి విష్ణుభట్ట సోమయాజియను నొకధాత్రీసురవరునిచేఁ బరిరక్షితయై, విష్ణువర్ధనుఁడను కుమారునిం గనెను. ఆతఁడు తనతల్లివలన, జరిగిన యావద్వృత్తాంతమును విని చళుక్యగిరి కేగి యచటగౌరియైన నందాభగవతి నారాధించి సకలసామ్రాజ్య చిహ్నములం బడసి కదంబ, గాంగాదుల నిర్జించి, సేతునర్మదామధ్యస్థసార్ధసప్తలక్షదక్షిణాపథమును పరిపాలించెను. ఈతనికి పల్లవాన్వయసంజాతయైన మహాదేవి వలన విజయాదిత్యుఁడు కలిగెను. అతనికుమారుఁడు పొలకేశి వల్లభుఁడు. ఈవిధమున అయిదవవిక్రమాదిత్యుని కౌతెమ్‌శాసన గాథకు నీవిమలాదిత్యుని రణస్థిపూండి శాసనగాథకు నెక్కడను సంబంధము కనఁబడదు. కౌతేమ్ శాసనగాథయైనను సంవత్సరములు గడచిన కొలఁదిమార్పుచెంది వృద్ధిపొందెను. కళ్యాణపురచాళుక్యుఁడైన రెండవ జయసింహుని క్రీ.శ. ౧౦౧౮లోని యొకశాసనమున అయోధ్యలో ఏఁబది తొమ్మండ్రు చాళుక్యరాజులు పాలించినపిదప వారిలో సత్యాశ్రయుఁడనురాజు జనించెననియు, ఆతనివలన బ్రహ్మవంశసంభూతులైన యావంశమువారికి సత్యాశ్రయ వంశీయులని విఖ్యాతి కలిగెననియుఁ గలదు. ఇదియును సరియైనదన వీలులేదు. ఏలయన క్రీ.శ. ౧౦౭౫ నాటి కళ్యాణపురచాళుక్యుల మఱి యొకశాసనమున ఈచాళుక్య వంశోత్పత్తి క్రమము మఱియొకరీతిని వర్ణింపఁబడినది. అది యెట్లన: బ్రహ్మమానసపుత్రుఁడు స్వాయంభువుమనువు; ఆతని తనయుఁడు మానవ్యుఁడు. మానవ్యసగోత్రులందఱు నీతని వంశీయులే. మానవ్యునికి హారితుఁడు; హారితునికి పంచశిఖహారీతి; ఈతనికి చాళుక్యుడు నుదయించిరి. ఈతని ననుసరించియే యీవంశము చాళుక్యవంశమను పేరఁ బ్రఖ్యాతమయ్యెను. నారాయణుని నుండి పద్మగర్భుడైన బ్రహ్మయుదయించెననియు, ఆతనికి హారీతుఁడుదయించెననియు ఆతనికి హారీతుఁ డుకలిగెననియు, ఈతని చుళుకమునందలి జలమునుండి ఉత్థాతఖడ్గుఁడై సత్తిమదేవుఁ డుద్భవించెననియు, ఈసత్యాశ్రయుని నుండియే చాళుక్యరాజవంశము నిరుపమానముగఁ బ్రకాశించెననియు పశ్చిమ చాళుక్యులమఱియొకశాసనము చెప్పుచున్నది.

వ్యత్యస్తముగను, పరస్పర విరుద్ధముగను ఉన్న యీశాసనములను వదలి చాళుక్యవంశోత్పత్తి క్రమమునకై వాఙ్మయమును బరిశోధింతము. బిల్హణుని విక్రమాంకదేవ చరిత్రము, జైనయతియైన జయసింహదేవసూరి విరచితమగు కుమారపాల చరిత్రమును చాళుక్యవంశానుక్రమమును వర్ణించుచున్నవి. మొదటిగ్రంథము క్రీస్తుశకము పదు

నొకండవ శతాబ్ది కడపటిభాగమున విరచింపఁబడినది: రెండవది క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్దమున రచియింపఁబడినది. విక్రమాంకదేవ, కుమారపాలు[1] రిరువురును చాళుక్యులే. ఆఱవ విక్రమాదిత్యుఁడని ప్రసిద్ధిఁగాంచినవాఁడు విక్రమాంకదేవుఁడు. ఆతని చారిత్రమునే అతని యాస్థానకవియైన బిల్హణుఁడు విక్రమాంకదేవచరిత్రమను కావ్యముగ వ్రాసియున్నాఁడు. బిల్హణవిరచితగాథ యీ క్రిందితీరున నున్నది.

బ్రహ్మ సంధ్యాసమాధిలో నుండఁగా దేవేంద్రుఁడాతనియొద్ద కరుగుదెంచి, భూలోకమునఁ బాపము పెరుగుచున్నదనియు, యజ్ఞవిభాగభోగ మమరులకు ఇంకస్మరణలోమాత్రమే నిలుచునట్లు కనిపించుచున్నదనియు, అందువలన దుష్టసంహారమునిమిత్త మవార్యవీర్యు నొకనిని సృజియింప వలసినదనియుఁ బ్రార్థింప, విరించి పురందర ప్రజ్ఞాపనము నాకర్ణించి ధ్యానానువిద్ధములైన తనవిలోచనములను సంధ్యాంబుపూర్ణమైన తనచులుకముపై ప్రసరింపఁజేసెను. అంతట నందుండి త్రిలోకసంత్రాణప్రవీణుఁడైన సుభటుఁ డొకఁడుదయించెను. శౌరిపదములనుండి గంగాప్రవాహమువలెనే క్రమముగా ఆతనినుండి యొకవంశ ముదయించెను. ఆవంశములో హారీత, మానవ్యు లుదయించిరి.

ఇఁక జైనయతియైన జయసింహ దేవసూరి శాసనకావ్య కర్తలవలెను, బిల్హణుని వలెనుగాక చాళుక్యులకు బ్రహ్మ సంసర్గమేమాత్రము లేకుండఁ జేసినవాఁడు. ఆతనికథన మీప్రకారమున నున్నది.

పూర్వమింద్రునివలె విశ్వోద్ధార ధురంధరుఁడును, క్షత్రియోత్తముఁడును, చులుక్యుఁడునని విఖ్యాతిఁ జెందినవాఁ డుదయించెను. ఆతఁడు మథూపఘ్నమను పట్టణము (మధుర) ను రాజధానిం జేసికొని భూతలమును బరిపాలించెను. ఆతనినుండి నరరత్నముల కాకరమును, విశ్వవిశ్రుతమునైన చాళుక్యవంశము కలిగెను.

దాక్షిణాత్య చాళుక్యగాథ లీవిధమున నుండఁగా, వింధ్యోత్తర భాగమునందలి అనహిల్ వాడపట్టణ సోలంకులు మఱియొకగాథ కల్పించిరి. పరశురాముఁడు క్షత్రియకులము నిరువదియొక్కమాఱులు వినాశము గావించిన పిదప లోకమంతయు అరాజకమై దైత్యులు, దానవులు మొదలగుదుష్టులు ప్రబలి బలహీనులను బాధించుచుండుటచూచి విశ్వామిత్రుఁడు మఱల క్షత్రియకులమును సృజియించుతలంపుతో మతధర్మతత్పరులైన ఋషులును, మునిపుంగవులు నుండు ఆబూపర్వతమునకేగెను. అంతట వారందఱునుగలసి యాపర్వతశిఖరముపైనొక యగ్నికుండమునుగల్పించిరి. అందుండి బ్రహ్మేంద్రాదుల యంశమున నలు

1. కుమారపాలుఁడు జైనమత మవలంబించి, జైనుల నాదరించినవాఁడు. ఈతని కాలమున జైనమతము చక్కఁగ వర్ధిల్లెను. సుప్రసిద్ధ జైన వైయాకరణుఁడును, నైఘంటికుఁడు నైన హేమచంద్రుఁ డీతని యాస్థానమన నేయుండి యీతనికి గురువుగనున్నవాఁడు. ఈతఁడు క్రీస్తుశకము పండ్రెండవశతాబ్దములోనివాఁడు.

వురు వీరపురుషు లుద్భవించిరి. వారు నలువురు పవార్ (ప్రమార), పరహారీ (ప్రతీహార), చౌహాణ్ (చాహుమాన), సోలంకి (చాళుక్య) వంశములకు కర్తలైరి. అగ్నికుండమునుండి యుద్భవించిన వారినుండి యేర్పడిన వంశములగుట వీటిని రాజపుత్రస్థానమున అగ్నికులక్షత్రియవంశము లందురు. ఆ యగ్నికుండమునం దుదయించిన నలువురిలో బ్రహ్మాయంశమున నుద్భవించిన వాని పేరు చలుక్యుఁడు. ఆతనివలననే యావంశీయులకు చాలుక్య లనుపేరు కలిగెను.

క్రీస్తుశకము పదునొకండవశతాబ్దమునకు పూర్వపు చాళుక్యులు బాదామిశాఖవారుగాని, కల్యాణపురశాఖవారుగాని, వేంగీశాఖవారుగాని యిట్టిపురాణ వంశావళుల నేర్పరించుకొని యుండలేదు. అంతియకాదు. బ్రహ్మసంబంధమును గానరాదు. సోమవంశప్రస్తావముఁ గన్పట్టదు. మహాకూట ధర్మజయస్తంభశాసనమున మాత్రము జయసింహుని మనుమఁడును, రణరాగుని కుమారుఁడునైన శ్రీ సత్యాశ్రయపృథివీవల్లభ రణవిక్రముఁడు హిరణ్యగర్భ సంభూతుఁడనియు, అగ్నిష్టోమ, అగ్నిచయన, వాజపేయ, బహుసువర్ణ, పౌండరీక, అశ్వమేధావభృథస్నానపుణ్యపవిత్రీకృత శరీరుఁడనియు వర్ణింపఁబడి యున్నాఁడు. ఈతఁడు మొదటిపులకేశి యని యీతనిబిరుదముల ననుసరించియే గ్రహింపవచ్చును. ఇఁక బాదామి చాళుక్యవంశజుఁడైన వినయాదిత్యుని శాసనములలో మొదటి విక్రమాదిత్యునిది 'హిమకరకరవిమల చాళుక్యకుల'మని తెలుపఁబడినది. ఈపైరెండు సూచనలుతక్క క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దమునకుఁబూర్వపుచాళుక్యశాసనవాఙ్మయమున బ్రహ్మసంబంధమునుగుఱించినట్టిగాని, సోమవంశమునకు సంబంధించినట్టిగాని, పల్లవునితో జరిగిన యుద్ధమునకు సంబంధించినట్టిగాని సూచనలేవియుఁ గానరావు.

ఈవిషయమటుండ పురాణవంశావళులను గల్పించుకొనుట యానాఁటి పాలకవంశముల యాచారముగ నుండెను. ఇట్టిపౌరాణిక వంశావళులు క్రీస్తుశకము ఏడు, పదునొకండు శతాబ్దముల నడుమఁబుట్టినట్లు శాసనములను బరీక్షించిన తెలియఁగలదు. ఇట్టి వంశావళులు పుట్టుటకు కారణమేమి? క్రీస్తుశకము ఏడు, పదునొకండుశతాబ్దముల మధ్యకాలము బౌద్ధమతము క్షీణించుచుండిన కాలమనియు, శంకరాచార్యులవారు నాస్తికవాదమును ఖండించుచు, అద్వైతమతమును స్థాపించుచుండిన కాలమనియు, ఇది నూతనరూపముతో వైదికమతము వ్యాప్తిగ నొక్కమాఱు విజృంభించిన పౌరాణికయుగమనియు మనము జ్ఞాపకముంచుకోవలసి యున్నది. ఈపౌరాణికయుగమున కొలఁదిగనో గొప్పగనో అధికారము సంపాదించిన సామంతమండలేశ్వరులును, మహామండలేశ్వరులు నైనవారలు వైభవాధికారములును, రాజ్యవిస్తీర్ణమును హెచ్చిన కొలఁది నీయుగమున చాతుర్వర్ణ్యవిభాగమున ద్వితీయస్థానమగు క్షత్రియపదము నధిష్ఠించుటకును, పౌరాణికవంశావళిని, సూర్య, చంద్రవంశసంబంధమును గల్పించుకొని,

తన్మూలమున ఆర్యసంఘమున నాధిక్యతను సంపాదించుటకును బ్రయత్నించుట యాచారమయ్యెనని శాసనపరిశోధనవలన స్పష్టపడుచున్నది. ఈకాలముననే రాజపుత్రస్థానమునందలి క్షత్త్రియసంస్థానము లనేకములు లేచినవి. రాష్ట్రకూట, చాళుక్య, చోళ, పల్లవ, గాంగాదివంశముల కీకాలముననే పౌరాణిక వంశావళు లేర్పడినవి. పౌరాణిక మత విజృంభణముయొక్క ప్రధాన ఫలితములలో ముఖ్యమైన దిదియొకటియని నిస్సంశయముగఁ జెప్పవచ్చును. అందువలననే ఒకే మూలవంశమునుండి చీలిపోయిన వేఱువేఱు శాఖలవారి వంశోత్పత్తి కథనమున పైనుడివిన గాథలలో నంతటి వ్యత్యాసము, అంతటి వైవిధ్యము నుండుటకుఁ గారణమైనది.

ఇఁకపైగాథలను పరిశీలించిన నందుండి చాళుక్యుల పూర్వోత్తర మేమైనఁ దెలియునేమో చూతము. చాళుక్యగాథలన్నియు పైనుడివినవిధమునఁ బరస్పరము అసందర్భముగను, అకటావికటముగ నుండుటవలన అయోధ్యకు చాళుక్యులకు సంబంధ ముండుటగాని, చాళుక్యు లయోధ్యలో పాలించుట కాని, అయోధ్యనుండి వారు దక్షిణాపథమునకు వచ్చుటకాని, చుళుకమునుండి పుట్టుట కాని, చళుక్యుఁడనువాఁడుకలుగుటగాని,అగ్నికుండమునుండి యుద్భవించుట కాని విశ్వాసపాత్రములైన చారిత్రకాంశములుగఁ బరిగణింపవీలులేదు. కాని యిందుసత్యమేమైనఁ గలదాయన్న చాళుక్యులు మొట్టమొదటచాతుర్వర్ణ్యవిభాగమునందలి మొదటి మూఁడువర్ణములవారిలోఁ జేరని ద్విజేతరజాతివారనియు,పరిస్థితుల ననుసరించియు, కాలముయొక్క స్వభావము ననుసరించియు, అధికారవైభవసంపద ననుసరించియు ఉత్తమతరగతినిం జేరఁ బ్రయత్నించినవారనియు విశదపడఁగలదు. మొట్టమొదట క్షత్త్రియులమని చెప్పకొననివారు క్రమక్రమముగ పదునాలుగవ శతాబ్దము నాఁటికి క్షత్త్రియులమని చెప్పకొనుటయే యిందులకుఁ దార్కాణము. అట్లే కానిచో ఒకే వంశమునుండి చీలినశాఖలవారివంశోత్పత్తి ప్రకార మిన్నివిధముల అతుకుబొతుకులతో నుండుట సంభవించునా? అదియటుండ ఈ చాళుక్యులు వెళ్‌కులమువారని యూహింపనవకాశముకలదు. ఈవిషయమున మాననీయులైన శ్రీయుత కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు వ్రాసినది ఎత్తి చూపినఁజాలును.

"అరవమునందు"దివాకరమ్" అను పేరుగలకోశము కలదు. ఇది ౯, ౧౦వ శతాబ్ద ప్రాంతపుది. ఇదియింతకంటెను ప్రాచీనమని చెప్పువారును కలరు. ఇందు "చళిక్యవెందర్" "వెళ్‌కుల అరసర్" అనుపదములు పర్యాయపదములుగ నీయఁబడినవి. "చళిక్యరాజులు" వెళ్‌కుల నృపతులు" అని యీపదముల కర్థము. అనఁగా ఆకాలమున చాళుక్యులు వెళ్‌కులము వారన్న నమ్మికయుండెననుట స్పష్టము. "వెళ్‌కులము"వారిని ఇప్పుడు 'వెల్లాళ్' అందురు. వీరుశూద్రులు; తెలుఁగులోని వెలమవారు, కన్నడములోని వక్కలిగర్ మొదలయినజాతులు వెళ్‌జాతులనియే చెప్పవలెను. వీరందఱును మొదట నొక్కజాతివారే. కాని దేశభేదములఁబట్టి పేళ్లుమారుట సంభవించినది. దీనినిబట్టి చాళుక్యులు మొదట దాక్షిణాత్యశూద్రజాతివారనియు, రాజ్యము వచ్చిన తరువాత క్రమముగ క్షత్త్రియత్వము నొందిరనియుఁ స్పష్టమగుచున్నది."

పై చాళుక్యగాథల ననుసరించి చాళుక్యవంశోత్పత్తి క్రమము నొకరీతినినిర్ణయించి, ఇంకను వాటిననుసరించి యూహింపఁదగిన విషయములేవైనఁ గలవేమో విచారింతము.

కల్యాణపురచాళుక్యగాథలలో విజయాదిత్య, విష్ణువర్ధన, త్రిలోచన పల్లవులనుగూర్చి నప్రసక్తి కానరాదు. వేంగిచాళుక్యశాసనములలో పదునాఱుగురు దక్షిణాపథమున నేలిరనువిషయము కాని, జయసింహుఁడు మౌర్య, కదంబ, గాంగ, రాష్ట్రకూట, నలాదుల, నిర్జించె నను విషయము కాని కానరాదు. కల్యాణపుర చాళుక్యగాథలలోని పౌరాణిక వంశావళిని తొలఁగించినచో, పొలకేశితాత గారగుజయసింహ వల్లభుఁడు చాళుక్యరాజ్య సంస్థాతయని తెలియఁగలదు. అట్లే వేంగీ చాళుక్య గాథలలోని పౌరాణిక వంశావళిని తీసివేసినచో త్రిలోచనపల్లవునిచే సమరమున నిహతుఁడైన విజయాదిత్య తనూభవుఁడును, పొలకేశి తండ్రియునగు విష్ణువర్ధనుఁడు చాళుక్యరాజ్య సంస్థాతయనవలసి వచ్చుచున్నది. కాని బాదామిచాళుక్యవంశమునుగుఱించి మనకు బాగుగఁదెలియుటచేతను, ప్రాచీన చాళుక్య శాసనములలోని క్రీ. శ. ఆఱవ శతాబ్దాంతము నందలిదగు మంగలీశ్వరుని మహాకూట ధర్మజయస్తంభ శాసనమును, ఏడవ శతాబ్దారంభము నందలి దగు రెండవ పులకేశి అయ్యావళీ శాసనమును జయసింహ, రణరాగుల పేర్కొనుచుండుట చేతను దక్షిణాపథమునందలి చాళుక్యరాజ్య సంస్థాతలు జయసింహ, రణరాగ, (మొదటి) పులకేశులనుట నిశ్చయము. అందువలన వేంగీచాళుక్య శాసనములందలి విజయాదిత్య, విష్ణువర్ధనులు కల్పితపురుషులనుటయే యొప్పిదము; కాని యీసందర్భమున అయిదవ విక్రమాదిత్యుని కౌతేమ్ శాసనమునఁ జెప్పఁబడినట్లు చాళుక్యులు సమస్త భువనాశ్రయ, సర్వలోకాశ్రయ, విష్ణువర్ధన,విజయాదిత్యాది విశేషనామములు గలవారు. అందువలన వేంగీ చాళుక్యశాసనములం దెలుపఁబడిన మొదటి విజయాదిత్య, విష్ణువర్ధననామములు బాదామి చాళుక్యులలో మొదటిపొలకేశి పూర్వులలో నెవరికైన బిరుదములైయుండిన నుండవచ్చును. ఇఁక వేంగీ చాళుక్యశాసనములందుమాత్రమే త్రిలోచన పల్లవయుద్ధము, చాళుక్యరాజ్య సంస్థాపనము ప్రస్తావింపబడుటచేత నొక్కవిషయ మూహించుట కవకాశముకలదు. వేంగిచాళుక్యులకు మూలవంశీయులైన బాదామిచాళుక్యులలోని మొదటిపులకేశి పూర్వులు తమ చాళుక్యరాజ్యమును దూర్పుగవ్యాపింపఁజేయఁ బ్రయత్నించియుండవచ్చును. అప్పుడు కృష్ణానదికి దక్షిణభాగమున దక్షిణాపథ ప్రదేశమున పల్లవులు పరిపాలించుచుండి యుండవచ్చును. రాజ్యమును విస్తరింపఁ జేసికొనఁ బ్రయత్నించు చాళుక్యులకు, ప్రదేశాధిపతులైన పల్లవులకు సంఘర్షము కలిగియుండును. కృష్ణానది కుత్తరభాగమున వేంగీదేశమును క్రీస్తుశకమేడవ శతాబ్దమునకు పూర్వము శాలంకాయనులును విష్ణుకుండినులును, కృష్ణకు దక్షిణభాగమున పల్లవులును బరిపాలించినట్లు మనకు శాసన

దృష్టాంతమే కలదు. క్రీస్తుశక మేడవ శతాబ్దారంభమున చాళుక్యులు విష్ణుకుండి ప్రభువులను జయించి వేంగీచాళుక్య రాజ్యమును స్థాపింపక పూర్వమే దక్షిణమునుండి ప్రాగ్దేశమునఁ దమరాజ్యమును విస్తరింపఁ జేసికొనఁ బ్రయత్నించిరనియు, నేతత్సందర్భమున చాళుక్యులకు పల్లవులకు సమరములు సంభవించెననియు, మొదటిమాఱు పల్లవులే జయించినను చాళుక్యులు అతికష్టముమీఁద నైనను కడప మండలమునందలి ముడివేము (ఇప్పటిపెద్దముడియము) వఱకు రాఁగలిగిరనియు, పల్లవుల తోడి యుద్ధమున నోటువడి ముడివేము అగ్రహారమున వారు కొంతకాలము తలదాఁచుకొనిరనియు, పిదపఁగొంతకాలమునకు మఱల విజృంభించి దక్షిణగాంగాది రాజ్యములను జయించిరనియు, త్రిలోచనపల్లవ సమరము పూర్వదేశమునకు సంబంధించిన గాథయగుటచే పూర్వచాళుక్య శాసనములందు మాత్రమే కన్పట్టుచున్నదనియు నూహించుట సమంజసము.

చాళుక్య విజయాదిత్యునితోఁ బోరిన వాఁడు త్రిలోచనపల్లవుఁడని చాళుక్యగాథ తెలుపుచున్నది. ఈతనికి ముక్కంటిపల్లవుఁడనియు, పల్లవత్రినేత్రుఁడనియు, త్రినయన పల్లవుఁడనియు, ముక్కంటి కాడువెట్టి యనియు పేళ్లుకలవు. కాడువెట్టి, కాడవరాయర్ - మొదలగు పదములు 'పల్లవ' నామాంతరమునంబరగు కడయార్ పదమునుండి పుట్టినవి. ఈ త్రిలోచనపల్లవుని శిలాశాసన మొకటి గుంటూరు మండలమునందలి బాపట్లతాలూకాలోని ఉప్పుటూరు గ్రామమున గలదు. అందు త్రినేత్ర పల్లవత్ర్యైతలేశ్వరుఁడు గంగానదీతీరమునందలి అహిచ్ఛత్ర పురమునుండి యాజ్ఞవల్క్యాన్వయులగు వేయిమంది బ్రాహ్మణులను బిలువనంపి వారికి అర్ధోదయ మహాపుణ్యకాలమున లవణపుర గ్రామము (ఇప్పటి ఉప్పుటూరు) నగ్రహారముచేసి యొసఁగెనని కలదు. ఈవిషయమునే తెలుపు త్రినయనపల్లవుని తామ్రశాసనముకూడగలదు కాని యీ తామ్రశాసనము విజయనగరరాజగు విజయ భూపతి నాఁడు చెక్కఁబడినదని గౌర్నమెంటు శాసనశాఖవారి యభిప్రాయము. ఇవితక్క ఇఁక నీత్రినేత్రపల్లవుని శాసనము లేవియుఁ గానరావు. ఈతనిని కరికాలచోడుఁ డోడించినట్లు గాథలు కలవు. పల్లవులలోనివాఁడగు రెండవస్కందవర్మకే త్రిలోచనపల్లవ నామాంతరముకలదనియు, నీతఁడు క్రీస్తుశక మూడవశతాబ్దములోనివాఁ డనియు గొందఱి మతము. క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దాదిని ధరణికోటను రాజధానిగ నేలిన కోటవంశీయులు తాము 'శ్రీమత్త్రినయన పల్లవప్రసాదాసాదిత కృష్ణవెణ్ణానదీ దక్షిణతటషట్సహస్రావనీ వల్లభుల'మని చెప్పుకొని యున్నారు. వెలనాటి చోళుల పూర్వుఁడైన మొదటి మల్లరాజు త్రినేత్రపల్లవునితో స్నేహము చేసికొని దక్షిణదేశ దిగ్విజయమునకై బైలువెడలి, గాంగ, కళింగ, వంగ, మగధ, ఆంధ్ర, పుళింద, పాండ్యాదులం జయించి షట్సహస్ర జగతి(ఆఱువేలనాఁడు)ని సంపాదించి ధనదపురమును రాజధానిగఁ జేసికొని పరిపాలించినట్లు

వెలనాటి చోళశాసనములందుఁగలదు. వీటి నన్నిఁటిననుసరించిచూడఁగా త్రిలోచనపల్లవు డను పేరుగల ఒకపల్లవరాజు నిజముగా ఉన్నను లేకపోయినను కృష్ణవేణ్ణానదీదక్షిణ షట్సహస్రావనిని చాల పురాతనకాలమునుండియు పల్లవులు పరిపాలించుచుండినట్లును, పల్లవుల నోడించి ఆదేశము చాళుక్యు లేలినట్లును, అటుపిమ్మట వరుసగా దానిని ధనదుపురము రాజధానింజేసికొని వెలనాటిచోళులును, అటువెనుక ధరణికోట రాజధానింజేసికొని కోటవంశీయులును పరిపాలించినట్లును, పల్లవు లేలిన దేశమును జయించి చాళుక్యులును, చాళుక్యరాజ్యము క్షీణదశకు వచ్చుచున్నతరి స్వాతంత్ర్యమును వహించి వెలనాటి చోళులును, కోటవంశీయులును రాజ్యమేలిరి గనుకనే పూర్వచాళుక్యగాథయందు త్రిలోచనపల్లవ సమరప్రసక్తియు, వెలనాటి చోడశాసనములందు త్రినేత్రపల్లవస్నేహప్రసక్తియు, కోటవంశ బిరుదములందు త్రినయనపల్లవ ప్రసాదాసాదిత రాజ్యవైభవప్రసక్తియుఁ గలిగినట్లును ఊహించుట సమంజసము. అది యటుండ నరసారావుపేట తాలుకాయందు కోటప్పకొండలోని యొకశాసనమున వెన్నయభట్టసోమయాజి పేర్కొనఁబడియున్నాఁడు. ఈతఁడు త్రినయనపల్లవుని ఆస్థానపండితుఁడైనట్లును, మహావాది మదేభసింహుఁడనఁబరగిన గాడభట్టును జయించి గిరిపశ్చిమదేశమున "ఆరామలేఖావృతమైన ఇఱ్ఱులూరును" త్రినయనపల్లవునినుండి పడసినట్లునుకలదు. ఈవెన్నయభట్ట సోమయాజియు, పూర్వచాళుక్యగాథయందలి విష్ణుభట్టసోమయాజియు నొక్కఁడే యని నా నమ్మకము. ఇరువురునుగూడ త్రిలోచనపల్లవుని కాలమునందున్నవారే. త్రిలోచనపల్లవునిచే నిహతుఁడైన విజయాదిత్యుని మహాదేవిని సంరక్షించిన విష్ణుభట్టసోమయాజి ఆపల్లవభూపతి యాస్థానపండితుఁడగు వెన్నయభట్ట సోమయాజిగాయని నిశ్చయించుటకు సంశయింపఁబనిలేదు. ఓడింపఁబడినది తనయాశ్రయునిచేతనైనను విష్ణుభట్టసోమయాజి కరుణారసార్ద్రహృదయుఁడై విజయాదిత్యుని మహాదేవిని సంరక్షించి యుండును. అందువలనపై గాథలవలన దేల్పఁదగినసారాంశమేమన:

౧. చాళుక్యులు దాక్షిణాత్యులు : వెళ్ కులసంజాతులు.

౨. చాళుక్య శాఖలన్నియు బాదామి చాళుక్యమూలవంశమునుండి విస్తరిల్లినవి.

3. చాళుక్యులు సూర్యవంశజులును కారు; చంద్రవంశజులును కారు: అగ్నికుల క్షత్రియులును కారు.

౪. చాళుక్యరాజ్యమును దక్షిణాపథ ప్రాగ్దేశముల వ్యాపింపఁజేయఁ బ్రయత్నించిన కాలమున కృష్ణానదీదక్షిణషట్సహస్రదేశము నేలుచుండినవారు పల్లవులు. కృష్ణానదికుత్తరమున చాళుక్యులకు విష్ణుకుండి ప్రభువులతోను, కాళింగులతోను ఎట్లు సంఘర్షము సంభవించెనో అట్లే అంతకుపూర్వము చాలకాలముక్రితమే కృష్ణాదక్షిణదేశమున వారికి పల్లవులతో సంఘర్షము సంభవించెను. తుట్టతుదకు పల్లవులను జయించి చాళుక్యులే కృష్ణానదీ దక్షిణదేశమును గూడ పాలించిరి.

# కీ. శే. సత్యవోలు గున్నేశ్వరరావు గారు

జి. జాషువా గారు

మంత్రిభాస్కరయశోమహిమంబును బిరాన, సాధించిన వదాన్యచక్రవర్తి
కవిగజమ్ముల నేలఁగా బునర్భవుఁడై వి,రాజిల్లు శ్రీకృష్ణరాయమూర్తి
శత్రుకోటికి గర్భశల్యమై తనరి శి,రాన కిరీటంబు లేనిరాజు
ఘనతపఃపరిపాకమున భారతాంగన, కడుపారఁ గన్న యఖండభోగి
గీ. వేంగిరాజ్యాటవీచరద్భీమసింహ, మక్కటక్కట సత్యవో లన్వయాబ్ధి
రాజబింబము గున్నేశరాయవర్యుఁ, డస్తమించెను దాతృత్వ మస్తమింప.

సీ. తనపోషణమున వృద్ధిని గాంచి మించిన, చిత్రలేఖకులకుంచియలనేర్పు
తనయాదరమున శస్తంబైన సత్కవి,ప్రవరుల భావప్రపంచగరిమ
తనసాయమున నాటుకొని తేజముంగన్న, నటవిగాయకసారనైపుణంబు
తనదానపటిమఁ దృప్తినిగొన్న సకలయా,చకమనోవిస్ఫుటాశాబలంబు.
గీ. అలయఖండగోదావరీజలతరంగ, ఘోషణంబునఁ గలసి దిక్కుంభిగములు
సీధునెపమునఁ గన్నీరు చిలుకరింప, నంగలార్చెడునమ్మ! యోయాంధ్రమాత!

శా. నీ కేపుత్రవతంస మిష్టుఁడయి శాంతిం గూర్చునో వాని కే
దో కాలాంతముసంభవించి చను నయ్యో! తల్లి! నీకర్మమే
మోకానీ హృదయంబు భిన్నములు గాదో, గర్భశోకంబు నీ
కాకల్పాంతము నిల్చుచో, భరతమాతా! యెంతదౌర్భాగ్యవే.

శా. నానానాటకసంఘరాజములకన్నన్ మిన్నగాఁ జేసి య
ట్లానందించిననాయకుం డకట దేవావాసముం జేరెన
మ్మా! నీ విప్పుడనాథవైతివి గదే యాభోగ మామంజుల
శ్రీ నీకుండదు భర్తతోడనె చనెన్ జింతామణీసంఘమా!





కీర్తిశేషులైన శ్రీయుత సత్యవోలు గున్నేశ్వరరావుగారు

రాజమహేంద్రవరము



హెర్మ్సు-(లోహవిగ్రహము)
మెర్క్యురీయను రోమకదేవతనుబోలిన
యొక గ్రీకుదేవత.



స్లా-ఫెండి ఆరియాడ్ని (శిలావిగ్రహము)
ఈమె యొక గ్రీకు పౌరాణికసతీమణి.
రోముపట్టణమునందలి వాటికనుభవనమున నీవిగ్రహమున్నది.



లే ఆకాను అను ట్రోజను పురోహితుఁడు అతని యిద్దరు కుమారులు: (శిలామయము).
వీ రొక మహనీయదేవాలయము నపవిత్రము గావించినందులకై వీరిని సర్పములు చుట్టఁబెట్టుకొని బాధించుచున్నవి. శిల్పవైఖరి హృదయ విదారకమగు భావములను స్ఫురింపఁజేయుచున్నది. ఈవిగ్రహము రోమునందలి వాటికనుభవనమున నున్నది.




వ. వేంకటరంగయ్య గారు, బి. ఏ., బి. యల్.

జగద్గురు శ్రీశంకరాచార్యులవారు "ద్వాదశ లింగ స్తోత్రము" అనుపేర పండ్రెండు శివక్షేత్రముల స్తుతించి యున్నారు. ఈస్తోత్రము శాంకర గ్రంథావళియందలి పదునెనిమిదవసంపుటమునందును, బృహత్ స్తోత్ర రత్నాకరాది స్తోత్ర గ్రంథములందును గలదు. అందందు కొలదిపాటి పాఠభేదము లున్నను మొత్తమునకు అన్నిటను విషయము నొక్కటిగనే కనుపడుచున్నది. ప్రాయికముగ మన దేశమునందు పఠింపబడుచుండు దేవతా స్తోత్రములు శ్రీశంకర విరచితములుగ గణింపబడుచున్నవి. ఆసేతుహిమాచల ప్రతీతి గలవన్నియు సర్వమాన్యులగు మహనీయులచే ప్రసాదింపబడి యుండగలవు. అట్లు గాకున్న వానికి సర్వత్రాంగీకారము లభింపనేరదు. వేదములకు ఇతిహాసపురాణాదులకు ముఖ్యములగు కొన్ని వైదిక ప్రక్రియలకు భరతఖండమునం దంతటను నొక రూపమగు ప్రవృత్తియు గౌరవమును గలిగియుండుటచే వీని ననుష్ఠించు భారతీయుల కేకజాతిత్వమును సాధింప వలనియగుచున్నది. ఈ సంకల్పముననే రాధాకుముద ముకర్జిగారు "ఫండమెంటల్ యూనిటి ఆఫ్ ఇండియా" యను బహ్వర్థవ్యంజకమగు గ్రంథము నొకదాని వ్రాసి యున్నారు.

అయితే ఏకదేశప్రాశస్త్యముగల గ్రంథములకు సార్వజనీనవ్యాప్తిప్రతిష్ఠలు గలుగుట కొరకై యజ్ఞాతకర్తృకులగు కవులు శంకరాదుల కర్తృత్వము వానికంటగట్టి వాని వ్యాపింపజేయుట గలదని చెప్పుట కేవలము సాహసము గాజాలదు. భాగవతము వ్యాసప్రోక్తముగాదనియు, బోపదేవుడు దాని రచించి వైయాసికము జేసెననుటయు, అధ్యాత్మరామాయణము నొక యతీశ్వరులు రచించి విశ్వామిత్రప్రోక్త మనిపించిరను టయు, సూతసంహిత విద్యారణ్యకల్పితమేకాని ఆర్షము గాదనియు, ఇట్టివిసంవాదములు అనాదిగ నున్నవి.

ఇట్లనే స్తోత్రకర్తృత్వవాస్తవ్యవిచారమునను గొన్నిట సంశయ మంకురించుచున్నది. బంగాళాదేశమున జనసామాన్య మనుదినము పఠించుచుండు గంగాస్తోత్ర మొకటి గలదు. దానిని జఫరాఫ్ ఖాన్ అను మహమ్మదీయభక్తుడు రచించినట్టుల యచటిశ్రోత్రియులు చెప్పు చున్నారు. కొందరు దీని శంకరప్రోక్తముగ గణించు చున్నారు.

ఇత్యాదివిషయముల బరిశోధించి కర్తృత్వ నిర్ణయముల జేసి సద్గ్రంథముల ప్రచురించుట కొకపరిషత్తు ముఖ్యముగ గావలసియున్నది. ఇట్టి పరిషన్నిర్మాణమునకు వలయువిద్యకును ప్రతిభకును కుశలతకును ద్రవ్యసంపదకును యాంధ్రదేశము వెదయన జెల్లదు గాని శేఖరుడై నిలువ దగుడు మృగ్యమన క్షంతవ్య మపరాధశతం.

ప్రకృతవిషయమగు ద్వాదశలింగస్తోత్ర కర్తృత్వమున సంశయ మగపడలేదు. శ్లోకగతవిషయములబట్టి చూచిన నవి ప్రాచీనప్రశస్తములయి కొందరకు అర్వాచీనులకు ఆధునికులకు తెలియనివిగ నున్నవి. ఇందుగల విశేషముల నాయాపట్టున జూపెదను.

౧ సౌరాష్ట్రదేశే వసుధావకాశే జ్యోతిర్మయం చంద్రకళావతంసమ్,
భక్తిప్రదానాయ కృతావతారం తం సోమ
నాథం శరణం ప్రపద్యే.

ఈశ్లోకమున సోమనాథక్షేత్రమునందలి జ్యోతిర్మయలింగము స్తుతింపబడియున్నది. విగ్రహద్రోహి గజినీమహమ్మదు దండెత్తివచ్చి ధ్వంసము చేసినసోమ నాథ మిదియే. శ్రీశంకరాచార్యులవారికాలము క్రైస్తవ

క్రీ॥ పూర్వము 080 సంవత్సరముల ప్రాంతమని తెలియుచున్నది. గజనీమహమ్మదు తరువాత దాదాపు 200 సంవత్సరముల నాటివాడు. సోమనాథక్షేత్ర మిప్పుడు ఘూర్జరమండల మున నున్నది. శంకరునికాలమున ఆదేశమంతయు సౌరాష్ట్రమున జేరినది కాబోలును. వసుధానకాశమనువిశేషణ ముండుటచేత జలభాగ మెక్కువగను స్థలము కొలదిగను ఉండుచోట ( Peninsnla ) సోమనాథాలయము కట్టబడినట్లు తోచుచున్నది. ఈక్షేత్రము సర్వత్ర ప్రసిద్ధమై చరిత్రాంకితమయి యున్నది. దీనిస్థానమునుగూర్చిన సందియ మేమియులేదు.

౨ శ్రీశైలశృంగే వివిధప్రసంగే శేషాద్రిశృంగేఽపి సదా వసంతమ్, త మర్జునం మల్లికపూర్వ మేనం నమామి సంసారసముద్రసేతుమ్.

దీనిలో గొంతసుగమము; కొంతకష్టసాధ్యముగ నున్నది. సోమనాథమునుంచి శ్రీశైలము విశేషదూరముననున్నను ఆచార్యులవారు రెండవశ్లోకమున శ్రీశైలవాసియగు శ్రీమల్లికార్జునుని స్తుతించియున్నారు. శ్రీశైలము నధిష్ఠించియుండునది శ్రీమల్లికార్జునుడని ప్రసిద్ధముగ నున్నది. "శేషాద్రిశృంగేపి సదా వసంతం" యనుటలో కొలది సంశయ ముత్పన్నమగుచున్నది. శ్రీశైలముమొదలు తిరుపతివరకు వ్యాపించియుండు పర్వతశ్రేణికి శేషాద్రిపర్వతములు అను వ్యవహారము గలదు. (Seshadri hil·) అందునను తిరుపతియుండుభాగము శేషునిశిరోభాగమని చెప్పుటగలదు. శ్రీవెంకటేశ్వరుని శేషాద్రివాసుడని జనులు నుతించుచున్నారు. శ్రీమల్లికార్జునుడును శేషాద్రిశృంగేఽపి సదా వసంతం యనువిశేషణము నిందుబొంది యున్నాడు. శేషాద్రిశృంగము తిరుపతియే యగునెడల అం దధిష్ఠించియుండు దేవర శ్రీమల్లికార్జును డనవలయు. తిరుపతికొండలమీద శ్రీవెంకటేశ్వరులు ఆదివరాహస్వామి లోనగుమూర్తులు గలరే కాని శ్రీమల్లికార్జును డచటయున్నటులు యాధునికప్రచారము లేదు. శ్రీశంకరాచార్యుల వారీవిషయమున పొరబడిరా యనుట సాహసాతిశయమగును. శంకరాచార్యులకాలమున నందు శ్రీమల్లికార్జును డుండి తరువాత కొంతకాలమున కాయాలయ ముత్పన్నమయినటుల జనశ్రుతియు లేదు.

అమోఘమగు శ్రీశంకరవాక్యము సమర్థింపవలయు ననిన నొక్కటే మార్గముదోచుచున్నది. బహుశః శ్రీశంకరాచార్యుల కాలమున శ్రీతిరుపతికొండమీదమూర్తి శైవమూర్తిగనుండును. ప్రాచీనాళ్వారులలో నొకరగు పేయాళ్వారులు తిరుపతికొండపై దేవునిహరిహర చిహ్నములు రెండును గల స్వరూపముగ ననుభవించిరి. ఈ అంశము పేయాళ్వారు ప్రోక్తమగు తిరుక్కండేన్ అనుగ్రంథమున గలదట. హరిహరరూపవర్ణనాప్రకరణమున యశఃకాయులట. గోపీనాథరావుగారు తమ "ఇండియన్ ఐకానోగ్రాఫీ" యనుగ్రంథమునగూడ నీవిషయ ముదాహరించియున్నారు. పేయాళ్వారులకాలము క్రీస్తుశకము 700 ప్రాంతమనికొందరు జెప్పుదురు. క్రీ. శ. 700 గానిండు. అంతకుముందు గానిండు. ఈయన కడుప్రాచీనుడు. పరమవైష్ణవభక్తుడు. బహుశః శంకరాచార్యులవారికంటె ముందువాడుగ నుండవచ్చును. ఈయన యావిగ్రహము లోని శైవచిహ్నములగూడ జూచి శివకేశవచిహ్నములగు జటాకిరీటములను, శూలచక్రాదులను జంటలుగ వర్ణించి యున్నాడు. తిరుపతికొండలకు వృషశైలమను నామము అనాదిగ గలదని పూర్వోక్తగోపీనాథరావుగారు తమ గ్రంథమున వ్రాసియున్నారు.

శ్రీవేంకటేశ్వరులు శివుడా విష్ణువా యనుగొప్ప సందేహము శ్రీరామానుజులవారి కాలమునగూడ గలిగి తత్సందేహనిర్ణయమునకై గొప్పసభ జరిగి, వాదము జరిగి, శ్రీరామానుజులవారి ప్రార్థనానుసారముగనో యుపాయాంతరముననో ఆవిగ్రహము విష్ణువని తీరుమానింపబడిన దనుగాథ ప్రసిద్ధముగ గలదు.

శివకేశవులపోరాట మిటులుండ శ్రీవెంకటేశ్వరమూర్తి పురుషబింబముగాదనియు శక్తిస్వరూపమనియు అందువలననే శుక్రవారాభిషేకములు శరన్నవరాత్రములు బ్రహోత్సవము లోనగు శాక్తేయతంత్రము లనుష్ఠింపబడుచున్నవనియు, దూరదేశాగతు లాదేవుని "బాలాజి" యని స్త్రీపర్యాయముగ బలుకుచుండుదురనియు గొందఱును, మఱికొందఱు ఆవిగ్రహము శ్రీసుబ్రహ్మణ్యస్వామియనియు, తచ్చిహ్నములు కొన్ని యిందుగలవనియు ఈ నాటికిని జెప్పుచున్నారు. గ్రంథవిస్తరభీతిచే నీవిషయ మింతటు ముగింపవగును.

"శేషాద్రి శృంగేపి సదావసంతం" అని శ్రీ మల్లికార్జునుని శంకరాచార్యులవారు స్తుతించుటలో శేషాచలమియు నుండజాలదని జెప్పుటకు జాలు సాధనసామగ్రి సూచింపబడినది. శంకరాచార్యులవారు శేషాద్రి శృంగప్రశంస చేయుటలో "అపి" యను సముచ్చయమును ప్రయోగించుట మాత్రమే కాక "సదా" యను విశేషమును గూడగలిపిరి. ఆచార్యులవారికాలమునగూడ సందేహము గలిగి తన్నివారణమునకై వారిట్లు "అపి" "సదా" యనుప్రయోగములచే అవధారణము చేసినట్లున్నది.

3 అవన్తికాయాం విహితావతారం ముక్తిప్రదానాయచ సజ్జనానామ్, అకాలమృత్యోః పరిరక్షణార్థం వందే మహాకాల మహాం సురేశమ్.

అవన్తి యుజ్జయినికి నామాంతరము. ఉజ్జయిని యందు మహాకాలుడను పేరుగల శివస్వరూపముండుట ప్రసిద్ధవిషయము. ఈదేవునే మహాకవి భవభూతి యుత్తరరామచరిత్రమునందు కాలప్రియనాథుడని స్మరించియున్నాడు. "అకాలమృత్యోః పరిరక్షణార్థం" అనుటయందు మార్కండేయ చరిత్రముకాక స్థానిక గాథ యెద్దియైన నుండునేమో విచారింపవలయు.

4 కావేరికానర్మదయోః పవిత్రే సమాగమే సజ్జనతారణాయ, సదైవ మాంధాతృపురే వసంతం ఓంకారమీశం శివమేక మీడే.

ఈ యోంకార క్షేత్రమునకే అమరేశ్వరమను నామాంతరము. ఇది ఖాండ్వాజంక్షనునకు సమీపముగ మోర్టక్ అనుస్టేషను చేరువనున్నది. ఈక్షేత్ర ప్రసంగమున నొకగొప్పవిషయము తేలుచున్నది. ఈక్షేత్రము "కావేరికానర్మదయో స్సమాగమే" యున్నటుల యాచార్యులవారుపదేశించినారు. ఈకావేరిదక్షిణజిల్లాలలోని కావేరి కాగలదా యను వితర్కము పుట్టుచున్నది. అరవ జిల్లాలలోని కావేరియగునెడల దీనికిని నర్మదకును సమాగమము దురూహ్యము. దేశకాలజ్ఞుడగుశంకరు డిందొక ప్రమాదమును గావించెనాయనుటయు మహాపచారము. ఈవిషయమును విచారింపగ నర్మదకు కావేరియనునొక యుపనది యున్నటుల స్పష్టముగ తెలిసినది. ఈరెంటి సమాగమస్థానమున నోంకారక్షేత్ర మున్నదట.

దక్షిణజిల్లాలలోని కావేరికి నామసామ్య మెట్లు కల్గిన దనువిచార మిట యప్రస్తుతముకాదు. క్రింద రానున్న అయిదవశ్లోకములోని వైద్యనాథము, ఆరవ శ్లోకములోని నాగనాథముగూడ ఈమీమాంసకు విషయములగుచున్నవి. దేశచరిత్రములందు ఆర్యులనబడు జాతివారు (వారు యిప్పటిచాతుర్వర్ణ్యమువారే కానిండు లేక వారిలో బ్రాహ్మణులయొక్క పూర్వికులే కానిండు) పశ్చిమోత్తరములనుండి భరతఖండము ప్రవేశించి క్రమక్రమముగ సింధునదిని దాటి గంగాయమునాపరిసరములజేరి క్రమక్రమముగ దక్షిణభాగమున బ్రవేశించిరని చెప్పబడియున్నది. వీరిలో నొకతోయమువారు నర్మదా కావేరీతీరముల గొంతకాలము నివసించి యచ్చట ఆరోగ్యస్థితులు చక్కగ లేనందున చాయగ దక్షిణమునకు బోయి పోయి దక్షిణకావేరీతీరముల జేరి యానదీ పరిసరములు రమ్యములుగను వాసయోగ్యములుగను యుండుటచే నచట విడిసి స్థిరావాసములు గుదిర్చికొని పూర్వపునర్మదాతీరములందుండిన యభిమానముచే ఈనదికిని కావేరియను నామము పెట్టుకొనియుందురు.

లోకమున నెచటగాని యొకదేశముననుండి మరియొక దేశమునకు వలసపోయినవారు ప్రాతనివాసస్థలముల పేళ్లనే క్రొత్తవసతులకు బెట్టుకొనుట లోకప్రసిద్ధము. ఉదాహరణములు గావలయునెడల బ్రిటిషు ద్వీపముల లోని గ్రామనామములన్నియు యునైటెడు స్టేట్సులో జూడగలము. కావేరీ తీరవాసులనేకులు నెల్లూరికివచ్చి యచటిపినాకినికి త్రోవ నడుగుచు కావేరినే స్మరించుకొనుచు కావేరికి త్రోవ యెటులనున్నదని యడుగుట గలదు. ఇటులనే కృష్ణానదీతీరపువారును నెల్లూరికివచ్చి "కిష్ట"కు త్రోవ నడిగెదరు. ఇట్లు అభిమానములు మనుష్యసామాన్యమునకు సహజముగ నున్నవి. వీనికి పూర్వపక్ష సిద్ధాంతము లక్కరలేదు.

కావేరినర్మదలలో సముద్రగామినియు మహానదమును నగు నర్మద పేరే పెట్టుకొనక దానియుపనదియగు కావేరి పేరు నేలయూర్జిత పరచుకొనిరను ప్రశ్న పుట్టవచ్చునుగాని యిట్టియూహలకు సమర్థనములును కారణములును అనంతములుగ నుండును. నర్మదగాక గంగయనిగాని సింధువనిగాని యేలపిలువలేదనవచ్చును? ఈ వాదము

అనవస్థాస్థితికి దేలును. కావేరి నర్మదలలో కావేరి రమ్యతరముగను సౌఖ్యతరముగను ఉండినది గాబోలు. కారణమేమయినను వేరొకటి స్థిరముగ నున్నది.

మనకావేరికి పేరుపెట్టినవా రొకప్పుడు నర్మదా తీరముల నుండినవారనుట కొకనిదర్శన మగపడుచున్నది. అరవదేశములోని వడమలను ద్రావిడ బ్రాహ్మణశాఖలలో వడదేశవడమలు, తెక్ దేశవడమలు అని రెండుశాఖలు గలవు. "వడమ" యనుదానికి "యుత్తరము" అని వ్యుత్పత్తి అరవవారు చెప్పుచున్నారు. ఈయుత్తరపు వారిలో ముందు దక్షిణమున జేరువారు, బహుశః తెక్ దేశ వడమలు అని పిలువబడిరి కాబోలు. తెక్ అనగ దక్షిణము. వెనుకవచ్చినవారు వడదేశవడమలు అయిరి గాబోలును. అనగా ముందువచ్చినవారు దక్షిణవడమలు, వెనుకటి వారు ఉత్తరవడమలు. "వడమ" శబ్దము ఉత్పత్త్యర్థమును గోలుపోయి రూఢ్యర్థమును బొందినది. ఉత్తరాదివార గుటయందు న్యూనత యేమైన నున్నయెడల అది వడమలకును అన్వయింపగలదు. తెలుగువారుమాత్రమే యుత్తరాదివారుగారు. జన్మవిస్మృతి యెంతపని చేయగలదు?

వడమ లొకానొకప్పుడు తాము నర్మదాపరిసరముల నుండినదాని మరువక తమ నిత్యసంధ్యావందనమున నర్మద ననుదినము స్మరించుట గలదు. వారు సంధ్యలలో నీశ్లోకము పఠింతురు:—

"నర్మదాయై నమః ప్రాతః నర్మదాయై నమోనిశి,
నమోఽస్తు నర్మదే తుభ్యం త్రాహి మాం విషసర్పతః."

బహుశః వీరిపూర్వికులు నర్మదాతీరములలో యిరవులు గుదిర్చికొనినకొంతకాలమున కాప్రదేశము విషసర్పభూయిష్ఠమై వాసయోగ్యము గాకపోయినది గాబోలును. 'కవేరస్యాపత్యం స్త్రీ కావేరీ' యను వ్యుత్పత్తి ఆ కావేరికి ఈకావేరికిగూడ సరిపడగలదు. కావు + ఏరి= కావేరి యను నొకయుత్పత్తియు సాధ్యముగ నున్నది. కావేరినీళ్లు కావువర్ణముగలిగియుండుటచే కావేరియైనదని కొందరు చెప్పుదురు. ఇదియుస్వాభావికముగ నేయున్నది. కృష్ణా. యమునానదులు వర్ణప్రాధాన్యము గలవి. బ్లూ నైల్ (Blue Nile) వైట్ నైల్ (White Nile) యను పేర్లు గమనింపుడు.

ఇదంతేయు నిటులుండ మనదక్షిణకావేరికి పౌరాణికనామము "మరుద్వృధ" యని తెలియుచున్నది. మరుద్వృధయే కావేరియగునెడల మనదక్షిణకావేరి జన్మవృత్తాంతమునకు నర్మదాతరణముచేసి సింధూప్రాంతముల కేగవలసియున్నది. మరుద్వృధయనునది "ఇమం మే గంగే యమునే" ఇత్యాదిఋక్కులలో పఠింపబడిన వైదికనదులలో నొకటి. అసిక్ని (Chenab) యును వితస్తా (Hydaspes or Jhelem) కలసి ప్రవహించు నదికీపేరని రాధాకుముదముఖర్జీ తనగ్రంథమున జెప్పియున్నాడు.

శంకరప్రోక్తమగు కావేరి కీ చిక్కులన్నియు లేకుండ నర్మదోపనదీత్వ మంగీకరింపవగును.

కావేరి నర్మదలపొందున కింకొక ప్రమాణమును జూపెదను. కలకత్తా హైకోర్టుజడ్జిగ నుండిన పార్గిటర్ న్యాయమూర్తిగారు వ్రాసిన ఏన్షంటు ఇండియన్ హిస్టారికల్ ట్రెడిషన్ (Ancient Indian Historical Tradition) అనుగ్రంథమున కావేరినర్మదల ప్రశంస ప్రసక్తమై నర్మదకు కావేరియనునొకయుపనది యున్నటుల సప్రమాణముగ జూపబడినది. ఉపనది యయ్యును ఈకావేరి యుత్తమజన్మచే విరాజిల్లుచున్నది. ఈమె యువనాశ్వుని మనుమరాలుగ బుట్టి కాన్యకుబ్జరాజగు జహ్నునిభార్యయై యువనాశ్వుని శాపవశమున నదియై నర్మదం గూడినదట.

౫ పూర్వోత్తరే పారలికాభిధానే సదాశివం తం గిరిజాసమేతమ్, సురాసురారాధితపాదపద్మం శ్రీవైద్యనాథం సతతం నమామి.

౬ ఆమర్దసంజ్ఞే నగరేచ రమ్యే విభూషితాంగం వివిధైశ్చ భోగైః, సద్భుక్తిముక్తిప్రద మీశ మేకం శ్రీనాగనాథం శరణం ప్రపద్యే.

ఈ శ్లోకద్వయమున వైద్యనాథనాగనాథక్షేత్రము లింపుగ వ్యాఖ్యానము నపేక్షించుచున్నవి. అయిదవ శ్లోకమున జెప్పబడిన వైద్యనాథక్షేత్రము పూర్వోత్తర భాగమున పారలికమనుస్థలమున నున్నటుల శంకరులు చెప్పియున్నారు. పరలీక్షేత్రము నైజాముగారంటేడు స్టేటురైల్వేలో హింగోలి స్టేషనుకు 17 మైళ్లదూరమున నున్నది. పూర్వోత్తరమని దిఙ్నిర్దేశము చేయబడియుండుటచే.. ఆరవశ్లోకములోని నాగనాథ క్షేత్రము

నపేక్షించి ఈవిశేషణము చెప్పబడినటులున్నది. నాగనాథక్షేత్రము పై వైద్యనాథమునకు ఇరువదిమైళ్ల దూరములో నున్నది. దీనినే అవుండా నాగనాథమనియెదరని తెలియుచున్నది. "ఆనుర్ధ" వికృతి "అవుండా" యని తోచుచున్నది. వైద్యనాథమను పేరుగల క్షేత్రములనేకస్థళములలో నున్నవి. నేపాలప్రాంతముల నొకటియు, కలకత్తా సమీపమున నొకటియు, తంజావూరు జిల్లాలో నొకటియు గలవు. శంకరస్తుతమయిన నాగనాథముగాక దక్షిణజిల్లాలలో నొకనాగనాథ మున్నటుల దెలియుచున్నది. కావేరీన్యాయమె వీనికిని అన్వయించుచున్నది. మనపూర్వికులు దక్షిణదేశమున నాటుకొనుకొలది తాము పూర్వము నివసించియుండిన స్థళాభిమానముచే ఆక్షేత్రనామములనే యచటనచట నెలకొల్పుచుండిరి.

౭ సానంద మానందవనే వసంతమ్ ఆనందకందం హృతపాపబృందమ్, వారాణసీనాథ మనాథనాథ, శ్రీ విశ్వనాథం శరణం ప్రపద్యే.

ఇందు శ్రీకాశీవిశ్వనాథస్వామి సంబోధింపబడియున్నాడు. కాశిగాక ఇంకొక వారణాసి యెచ్చటనైన యున్నటులు దెలియుటలేదు. అంతియకాక కాశీక్షేత్రమునకు సంకల్పాదులలో "ఆనందవనే, మహాశ్మశానే" యని చెప్పుదురు. ఈ శ్లోకమున "వారాణసియు" "ఆనందవనము"ను ప్రస్తుతింప బడకుండిన ఈ విశ్వనాథు డేపల్లెవాడగునో. వేంకటగిరిలో నొక "కాశీ విశ్వనాథస్వామి" యే యున్నాడు. ఇంక ననేకగ్రామములలో విశ్వనాథాలయములు గలవు.

౮ యో డాకినీశాకినికాసమాజే నిషేవ్యమాణం పిశితాశనైశ్చ, సదైవ భీమాదిపదప్రసిద్ధం తం శంకరం భక్తహితం నమామి.

ఈక్షేత్రము టెగాం స్టేషన్ సమీపమున నున్నది. ఈమూర్తి శాకినీడాకినీ సమాజములలో నిషేవ్యమాణుడుగ వర్ణింపబడియుండుటచే యుగ్రమూర్తిగ నుండును. అందుచేతనే భీమాదిపద ప్రసిద్ధుడేయున్నాడు. ఈలింగశీర్షమునుండి నెడలు జలస్రావమే భీమానది యైనదని కొందరు చెప్పుదురు. భీమశంకరమూర్తు లీక్షేత్రమునందే కాక యితరస్థళములందును గలరు. ఆచార్యులవారు ఈక్షేత్రమునే స్తుతించియున్నారు. ఈక్షేత్రము ఢాకా (Daca)గ యుండవచ్చునా యను ననుమానమునకవకాశము గలదు. అయితే ఢాకా (Daca) యందు ఢాకేశ్వరీదేవికి ప్రాశస్త్యముగలదు గాని ఢాకేశ్వరునికి లేదు. ఈవిషయ మింకను విమర్శింపదగును.

౯ శ్రీతామ్రపర్ణీ జలరాశియోగే నిబధ్య సేతుం నిశిబిల్వపత్రైః, శ్రీరామచంద్రేణ సమర్చితం తం రామేశ్వరాఖ్యం సతతం నమామి.

శ్రీరాముడు సేతువు నెచ్చట కట్టినదియు నిర్ణయింపవలసియున్నది. ఈశ్లోకము ననుసరించి తామ్రపర్ణీజలరాశియోగమున సేతుబంధమయినటుల దెలియుచున్నది. సామాన్యజనశ్రుతియు లోకాచారమును సేతుబంధము రామేశ్వరమనుద్వీపముకడ నైనటులు జూపుచున్నవి. అచటిలింగమునకు రామేశ్వరలింగమని పేరుండుటచే రామేశ్వరపక్షమే బలవత్తరమని వాదింపవచ్చును. అయితే యిప్పటి రామేశ్వరముకడ తామ్రపర్ణి జలరాశి యోగములేదు. తామ్రపర్ణి జలరాశియోగము తిరునల్వేలి జిల్లాలో గలదు. యాత్రికుల రామేశ్వరము రామనాథపురంజిల్లాకు తూర్పున నున్నది. తామ్రపర్ణీ సాగర సంగమమునకును ఇప్పటి రామేశ్వరమునకును సంబంధపడుటలేదు.

రామాయణ యుద్ధకాండ—సర్గ ౧౨ శ్లో ౭౮ నందు "దశయోజనవిస్తీర్ణం శతయోజనమాయతమ్" అని సేతువుయొక్క-పొడవును వెడల్పును జెప్పబడియున్నవి. ఇందువలన కన్యాకుమారిమొదలు రామేశ్వరద్వీపమువరకు గల స్థలమంతయు ఈ సేతువుయొక్క- విస్తీర్ణమున జేరగలదు. అట్లయినను తామ్రపర్ణి జలరాశియోగమునొద్ద రామసేతు వుండవలయును. దీని సమన్వయము చేయుటెట్లు? శంకరవాక్కు- అమోఘము. వారి కాలమున భూజలముల స్థితులు ఈ శ్లోకార్థమునకు సరిపోవు చుండినవని చెప్పినయెడ ఇప్పటి తామ్రపర్ణి ముఖద్వారమునకును రామేశ్వర ద్వీపమునకును 150 మైళ్ల పైబడినవ్యవధి యుండవచ్చును. ఈ రెంటిలో దేనికి స్థానభ్రంశము గలిగెనో? ఆచార్యులవారు స్తుతించిన రామేశ్వర లింగము ఇప్పటి రామేశ్వరములోనిది కాదని యూహింపవచ్చును. రామునిసేతువు యిపుడు రామేశ్వరమునొద్ద

కట్టబడియుండినయెడల వాల్మీకి వర్ణనమున కించుక భేద మగుచున్నది. నలసేతువు ఉత్తరమునుండి దక్షిణమునకు వ్యాపించినటుల రామాయణమున గనుపడుచున్నది.

హరయో దక్షిణం పారం
గమిష్యన్తి సమాగవాః—యుద్ధ. ౧-౧౦.
జగామ రామో ధర్మాత్మా
ససైన్యో దక్షిణాం దిశమ్—యుద్ధ. ౪-౫౪.
సాగరస్యోత్తరే తీరే
సాధు సేనా నివేశితా.—యుద్ధ. ౫-౧.

ఇత్యాదుల విమర్శింపనగు. మరియు సీతాన్వేషణమునకై వెడలిన వానరయూథము "దక్షిణస్య సముద్రస్య సమాసాద్యోత్తరాం దిశమ్" యని (కిష్కింధా. స. 64. శ్లో. 4) గలదు.

ఈ వానరయూథము వింధ్యపర్వతమున నుండి బయలువెడలినది.

వింధ్యాదుత్థాయ సంప్రాప్తం
జలధేస్తీర ముత్తరమ్. సుం. ౩౫-౬౭.
తతోహి వసుధే గంతుం
దక్షిణో దక్షిణాం దిశమ్. సుం. ౧-౧౧.
ప్రపేదే హరిశార్దూలో
దక్షిణాదుత్తరాందిశమ్. సు. ౫౬-౨౫.
యేతు తత్రోత్తరే తీరే
సముద్రస్య మహాబలాః. సు. ౫౭-౭.
దక్షిణా తీర ముదధే
ర్లంకా యత్రచ సా పురీ. సు. ౫౮-౪.

ఇత్యాద్యనేక ప్రమాణవాక్యములవలన లంక సముద్రమునకు దక్షిణమున నుండినదనియు రాముని దండు ఉత్తరమునుండి దక్షిణమునకు నడచినదనియు స్పష్టపడు చున్నది. లంక యిప్పుడు రామేశ్వరపు ద్వీప నుండిన యెడల సేనాపథము ఉత్తరమునుండి దక్షిణమునకు పోయియుండదు. తూర్పుదిశకు పోయియుండవలయును. ఆదిక్కునకు దరలినటుల వాల్మీకి చెప్పియుండలేదు. మరియు కీర్తిమూర్తులగు మహామహోపాధ్యాయ తిరువిశనల్లూరు రామసుబ్బాశాస్త్రిలవారు రచించిన రామసేతువినిర్ణయమను చిన్నగ్రంథమునను నలసేతు పథము ఉత్తరదక్షిణములుగ నుండినదనియే బహుప్రమాణపురస్సరముగ నిష్కర్ష చేయబడియున్నది. తామ్రపర్ణీ జలరాశియోగము భరతఖండముయొక్క దక్షిణాగ్రముననే కలదు. భూగోళవిధానజ్ఞులీశ్లోకార్థమును సమన్వయము చేయవలయును. హిందువులు ఏరేవున సింధుస్నానము చేసినను అదియే సేతుసుట్టమనుకొని అదియే ధనుష్కోటియనిసంకల్పించి రామధనుర్బాణముల నిసుకలో లిఖించి ధ్యానించి స్నానమున కుపక్రమింతురు. ఈమైతిహ్యము నాశ్రయించియు ఇపుడు రామేశ్వరమువద్ద సేతువు వంటి కోవ యొకటి సముద్రమధ్యమున గానవచ్చుచుండుటచేతను ఇదియే రాముని సేతువని పామర జనులు వాడజొచ్చియుందురు. సేతుస్థాననిర్ణయము చేసి శ్రీ యాచార్యులవారి శ్లోకమును స్థిరపరుపవలయును.

౧౦ సింహాద్రి పార్శ్వేపి తటే రమ్యం తం గోదావరీతీర పవిత్రదేశే, యద్దర్శనాత్పాతక జాతనాశః ప్రజాయతే త్ర్యంబక మీశ మీడే.

ఈ త్ర్యంబకక్షేత్రము నాసికాసమీపమున నున్నది. నాసికాత్ర్యంబకముల, యాత్రికులు గలిపి చెప్పుదురు. ఈ క్షేత్రసమీపవర్తియగు సింహాద్రి గుర్తింపవలసినదిగానున్నది. "సహ్యాద్రిశీర్షే విమలే వసంతం" అని పాఠాంతరము గలదు.

ఇది సింహాద్రియగునుగాక సహ్యాద్రియగునుగాక. విశాఖపట్టణ సమీపమున నుండు సింహాచలము మాత్రము గాజాలదు. ఈసింహాచలమునకడ త్ర్యంబకక్షేత్రమున్నటుల ప్రసిద్ధిలేదు. అంతియకాక గోదావరికిని ఈ సింహాచలమునకును దాదాపు 15 ఆమడలుండును. గోదావరీ జిల్లాలో నేమూలనుండి వచ్చు బ్రాహ్మణయాచకుడును గోదావరీతీరవాసినని చెప్పుకొనుట కలిగియున్నను పదేనామడల దూరమువారి కీనుడ్డరిక ము గలుపవగదు. సింహాచలములోని మూర్తి శివుడా విష్ణువాయను సందేహమున కవకాశముగలదు. నిజస్వరూపము చిదంబర రహస్యమును బోలియున్నది. సింహాద్రియప్పనికి సంవత్సరమున కొకనాడు గంధలేపనము వదలించి వెంటనే నూత్న లేపనము నలదుదురు. యథాస్థితి లోకమునకు వెల్లడి గాకుండుటయే ఈలేపనోద్దేశమై యుండునా?

౧౧ హిమాద్రిపార్శ్వేపి తటే రమంతం సంపూజ్యమానం సతతం మునీంద్రైః, సురాసురైర్యక్ష మహోరగాద్యైః కేదారసంజ్ఞం శివ మీశ మీడే.

ఇది ప్రసిద్ధమగు కేదారక్షేత్రము. హిమవత్పార్శ్వమున నున్నది. దీనింగూర్చి వివాద మేమియు లేదు.

౧౨ ఏలాపురీ రమ్య శివాలయేఽస్మిన్ సముల్లసంతం
త్రిజగద్వరేణ్యమ్, వందే మహోదారతరస్వభావం
సదాశివం తం ధిషణేశ్వరాఖ్యమ్.

(ధిషణేశ్వరునికి "ఘృష్ణేశం" అనిపాఠాంతరము గలదు.)

ఈఏలాపురి యనునదియే నిజాము యిలాకా యెల్లోరా (Ellora) అని చెప్పబడుస్థలము. ఇచ్చట "ఏలా" యను చిన్ననది యున్నదట. యెల్లోరాగుహాలయములను (Cave Temples of Ellora) గూర్చి చరిత్రగ్రంథములలో విశేషముగ ప్రశంస గలదు. అనాదికాలమునుండి హిందూమతస్థానముగ ప్రసిద్ధిచెందిన క్షేత్రముగుటచే నపట బౌద్ధులు ప్రవేశించి గుహాల దొలిపించి విహారముల నేర్పరచికొని తమమతవ్యాపకము చేయుచుండిరో లేక బౌద్ధమతమున కొకయునికిపట్టగుటచేత బౌద్ధమతధ్వంసకులపట వైదికాచారముల ననుసరించి శివప్రతిష్ఠ చేయించిరో నిర్ణయింపనలవిగాదు. ఆచార్యులవారీక్షేత్రమునుగూడ స్తుతిస్తోత్రముచేయుటచే నిది ప్రాచీనప్రసిద్ధి గలపవిత్రక్షేత్రముగ నుండును.

ఈ పండ్రెండు క్షేత్రములును ఈద్వాదశలింగ స్తోత్రమువలన ప్రసిద్ధిగాంచినవి కావు. శ్రీశంకరాచార్యులవారికాలమునకే యివి కడుప్రసిద్ధములై యుండినవి. వైష్ణవులకు నూటయెనిమిది దివ్యతిరుపతు లున్నటుల శైవపక్షమునను అనేకప్రాచీన పవిత్రక్షేత్రములు గలవనియు వానిలో ఈపండ్రెండింటినే "ద్వాదశజ్యోతిర్లింగము"లని లోకము గొనియాడుచున్నదనియు రాధాకుముదముఖర్జీగారును తమగ్రంథమున వీని పేర్కొనియున్నారు:—

సౌరాష్ట్రే (1) మల్లినాథంచ శ్రీశైలే మల్లి(2)కార్జునమ్,
ఉజ్జయిన్యాం (3) మహాకాలం ఓంకార (4) మమరేశ్వరే.
కేదారం (11)హిమవత్పృష్ఠే డాకిన్యాం(8)భీమశంకరమ్,
వారాణ(7)స్యాంచ విశ్వేశం త్ర్యంబకం(10)గౌతమీతటే.
వైద్యనాథం(5)చితాభూమౌ నాగేశం (6)దారుకావనే,
సేతుబం(9)ధేచ రామేశం ఘుష్మేశంచ (12) శివాలయే.
ఏతాని జ్యోతిర్లింగాని సాయం ప్రాతః పఠేన్నరః.
సప్తజన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి.

పైశ్లోకములలో ఆయాస్థానములలో వేసినయంకెలు శాంకరశ్లోకములలోని వరుసను తెలియజేయును.

ఈస్తోత్రశ్లోకములు బృహత్ స్తోత్రరత్నాకరము అనుస్తోత్రములపుస్తకమున గూడ గలవు. పాఠభేదము లున్నవిగాని లింగభేదములు లేవు. ఈక్షేత్రములు గుజరాతు (సౌరాష్ట్రము) మొదలు సేతుబంధమువరకు గల మధ్యదేశమున అందందు గలవని తెలుపబడినది. ఈపండ్రెండును అనాదిప్రసిద్ధక్షేత్రములని నిర్ణయించుటకు ఆచార్యసూక్తిమాత్రమే కాక మరియొక ప్రబలప్రమాణమును గలదు. ఈ పండ్రెండింటిలో పది పంచక్రోశాత్మకమగు కాశియందు గలవు.

సోమనాథుడు—సంకష్టనాశనీఘట్టమునగలడు
మల్లికార్జునుడు—ప్రహ్లాదఘట్టము
మహాకాలుడు—విశ్వేశ్వరగోశా
ఓంకారేశ్వరుడు—విశ్వేశ్వరగంజ్
వైద్యనాథుడు—గయఖేదోవలో ఆనందభైరవుని గుడి [యొద్ద
నాగనాథుడు—విశ్వేశ్వరగంజ్
విశ్వనాథుడు—మణికర్ణికా
రామేశ్వరలింగము—రామేశ్వరఘట్టము
త్ర్యంబకేశ్వరుడు— దుర్గాఘట్టమున దూదివినాయకుని గుడియొద్ద
కేదారేశ్వరుడు—కేదారఘట్టము
భీమశంకరుడు, ధిషణేశ్వరుడు } కాశిలో వీరిస్థానములు తెలియలేదు.

దూరదేశములయాత్ర చేయలేనివారి కొరకు సకలక్షేత్ర ప్రతీకములును పవిత్రతమమగు శ్రీకాశీ క్షేత్రమునసే పెద్దలు ప్రతిష్ఠింపజేసిరి. ఒక గొప్ప దేవాలయమున ననేకసన్నిధు లేర్పరచి యొక్కొక్క దానియందు ఒక్కొక్క దేవుని ప్రతిష్ఠ చేయుట గలదు. ఒక సన్నిధిలో శ్రీరాములు ఇంకొకదానిలో శ్రీవేంకటేశ్వరులు మరియొకదానిలో శ్రీనరసింహస్వామి, ఒకమూలపార్థసారథి ఇంకొకప్రక్క శ్రీరంగనాయకులు. ఇటుల ఒక ఆవరణములో ఇన్ని బింబములుండుటవలన అందరు దేవతలను యౌగపద్యమున దర్శించుటకు వలనుగలిగినటుల ఒక్క కాశీక్షేత్రమునందే ఈ లింగములును పూర్వీకులు ప్రతిష్ఠ

చేసిరి. వినాయక ప్రతిమునకు బంగారముతో గాని వెండితో గాని గణపతి ప్రతిమ చేయించుకొన వలయు ననియు, అందుకు శక్తిచాలనివారు "వృక్షమయం కుర్యాత్" యని చెప్పబడినట్టుల ప్రతిమలందువలె యాత్రలందును విత్తశాఠ్యదోషము కలుగకుండునట్టుల పూర్వీకులు యాత్రికుల కిట్లు వసతుల నమర్చినారు.

పురాణేతిహాసములలోనను స్తోత్ర కదంబముల లోనను స్మరింపబడియుండు నదులు క్షేత్రములు అన్నియు ఇపుడు భరతఖండమున గలవా లేక ఆర్యులను వారొకరు ఖండాంతరములనుండి భరతఖండమును ప్రవేశించినపిదప వారివారి ప్రాచీనాభిమానముల కొలది పూర్వనివాసముల పేళ్లను తమ నూత్నవాసములకు బెట్టుకొనుచుండిరా యను నిత్యాదివిమర్శకు మన విద్యావిచక్షణులు ప్రయత్నింపవలయునని ఈకుపక్రమన్యాసముయొక్క ముఖ్యోద్దేశమైయున్నది. బైబిలులోని ఓల్డుటెస్టమెంటు (Old testament) అను పురాణభాగమున జేర్చబడిన స్థలజలముల నిప్పటి పాశ్చాత్యశోధకులు గనిపెట్టి వానియాకరములను ఆధునిక నామములను సాధించుచున్నారు. ఇట్టివిమర్శను మన వారును ప్రారంభించి పురాణాదులలోని గిరినదిగ్రామాదులను గనిపెట్టవలయును. విమర్శయు పరిశోధనమును ప్రయోగింపకయే ఆప్తవాక్యముగ అనేకవిషయముల మన మంగీకరించుచున్నాము. ఒక యుదాహరణమును గొందము:—

రామాయణమున బాలకాండయందు వర్ణింపబడిన గంగావతారము ఇప్పటి గంగానదికి (Ganges) సరిపోవుచున్నది. ఆకాశమున నుండి గంగ, శివజటాజూటమునం జేరి యటనుండి విడువబడి బిందుసరమువంక కేగి ఏడు ప్రవాహములయినవట. వాల్మీకివాక్కునే యనుసరింతము.

తస్యాం విసృజ్యమానాయాం సప్తస్రోతాంసి జజ్ఞిరే,
హ్లాదినీ పావనీచైవ నళినీచ తథాపరా.
తిస్రః ప్రాచీం దిశం జగ్ముర్గంగా శ్శివజలా శ్శుభాః,
సుచక్షుశ్చైవ సీతాచ సింధుశ్చైవ మహానదీ.
తిస్రస్త్వేతా దిశం జగ్ముః ప్రతీచీంతు శుభోదకాః,
సప్తమీ చాన్వగా త్తాసాం భగీరథ మథో నృపమ్.

శంకరు శిరముననుండి బయలువెడలినగంగ యేడు పాయలై అందు మూడు పడమటి దిక్కునకును మూడు తూర్పుదిక్కునకును ప్రవహించినట్టులను యేడవనది భగీరథునివెంట నడచి సాగరగామియైనట్టులను దెలియుచున్నది. ఈ సప్తమ స్రోతస్సు యేదిక్కున జని సరిక్షితిం గూడెనో? ఇప్పటి గంగవలె ప్రాగ్దిశ యనునడుల హ్లాదిని, పావనీ, నళినిగాములలో జేరవలయునుగదా? పూర్వ పశ్చిమశాఖా పరిసంఖ్యాన ముదాహృతశ్లోకమున వివరింపబడియున్నది. భగీరథానుగామినియగు శాఖ వరించిన సముద్రు డెవడు? ఉత్తరమున కెదురెక్కుట యసంభవము. దక్షిణ దిక్కొకటియే మిగిలియున్నది. ఇపుడు లోకమంతయు గంగయని పూజించునది హిమాలయముననుండి కొంత దవ్వు దక్షిణమున కేగి యటనుండి పూర్వాభిముఖమయి తూర్పుదిశనే సముద్రము చేరుచున్నది. పరిశిష్టన్యాయముచే నిదియే భగీరథుడు దెచ్చిన గంగగ నుండవలయును. దక్షిణమునకు ప్రవహించి సముద్రము చేరినశాఖ యొకటియు లేదు.

గంగావతార ప్రశంస మార్కండేయ పురాణమునగూడ గలదు. "భవానీవిభుండు హిమవత్తంబుమీద నాగంగ విడిచిన నది యేడుప్రవాహంబులయ్యె. అందు మూడుప్రవాహంబులు పూర్వముఖంబులు మూడు ప్రవాహంబులు పశ్చిమ ముఖంబులు నై చని యుదధింగలసె. ఏకప్రవాహరూపంబున భగీరథురథంబు ననుగమించి దక్షిణ ముఖంబై "చని × × × గంగవనధి బొలుపుగ గూడెన్" యని ఆపురాణమునయున్నది. ఇప్పటి భాగీరథి యేదిక్కునబోయి సముద్రమును జేరుచుండు నదియు భూపటమునదెలియగలదు. దక్షిణదిక్కని చెప్పనలవికాదు. భగీరథునిగంగ యంతరించెనా లేక యర్వాచీనకాలమున ప్రాచీనపథము దప్పించి నదియా.

ఇట్లు సందిగ్ధవిషయము లనేకములు గలవు. ద్వాదశ లింగక్షేత్రముల ననుసరించి దిఙ్మాత్రముగ కొలది ప్రసంగ మిందు జేయబడియున్నది. భూగోళ శాస్త్రశోధకు లీవిషయమున దిగి పురాణేతిహాసాదులలో ప్రశంసింపబడియుండు పురగిరినద్యాది విమర్శచేయుట దేశచరిత్రకు గొప్పసహాయముగ నుండును. ఈవిషయమున బరిశ్రమ చేయుటకు విదేశీయులకంటె స్థలజ్ఞులగు దేశీయులకు సౌకర్యము లెక్కుడుగ నుండగలవు.



# దొంగాట

త్రిపురాన వేంకట సూర్యప్రసాదరాయ కవిగారు

"న మాతుం శక్యం మే నయనయుగ మాళీకరతలైః
తనుర్జ్యోత్స్నా చేయం విఘటయతి గాఢాంధ తమసమ్,
సఖీనా మాహూతిం విరచయతి మే గంధ నివహః
రుదంతీం తాం మాతా హసితవదనా చుంబతిముఖమ్."

క. చెలులకు నా కనుఁగవ చే, రలమిఱుఁ దమంబు నొడలి ప్రభయడఁచున్ మై
వలపు చెలులఁ బిలుచు నని పొ, గులు సుత మొగముఁ గన్ జనని నగుచు ముద్దిడియెన్.

చ. చెలులకు నాదుకన్నుఁగవ చేరల మూయఁగ రాని దయ్యె మై
నొలసెడు పండువెన్నెల లయో! విరియించెడుఁ జిమ్మ చీఁకటిన్
బిలుచుచునుండు నెచ్చెలుల మేనిసుగంధ మిఁ కేమి సేతు నం
చలయిక నేడ్చుకూఁతు వదనాబ్జము ముద్దిడుఁ దల్లి నవ్వుచున్.

## అచ్చ తెలుఁగు

సీ. కొలఁదిమీఱుచు నెచ్చెలులకుఁ జేరలమూయఁ, గారానిదయ్యె నా కన్నుదోయి
గాటంపుఁ జిమ్మచీకటులఁ జిమ్మెడునాదు, నెమ్మేని పండు వెన్నెలల తేట
ఇదె యిందు డాఁగె రారే యంచు బోటులం, బిలిచెడున్ నామేన నొలయుతావి
మొగముపై జుమ్మని ముసరుచున్ వీడక, వెంటాడి చీకాకు వెట్టుఁ దేఁట్లు
తే. ఆడుకొనుటకుఁ బనికిరావనిరి సకియ, లకట నేనేమి సేతునే యమ్మ! యనుచు
ముద్దులొలుక నేడ్చుచునున్న ముగుదకూఁతు, మొగముఁదమ్మిని ముద్దిడు నగుచుఁదల్లి.





# ఆంధ్రు లార్యులా??

మామిడిపూడి వేంకటరంగయ్య గారు, ఎం. ఎ.

సుప్రసిద్ధులగు చిలుకూరువీరభద్రరావు గారు "ప్రాచీనాంధ్రులెవ్వరు? ఆర్యులుకారా?" అనుశీర్షికతో ఈపత్రికలో ఇదివరకు ఆరువ్యాసములు ప్రకటించి ఇంతకు పూర్వ మెవ్వరికిని తెలియనిసంగతు లనేకములను తెలియపరచుచు నేను "శారద"యందును "సారస్వతసర్వస్వ"మందును సూచించిన అంశములను కొన్నిటిని ఖండించియుండుటచే వారిసిద్ధాంతములలోని సత్య మెద్దియో ఎరుగదలచి వారివ్యాసముల ననేకపర్యాయములు చదివి అందుపై నాకుతోచినఅభిప్రాయ ములను పాఠకులకు తెలుప ప్రయత్నించుచున్నాను. 1924 ఆగస్టు "శారదలో" వారు నన్ను గురించి ఈవిధముగ వ్రాసియున్నారు. "నేనొకవ్యాసమును భారతిలో బ్రకటించుటకు బ్రారంభించినతోడనే నేనుచెప్పదలచినదంతయు చెప్పనీయకయే .........నాసిద్ధాంతములను ఖండించుటకు దొరకొనిరి." కాని వారి ధోరణి చూడగా కొన్నిసంవత్సరములకుగాని వారిరచన పూర్తిగానట్లు తోచుచున్నది. "మనచరిత్రమంతయు మహాభారతమం దిమిడియున్నది. ఇది రెండువేలపుటలకు మించిన గ్రంథమగుచున్నది" అని వారు వారి మొదటివ్యాసమందు చెప్పియుండుటచేతను, ఇంతటిగ్రంథమును వ్యాసరూపముగ మాసపత్రికలో నప్పుడప్పుడు ప్రచురించినయెడల గ్రంథము ముగియుటకు చాలకాలము పట్టుటచేతను, వారి అభిప్రాయముల వైఖరి ఇప్పటికే చదువరులందరికి తెలిసియుండుటచేతను 'శారద'లో వారు నాకొరకుచేసిన హెచ్చరికను గమనించక నాయభిప్రాయములను వ్యక్తపరచుట కుపక్రమించితిని. ఇదిగాక, నే నీపనికిపూనుకొనుటకు వారు నన్నుగురించి చేసినఖండనమాత్రమే కారణముకాదు. వారిసిద్ధాంతములు విపరీతములుగ నుండుటయు, వారివంటిపండితులు 'చరిత్ర' యనుపేరుపెట్టి ఏమివ్రాసినను చెల్లుచుండుటచేతను, వారువ్రాసినవిషయములను గురించి పక్షాంతర మొక్కటి యున్నదనియు అది వ్యక్తమైనగాని వారివ్రాతలలో సిద్ధాంతము లనదగినవేవియో, వట్టిఊహ లనదగినవేవియో తెలుసుకొనుటకు వీలులేకపోవుటచేతను నే నీపనికి పూనితిని. "ప్రాచ్యులుగాని పాశ్చాత్యులలో మరియెవ్వరుగాని తెలుపని విషయములను భగవదనుగ్రహమువలన నేను దెలిసికొని మీకు దెలుపుట సంభవించుచున్నది," అని వారు తన్నుగురించి వ్రాసుకొనియున్నారు. నేను వ్రాయువిషయములంతటి గూఢములు కావు. అయినను పేలవములని

నామాటలను తృణీకరించక నావ్రాతను మన్నింప పాఠకులను కోరుచున్నాను.

1. వీరభద్రరావుగారిది పురాణపక్కి గాని చారిత్రకపక్కి కాదు. విష్ణుపురాణములు 'సర్వం విష్ణుమయంజగత్' అనియు, శివపురాణములు 'సర్వంశివమయంజగత్,' అనియు, ప్రతిపాదించుటకు పూనుకొనినట్లు వీరు 'సర్వ మంధమయం జగత్' అను సిద్ధాంతమును నెలకొల్పుటకు కంకణముగట్టుకొనియున్నారు. అందుచే వీరు వ్యాసములకు 'అంధపురాణ' మని పేరుపెట్టిన యోగ్యముగ నుండునని మనవిచేయుచున్నాను. 'ప్రాచీనాంధ్రులెవ్వరు? ఆర్యులుకారా?" అను ప్రశ్నకు సమాధానము చెప్పుటకుబదులు భరతఖండము లోనివారందరు ఆంధ్రులు (అంధులు) అని రుజువుచేయుటయే వీరి యుద్దేశమైనట్లు కనుపడుచున్నది. వీరిదృష్టికి కౌరవులు పాండవులు వైదేహులు లిచ్ఛవులు హైహయులు భార్గవులు ఆంగిరసులు వానరులు (రాక్షసుల గురించి వీరిఅభిప్రాయ మింకను తెలియలేదు) రామలక్ష్మణులు మున్నగువారందరు ఆంధ్రులే. ఆంధ్రులు కానివారు ప్రపంచమందు లేరు. వీరశైవము వీరవైష్ణవము వీరశాక్తము లోనగుమతములవలె వీరిది వీరాంధమతమని చెప్పతగి యున్నది. కావున పౌరాణికుల మార్గము ననుసరించి వీరు గ్రంథమువ్రాయుచున్నారని చెప్పవచ్చును. అప్రస్తుతాంశములనేకములను చేర్చుటచేత మనభారతరామాయణములు పురాణములు కడుదీర్ఘములైనట్లు శీర్షికలోనిప్రశ్నకు జబాబివ్వక తో ( ? ) విష యములనన్నిటిని చేర్చుటచే వీరివ్యాసము లింతటిదీర్ఘము లైనవి.

2. వీరిశీర్షికలోని "ప్రాచీనాంధ్రులెవ్వరు?" అనువాక్యమందలి "ప్రాచీన" శబ్దమునకు వీరు నిర్వచనము గావించలేదు. అందువలన చదువరులకు కొంతకష్టము సంభవించియున్నది. 'ప్రాచీన' మనగా వైదికయుగమా లేక బౌద్ధయుగమా లేక హూనుత్సాంగుకాలమా? ప్రాచీనమునకును నవీనమునకును ఎప్పటినుంచి వీరు హద్దు ఏర్పరచియున్నారు? ఈహద్దేదియో నిర్ణయించినగాని ప్రాచీనాంధ్రులార్యులో కారో చెప్పుటకు వీలులేదు. వీరిసిద్ధాంతమున యజ్ఞయాగాది కర్మలమూలమున మోక్షము వచ్చు ననుమతమవలంబించినవారు ఆర్యులు. ఆర్యులను మాట మతమును సూచించునదిగాని జాతిని సూచించునది కాదు. దీనినిబట్టి ఒకప్పుడు ఆర్యమతమును స్వీకరించనివారు కాలాంతరమున స్వీకరించుట అసంభవము కాదుగదా? ఋగ్వేదకాలమందు "ఆంధ్రులు" ఆర్యమతావలంబకులు గాక తర్వాత ఆర్యమతావలంబకులై యుండకూడదా? ఆర్యమతము కాలక్రమమున దేశమందంతట వ్యాపించెనని వీరభద్రరావుగా రంగీకరించి యున్నారు. దీనిని బట్టి బహుప్రాచీనకాలమున ఆంధ్రులార్యులు కారనియు క్రమక్రమముగ ఆర్యులైరనియు చెప్పుట వీలుపడుచున్నది. లిచ్ఛవులు విదేహులు అంగులు వంగులు లోనగువారి ప్రశంసను తమవ్యాసములలో విస్తారముగ తెచ్చిపెట్టుటకు "ప్రాచీనమున కేద్ది హద్దో నిర్ణయిం

పక పోవుటయే కారణము. ఇప్పటికాలమందు ఆంధ్రభాష మాటలాడువారును ఆంధ్రదేశమందు కాపురముండువారును ఆంధ్రులనిగదా మనము చెప్పుచున్నాము. ఈయాంధ్రులలో ఆర్యులెవరు? అనార్యులెవరు? విభజించి చెప్పుటకు వీలున్నదా?

"ఆర్య" లనుమాటకు వీరభద్రరావుగారు కల్పించిన అర్థము ననుసరించినయెడల వేదకాలమందలి ఆంధ్రులు ఆర్యులుకారనియే చెప్పవలసియున్నది. "కర్మయుక్తు లార్యులు కర్మహీనులు దస్యులు". "ఆర్యశబ్దమునకు గాని ద్రావిడశబ్దమునకుగాని చర్మములరంగులతోను రూపరేఖావిలాసములతోను సంబంధమెంతమాత్రమును లేదు. ఆర్యశబ్దము మతాచారకర్మలతో సంబంధించి వాఙ్మయమున వక్కాణింపబడినదై యున్నదిగాని కేవలము జాతిపరమైనదికాదు"అని వీరువ్రాసియున్నారు. వైదిక వాఙ్మయమందు ఆంధ్రులను గురించిన ప్రశంస ఐతరేయ బ్రాహ్మణమందొకచోట తప్ప మరియెచ్చటను గనుపించదు. ఆకాలపు ఆంధ్రులనుగురించి మన మెట్టిసిద్ధాంతముల ప్రతిపాదింపదలచినను వాటికన్నిటికిని ఆవాక్యమొక్కటియే ఆధారముగాని మరి ఆధారములులేవు. ఆవాక్యమందు ఆంధ్రులు పుండ్రులు శబరులు పుళిందులు మూతిబాలు దస్యులని చెప్పబడియున్నది. దీనినిబట్టి దస్యులార్యులైనయెడల ఆంధ్రులుకూడ ఆర్యులగుటయు దస్యు లార్యులుకాని యెడల ఆంధ్రులుకూడ ఆర్యులుకాక పోవుటయు సంభవించుచున్నది. దస్యు లార్యులా కారా? దస్యులను గురించి వీరభద్రరావుగారు ఈ విధముగ చెప్పియున్నారు. "ఇంద్రాగ్నులను దస్యులు పూజింపరు. అవ్రతులు అపవ్రతులు అన్యవ్రతులు అనగ్నిత్రులు అయజ్వులు అయజ్వానులు అబ్రహ్మలు బ్రహ్మద్విషులు అనింద్రులు అని దస్యులు ఋగ్వేదములో పలుచోట్ల వర్ణింపబడిరి." అనగా ఆర్యకర్మలను ధిక్కరించి మతాంతరము నవలంబించినవారలేకదా దస్యులు. ఈదస్యులలో నొక్కరగు ఆంధ్రులు ఆర్యులుకారని దీనినిబట్టి స్పష్టమగుచున్నది. ఈకాలమున హిందువులకు మహమ్మదీయులకు ఎట్టిభేదము కలదో అట్టి భేదమే ఋగ్వేదకాలమున ఆర్యులకును దస్యులకు నుండెను. ఏకకాలమందొకడు హిందువుగను మహమ్మదీయుడుగను ఎట్లుండగలడు? అదేవిధమున దస్యులు ఆర్యులు కాజాలరు; ఆర్యులు దస్యులు కాజాలరు. ఆంధ్రులు దస్యులలో నొకశాఖవారనితప్ప వారిని గురించి మరేమియు మనకు తెలియదు. చదువరులను భయపెట్టి లేనిపోనిగడబిడ చేయుటకై వీరభద్రరావుగారు ఇంతటిగ్రంథమును కల్పించిరేకాని 'ఆర్య' 'దస్యు' శబ్దములకు వారుచేసిన అర్థమునుబట్టి ఆంధ్రు లార్యులు కారనుట నిర్వివాదాంశము.

వారివ్యాసములలో ఈసందర్భమున మరియొకచిత్రముగూడ కన్పించుచున్నది. పైనుదాహరించినవాక్యములో దస్యులు అనింద్రులని అంగీకరించుచు అయిదవవ్యాసములో ఏకారణముచేతనో "ఆంధ్రులర్యులలోనివారని యునుఉత్తరకురుభూములలో వీరు నివసించ

నపుడుబుగ్వేద వైదికార్యమతము మొలకెత్తిన దీయాంధ్ర సంఘములోనే యనియును నాయభిప్రాయము" అని చెప్పియున్నారు. అనింద్రత్వమే ప్రధానలక్షణముగాగల దస్యులలో నొకరగు ఆంధ్రులయందు ఇంద్రోపాసనమే ప్రధాన లక్షణముగాగల వైదికార్యమతము మొలకెత్తినదని చెప్పుట హాస్యాస్పదముకదా ఇట్టి పరస్పరవిరుద్ధములగు వాక్యములెన్నియో వీరివ్యాసములందుండుటచే వీరినిశ్చితాభిప్రాయ మిదియని చెప్పుటకు వీలులేకున్నది. బహుశః వీరి కింకను ఈవిషయమై నిశ్చితమగు అభిప్రాయము కుదురలేదేమో యనుసందేహముకూడ కలుగుచున్నది.

తమసిద్ధాంతమును రుజువుపరుచుటకువీరు మరియొకమార్గము నవలంబించి ఆర్యులు నాగరికులనియు దస్యులుకూడ నాగరికులే అనియు అందుచే ఆర్యులు దస్యులు ఒక్కరే అనియు చెప్ప సాహసించిరి. చీనాదేశస్థులు నాగరికులు; ఇంగ్లీషువారుకూడ నాగరికులు. దీనినిబట్టి చీనావారును ఇంగ్లీషువారును ఒకే జాతివారని నిర్ణయించుటకు వీలుకలుగునా? ఇదిగాక ఒకే జాతియందు పుట్టినవారిలో కొందరు నాగరికులుగను మరికొందరనాగరికులుగను ఉండవచ్చును. దానినిబట్టి నాగరికులందరొక్కజాతియనియు, అనాగరికులు మరియొకజాతివారనియు చెప్పుట యుక్తియుక్తమా?

ఇట్లే వీరు ఐరేనియన్‌భాషలో దస్యుశబ్దమునకు గల అర్థమును పురస్కరించుకొని ఆంధ్రులకును ఆర్యులకును ముడిబెట్టచూచిరి. "ఐరేనియన్ రాజగు డెరయసు" శాసనములో దస్యు శబ్దమునకు ప్రజలని అర్థమట. వేదభాషలోని విట్శబ్దమునకు గూడ నిదియే అర్థము. అనగా 'విశు'లు "దస్యు"లు ఒకరే. విశులనగా వైశ్యులు. వైశ్యులార్యులు. కావున దస్యులుకూడ ఆర్యులె". ఈ వాదములో రెండులోపములు కనబడుచున్నవి. మొదటిది వేదభాషయందు దస్యుశబ్దము విట్శబ్దముతో సమానార్థకముగ వాడబడియుండలేదు. డెరయసుకు సుమారు రెండువేల సంవత్సరములకు పూర్వ మెప్పుడో రచింపబడిన ఋగ్వేదములోని దస్యుశబ్దమునకాకాలము (ఋగ్వేదకాలమున) న ఎట్టి అర్థముండెనో మనకు స్పష్టముగ తెలియుచుండగా ఆయర్థమును వదలి డెరయసు కాలమునాటి అర్థమును గ్రహించుట యుక్తమా? దస్యుశబ్దమును డెరయసు ఏ అర్థమున వాడెనో ఆయర్థమందు ఋగ్వేద ఋషులు వాడియుండలేదు. రెండవలోపమేమనగా: డెరయసుకుపూర్వము దస్యుశబ్దము ఐరేనియన్‌భాషలో 'శత్రువు' 'శత్రుదేశము', 'రాష్ట్రము' అను అర్థములలో వాడబడియున్నది. ఐరేనియన్‌లోని దస్యుశబ్దమునకును వేదభాషలోని దస్యుశబ్దమునకును సంబంధము కలుపగోరినయెడల 'శత్రువు' అను అర్థమున ఆరెండుభాషలలో నాపదము లుపయోగింపబడిన ట్లూహించుటయే సమంజసము. శత్రుత్వ ముండుటచేతనే ఆర్యేతరులను ఆర్యులు దస్యులనిపిలుచుట సంభవించెను. వీరభద్రరావుగారు కల్పించినఅర్థము నవీనము

గాని ప్రాచీనముగాదు. (Vedic Index Vol. 1, P348-9)

3. ఈవ్యాసములను వ్రాయుటలో మతమందును నాగరికతయందును ఆంధ్రులార్యులతో సమానులని నిరూపించుటమాత్రమే కాక ఆంధ్రులు ఆర్యులు ఒకేజాతివారని రుజువుపరుచుటకూడ వీరభద్రరావుగారి యుద్దేశమని తోచుచున్నది. 'జాతి' యనుమాట నొక్కొక సందర్భమున నొక్కొక అర్థమందు మనము వాడుచున్నను 'రక్తసంబంధముగల ప్రజాసముదాయము' అను అర్థమందు వీరభద్రరావుగారు వాడదలచినట్లు తెలియుచున్నది. 'జాతి' శబ్దమునకు శాస్త్రీయమగు అర్థముకూడ నిదిగనే. ఒకప్రదేశములో నివసించుచుండువారందరు సజాతీయులా కారా, పరస్పర రక్తసంబంధముకలిగినవారా కారా, అనుదానిని నిర్ణయించుటకాధార మేదైన ఉన్నదా? పాశ్చాత్యదేశములందలి జాతిశాస్త్రజ్ఞులు శరీరముయొక్క బాహ్యలక్షణములలో కొన్నిటినిబట్టి ఈనిర్ణయమును చేయవచ్చునని చెప్పుచు, ఈమార్గము ననుసరించి మానవకోటిని కొన్నిజాతులుగ విభజించియున్నారు. ముఖము ముక్కు కండ్లు తల మొదలగువాటియొక్క పోలికలనుబట్టి సామాన్యముగ ఒకరొకరికి గలరక్తసంబంధమును మనము నిరూపించుచుందుము. ఒకేవంశమందు పుట్టినవారందరిలో సమానలక్షణములు కొన్ని కనుపించుచుండుటచేత, సమానశరీరలక్షణములు గలవారగు కొందరిని మనము చూచినపుడు (వారు ఒకేవంశమందు పుట్టినట్లు మనకు గ్రంథాధారము లేవియు దొరకకపోయినను) వారు సజాతీయులేయని చెప్పుటకు సాహసించుచుందుము. శరీరలక్షణములందు ఎట్టి సాదృశ్యముగాని లేనపుడు ప్రాచీనగ్రంథము లేమిచెప్పినను అట్టివారు సజాతీయులని సిద్ధాంతపరచుట అశాస్త్రీయము. ఈ'జాతి'శాస్త్రము యొక్క సంప్రదాయముల నన్నిటిని విపులముగ చర్చించుటకు తగినయవకాశ మిచట లేనందున ఈవిషయము నింతటితో నిలుపుచున్నాను. "జాతి" అనగా ఏమియో వీరభద్రరావుగారు స్పష్టపరచియుండినయెడల ఈ ప్రశంసకూడ అక్కరలేకయే యుండియుండును.

ఆంధ్రులు ఆర్యులు ఒకేజాతివారని నిశ్చయించుటకు వీరభద్రరావుగారు రెండు మార్గము లవలంబించిరి (1) "ఆర్యజాతులవారికంటె దస్యులు భిన్నజాతులవారని తెలుపుశబ్దప్రయోగములు (వేదమునందు) గానరావు. కాబట్టి ఆర్యులు ఆంధ్రులు సజాతీయులుగాని విజాతీయులు కారు. దీనినిగురించి నేను 'శారద' లో విమర్శించి యుండుటచేత ఇప్పుడిచట విపులముగ వ్రాయుట మానుచున్నాను. ఆంధ్రులు ఆర్యులు సజాతీయు లని తెలుపుశబ్దప్రయోగములు వేదమందున్నవా? లేనప్పుడు మనము వారు సజాతీయులేయని ఎట్లు నిశ్చయించగలము? (2) ఆర్యులలో చేరియుండు తెగలవారు కొందరు ఆంధ్రజాతీయు లగుటచే ఆంధ్రులుకూడ ఆర్యులని వీరభద్రరావుగారి వాదము. ఈతెగలవారిలో నెవరైన నిజముగ ఆంధ్రులగుదురో మనము విమర్శించి చూడవలెను.

I. "ధృతరాష్ట్రుడు జాత్యంధుడని చెప్పబడి యున్నాడు. జాత్యంధుడనగా జాతిచే అంధుడు లేక అంధ్రుడు (ఆంధ్రుడు). ధృతరాష్ట్రు డాంధ్రుడైనయెడల అతని పూర్వు లగు కౌరవులుకూడ ఆంధ్రులే. కౌరవులు భారతులు. భారతు లార్యులైనట్లు వేదములు చెప్పుచున్నవి. కనుక ఆంధ్రులుకూడ ఆర్యులే." ఈసందర్భమున పాఠకులు రెండు మూడు విషయములను గమనించవలెను. (1) జాత్యంధుడనగా అంధజాతి వాడను అర్థము వీరభద్రరావుగారు క్రొత్తగా కల్పించినారు. పురాణములు స్మృతులు కావ్యములు వేదములు మొదలగు సంస్కృత గ్రంథములందెచటను ఈయర్థముతో ఆమాట వాడబడి యుండలేదు. మహాభారతమును రచించిన వాడు ధృతరాష్ట్రుడు ఆంధ్రుడని చెప్పగోరిన యెడల ద్రావిడప్రాణాయామము రీతిగ ఇట్టి చుట్టుత్రోవనేల నడచును? (2) సంస్కృతమందు 'అంధ' పదమునకును, 'అంధ్ర' పదములకును సంబంధము లేదు. 'అంధ్ర'శబ్దమునకు మారుగ 'అంధ' శబ్దము ఏకవిగాని ప్రయోగించియుండలేదు. సంస్కృతపదమగు 'అంధ్ర'ము ప్రాకృతము 'అంధ'గ మారుట కలదుగాని సంస్కృతభాషలోనే 'అంధ' 'అంధ్ర' శబ్దములు సమానార్థకములు కావు. (3) ధృతరాష్ట్రుడు అంధజాతివాడుగాని సిజముగ గ్రుడ్డివాడు కాడని వీరభద్రరావుగారు చెప్పిరిగదా? అట్లైనయెడల మహాభారతములోని కథకంతకుగూడ విపరీతార్థ మేదియైన కల్పింపవలసియుండును. వ్యాసమహర్షి తల్లి యగుసత్యవతిచే ప్రేరేపింపబడి సంతానమును ప్రసాదించుటకై అంబికవద్దకు వెళ్లినపు డామె,

"భయా త్కాశీసుతా తంతు నాశక్నో దభివీక్షితుమ్"

(భయమువలనచూచుటకు శక్తిలేనిదయ్యెను); అందుచే

'కింతు మాతుః సవైగుణ్యా దంధఏవ భవిష్యతి,'

(కుమారుడు తల్లిదోషమువలన గ్రుడ్డివాడు కాగలడు)అని భారతముచెప్పుచున్నది. 'అంధఏవభవిష్యతి'అనువాక్యములోని అంధశబ్దమునకు అంధజాతి-ఆంధ్రుడు-అను అర్థమే యుచితమైనయెడల 'మాతృవైగుణ్యమునకును' ఆమె చూడలేకపోవుటకును ధృతరాష్ట్రు డంధజాతివాడగుటకును గల కార్యకారణసంబంధ మెద్ది? అంధుల (అంధ్రుల) మాత లందరికి నేదైన వైగుణ్యము కలదా? ఇదిగాక సత్యవతి 'అంధఏవభవిష్యతి' అనువాక్యమును విన్నతోడనే

'నాంధః కురూణాం నృపతి రనురూప స్తపోధన!
......ద్వితీయం కురువంశస్య రాజానం దాతుమర్హసి'

అని చెప్పెనుగదా? ధృతరాష్ట్రు డాంధ్రుడగుట వ్యాసుడు అంబాలికకు పుత్రదానము చేయుటలో నెట్లు కారణమగును?ధృతరాష్ట్రు డంధుడగుటయు, అంధుడు కౌరవులకు రాజుకాదగిన వాడు కాకపోవుటచేతను 'అంబాలికయందు మరియొక కుమారుని బడయు'మని సత్యవతి చెప్పెను. ఈ వాక్యములో 'అంధు' డనగా 'ఆంధ్రు'డనిస్థిరపరచినయెడలవాక్యమునకంతకు ఏమి అర్థము చెప్పదగియుండును?ధృతరాష్ట్రుని వివాహసందర్భములో మహాభారతమున:

గాంధారీ త్వథ శుశ్రావ ధృతరాష్ట్ర మచక్షుషమ్,
ఆత్మానం దిత్సితం చాస్మై పితా మాతా చ భారత!
తత స్సా పట మాదాయ కృత్వా బహుగుణం తదా,
బబంధ నేత్రే స్వే రాజ! పతివ్రత పరాయణా.

అని చెప్పబడియున్నది. ధృతరాష్ట్రుడు కండ్లులేని వాడగుటచే గాంధారి పతివ్రత గావున నేత్రపటంబు గట్టుకొనెనని స్పష్టమగుచున్నది. పైశ్లోకమందలి 'అచక్షుషం' అను పదమునకు వీరభద్రరావుగారు ఏయర్థమును కల్పింతురో! ఆంధ్రులలో స్త్రీలందరు నేత్రపటముల గట్టుకొని యావజ్జీవము గడపుట ప్రాచీన కాలమం దాచార మైయుండెనా? భీష్మపర్వ ప్రారంభమున వ్యాసుడు ధృతరాష్ట్రునితో

"క. కాలంబగుటయు నృపులకు
నాలము సమకూఱె దీని కడలకు మది నీ
వాలోకింపగవలసిన
నీలోనికి దివ్యదృష్టి నిచ్చెదఁ బుత్రా!"

అనిచెప్పుటయు తర్వాత

"చ. అనుడు నతండు ఘోరముగ
నన్నలు దమ్ములు పోరఁ గ్రూరతన్
గనుఁగొనజాల నేను వినఁ
గా వలతుం దదనుగ్రహంబు సే
సినఁ గడు లెస్సయన్న ముని
చిత్తమునం గరుణించి సంజయుం
బనిచె మహారణంబు పరి
పాటిమెయిన్ సకలంబుఁ జెప్పఁగన్."

అనియు తెలుపబడియున్నది. ఇట్టి కథాసందర్భములనెన్నిటినైన భారతమునుండి చూపించవచ్చును. మహాభారతకథకంతకు ధృతరాష్ట్రుని గ్రుడ్డితనమే పునాదియై యున్నది. అత డంధుడుగాక ఆంధ్రజాతీయుడే అయినయెడల ఇంతటికథ కవకాశమే లేదు. ఆంధ్రులలో ప్రాచీన కాలమందు అంతఃకలహములు నైజములని చెప్పవలసి యుండును.

(4)"ధృతరాష్ట్ర స్స్వచక్షుష్ట్వా ద్రాజ్యం నప్రత్యపద్యత" అని అంధుడగుటచేత ధృతరాష్ట్రుడు రాజ్యమును బొందలేదని చెప్పినకారణము అంధజాతులవారి కాకాలమున ప్రజాసత్తాకరాజ్యమునం దుండెడియభిలాష చేతనే కాని మఱియొండుకాదు," అని వీరభద్రరావుగారు వ్రాసిరి. అంధుడనగా ఆంధ్రుని అపార్థముచేసిన చేయవచ్చునుగాని 'అచక్షుష్ట్వాత్' అనగా ఆంధ్రుడగుటవలన అనుఅర్థ మెట్లుపొసగును? ధృతరాష్ట్రునికాలమున అంధజాతులవారిది ప్రజాసత్తాకరాజ్యమనుటకు ప్రమాణములు లేవు. "జయస్వాలుగారు తమ్ముదాము పరిపాలించుకొను (Republican) కులములలోనుండి శాతవాహను లేర్పడిరని యైతిహ్యమువలన బోధపడుచున్నది," అనివ్రాసినవాక్యము వీరభద్రరావుగారికి గలప్రమాణము. శాతవాహను లాంధ్రులో కారో నిస్సంశయముగ మనము చెప్పలేము. ఇదిగాక జయస్వాలుగారు పైవాక్యమును ఎప్పటిఆంధ్రులగురించి వ్రాసిరో తెలియుటలేదు. వేదయుగమునకును ధృతరాష్ట్రునికాలమునకును మధ్యను ఆంధ్రుల రాజకీయపద్ధతులలో మార్పులులేవా? ఆలోచించి చూచినయెడల ధృతరాష్ట్రునికాలము నాటిఆంధ్రులు ప్రజాసత్తాకరాజ్యముగలవారను అభిప్రాయము నిరాధారమైనదని స్పష్టమగును. వారు ఏకనాయక (Monarchical) ప్రభుత్వమునకు లోబడినవారనుట నిర్వివాదాంశము.

"నాంధః కురూణాం నృపతి రనురూప స్తపోధన!"
"ద్వితీయం కురువంశస్య రాజానం దాతుమర్హసి"

అను పై నుదాహరింపబడిన శ్లోకభాగముల అభిప్రాయమేమి? కౌరవులకు రాజులు కలరనియు, గ్రుడ్డివాడు రాజ్యార్హుడు కాడనియు, అంధుడు కానివాడు రాజు కాదగినవాడనియుగదా అర్థము? రాజే లేనిపక్షమున

"ద్వితీయం కురువంశస్య రాజానం దాతుమర్హసి"

అని చెప్పవలసిన అగత్యము లేకుండును. ఇదిగాక ధృతరాష్ట్రుని పూర్వులలో యయాతి దుష్యంతుడు భరతుడు శంతనుడు మొదలగువారు రాజులు కారా? "ఆసేతు హిమాచలమధ్యస్థమైన యీ భూభాగమునకు నెవ్వనినామముచేత భరతవర్షమని పేరు గలిగెనో యట్టి మహాచక్రవర్తియైన భరతునకు మంత్రియై మహాపట్టాభిషేకము గావించినవాడే దీర్ఘతమస్సు," అని వీరభద్రరావుగారే వ్రాసియున్నారు. కౌరవులకు రాజే లేనియెడల భరతుడు చక్రవర్తి యగుటయు దీర్ఘతమస్సు అతనికి పట్టాభిషేకము గావించుటయు కల్లగదా? (5) సహదేవుని దిగ్విజయము సభాపర్వమున వర్ణింపబడి యున్నది. అందు అతడు దక్షిణదిక్కున ఆంధ్రులను వశపరచుకొనినట్లు తెలియుచున్నది. కథాసందర్భమునుబట్టి ఆంధ్రులుకౌరవులకంటె భిన్నులని స్పష్టమగుచున్నది. ధృతరాష్ట్రుడాంధ్రుడైనయెడల సహదేవుడుకూడ ఆంధ్రుడే యగును. అప్పుడు ఆంధ్రులు హస్తినాపట్టణ ప్రాంతవాసు లగుదురుగాని దాక్షిణాత్యులు కాజాలరు. ఇదిగాక ఆంధ్రుడగు సహదేవుడు ఆంధ్రులవశపరచుకొనెనని చెప్పుటలో సారస్యమేమి కలదు?

దీనినంతనుబట్టి జాత్యంధుడనగా గ్రుడ్డివాడనియేకాని అంధజాతివాడు కాదనియు, ఆంధ్రులకును కౌరవులకును ఏవిధమగు సంబంధము లేదనియు స్పష్టమగుచున్నది.

II. దీర్ఘతమస్సను ఋషి అంధజాతివాడని చెప్పుటకూడ ఇట్టిదే. "అంధఋషి (దీర్ఘతమస్సు) నిజముగా గ్రుడ్డివాడు కాడు. జాత్యంధు డనగా బుట్టు గ్రుడ్డివాడని యిటీవలి వ్యాఖ్యాతలు అర్థములు వ్రాసియున్నారు. జాత్యంధుడనగా నంధజాతివాడని యర్థముచేసికొనవలయును." అని వీరభద్రరావుగారి అభిప్రాయము. ఇందులోని 'ఇటీవలి'శబ్దము నిరర్థకము. ప్రాచీనవ్యాఖ్యాతలలో నెవరు గూడ 'అంధజాతివా'డను అర్థము వ్రాసియుండలేదు. ఈవ్యాఖ్యానమునకు కర్త వీరభద్రరావుగారే. నవీనులుగాని ప్రాచీనులుగాని వీరితో ఏకీభవించినవా రొక్కరుకూడ లేరు.

దీర్ఘతమస్సుని చరిత్రములో వీరభద్రరావుగారు ప్రధానాంశముల నాలుగింటిని చెప్పిరి. బృహస్పతి అతనిని అంధుడగునట్లు శపించుట మొదటి అంశము. అంధుడనగా గ్రుడ్డివాడు. కానియెడల ఇది శాపమెట్లగును? అంధజాతిలో పుట్టుటయే శాపఫలమైనయెడల ప్రాచీనకాలపు అంధులు (ఆంధ్రులు) నీచజాతివారని చెప్పవలసివచ్చును. దీర్ఘతమసునిభార్య అంధుడని అతని నిరాకరించుట రెండవఅంశము. గ్రుడ్డివాడై కుటుంబ

పోషణము చేయలేకపోవుట అతని నిరాకరించుటలో యుక్తమగుహేతు వగునుగాని అతడు అంధజాతివాడగుట అట్టిహేతువగునా? హేతువే అయినయెడల ప్రాచీనకాలపు ఆంధ్రస్త్రీలలో పాతివ్రత్యము సదాచారముగ గణింపబడలేదని చెప్పవలసివచ్చును. ఇది మిక్కిలి అసంగతము. బలియొక్కభార్య అంధుడని దీర్ఘతమస్సును సంతానార్థమై పొందలేదనియు, అతనివద్దకు తనదాసిని పంపెననియు చెప్పబడియున్నది. అంధుడగుటవలన ఆమె అతనియందయిష్టముచూపెనని చెప్పుట సంగతముగాని అంధజాతివాడగుటచే అట్లుచేసెనని చెప్పుట తగదు. నియోగపద్ధతిని సంతానము బడయుటకు అంధజాతి బ్రాహ్మణులు పనికిరారా? ఇన్ని అసంగతములతోగూడిన వ్యాఖ్యానమును కల్పించి అంధుడుకాని దీర్ఘతమస్సును ఆంధ్రుడని రుజువుచేయ ప్రయత్నించుట నిరర్థకవ్యాపారము. ఇతిహాసములోని ముఖ్యోద్దేశ మెద్దియో దానికనుగుణముగ అందులోని వాక్యములకును మాటలకును అర్థము చెప్పవలెనుగాని అపార్థముచేసి ఆయుద్దేశమును చెడగొట్టుటఎన్నటికిని న్యాయము కాజాలదు.

III. హైహయులు శాపముచే జాత్యంధులైరని చెప్పబడియుండుటచే వారుకూడ ఆంధ్రులని వీరభద్రరావుగారి మతము. శాపమువలన అంధజాతివారైరనిచెప్పుట అపార్థమని పైన చెప్పియున్నాను. కాని వీరు అంధజాతివారనుటకుమరియొక కారణమును రావుగారు చెప్పియున్నారు. "ఈకథలో చెప్పబడినట్లు హైహయాది క్షత్రియులు నిజముగా దృష్టిని పోగొట్టుకొన్న గ్రుడ్డివారే యైనయెడల గిరిదుర్గములలో విచ్చలవిడిగా సంచరించుచుండిరని ప్రకృతిస్వభావమునకు విరుద్ధముగ గ్రంథకర్త యెట్లు వ్రాయగలడు? కాబట్టి యీ క్షత్రియులెల్లరు నంధజాతివారే. వీరాంధ్రులే" అని పురాణగాథలో స్వభావ విరుద్ధముగ నిదియొకటి మాత్రమే రావుగారికి తోచెను కాబోలు! కార్తవీర్యార్జునునికి సహస్రబాహువు లుండుటయు కుల సంరక్షణార్థము గర్భవతియగు స్త్రీ గర్భములోని పిండమును తనయూరువులో దాచికొనుటయు, తొడలోనుండి పుట్టినబిడ్డడు పుట్టినవెంటనే హైహయులకు శాపమివ్వ గలుగుటయు—ఇవి స్వభావసిద్ధము లగుటయు, అంధులు సంచరించుట స్వభావవిరుద్ధము కాకపోవుటయు నెట్లు? పురాణములలోనికథలన్నియు ఇట్టివే. వాటికి ప్రకృతివిరుద్ధముగాని అర్థమును కల్పింపబూనుట వ్యర్థప్రయత్నము.

IV. వానరులు ఆంధ్రు లగుటగూడ మిథ్యయే. "హనుమంతుడు పవనపుత్రుడనియే వక్కాణింపబడి యుండెను. ఆంధ్ర పహ్లావ లేక ఆంధ్రపహ్నవయొక్క ప్రాకృతభాషారూపమే అంధపవన యనునది" అని రావుగారు వ్రాసిరి. పురాణములలోను చరిత్రగ్రంథములలోను పహ్లావులయొక్కయు పహ్నవులయొక్కయు ప్రశంసగలదు గాని ఆంధ్రపహ్లావులయొక్కగాని ఆంధ్ర పహ్నవుల యొక్కయు ప్రశంస కానరాదు. నిరాధారమైన 'ఆంధ్ర' శబ్దమును ఇచట తెచ్చిపెట్టి

టకు కారణమేమియో ? పహ్లావులు పహ్నావులు గ్రుడ్డివారు (అంధులు) కారు. స్వచ్ఛమగు దృష్టిగలవారు. అట్టివారికి అంధత్వభాగ్య మెట్లుకల్పించుటయో తెలియకున్నది. పహ్నవశబ్దము పవనశబ్దముగ నేసూత్రమును బట్టి మారినదో? ఇంతకు పహ్నవులాంధ్రులు కారుగదా ? హనుమంతుని పవనపుత్రుడని మాత్రమేనా వక్కాణించియుండుట. తక్కిన దేవతలవలె అతనికిగూడ నూటయెనిమిది నామములో సహస్రనామములో యున్నవి. వాలి జాత్యంధుడని చెప్పుటగూడ నిట్టిదే. పాపము ! రావుగా రతనికి అంధత్వము తీసుకొనివచ్చి పెట్టిరి. "జాత్యంధుడు జాత్యంధులతో కలసి ఆలోచించులాగున (నిష్ఫలముగ) చపలుడగువాలి చపలులగువానరులతో ఆలోచించుట" అని శ్లోకార్థమైయుండ వాల్మీకి ఏదో యొకవిధముగ వాలి జాత్యంధుడని సూచింపనలె ననుకొనినటుల రావుగారు వ్రాసిరి. వాల్మీకికి సంస్కృతభాష రాదు కాబోలు ! తన యభిప్రాయమును స్పష్టపరచుటకు తగిన శక్తి అంతటి మహాకవికి లేదేమో ! సీతను వెదకుటకై వానరులను నానాదేశములకు పంపినపుడు ఆంధ్రులదేశములకుగూడ వెళ్లవలసినదని సుగ్రీవుడు వానరుల నాజ్ఞాపించెనుగదా ? తా నాంధ్రుడగుటయు తనదేశ మాంధ్రదేశమగుటయు వానరులందరు ఆంధ్రులగుటయు నిజమైన యెడల ప్రత్యేకముగ ఆంధ్రులదేశము మరియొకటియున్నట్లు అతడేలసూచించెను? రావుగారి వైపరీత్యములలో చదివి ఆనందించవలసిన వైపరీత్యము మరియొకటియున్నది. వాలి సుగ్రీవులాంధ్రులని యొకచోట జెప్పి మరియొకచోట వారు శాకబ్రాహ్మణులని వచించెను. శాకబ్రాహ్మణులనగా మృగాబ్రాహ్మణులు ; మృగాబ్రాహ్మణులే మగాబ్రాహ్మణులు. మర్గియానా పార్థియా మేదియా మొదలగు దేశములయందు పురోహిత కార్యముల నిర్వర్తించువారిని మగీ లేక మగాలనుచుండిరి; అనిరావుగారి అభిప్రాయము. మగాలు ఆంధ్రులైనయెడల ఇప్పటిపారసీక దేశమందుకూడ ప్రాచీనకాలమున ఆంధ్రు లుండిరని తేలుచున్నది. ఇదివరకు భరతఖండవాసులు మాత్రమేఆంధ్రులనిఅనుకొనుచుంటిమి.ఆంధ్రత్వము ఇప్పుడు విదేశములకు కూడ ప్రాకినది.

నా విమర్శ ఇప్పటికే దీర్ఘమైనది. నేను వ్రాయవలసిన విషయములింకను ఎన్నియో యున్నవి. రావుగారివంటి దేశాభిమానులు మనదేశమందు కొందరుకలరు. చారిత్రకాంశము లడ్డదిడ్డముగ చేసినగాని తమదేశాభిమానమునకును సార్థకము లేదని ప్రమాణములున్నను లేకపోయినను నూతన సిద్ధాంతముల చేయుటయే వారియుద్దేశము. తమిళులలో కొంద రిట్టివారు కలరు. ప్రపంచములోనిభాషల కన్నిటికి అరవభాషయే మూలమనియు, మానవకోటి కాదిమనివాసము సృష్ట్యాదిలో అరవభూమియనియు, సంస్కృతాది వాఙ్మయములకు అరవ మాధారమనియు తమిళ దేశాభిమానులవాదము. ఏసుక్రీస్తు అరవములో మాటలాడినాడట ! ఇట్టి దురభిమానమును విడిచినగాని యథార్థము బయల్పడజాలదు. చరిత్రగ్రంథముల వ్రాయగోరువారు సత్యమందే దృష్టిగలిగి తమకార్యముల నిర్వహింతురుగాక.



# రాగము

గాధావఝుల రామావధానిగారు

ముద్దుఁగొలిపెడు నెలమావిమోకతలిరు
టాకు జొంపాల మెసవు నాకోకిలంబు
కావిదేలిన గొంతు సాకారమునను
విశ్వమోహన రసపుంజ మృదులగీతిఁ
బాడుకొనుచుండ జల్లనె పాంథు నెడఁద
బిసకిసాలయచ్ఛేదప్రవృత్తి వీడి
స్వాదుపాథేయములు మాని సంచరించు

* * * *

2 నీలనీరంధ్ర కాదంబినీ గణంబు
చదలఁ బర్వఁగ బారులౌ చాతకముల
రాగమహిమను గొని యాడె రక్తినూని
వేయికన్నులు వికసింప వెఱ్ఱినెమ్మి
నెమ్మితోడ నానందనృత్యమ్ము సలిపె

* * * *

3 కలితగంగాపగాతరంగములయందు
జలజ విస్తృతషట్పదశ్రావ్యగీతి
మగ్నమై యంచపెండు మైమఱచియుంట

* * * *

4 చారుసితశీతచంద్రికాపూర్ణమైన
శారద మనోజ్ఞయామిని నీ సమయమందు
శీతకిరణుని యమృతప్రసేచనమున
జొక్కి తిరుగాడు వెన్నెల పక్కిగముల
గాంచి యిదియేమొ జక్కవ కవను వీడె.

* * * *

5 నిబిడనీరంధ్రకంటకావృతము నగుచు
ప్రతిపదన్యాసశృంఖలాప్రాయ మగుచు
క్రూరమృగరావభయదసంకులము నైన
కఠినరాక్షస సంసారగహనమందు
దారిఁ గానక తిరుగాడువారు ప్రేయ
సీ కటాక్షామృతంబు భుజించుచుంద్రు.



# సూత్రకాలవ్యవసాయచరిత్ర

పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి గారు

(రెండవ సంపుటము రెండవసంచిక తరువాయి)

(1) భూమి ప్రజలదేగాన, రాజు భూమిని దానముఁ జేయరాదు.

(2) సార్వభౌమున కన్నిటిని దానముచేయుట కధికారముగలదా? యని సంశయము. భూమినీయవచ్చునా? (కాదని చెప్పుచున్నాడు) ఎట్టిభూమి? మట్టి మొదలు భూగోళమంతయు భూమియే. అందువలన నొకపొలమే కాదు. మట్టిమాత్రమే కాదు. (ఈ యారవపాదాది యందు సార్వభౌముఁడు తన యాస్తినంతయు నీయవచ్చునని చెప్పుటచేతను) అందువలన నేమి తేలినది? ప్రభువునకు భూమియందు "స్వత్వ" మున్నదిగాన, తప్పక భూమిని దానమీయవచ్చునని. స్వత్వత్యాగము మానసికముగా యుక్తమైనదేను కాని భూమి విషయమై రాజునకు స్వత్వము లేదని చెప్పుచున్నాము. ఎందువలన ననగా, ప్రతి పొలమునకు యజమానులు వేఱుగనున్నారు. అందువలన రాజు ప్రత్యేకక్షేత్రముల నన్యాధీనముఁ జేయుటకు నధికారి కాఁడు. తన పృథివీభాగము నంతయుఁ గూడ నన్యాధీనము జేయుట కర్హుఁడుకూడ కాఁడు. ఎందువలన ననగాఁ ఎంతవరకు సార్వభౌమత్వ మనుభవింపఁబడునో అంతవరకే భూమిపై నాతని కధికారము కలదు కాని, పిమ్మట లేదు. సార్వభౌమునకు భూమియం దొకయధికారము మాత్రము విశేషించి కలదు. అదేది? వ్యవసాయకులు పండించిన దానిని, శత్రువులు కొనిపోకుండగ రక్షించుటచేతను పండినదానిలో నిర్దిష్ట భాగమునకుమాత్రమె రా జధికారియై యున్నాఁడు. కాని భూమి కధికారికాఁడు. ఆభూమియందుండిన మనుష్యులకు ప్రాణి సాధారణమునకు భూమ్యధికారము కలదు. కాన భూమిని రాజు దానమీయ నర్హుఁడు కాఁడు.

(3) ఈభూమిని రాజు దానము చేయవచ్చునా కూడదా? భూమి సార్వభౌముని సొత్తనుకొనువాఁడు దానముఁ జేయవచ్చు నను. కాని యీభూమి యొకని

---

(1) న భూమి స్స్యాత్సర్వాన్ ప్రత్యవశిష్టత్వాత్ ॥ పూర్వ మీమాంస (6-7-3)

(2) అత్రైవ సర్వదానే సంశయః. కిం భూమి ర్దేయా? న ఇతి కా పునర్భూమి రత్రాభిప్రేతా. యదేత న్మృదారబ్ధం ద్రవ్యాంతరం పృథివీ గోలకం. నక్షేత్రమాత్రం మృత్తికావా తత్ర కింప్రాప్తం? అవిశేషాద్దే యా ప్రభుత్వ సంబందే నహి తత్ర స్వశబ్దో వర్తతే శక్యతేచ మానస వ్యాపారేణ స్వస్య స్వతా నివర్తయితు మితి. ఏవం ప్రాప్తే బ్రూమః న భూమిర్దేయా ఇతి. కుతః? క్షేత్రాణాం ఈశితారో మనుష్యా దృశ్యంతే నకృత్స్నస్య పృథివీ గోలకస్య ఇతి. ఆహాయ ఇదానీం సార్వభౌమః స తర్హి దాస్యతి సోఽపి న ఇతిబ్రూమః. కుతః? యావ తా భోగేన సార్వభౌమో భూమే రీష్టే తావతా. అస్యాపి న తత్ర కశ్చిద్విశేషః. సార్వభౌమత్వే స్వత్వేత దధికం యత అసౌ పృథివ్యాం సంభూతానాం వ్రీహ్యాదీనాం రక్షణేన నిర్విష్టస్య కస్యచి ద్భాగస్య ఈష్టేః న భూమేః. తన్నిర్విష్టాశ్చ యేమనుష్యాః తైరస్య త్సర్వప్రాణినాం ధారణవిక్రమణాది యద్భూమికృతం తత్రేశిత్వం ప్రతి నకశ్చి ద్విశేషః. తస్మాన్న భూమిర్దేయా.— శాబరీభాష్యమ్.

(3) యేయం మహాపృథివీ సా కిం దేయా నవేతి? సాపి సార్వభౌమస్య ధనమితి మన్యమానో దాన మాహ. నాసౌ కస్యచి త్స్వం. రాజ్ఞాం హి రాజ్ఞాం స్వవిషయపరిపాలన కంటకోద్ధరణ భర్తృత్వేన కర్షకాదిభ్యః కరాదానం దండేభ్యశ్చ దండాదాన మిత్యేతావాన్ సంబంధః న స్వామిత్వం. అతో నసార్వభౌమో మహాపృథివీం దద్యాత్ మాండలికశ్చ మండలమ్.— పార్థసారథికృత శాస్త్రదీపికా.

సార్థకముకాదు. రాజ్యమున నుపద్రవములు కలుగకుండఁగ రక్షించుటచే రాజులకు వ్యవసాయకులనుండి పన్ను పుచ్చుకొను నధికారము మాత్రమే యున్నది. దుష్టులను దండించి జరిమానాలఁ గూడ స్వీకరించును. ఇంత మాత్రమే రాజునకు స్వత్వము కలదుగాని భూమియందు సర్వాధికారము లేదు. అందువలన సార్వభౌమునకు దేశము నన్యాధీనముఁ జేయుటకుఁగాని, మండలాధిపతి నుండలము నన్యాధీనముఁ జేయుటకుఁగాని యర్హత లేదు.

(1) ఈమహాభూమి సార్వభౌముని ధనమగుటచే దానిని దానమిచ్చుటకు సార్వభౌమున కధికారము కలదని తోచును కాని, సార్వభౌమునకు దానియం దధికారము లేదు. ఒకరాజు మరియొక దేశమును జయించినను, ఓడిపోయిన శత్రువుయొక్క ధనము గృహములు, వాని స్వంతికమతిములు మాత్రమే గెలిచినవాని స్వత్వముగును కాని ప్రజల క్షేత్రములు మాత్రము జయము నొందినవాని స్వత్వము కాదు. రాజ్యమును గెలుచుట యనగా రాజ్యసూత్రాధికారమే స్వాధీనమైనదని యర్థము. రాజ్యమును పాలించుటలో ప్రజలకు శత్రుబాధలు, మొదలగునవి లేకుండఁగఁ గాపాడి యందులకుగాను వ్యవసాయకులనుండి పన్నును బుచ్చుకొనును. నేరస్థులను శిక్షించి "జరిమానా" లను బుచ్చుకొనును. ఇదియే రాజునకుఁగల యధికారము. ఇంతమాత్రముచే రాజునకు భూమియందు స్వత్వ మేర్పడలేదు. భూమియందేరాజునకు స్వత్వ ముండినయెడల వనములలోని గడ్డి, కట్టెలపైఁ గూడ రాజున కధికారముండును.

రాజునకు వనములలోని, గడ్డి, పుల్లలపై నధికారము లేదుగనుకనే రాజు వానినమ్ముకొనుచుండుటలేదు. అడవిలోనిగడ్డి మొదలగువానిపై రాజున కధికార ముండిన యెడల పట్టణగ్రామాదులలోని ప్రజలగృహములపైని రాజున కధికార ముండును. రాజునకుఁ బ్రజలగృహాదులయం దధికారము లేదు. కనుక రాజు భూమినిచ్చుట కర్హుఁడు కాఁడు. మండలాధిపతి మండలము నిచ్చుట కర్హుఁడుకాఁడు. రాజు కొనిన గృహక్షేత్రాదికములను దాన మీయవచ్చును. (శ్రీఖండదేవునికాలమునకు నరణ్యములపై రాజున కధికారము లేదు. ఒక్క శ్రీఖండదేవుఁడే కాఁడు. హిందూమహమ్మదీయప్రభుత్వములలో నెపుడును వనములపై రాజధికారమును వహించినటులఁ గానము. బ్రిటీషుపరిపాలనలో 1865 సం॥ర ప్రాంతము ననే యరణ్యములపై నధికారమును బ్రభుత్వమువారు పూనియున్నారు. ఇందునుగూర్చి "బ్రిటీషుకాల"చరిత్రములో విమర్శించెదను).

మహాభూమి దానముఁ జేయఁదగినదాకాదా? స్వత్వముగుటచే రాజు దానమిచ్చుఁగాక! రాజునకు భూమిపై పాలనాధికారముమాత్రమే యుండుటచే భూమి రాజునకు స్వత్వముకాదు. అందువలన రాజు భూమిని దాన మీయరాదు. ఎపుడు రాజు "విశ్వజిద్యజ్ఞ"దికము

1 యేయం మహాపృథివీ తస్యాః సార్వభౌమధనత్వా త్తేనైవ దానమితి ప్రాప్తే సార్వభౌమస్యాపి న తస్యాం స్వత్వం జయస్యాపి శత్రుస్వామిక ధనగృహక్షేత్రాదివిషయ ఏవ స్వత్వోత్పాదకత్వాత్. మహాపృథివ్యాంతు, రాజ్యసూత్రాధికారస్యైవ జయేన సంపాదనాత్. రాజ్యం హి స్వవిషయపరిపాలనం కంటకోద్ధరణరూపం. తన్నిమిత్తకంచ. తస్య కర్షకేభ్యః కరాదానం దండేభ్యశ్చ దండాదాన మిత్యేతావన్మాత్రం. న త్వేతావతా తస్యాం స్వత్వం. తథాత్వేచ వనగతతృణకాష్ఠాదావపి స్వత్వాపత్తేః తత్ర స్వత్వోత్పాదక, పరిక్రియవిరోధాపత్తేః తద్విషయస్య ప్రజాదిగృహాదిష్వపి స్వత్వాపత్త్యాచ్చ తస్మాన్నాసౌ దేయా మాండలికేనాపి మండలం పరిక్రియాదిలభ్యం గృహక్షేత్రాదికం తు దేయమేవ.—శ్రీఖండదేవకృత "భాట్టదీపికా".

2 శ్లో. దేయా నవా మహాభూమిః స్వత్వా ద్రాజా దదాతు తామ్,
పాలనస్యైవ రాజ్యత్వా న్నస్వం భూ ర్దీయతే నసా.

వ్యా. యదా సార్వభౌమో రాజా విశ్వజిదాదౌ సర్వస్వం దదాతి తదా గోపథరాజమార్గజలాశయాద్యన్వితా మహాభూమి స్తే దాతవ్యాః; కుతః? భూమే స్తదీయధనత్వాత్ "రాజా సర్వస్యేష్టే బ్రాహ్మణవర్జం" ఇతి స్మృతేః, ఇతిప్రాప్తే బ్రూమః దుష్టశిక్షాశిష్టపరిపాలనాభ్యాం రాజ్ఞ ఈశితృత్వం స్మృత్యభిప్రేతం ఇతి న రాజ్ఞో భూమి ర్ధనం కింతు తస్యాం భూమౌ స్వకర్మఫలం భుంజానానాం సర్వేషాం ప్రాణినాం సాధారణం ధనం అతో ఽసాధారణస్య భూఖండస్య సత్యపి మహాభూమే ర్దానం నాస్తి. జైమినీయన్యాయమాల.

లలో సర్వస్వము దానమిచ్చుచున్నాఁడో అపుడు గోమార్గ, రాజమార్గ, జలాశయాదులతోఁ గూడిన భూమి గూడ దాన మీయఁదగినదే. ఎందువలన ననగా భూమి రాజధన మగుటచేతను, స్మృత్యంతరమున, "రాజు బ్రాహ్మణ సంబంధముకాని యితరమునకంతటికిఁ బ్రభువు" అనుట వలన. అయితే చెప్పుచున్నాము. అన్నిటికి రాజు శాసకుఁ డనునది దుష్టశిక్షణశిష్టపరిపాలనలకుమాత్రమేకాని భూమిని స్వాధీనముఁ జేసికొనుటకుఁ గాదు. భూమి తనపై నుండి స్వస్వకర్మల ననుభవించుప్రాణిసాధారణమునకే ధనమైయున్నది. భూమి జనసామాన్యధనమే. అందువలన రాజు మహాభూమిని దానముఁజేయుట కర్హుఁడు కాఁడు. కొనినభూములను దానమీయవచ్చును.

1 రాజు భూమిని దాన మీయవచ్చునా కూడదా? దానము స్వత్వత్యాగముకనుక నీయవచ్చునని బయటికి గాన్పించుచున్నదని పూర్వపక్షముకాని సిద్ధాంతముచే రాజునకు భూమిపై నధికారము లేనందున నీయరాదు. పైచర్చనుఁ జూడఁగా రైతునకు "జిరాయితీహక్కు" సూత్రకాలముననే కలిగెనని స్పష్టమగుచున్నది. పన్ను నీయనందున భూమిని వేలముపాడుపద్ధతి నాఁడు లేదు. నాఁడు జనసమృద్ధిలేక వ్యవసాయముఁజేయఁదగినభూమి విస్తారముగ నుండుటచే నెవఁ డరణ్యమును ఛేదించి వ్యవసాయము చేయునో వానిదే భూమి యను ధర్మము కలిగెను. మనుస్మృతిలోని క్రిందివాక్యముఁ జూడుడు.

2 వనమును నఱికి భూమిని సాగుచేసినవానిదే భూమియనియు లేడిని, బాణముతో ముందుగఁ గొట్టిన వానిదే యా లేడి యనియుఁ బండితులందురు. రాజు భూమిపైఁ దీసికొనవలసినపన్నుయొక్క విధానమును దాని నేరీతిగాఁ దీసికొనవలసినదియు, రైతు పన్ను నీయనపు డెటులు ప్రభుత్వము వ్యవహరింపవలసినదియు సూత్రకాలమునందే, శాస్త్రజ్ఞులు నిర్ధారణమునుఁ జేసియున్నారు. వాని నిందు దిఙ్మాత్రముగ వ్రాయుచున్నాఁడను.

## పన్నునుఁ బుచ్చుకొనెడి యేర్పాటులు

3 రాజు ప్రజలవలన నారవవంతుపన్నుఁ బుచ్చుకొని రక్షింపవలెను.

4 వ్యవసాయదారులు రాజునకు తమపంటనుండి సమయానుసారముగా పదియవవంతుగాని, యెనిమిదియవ వంతుగాని, ఆరవవంతుగాని పన్నుగా నీయవలెను.

5 పశువులు బంగారము వీనివలన వచ్చినలాభములో యేబదియవవంతును.

ధాన్యములు పండుభూములపైని భూములసారాసారములకుఁ దగినటుల నెనిమిదికాని యారుకాని, పన్నెండుకాని వంతులలో నొకవంతును రాజు పన్నుఁగా దీసికొనవలెను.

6 రాజు ద్రవ్యహీనుఁడుగానుండినను మామూలు కంటె హెచ్చుపన్నునుఁ బ్రజలవలనఁ బుచ్చుకొనరాదు.

7 ఆరవవంతు భూమిపన్నునుఁ దీసికొనుచునే రాజు ప్రజాపాలనమును యుక్తముగ జేయఁడో ఆ ప్రజల పాపమునంతటిని నారాజే పొందును.

---

1 తత్రైవమాహ: భూమిర్దేయా నవేతి? సంశయే సార్వభౌమస్య విద్యమానస్వత్వత్యాగసంభవా ద్దేయేతి బహిః పూర్వపక్షే సిద్ధాంతమాహ: నేతి స్పష్టోఽర్థః-రామేశ్వరసూరికృతజైమినీయసూత్రవృత్తి.

2 శ్లో. స్థాణుఛేదస్య కేదార మాహు శ్శల్యవతో మృగమ్—మనుస్మృతి. (9-44)

3 షడ్భాగభూతో రాజా రక్షేత్ప్రజామ్—బోధాయనధర్మసూత్రమ్. (1-10)

4 రాజ్ఞే బలిదానం కర్షకై ర్దశమ మష్టమం షష్ఠంవా—గౌతమధర్మసూత్రమ్ (10)

5 శ్లో. పంచాశద్భాగ ఆదేయో రాజ్ఞా పశుహిరణ్యయోః, ధాన్యానా మష్టమో భాగః షష్ఠో ద్వాదశ ఏవవా—మనుస్మృతి. (7-130)

6 శ్లో. అనాదేయం నాదదీత పరిక్షీణోపి పార్థివః—మనుస్మృతి (8-170)

7 శ్లో. ఆరక్షితారం రాజానం బలిషడ్భాగహారిణమ్, తమాహుస్సర్వలోకస్య సమగ్రమలహారకమ్—మనుస్మృతి (8-308)

## పన్ను నొక్కసారియే తీసికొనరాదు

[1]రక్తము పాలు తేనె వీనిని, జలగ దూడ భ్రమరము ఇవి యెటుల స్వల్పస్వల్పముగా గ్రహించుచున్నవో యటులనే రాజు కర్షకులనుండి పన్నును స్వల్పస్వల్పముగాఁ దీసికొనవలెను.

భూమిని వ్యవసాయముఁజేయుటకుఁ దీసికొని వ్యవసాయముఁజేయకయుండినచో రాజు పన్నునెటుల రాఁబట్టుకొనవలెను?

[2]వ్యవసాయమునకుఁగాను పొలము నాక్రమించి, యాపొలములో వ్యవసాయమును జేయకపోయినయెడల భవిష్యత్కాలమున వ్యవసాయముఁ జేసినపుడే యాపొలములోనిపంటను,గతఫలమునకుఁగాను రాఁబట్టుకొనవలెను.

భారతీయ సాంప్రదాయమునందు రైతుపన్నునే కారణముచేతనైన నీయక పోయినచో, ప్రభుత్వమా రైతుయొక్క భూమిలోని సస్యమును లాగికొనుటయు, చరాస్తిని బహిరంగముగ నమ్మి పన్నుగా జమకట్టుకొనుటయు, పన్నునీయనివాని ననేక నిర్బంధములఁ జేయుటయే కాన్పించుచున్నదికాని, రైతుయొక్క భూమిని వేలముపాడుటలేదు. మహమ్మదీయ సాంప్రదాయముకూడ భూమినుండి రైతును తొలగించుట కంగీకరింపదు. కాని మహమ్మదీయ రాజ్యకాలమున, పన్నుల నొక్కొకప్రభువు హెచ్చుచేసినపుడు రైతే విస్తారపు పన్ను నీయలేక భూమిని వదలిపోవుచుండువాఁడు. బ్రిటీషు పరిపాలనలో పన్నునిచ్చునంతకాలమె రైతునకాభూమిపై స్వాతంత్ర్యమున్నదనియు, పన్ను నీయనినాఁడు భూమిని వేలముఁ బాడుటకుఁ బ్రభుత్వమునకు స్వాతంత్ర్యము కలదనియు సాంప్రదాయసిద్ధమైనది. దీనిని గురించి విశేషములఁ దెలిసికొనగోరువారు" ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము యొక్క 14 సంచికలోని "అమరకము" అను వ్యాసముఁ జూడగోరెదను.

## గ్రామ నిర్మాణ విధి

[3] పచ్చికకలిగినది సస్యములు కలిగినది వర్తకులచేతను, యోగ్యులచేతను సుఖముగ కాపురముండఁదగినది, స్వవృత్తి (వ్యవసాయము) చేజీవించెడి జనులచే కాపురముండదగినది, గాలి, యెండ, బాగుగ సోకునట్టిదియునగు గ్రామమును నిర్మింపవలెను.

## గ్రామరక్షణవిధి

[4] ఏరాజుయొక్క దేశమునందలి పల్లెలలోను, అరణ్యములలోను దొంగలభయము లేదో,ఆరాజు క్షేమముఁ జేయును.

[5] రాజు, పట్టణమునకు నలువైపులను యోజనము మేరను దొంగలనుండి రక్షింపవలెను. గ్రామములనుండి క్రోసుమేరను దొంగలనుండి రక్షింపవలెను. పైప్రదేశములో చోరులవలన నెవరిసొత్తైన నష్టపడినయెడల నానష్టద్రవ్యమును రాజు నష్టపడినవారికీయవలెను.

ప్రాచీన రాజకీయములో రాజునకుఁ జోరులనుండి ప్రజలను రక్షించుటయే ప్రధానధర్మమగుటచేతను, అందుకొఱకే పన్నును పుచ్చుకొనుటయను న్యాయమేర్పడుటచేతను, చోరులనుండి నష్టపడినవారి ద్రవ్యమును రాజు సంపాదించి యీయలేనినాఁడు రాజస్వమునుండియే నష్టపడినవారి నష్టద్రవ్యము నిచ్చుచుండిరి. నేఁడు నష్టపడినవారి నష్టద్రవ్యమును, రాజస్వమునుండి యిచ్చుకొను బాధ్యతలేదు. ప్రతిసంవత్సరము "పోలీసు"డిపార్టుమెంటుయొక్క రిపోర్టునుఁ జూచినయెడల నెన్ని చోరీకేసులలో నెన్నిటి ద్రవ్యము, నష్టపడినవారికిఁ జెంద

---

1 శ్లో. యథాల్పాల్ప మదంత్యాద్యం వార్యోకో వత్సషట్పదాః, తథాల్పాల్పో గృహీతవ్యో రాష్ట్రాద్రాజ్ఞాఽఽబ్దికః కరః—మనుస్మృతిః (7–129)

2 సూ. క్షేత్రం పరిగృహ్యోత్థానాభావాత్ఫలాభావే యస్సమృద్ధస్స భావితదపహార్య-గౌతమధర్మసూత్రమ్.

3 శ్లో. జాంగలం సస్యసంపన్నం ఆర్యప్రాయమనావిలత్, రమ్యమానత సామంతం స్వాజీవ్యం దేశ మావిశేత్, మనుస్మృతిః (7–69)

4 సూ. క్షేత్రకృద్రాజా యస్య విషయే గ్రామేఽరణ్యేవా తస్కరభయం నవిద్యతే. ఆ. ధ (2–10)

5 సూ. సర్వతో యోజనం నగరం తస్కరేభ్యో రక్ష్యం(23) క్రోశో గ్రామేభ్యః (24), తత్ర యన్ముష్యతే తైః స్తత్ప్రతిదాప్యం (25) — ఆపస్తంబధర్మసూత్రం(2–10)

జేయఁబడుచున్నదో వార్తాపత్రికలఁ జదువువారికిఁ దెలియుచున్నది. ఇందునుగురించి జస్టిస్ శంకరనాయరుగారొకప్పుడు "మాడరన్ రివ్యూ"కు వ్రాసిన వ్యాసము చదువఁదగినది.

## ఇతరవిషయములు

1 భూమిని స్వాధీనపు కుదువకిచ్చినయెడల నూటికి నెలకు ఒకటింబాతిక వడ్డీని బుచ్చుకొనరాదు. వాయిదా తప్పినంతమాత్రమున దాని నితరులకు దానముఁజేయుటకును విక్రయించుటకు నధికారములేదు.

పై యభిప్రాయము మనువుది. పైనిచెప్పఁబడిన విధానముచే నూటికి రూపాయి నాలుగణాలవడ్డీ భూమిపై తీయరాదని స్పష్టమగుచున్నది. నేఁటి బీదరైతునకిట్టి నియమమున్నయెడల బాగుండును. నేటి బీదరైతులు హెచ్చువడ్డీకి తమభూములను కుదువకిచ్చి భూములనే కోలుపోవుచుండుటను జూచుచున్నాము.

2 గ్రామసమీపముననుండని పొలములలో పశువులచేఁ బొలము కాపునకుఁ బశుస్వామి నష్టమును గలిగించినయెడలఁ బొలముకాపునకు నొకటింబాతిక నాణెము దండనముగా నిప్పింపవలెను.

నేటికాలమునందు బందెలదొడ్డిలోఁబడిన పశువులనుండి వసూలుచేయుద్రవ్యము పంటలో నష్టపడిన రైతునకుఁ జెందునుండలేదు. బందెలదొడ్డికైన వ్యయముపోను మిగిలినదానిని, పోలీసుడిపార్టుమెంటుయొక్క న్యాయమునకు జమకట్టఁబడునట. డి. పి. డబ్లియు శాఖలోని స్వల్పసేవకులు (మైలుకూలీలు) మొదలగువారు నెలకింత బందెలదొడ్డినిఁ బెట్టి పశ్చాద్దాయమును స్వీకరింపవలెనను రహస్య నియమము కలదని వినుచున్నాము.

3 జనుల కుపయోగించు తటాకోదకమును పొలమునకుఁ బ్రవహింపజేసినను తటాకమునకువచ్చు నీటిమార్గముల నడ్డుకట్టి పొలమునకుఁ బెట్టుకొనినను, వానికిఁ బూర్వసాహసదండమును (250 రూకలు) విధింపవలెను.

4 వెలుగులేనితోఁటనుండి, మేడి, వెలగ మొదలగు వాని ఫలములను, దుంపలను, అగ్న్యారాధనమునకు సమిధలను, గోవులకు గడ్డిని దీసికొనినయెడల నది దొంగతనమని వ్యవసాయకుఁ డభియోగమును జేయరాదు.

5 ద్విజుఁడు, మార్గస్థుఁడు, బ్రదుకు తెరువులేనివాఁడు, రెండుచెఱకులనుగాని రెండుదుంపలనుగాని పొలమునుండి తీసికొనినయెడల వ్యవసాయకుఁ డభియోగముఁ జేయరాదు.

సాంఘికధర్మములకు వ్యవసాయకుఁడు ధర్మబుద్ధితోఁ దోడ్పడు నాచారము ప్రాచీనకాలమునుండియుఁ గలదని పైమనువాక్యములవలనఁ దెలియుచున్నది. సూత్రకాలమునందును, నేఁటివలె బజారునకుఁ గూరగాయలమ్మువారు వచ్చుట బియ్యపుకొట్లు, తూనికరాళ్లు, కొలపాత్రలు, దురాత్మగ్గలు పిచ్చుకొలతలు, పిచ్చుతూనికలు, కల్పించుట, రాజభటుల పరిశీలనము, మోసపువర్తకులను, శిక్షించుట మొదలగు వృత్తాంతములు మనుస్మృతిలోఁ గలవు. అవి యీగ్రంథమున కనవసరమని వివరింపలేదు. "తైత్తిరీయ బ్రాహ్మణ, అథర్వవేదము"లయందే, గ్రామసంఘములు, గ్రామోద్యోగులుండుటయు, గ్రామస్థలస్వల్పాభియోగములు, గ్రామములయందే తీర్పఁబడుచుండినటులను సూచింపఁబడియున్నవి. సూత్రకాలమునం

---

1 శ్లో. నత్వేవాధౌసోపకారే కౌసీదం వృద్ధి మాప్నుయాత్, నచాధేఃకాలసంరోధాత్ నిసర్గోఽస్తి నవిక్రయః—మనుస్మృతిః (8-143)

2 శ్లో. క్షేత్రే ష్వన్యేషుతు పశు స్సపాదం పణ మర్హతి, సర్వత్రతు సదో దేయః క్షేత్రికస్యేతి ధారణా—మనుస్మృతిః (8-241)

3 శ్లో "యస్తు పూర్వ నివిష్టస్య తటాకస్యోదకం హరేత్, ఆగమం వాప్యపాం భిన్ద్యాత్ సదాప్యః పూర్వసాహసమ్—(9-281)

4 శ్లో. వానస్పత్యం మూలఫలం దార్వగ్న్యర్థం తథైవచ, తృణంచగోభ్యో గ్రాసార్థ మస్తేయం మను రబ్రవీత్—మనుస్మృతిః. (8-339)

5 శ్లో. ద్విజోఽధ్వగః క్షీణవృత్తి ర్ద్వా విక్షూ ద్వేచ మూలకే, ఆదదానః పరక్షేత్రా న్న దండం దాతు మర్హతి—మనుస్మృతిః. (8-341)

దావిధానములు వృద్ధియై, వ్యవసాయకునకు సుఖహేతువులైనవి. నేఁటి గ్రామ్యవ్యవసాయకునకువలె, నాఁటి వ్యవసాయకులు "దావాకోరులై" యుండలేదు. వ్యయమెంతమాత్రము లేకుండగనే నాఁటి వ్యవసాయకుఁడు, స్వగ్రామముననే తగవులఁ బరిష్కరించుకొనువాఁడు. ఆకాలమునందార్యులు క్షామమెంతమాత్రము తమదేశమునందుఁ బొడచూపకుండఁగ గొన్ని విధానములఁజేసిరి. అందుఁ గొన్ని వస్తువులు దేశమునందే యుండవలసిన యవసరముండునని తలంచి, యెగుమతికాకుండు నిబంధనలఁజేసిరి. అందుఁ గొన్నిటినిమాత్ర మిచటను వ్రాయుచున్నాఁడను.

1 మనుష్యులను, గుడాదిరసములను, కుసుంభాది రంగులను, గంధద్రవ్యములను.

ఈననియావులను, లక్క మొదలగువానిని, అరఖులను, వి_త్తనములను, మద్యమువంటి ద్రవ్యమును, పిప్పలిని మిరియములను, ధాన్యమును, మాంసమును, ఆయుధమును, పుణ్యమును విక్రయింపరాదు.

2 నువ్వులను బియ్యమును విక్రయింపఁ బ్రయత్నమునైనఁ జేయరాదు.

3 నువ్వులను బియ్యమును వస్తువునకు వస్తువుగానైన మార్చుకొనరాదు.

4 మార్చుకొనుట యత్యవసరమైనచో, భోజనద్రవ్యమునకు భోజనద్రవ్యమును, మనుష్యులకు మనుష్యులను, రసములకు రసములను, గంధములకు గంధములను, విద్యకు విద్యను మార్చుకొనవలెను.

5 అమ్మఁదగినవస్తువులచేతనే వ్యవహారముఁ జేయవలెను.

పైసూత్రార్థములఁ బరిశీలింపఁగా భోజ్యపదార్థములను ప్రతిగృహస్థుడును నిలువఁజేసికొనవలెననియుఁ ముడివస్తువుల నమ్మరాదనియు, స్పష్టమగుచున్నది. ప్రాచీనకాలమునందు బానిసపద్ధతి కముండెడిది. అందువలననే మనుష్యులను విక్రయింపరాదు అను వాక్యముపయోగింపఁబడెను. నేఁడు భోజ్యపదార్థముల యెగుమతి విశేషించియున్నను, మనుష్యవిక్రయము లేనందులకుఁ జాలసంతసింపవలసియున్నది. కొంతకాలమునకుఁ బూర్వము, నేటాలు, ఆసాం, మొదలగుచోటులకు "డిపోలు"ద్వారా మనుష్యులనంపుటమాత్రము, అప్రత్యక్ష మనుష్య విక్రయముగాఁ దోచెడిది. ఈశ్వరానుగ్రహమువలనఁ జాలవరకామనుష్యుల యెగుమతికూడ నేఁడు తగ్గినందులకు సంతసింపవలసియున్నది. సమస్తశాస్త్రములు కళలు సూత్రకాలమున నభివృద్ధినొందెనని. దానితోపాటు వ్యవసాయకళకూడ వృద్ధినొందెనది. సూత్రకాలమున వృద్ధినొందిన వ్యవసాయ విశేషములఁ జూడుఁడు.

1. భూమిని హెచ్చుగ దున్ని పంటలను హెచ్చుగ బండించుట, 2. "షష్టికలు" మొదలగు సస్య విశేషములను వ్యవసాయముఁజేయుట, 3. దమ్మువలని లాభము, దెలిసికొనుట, 4. కలుపుతీతవలని లాభముఁ దెలిసికొనుట, 5. అరటి పోక కొబ్బరి చెఱకు ద్రాక్ష మొదలగు తోటలను వేయుట, 6. పంచదార బెల్లము మొదలగు పదార్థములఁ జేయుట, 7. పశువైద్య విశేషములఁ గనిపెట్టుట, 8. కళ్లమునకు నడుమను కట్టఁబాతి నూర్చుట, 9. పొలములకు కంచెలను వేసి రక్షించు విధానము, 10. వ్యవసాయపు మర్యాదలు, 11. కరువురాకుండుటకుఁ దగినట్టుల వ్యవహారముఁజేయుట, మొదలగువానిని గనిపెట్టిరి.

సూత్రకాలవ్యవసాయ చరితం సమాప్తమ్.

---

1 సూ. మనుష్యాన్ రసాన్ రాగాన్ గంధా నన్నం చర్మ గవాం వశాం శ్లేష్మోదకే తోక్మ, కిణ్వే పిప్పలి మరీచే ధాన్యం మాంసమాయుధం సుకృతాశాంచ" ఆ. ధ. (1-20-12)

2. తిలతండులాం స్త్వేవ ధాన్యస్య విశేషేణనవిక్రీయాః—ఆపస్తంబధర్మసూత్రం (1-20-13)

3. అవిహితశ్చైతేషాం మిథో వినిమయః. —ఆ. ధ. 1-20-14

4. అన్నేనచాన్నస్య మనుష్యాణాంచ మనుష్యై రసానాంచ రసైర్గంధానాంచ గంధై ర్విద్యయాచవిద్యానామ్—ఆ. ధ. (1-20-15)

5. అవిక్రీతపణ్యై ర్వ్యవహారేత— ఆ. ధ. (1-20-16)

# కలహంస

భండారు వీర రాజేశ్వర రావు గారు

నవకమెడవోని పడుచుపొందమ్మితూండ్ల, తూగుటూయెలలం దోఁగి యాఁగకుండ
మధురనయనాంచలములఁ జెమ్మలుద్రవింప, బేలవలె నుంటివేల మరాళబాల?

చ. లలితపుఁబొన్నపూవలపులం దులకించు మిటారితెమ్మరల్
మలయవొ? మోహనామృతములం దొలఁకాఁడు పిసాళివెన్నెలల్
వెలయవొ? కోకిలంబు లతివేఁడ్క మనోహరగీతరాగముల్
పలుకవొ? యేల తొయ్యలి! విలాపము లిట్టి నిశాంతవేళలన్?

గీ. మృదుమధురసాంద్రదర హాససదనమైన, నునుమొగము వాంచి బాష్పాంబుకణము లెన్నొ
దొనదొరన్ రాల్చుచుంటె కన్గొనల నుండి? ఏల యీగర్భవేదన లిపుడు వెలఁది?

గీ. సృష్టివైచిత్ర్యచిత్రలక్షితములైన, కలికిహొంబట్టుఱెక్కలదళము లిపుడు
చికిలివెన్నెలపాలవెల్లికల సెగలఁ, గుమిలి కసుగందునని దాఁచుకొంటె పడఁతి?

గీ. పదిదినము లైనదో లేదొ గద త్వదీయ, బాల్యపరిమాణమగుముక్కుపచ్చలారి
అపుడె హితులకునేని చెప్పంగరాని, యంతటిరహస్యపు విషాదమా! కృశాంగి!

సీ. గుజ్జుమావుల నల్లుకొని ప్రోఁదిఁగొను మల్లి, కామతల్లుల ప్రాపుఁ గాంచి కొంత
ప్రియతమంబో గులాబీపుష్పవతిఁ గోరు, మారుతప్రియు నండఁ జేరి కొంత
కలువ సెజ్జలఁ గేళిసలుపు తుషారదం, పతులసామీప్యంబు వడసికొంత
మెలమెల్ల సయ్యాట సలిపి మంతనమాడు, సెలయేటియలల ప్రక్కలనుగొంత
గీ. పవనసంచాలనంబున భ్రమసి, చిఱుత, పరువులం దేఱి, పూవుటోవరులనీడ
నిలచునా కులజంటలకెలనఁ గొంత, ఈసవరసోదయంబుల నెఱిఁగినావొ!

గీ. మదవదళికులమదె నీదుమృదుపదంబు, వదలని లతాంతముకుళగర్భములఁ జేరి
కలఁతఁ బెట్ట నోకింతైనఁ గసరవేమి? తన్మయోద్రేకమున నుంటివా, లతాంగి!

గీ. పడతి! నీదుర్భరస్వాదుప్రణయబాష్ప,హార్తికంబుల భాగ్యసంపదలఁ బోలెఁ
దనదు గర్భంబునం దాఁచుకొనెడు కలువ, కన్నెదెసనైనఁ జూఁడు నీపున్నె మగును.

గీ. నవురువెన్నెల చక్కందనాని కుబికి, లీలలం దేలుమేన బాలికలఁ గాంచి
బాల్యకౌతూహలమునఁ జప్పటలు చఱచు, హల్లకకుమారుఁ గని యూఱడిల్లు మబల!



# మన కర్తవ్యము

పోణకా పిచ్చిరెడ్డి గారు బి. యే (ఆనర్సు)

మానవజాతిని యిప్పటివరకు అనుభవించుచున్న అన్యాయ అయోమయసందర్భముల నుండి తప్పించి యింతకంటె సౌఖ్యకరములగు పరిస్థితులలో ప్రపంచము నుంచనగునను యోచన క్రొత్తగ ఇప్పుడు కల్గినది కాదు. మిగులపురాతనములును చారిత్రికముగా మొదటిగ్రంథములునగు వేదములకంటెగూడ పురాతనము. ఈజగత్తును ఆదర్శపువెలుగున జూచు ప్రతిమనుజుడును— తానన్వేషించునది జ్ఞానమైనను, శిల్పమైనను, ప్రణయమైనను, ఆనందమైనను సరే— ఇంతటిదుఃఖము అనవసరముగా ప్రపంచమును ముంచివేయుచుండ నేమియు చేయక ఊరకున్నామే అని చింతనొందకమానడు. తనకు శక్తిసామర్థ్యములున్నచో, భావప్రపంచమున గనుపించురీతిగనే లోకమును స్వర్గతుల్యముగ నొనర్ప ప్రయత్నింపగలడు. ఇట్టి యిచ్ఛయే, యీ సంకల్పమే- విష్ణుస్వరూపమగు మానవప్రపంచము నెడలగల యవ్యాజానురాగమే, పూర్వము మతకర్తలకు, రాజనీతిజ్ఞులకు, దేశోద్ధారకులకు, మూలబలముగా నుండినది.

జనులలో నధికసంఖ్యాకులు— దాదాపుగా నందరును—పురుషులు, స్త్రీలు— సాధారణసమయములలో తమజీవితముల యెడలగాని విశాలమగు ప్రపంచము నెడలగాని, చింతగాని, ఆలోచనగాని విమర్శనజ్ఞానముగాని కలిగియుండరు. తాము జన్మించియున్న సంఘమొసగుదాని నంగీకరించి వర్తమానకాలమును గూర్చిన చింత తప్ప భవిష్యత్తునుగూర్చిన యాలోచన లేకయే జీవితముల గడపుచుందురు. అరణ్యమున సంచరించు మృగములతో సమానముగా ప్రస్తుతావసరముల తృప్తిమాత్రమే కోరుచు, పురోదృష్టిలేక, కొలదిపాటి కష్టముతోనే తమజీవితపరిస్థితుల మార్చుకొని సుఖపడగలుగుదుమని యెరుగకయే తమవ్యర్థజీవితముల గడపుకొనుచుందురు. కొందరు మాత్రము స్వలాభాపేక్షచే, కీర్తిప్రతిష్ఠల సంపాదించుకొననగునను ఆసచే, తమసంఘపు ఔన్నత్యమునకు పాటుపడుచుందురు. వీరి అభిప్రాయము లెట్టులున్నను, రూపాయతో తన్ను కొట్టిన ధనికునివలన బిచ్చగానికి లాభమేకలిగినవిధముగా ప్రపంచమునకు, జనసామాన్యమునకు, వీరివలన కీడుగాక మేలే కలుగుచున్నది. తాము తమకు కావలయునని కోరులాభములను ప్రతివారును అనుభవించునట్లొనర్పదలపుగలవారు చాలకొద్దిమందిమాత్రమే.

మానవలోకముమీద నిట్టిఅవ్యాజానురాగము గలిగిన మహనీయులు తామెట్టిసంఘమున నెంతయైశ్వర్యయుతులై యుండినను, ప్రస్తుతము తమస్థితి యెంతబాగుగనున్నను, తామొనరింపజూచు కార్యములవలన తమకు కష్టములు గలుగనున్నను, తమస్థితి తారుమారైనను ప్రపంచము దుస్థితిజూచి యోర్చుకొని యుండజాలరు. ప్రపంచచరిత్ర దిలకించినయెడల లోకోద్ధారకులగు నిట్టి మహనీయులలో జాలమంది ఆగర్భశ్రీమంతులు రాజ్యాధిపతులు సార్వభౌములుగానుండినవారే యని వ్యక్తము కాగలదు. అట్టివారు తమకృత్యములవలన తమస్వలాభము నావంతయేని గోరక ప్రపంచమునకు తమ అమూల్యజీవితముల ధారవోసిరని చెప్పక తప్పదు. తమవారికష్టములు వారిలోగలలోపములు యితరులకు తెలిసినట్లు తమకు తెలియవని యొకసిద్ధాంతము గలదు. దీనినందరు ఒప్పుకొనకున్నను దీనియందుగూడ కొంతనిజము లేకపోలేదు. భోగముదానియింట పుట్టిపెరిగినకొడుకునకు తన సోదరి నితరులతోగూర్చుట ఏహ్యముగ దోచనట్లు ఒక సంఘములో పుట్టిపెరిగినవారి కాసంఘములోని లోపములు గాన్పించవు. అన్నకుమార్తెను పెండ్లియాడు

మహామ్మదీయాచారమునకు హిందువు లేవగించుకొనెదరు. అంతకంటె రక్తస్పర్శ యెక్కువగాగల అక్కచెల్లెండ్ర వివాహముజేసికొనుట కభ్యంతరమే యుండదు. ఇట్లే అన్నీ. కావుననే సంఘసంస్కరణాభిలాషులుగ నుండువారు సాధారణముగ యితరజాతులవారి విద్యల,మతముల, నాగరికతల, బాగుగ నెరిగినవారుగ నుందురు. అట్లుండకున్న సంఘోద్ధరణ మసాధ్యము.

దేశభక్తి, అనేకవస్తువుల సంయోగమువలన నేర్పడినవిషయము. ఇది మూఢభక్తిగ మారి చెడిపోకయుండవలయునన్న తమదేశపు చరిత్ర సారస్వతము యిత్యాది విషయములమాత్రమే నేర్పి యితర దేశముల చారిత్రిక సారస్వత విద్యల నభ్యసింపజేయకుండరాదు. అన్నియు నేర్చినతరువాతనే స్వచ్ఛమగుభక్తి యేప్రజలకైన గలుగునది. ఇది యెరుగనిపాలకులుగాని, ప్రజలుగాని చేయు కార్యములు వారుద్దేశించిన ఫలితమునకు వ్యతిరేకమగు లాభముల నార్జించితీరును. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ,"యనుట తాతత్రవ్వించిన తటాకమని ఉప్పునీళ్లుత్రాగవలెనని బోధించుటకుగాదు. నేడు మనప్రభుత్వమువారుగాని మనజాతీయవాదులుగాని ప్రజలకొసగు విద్యలో నీలోపము స్పష్టముగ గాన్పించుచునేయున్నది. ఈమధ్య అమెరికాదేశమున ఒకరాష్ట్రములో పరిణామసిద్ధాంతము (Theory of evolution) బోధింపరాదని కొందరు పట్టుబట్టిరి. అందువలన నిప్పుడాదేశములో ఆసిద్ధాంతము నెరుగనివారుగాని, చదువనివారుగాని లేకుండునట్లు సంభవించినది. కారణమేమి?...

తామెరుగనిపరిస్థితులలో నుండుజనులగూర్చి విచారించునపుడు వారికి తోచనికష్టములుకూడ మనకు గనబడును. బుద్ధదేవునికి అగపడినట్లే ప్రపంచము దుఃఖసముద్రములోనున్నట్లు చూడగలము. పైసిద్ధాంతమునకు వ్యతిరేకముగా కొన్ని పేర్ల నుదహరింపనగును గాని తీవ్రముగ నాలోచించిచూచినయెడల సామాన్యజనులలో నుండివచ్చిన మహాత్ములుగూడ తాము జనసామాన్యమును వారిపరిస్థితులలోనుండి గాక ఉన్నత ప్రదేశమునుండి వీక్షించుట కవకాశము లేర్పడియుండవలయును. లేనియెడల నట్టిపని అసాధ్యము. భగవదవతారములనదగు నీ మహనీయులు తమసోదరులదుఃఖములబాప బద్ధకంకణులై తొలుత ఉపదేశములలోను పిమ్మటకార్యములలోను తమభావముల వ్యక్తపరతురు. సంఘోద్ధరణకై ప్రయత్నింతురు. లోకము నానందమయముగ జేయజూతురు.

కాని యిప్పటివరకు వారి యుద్దేశములు నెరవేరకపోయెను. పూర్ణముగ నెప్పటికి నెరవేరజాలవు. ఏలనన నట్లు నెరవేరినచో అభివృద్ధికి మార్గ ముండదు. చలన మాగిపోవును. అప్పుడు లోకము నశింపవలయును. ప్రపంచమును వీక్షించిన అట్లు జరుగునని తోచదు. ప్రపంచము, ఈసృష్టియంతయు ఒక గమ్యస్థానము జేరునని (a far off divine event) దలచరాదు. అట్లే అయిన ఎప్పుడో ఒకసారి అచటికి చేరక తప్పదు. అట్లుగాక గమ్యస్థానము, మన ఆవశ్యముగూడ నట్లే జరుగుచు ఉన్న యెడల సర్వకాలము అభివృద్ధికి మార్గ ముండగలదు. భగవంతుని సృష్టియంతయు ఒకచోటుజేరి అచ్చట నాశనమై మరల మొదట నుద్భవించుచుండునను సిద్ధాంతమున కర్థము లేదు. కొందరి మతము (theory) ప్రకారము సృష్టియంతయు చక్రమువలె తిరుగుచుండుననియు కొంతకాలమునకు మనము మొదటికే మరల వత్తుమనియు వృద్ధియనునదియే లేదనియు చెప్పుచుందురు. అట్లే అయినచో ఈ జగన్నాటకము నేల నాడవలయును? ఈ ప్రపంచము చరాచర జంతుజాలముతో కూడిన యీ విశ్వ మానవ ప్రపంచము, సూర్యమండలము, దానిచుట్టుతిరుగు సమస్త గోళములు, సృష్టి సర్వస్వము 'ఉండుటకు' కారణ మెద్దియో యుండవలెను. మరియు మనము వృద్ధి చెందుటయే లేదను సిద్ధాంతమును ఈప్రపంచమే పూర్వపక్ష మొనర్చుచున్నది. ఈసృష్టి సర్వస్వములో ఒక అణువుతో సమమగు మన ప్రపంచముననే యింత అభివృద్ధి యగుచుండ నింతకెన్నిరెట్లు ఎక్కువగా నితర గోళములలో నుండునో మీరే యోచింపుడు. మనమొనర్చు కార్యములలో నభివృద్ధి లేదని వాదమునకు ఒప్పుకొన్నను మన అభిప్రాయములలోని మార్పుల కేమి సమాధాన మివ్వనగును? మరియు సర్వ మానవులును అభివృద్ధి అని చెప్పువిషయ మొకటైన నుండవలయును. 'ఫలానిది' అభివృద్ధి యనుటలో భేదాభిప్రాయము లుండవచ్చును. గాని అసలు వస్తువుయొక్క ఉండుట (Existence) లో భేదాభిప్రాయము లుండజాలవు. ఇది మనవ్యాసమునకు సంబం

ధించిన విషయము కాదు గాన దీని నింతటితో వదలి నా అభిప్రాయమును మాత్రము తెలిపెదను.—సృష్టి ముందుకు జరుగుచునే యుండును కాని దానికి నిశ్చలముగ నుండు ఆదర్శము మాత్రము లేదు. గమ్యస్థానముగూడ ముందుకు జరుగుచుండును. అభివృద్ధి తిరుగుడుమెట్లవలె (Spiral Stair case) వలె పైకి పోవుచుండును. ఈవిషయమునుగూర్చి సమయము దొరకునెడల నచిరకాలములోనే నాయభిప్రాయముల విపులముగా వెల్లడింపగలను.

పైనజెప్పినట్లు వారి అభిప్రాయములు పూర్ణముగ నెన్నటికి నెరవేరజాలవు. ఏలనన అభివృద్ధి కావలయునన్న అసంతృప్తి ప్రబలముగ నుండవలయును. అసంతృప్తియే అభివృద్ధికి మూలబీజము. పూర్వము జొత్తిగా (అనగా కావలసినంత) అభివృద్ధి లేక యుండుటకు కారణ మీ అసంతృప్తి లేకయుండుటయే. ఇందువలన నప్పటిజనులు కష్టములు లేక యుండిరనిగాని, కష్టములన్నియు ఇప్పుడే వచ్చినవనిగాని అనుకొనరాదు. నా అభిప్రాయ మిది: మన మింతకంటె ఉన్నతస్థితిలోనుండగలము అనుభావము మనసుకు తగిలినప్పుడు మాత్రమే అసంతృప్తి కలుగగలదు. కాని అట్టి అభిప్రాయములే లేక మృగములవలె నుండినప్పుడది జొత్తిగా నుండదు. హిందూదేశమునకు ముప్పుదెచ్చి నాశనమొనర్చిన 'కర్మ' సిద్ధాంతమునే ఆదర్శప్రాయముగా నుంచుకొన్న అనాగరికుల కసంతృప్తి కలుగగలదా? తాను జేసికొన్న కర్మవలన తానధోగతి పాలైతినని యెంచి యింకనైనను ధర్మము (?) ను మీర కుందమని తమకు సర్వేశ్వరుడు ప్రసాదించిన స్వచ్ఛమగు ఆత్మల కళంకితములుగ నొనర్చి, ధూళి ధూసరితములై నేలలో బొర్లాడజేసిరి.

ఇప్పటివరకు యుగయుగమునను మహాపురుషు లుద్భవించిదేశోద్ధరణకు ప్రాణములుధారవోయుచుండినను మనము నత్తగుల్లలకంటె మెల్లగ వృద్ధిజెందుచున్నాము. అసలు రోగపీడితులకే వారివైద్యము రుచింపనప్పు డింతయైన ముందుకు వచ్చినాముగదా అని సంతోషించ వలసినదే. మొదటినుండియు దురదృష్టవంతులగు మనదేశపు ప్రజలు జ్ఞానశూన్యులై యుండుటవల్లను, దైవనిర్దిష్టములగు (?) తమబాధల పడలేక నిస్పృహులై పడియుండుటవల్లను, తమ అధికారులవల్ల శిక్ష నెక్కుడ అనుభవింపవలసి వచ్చునో అను భీతిచేతను తాము మునిగితేలుచున్న నీచపరిస్థితులు తమ కలవాటై యుండుటచే గౌరవము గోల్పోయి నీతిదూరులు గను, నీతిబాహ్యులుగను నుండుట చేతను, అట్టివారిలో ప్రబోధము కలిగించి సంఘము నౌన్నత్యము నందజేయుట అసాధ్యమైనపని యాయెను.

జనులను సగటున రెండు తెగలుగ విభజింపవచ్చును— మార్పుకావలయు ననువారు, మార్పక్కఱలేదనువారు— వీరిలో నెన్నియో తరగతులు గలవు. కాని మొత్తముమీద యిప్పుడుండుస్థితిలో ప్రపంచములో దుఃఖ మమితముగ నున్నది. ఇది అనవసరము. కొంచెము కష్టపడినయెడల మన మీలోకమును బాగుచేసుకొన గలము అనువారు కొందరు. ఈప్రపంచములో దుఃఖముండుట వాస్తవమే కాని సాధ్యమగు ప్రపంచములలో నెల్ల (The best of all possible worlds) నిదియే శ్రేష్ఠము. ఇంతకంటె ప్రపంచమున దుఃఖమును తగ్గింపజాలము. ఇంతమాత్రమైన దుఃఖము లేనియెడల ప్రపంచనటన అసాధ్య మనువారు మరికొందఱు. ఈరెండుతెగలవారును తమతమ సిద్ధాంతముల ప్రకార మాచరించిన నేతప్ప ప్రపంచమునకు మోక్షము గలుగనేరదని విశ్వసించెదరు.

వీరినే ఉదారహృదయులు, సంకుచితస్వభావులు అని యనవచ్చును. నిజముగా నుదారహృదయులు (Liberals) అగువారు ప్రతివిషయమునను నుదారులైయే వర్తింపవలయును గాని మనదేశపు జాతీయవాదులవలె రాజకీయములందు మాత్రము మిగుల నుదారత సాంఘికములందుమాత్ర మందుకువ్యతిరేకముగ నుండరాదు. సంకుచితస్వభావులు (Conservatives) ప్రతియడుగును బాగుగ నాలోచించియే ముందుకు బెట్టవలయుననువారు. సాధారణముగా బలవంతులు, శక్తివంతులు, ద్రవ్యవంతులు, రాజ్యాధిపతులు, పీఠాధిపతులుగా నుండువారు ఇప్పుడుండు స్థితియే యుండవలయు నందురు. కొందరు విద్యావంతులు మాత్రము వేరుతెరగుగా భావింతురు. హిందూదేశ సాంఘికతత్త్వ (Sociology) శాస్త్రవిచారము మనకిప్పు డవసరము లేదుగాని యిది మాత్రము చెప్పవలెను. ఏకారణముల వల్లనైననేమి మనదేశమున రెండువిధములగు భావములు

ఒకదానికొకటి వ్యతిరేకములనవి — ప్రబలియున్నది. ఈ విపరీతభావసమ్మేళనము (?) ప్రతివిషయమునను గాన్పించును. మానసిక చింతలలో మిగుల నుదారత; కార్యాచరణమునం దిందుకు వ్యతిరేకము— విజ్ఞానవిషయములలోగాని, సారస్వతమునందుగాని, శిల్పమునందుగాని ముఖ్యముగా తత్త్వచింతనలో— ఈ కడపటి విషయమును మాత్రము పరిశీలింతము.

తత్త్వవిచారమునందు మనవారికలము నిరాఘాటముగ సాగినది. సాంఖ్యయోగములందుగాని, న్యాయవైశేషికమీమాంసాదులయందుగాని మనవారు ఫలితముల సరకుసేయక ప్రవర్తించి హేతువాదమునం దగ్రగణ్యులైరి. పాశ్చాత్యతత్త్వజ్ఞులు హేతువాదమునం దసమానులు. అట్టివారిలో మిగుల ముఖ్యులగు కాంటు హిగెల్ (Kant Hegel) మొదలగు మహాశయులు సయితము విధిలేక ఒప్పుకొనవలసివచ్చినపుడు, తమమతముల నొకమూలబెట్టి, తమసిద్ధాంతములకు వ్యతిరేకమగు సమస్య లెదుర్కొనినపుడు, సమాధానమే లేక యూరక నుండిరి. కాని శ్రీశంకరాచార్యులవారు మాత్ర మట్లుచేయక తమమతము (Theory)కంటె నెక్కుడుగ తర్కసిద్ధాంతమునే నమ్మి అది నిర్ణయించినట్లే తనమతమును తుదవరకు పోనిచ్చెను. పక్షపాతరహితమగు నిట్టినిరాఘాటప్రవర్తనను గూర్చి యెంతపొగడినను తనివిదీరునా? దీనివలనగలుగు సౌఖ్యానందముల ననుభవింప మొదలిడకమునుపే 'ఏందు కింతతొందర అటుచూడుము. ఈసిద్ధాంతముయొక్క కార్యరూపమును దిలకింపుము' అని యేదియో చెప్పుచున్నది... అటుచూచినతోడనే ఆనందమంతయు వ్యసనమగుచున్నది. నవ్వు యేడ్పుగ మారుచున్నది. ఏల?... శంకరుడు తననిరాఘాటతర్కమువలన దేలిన 'బ్రహ్మమునకును' ప్రపంచమునకును సంబంధములేకుండుట ఒప్పుకొనవలసివచ్చినపుడు తనమతము భగ్నమగుస్థితి సంభవించెనేయని విచారించి, వ్యావహారికమని పారమార్థికమని భేదములగల్పించి తనమతములోని లోపముల గప్పిపుచ్చి బాగుచేసెను.(?) (నిజములో ఈ సిద్ధాంతమువలననే శంకరునిమతమునకు న్యూనతగలుగుటకు కారణమైనది.) ఇట్టిసందర్భము మనసంఘమున ప్రతివిషయమునను గనుపించుచునేయున్నది. ప్రపంచమే మిథ్య, మాయ, దుఃఖభాజనము. ఇచటినుండి విముక్తియే కర్తవ్యము అనుసిద్ధాంతము. ప్రాపంచిక వ్యవహారములలో మాత్రము యివియన్నియు నిజములని నమ్మి జరుపుకొనవలయును. ఇట్టిసందర్భమున అద్వైతవేదాంతి, ఏనుగు, కథ జ్ఞప్తికి వచ్చుచున్నది.

ఒక వేదాంతి సర్వము మిథ్యయని జనులకు, బోధించుచుండెను. ఇంతలో నొకయేనుగు తప్పించుకొని ఘీంకారము చేయుచు వారున్నచోటికి పరుగెత్తివచ్చుచుండెను. దానినిజూచి యావేదాంతి కాలికి బుద్ధిజెప్ప మొదలిడెను. ఆపల కొంతసేపటి కాజనులాసిద్ధాంతిని ఏలపరుగెత్తిపోయితివని యడుగగా 'ఆయేనుగు మిథ్య, అది తరుముట మిథ్య, నేను పారిపోవుటకూడ మిథ్యయే!' యని ప్రత్యుత్తర మొసగెనట. చూడుడు, శంకరునిమతమున కెట్టిగతిపట్టినదో! పరబ్రహ్మము నిర్గుణుడేకాని మనము సగుణునిగానె యారాధింపవచ్చును! ఆహా! ఏమివిపరీతపు దెలివి! ఒక మహామహుడు వచించినట్లు మనము సంసారకష్టసుఖములకై నిర్దేశింపబడియు, సంసారచక్రఘోరపరివర్తనములకు బరిచితులమయ్యు దానినిజూచియే భయపడుచున్నారము. సముద్రమునకును, తీరమునకును నడుమ ఆవేదనచే మునుగుచున్నాము. నక్షత్రశోభితమును సుందరమునగు రాత్రినిజూచి భయపడి చండభానుని యెండలోబడి మ్రగ్గుచున్నారము... మనము నీటిలో దిగజంకు చేపలవంటివారము. చీకటికి వెరగందు గడ్లగూబలవంటివారము.

ఇందులకు కారణములగూర్చి యోచించుట ప్రస్తుతము మనపనిగాదు. దీనివలన గలిగిన ఫలితమునుగురించియే మనమిపుడు యోచింపనగునది. ఇట్టులుండుటవలననే ప్రతియుదారాశయమునకును మనదేశము ప్రతిఘటించి నిల్చినది. ఉన్నతాదేశములు మనదేశమును జొరయత్నించినప్పుడు ద్వారముననే నిలిచి "మాయాదేశము లింతకంటెను మహోన్నతములు. మరలిపొమ్మని" వానిని బంపివేసి ఆయుత్తరక్షణము మొదలు తనవ్యావహారిక ధర్మమునే యనుష్ఠించుట మొదలగు కార్యములవలన మనదేశము అభివృద్ధికి విముఖత గలిగియున్నది.

జ్ఞానమును, మతవిద్యను తమకృత్యముగా గలిగియుండినవారు స్వాతంత్ర్యమున కడ్డునిలిచిరి. ఋగ్వేద

కాలమున యజ్ఞయాగాదులు ప్రబలి వానివలననే ముక్తిగలుగునను నమ్మకము జనులకుండెను. క్రమక్రమముగా దీనియెడల నమ్మకము క్షీణించి యజ్ఞములలో పశువులను బలియియ్యరాదనియు మోక్షము జ్ఞానమువలననే కలుగగలదనియు నమ్మకము ప్రబలెను. ఈమార్పు కలుగుటకు కారణము అప్పటి జనులమనస్సులు వికసించుట, ప్రపంచము బాల్యావస్థను దాటుటమాత్రమే కాదని యీ పురాతనగ్రంథముల చారిత్రకదృష్టితో జూచిన ప్రతి మానవునకు విశదముగాగలదు. మొదటినుండియు సంఘములోని ప్రధానస్థాన మాక్రమించుకొనుటకు బ్రాహ్మణులకును క్షత్రియులకును జరుగుచుండిన సమరములు వారి వారి ప్రత్యేకసిద్ధాంతము లెట్లెట్లు పరిణమించినదియు ఎచ్చటచ్చట యెవ్వరెవ్వరు ఏయేస్థానముల నాక్రమించుకొనియుండినదియు అందరికి దెలిసిన ప్రాతకథయే యగుటవల్లను దాని ప్రమేయ మిచ్చట అత్యవసరముగ గనుపింపకుండుటచేతను వదలితిని.

జ్ఞానమువలననే మోక్షము గలుగగలదను సిద్ధాంతము బ్రాహ్మణాధిక్యతగలిగియుండిన కురుపాంచాల దేశములందుగాక రాజసూయయాగమునందువలె క్షత్రియులే మొదటిస్థానము నాక్రమించుకొని యుండిన కాశికోసలవిదేహరాజ్యములలో జన్మించినదనిన చాలును. అనగా దృష్టిలో యీ భేదము గలిగినది బ్రాహ్మణులవలన కాదు. మఱి క్షత్రియులవలన. ఇందులకు ప్రమాణములు గలవు. ఇది వివాదాంశములలో నుండి దాటిపోయికూడ ఇరువది సంవత్సరములు కావచ్చుచున్నది. క్షత్రియముఖముగా వెల్వడిన యీ బ్రహ్మవిద్య క్రమక్రమముగా దేశమంతయు నల్లుకొనెను. మొదట బ్రాహ్మణులు దీనికి ప్రతిఘటించిరి. ఇతరులకండ్లయెదుట నీనూతనసిద్ధాంతము పైకిరాకుండుటకు చేయవలసిన పన్నాగముల నెన్నియో పన్నిరి. కాశీవిదేహదేశస్థుల తూలనాడ మొదలిడిరి. నీచమగు ప్రాకృతము మాట్లాడుకొనువారనిరి. దీనివలన నేమిన్యూనతయో తెలియరాకున్నది. పూర్వాచారముల కాలబట్టును, బ్రాహ్మణనాగరకతావాసమునునైన కురుపాంచాలదేశస్థులు తామూరకుండుటవలన నిట్లుగలిగెనని తెలుసుకొని, వారివిద్యతోనే వారినోడించవలయునను సంకల్పముతో నా 'బ్రహ్మ'విద్యకొరకై క్షత్రియుల నాశ్రయించిరి. ఉపనిషత్తుల, పురాణముల, శాస్త్రదృష్టితో జదివినయెడల విదేహరాజగు జనకుడు, కాశీరాజగు నజాతశత్రుడు, కోసలదేశాధీశ్వరుడగు విశ్వామిత్రుడు యీనూతనసిద్ధాంతమును వృద్ధిలోనికి దెచ్చినవారిలో నగ్రగణ్యులనియు అనేకమంది బ్రాహ్మణులకు వారీవిద్య నేర్పిరనియు యెరుగగలము. ఎట్టియున్నతోద్దేశములతో బయల్వెడలినను తగినవారు లేనిచో కొంతకాలమునకు ప్రతిమతమును కళంకితమగుట సిద్ధము. బ్రహ్మవిద్యకూడ నిట్లేయయ్యెను.

ఈవిద్యను కొంతకాలమునకు బ్రాహ్మణులు తమ స్వంతమును జేసికొనగలిగిరి. బృహదారణ్యకోపనిషత్తు కాలమునాటికి యాజ్ఞవల్క్యుడు క్షత్రియుల నోడించి మరల బ్రాహ్మణుల యగ్రవర్ణత్వమును స్థాపించుటతో నీమతము కలుషితము కాజొచ్చెను. ఇంతటితో నిలిచిన బాగుగనే యుండియుండెడిది. కాని వారియుద్దేశము పూర్వపుక్షత్రియులవలె బ్రహ్మవిద్య నెరిగి యుండుట మాత్రము కాదు. ఎట్లైనను తమ పురాతన ధర్మమును పునరుద్ధరించ వలయును. యజ్ఞములను క్రతువులను యీ నూతన బ్రహ్మమునకు ముడిగట్టవలయును. (ఆహా! ఎట్టి ధర్మమున కెట్టి దుర్దశపట్టినది.) ఈ సదుద్దేశముతో వేదములలోని మాటలకు క్రొత్తయర్థముల గల్పించి యజ్ఞకర్మలకు వేదభావముల గల్పించి యీ క్రొత్తవిద్య క్షత్రియులనుండి బయలుదేరినది కాదనియు ఎప్పటినుండియో వేదములలో నిమిడియుండినదనియు బలుకసాగిరి. తమ స్థానమును బలపరచుకొనిరి. ఏది యెట్లున్న నేమి? బ్రతుకునకును నమ్మకములకును భేదమేర్పడెను. సర్వసమత్వమును సూచించు బ్రహ్మవిద్యను తమవశమొనర్చుకొని అనుష్ఠానమున వర్ణాధిక్యతకే ప్రాముఖ్యమొసగసాగిరి. నిర్మల స్వాతంత్ర్య ప్రవాహమును తొలిసారి మలినమొనర్చిరి.

రెండవసారి, ప్రపంచమునందలి మతము లన్నిటిలోను శ్రేష్ఠతమమగు బౌద్ధమతమును ప్రేమామృత వర్షమును గురిపించుచు భూతదయ సర్వమానవ సౌభ్రాతృత్వమును బోధించి వర్ణభేదముల రూపుమాప యత్నించెను. 'అహింసా పరమోధర్మః' అను ముఖ్యసూత్రము గలిగి ప్రపంచమున కంతటికిని ఆదర్శప్రాయమగు నీ గౌతమబుద్ధుని మతముయొక్క జీవితము కడకు జగమెన్నడు కని

విని యెరుగనిదియు మిగల ఘోరమునగు విషాదాంత నాటకముగ బరిణమించి ప్రపంచచరిత్రయందు హిందూ దేశమును ముఖ్యముగా బ్రాహ్మణ నాగరికతను మిగుల నీచస్థానము నాక్రమించుకొనియుండున ట్లొనర్చుటకు కారణమయ్యెను. జన్మభూమినుండి బౌద్ధమతమును కూకటి వ్రేళ్లతోగూడ బెరికి దాని పొలకువయే లేకుండ చేసిన ఘనకార్యమునకు సంతోషించువార లుండిన వారిని సంతోషించనిండు. కాని ప్రపంచచరిత్ర యుండునంత కాలము, జనులకు జ్ఞాన ముండునంతవరకును, ఈ విషాదాంత నాటకకర్తయగు నాగరికతకు గలిగిన కళంకము మాసిపోజాలదు. సర్వమానవ సంఘోద్ధరణకై పాటుబడు దేశములతోపాటు హిందూదేశము తలయెత్తుకొని తిరుగ జాలదు.

ఇట్లు జరుగుట యెన్నడో ఆయెనని ఊరట జెందుటకు గాదు. ఏ ఉద్దేశముతో బౌద్ధధర్మమును బయటకు బంపిరైనెనో ఆ యుద్దేశములు జనులలో నుండునంతవరకింతకంటె యభివృద్ధి గనుపింపజాలదు. అహింసా సిద్ధాంతమును వారినుండి కైకొని అంతకుమునుపే తమ మతము నందది కలదని పలికి యా నూతనమతము నణగద్రొక్కయత్నించిరి.

కొందరి మతమున నిట్టిగుణములు తమ మతమున కుండుట దానికి గౌరవమే యగును. వారి యభిప్రాయము లిట్లుండును. హిందూమత మగాధము,అతి విశాలము, ఆద్యంతములు లేనిది. సర్వమతములును అందులో నిమిడియే యున్నవి. హిందూమతములో లేని క్రొత్త విషయము ప్రపంచములో నింకెచ్చటను ఉండజాలదు!

వీనిలో కడపటివిషయమును మొదటబరిశీలింతము. హిందూమతములో లేని క్రొత్తవిషయము ప్రపంచములో నింకెచ్చటను ఉండదనిన నేమి యర్థము? హిందూమతము సర్వవిధముల పరిపూర్ణమనియేకదా. పూర్ణము కానిచో క్రొత్తవిషయము వేరొకచోట నుండవీలగును. కాన హిందూమతము సర్వవిధముల సమగ్రమనియే పై యభిప్రాయము. మొదట హిందూమతము నటుంచనిచ్చి ప్రపంచములో నేమతమైనను పరిపూర్ణమైనది ఉండుట కవకాశము కలదా? అను పంగతి నాలోచింతము. అసలు మతమేకాదు. ఏదియు పరిపూర్ణముగ నుండుటకుగాని ఒకవేళ ఉండినను అట్లున్నదని మన మెరుగుటకు గాని సాధ్యముకాదని తత్త్వశాస్త్ర పరిచితులగువారికి దెలుపు కొనవలసిన యవసర ముండదని తలచెదను. అట్లుండ నీమహాసృష్టిలో నొక పరమాణువుతో సమానమగు మన ప్రపంచమునందలి మారుమూలదేశములో నుద్భవించిన యొక సిద్ధాంతము సమగ్రముగ నున్నదనుటకు నోరెట్లాడును? కావున పైజెప్పినట్లు హిందూమతములో నన్నియు నున్నవి అను మాటకు అర్థము. హిందూమతములో తక్కిన మతములలో లేని విషయము లనేకము లున్నవని చెప్పుటయేకాని వేరుగాదని నా నమ్మకము. మనవారికి సహజమగు నతిశయోక్తి అలంకారముతో మామతము గొప్పది అనుమాటకు బదులు మామతము సమగ్రమని పలికిరి.

దీని నొప్పుకున్నను దీనికంటె తీవ్రమగు సమస్య మనల నెదుర్కొనుచున్నది. ఇట్లు గొప్పదని చెప్పుకొను వస్తువేది? ఈహిందూమతమునకు మూలసూత్రము లెవ్వి? ఎట్టివాడు హిందువు డనిపించుకొనును? హిందువునకును యితరమతముల వారికిని భేదమేమి? హిందూమతమనిన కొన్ని సూత్రముల నమ్మి యట్లు వర్తించుటయా? అట్లయిన నా సూత్రము లెవ్వి? హిందూ మతమునకు కర్త యెవడు? కర్తయే లేనిచో నిది యెట్లుద్భవించెను? ఇట్లుగాక హిందూమతమనిన అన్యమతసంయోగ ఫలితమే యగునా? అట్లయిన నీమతమునకు ప్రత్యేకవ్యక్తిత్వమే లేదా? ఇట్టివే ఎన్నియో ప్రశ్నలు ఒకదాని నొకటి నెట్టుకొనుచు ప్రవేశించును. వీనికి జవాబేలేదా? శూన్యమగు నాకాశము ప్రత్యుత్తర మొసగుచున్నది ఈసమస్య కూడ సృష్టివలెనే అగాధమైనది అని.

మనమత మిట్టిదని మనము నిర్వచనమే చేయలేని యప్పుడు దాని గుణాగుణములగూర్చి పలుకుటకు మాత్ర మెట్లగును? వాదమున మనకు ఉపయోగించ కున్నను, మనమతముయొక్క వైశాల్యము అందులో మనము దాగు కొనుటకు మాత్ర ముపయోగించుచున్నది. పాశ్చాత్యుల వ్యాసములందువలె దీనినంతయు వెదకినను కావలసిన విషయము దొరకకపోయినను గ్రంథములగుటకు మాత్రము వీలగు చున్నది. మన కర్థము కాకపోయిన కాకపోవచ్చును గాని సర్వ కాలములకు సరిపోవు సిద్ధాంత

ములు మనమతములో నున్నవి అనుమాట ప్రతివాని నోటను విననచ్చుచున్నది. నేను మరుగుజ్జునే యైనను మా తాత చాల పొడుగువాడు. తన స్వంతశక్తివలన నిలిచి యుండజాలని తీగె వేరుజాతివగు వృక్షమునకు పెనవేసికొని పైకెగబ్రాకుచున్నది.

ఇంకొక తెగవా రిట్లు పలుకుదురు. 'మనమతము చాల నుదారాశయములతో బయలుదేరినది. మంచి యెచట దొరకినను అది గ్రహించుచున్నది' అని. ఇది నిజమేయైన యెడల సంతోషింపవలసిన విషయమే కాని సత్యమిందుకు వ్యతిరేకముగ నున్నది. ప్రతివిషయమునుండియు సుగుణమునే గ్రహించుశక్తిగల వస్తువు తనకు లాభకారి యగు విషయము నెడల కృతజ్ఞతనైన కలిగియుండవలయును. అంతేకాని దాని సత్వమును మాత్రము గ్రహించి యేరు దాటినవెనుక పడవను తగులబెట్టినట్లు, తిన్నయిల్లు గ్రుద్దలించినట్లును దాని నాశనమునకై పూనరాదు. ఇది పశుకృత్యము. సత్వముగలదిమాత్రమే నిలువగలదు.(survival of the fittest) అను సిద్ధాంతమునకు సరిపోవునది పై సిద్ధాంతము స్వాభావికమే యైనను హీనసృష్టి (Lower Strata of animals) కిమాత్రమే అన్వయింపగలదు. పైకివచ్చుకొలదియు యీపోటీ (competition) సిద్ధాంతమునకుస్థలము లేదు. సేవా(Co-operation) సిద్ధాంతము దానిస్థలము నాక్రమించుకొనుచున్నది. ఇట్టిసేవయే మానవజీవిత పరమావధి అతి నికృష్టసేవా జీవనంబె యపుడు బోధనీయము, శ్రేష్ఠము, పూజ్యతమము. అట్టిమహోన్నతాదర్శము చిన్నచేపలను మ్రింగు పెద్దచేపవంటిదియు, కచ్చితమగు ఆకారము లేనిదియునగు హిందూమతమున గానుపింపదు. కావున సమస్తవస్తువుల గొట్టుకొనిపోవు జలధారికాల్వవలె హిందూమతమునకీసర్వభక్షకత్వము కళంకము నాపాదించునే కాని స్వచ్ఛత నొసగజాలదు.

మరల సర్వజనసహోదరభావము ప్రకటించు శైవమతముపట్ల మనదేశ మెట్లువర్తించెనో స్మరింపుడు. దక్షిణదేశమున జననమొంది ప్రతివిషయమునను ఉదార హృదయముతో వర్తించిన యీమతమున దైవ, పితృ, కార్యములసమయమున వాడబడుభాష ఎన్నడో చనిపోయిన సంస్కృతముగాక జీవకళలతో విలసిల్లు మాతృభాష. ఆదర్శములా మహోన్నతములు. ఉద్దేశము సర్వమానవసంఘోద్ధరణ. ఇట్టులుండియు వృద్ధిగాంచక పోయె. కారణ మూహ్యము. ఇట్టులే సర్వజనసౌభ్రాత్రము నర్థించు రామానుజమతముకూడ భగ్నమయ్యెను.

ఈరెండుమతములు అభివృద్ధికభ్యంతరములు గలిగించు మతసంపర్కమువలన విపరీతములుగ బరిణమించెను. ఈరెండుమతములును మొదట బౌద్ధమతముతోపాటు విచక్షణ లేకయే, తమమతోద్దేశముల కనుగుణముగ, జనసామాన్యమునంతయు తమమతమున జేర్చుకొనసాగెను. బ్రాహ్మణులు, తక్కినయగ్రజాతులవారు సర్వజనసమానత్వము నొప్పరైరి. అందువలన గరిష్ఠసంఖ్యాకులు హీన (మనిపరిగణింప బడుచున్న) జాతులవారే యేర్పడిరి. అందువలన వారిమతముల ప్రతిష్ఠ తక్కువకాజొచ్చెను. [ఇప్పటికాలమున ముఖ్యముగా మాలమాదిగల జేర్చుకొనుచున్న క్రైస్తవమతమున కిట్టిగతియే సంభవించియుండుట అందరికి దెలిసినవిషయమే.] అంతట తమలోపమును గుర్తెరిగి దిట్టముగ కట్టుబాటుల నొనర్ప మొదలిడిరి. మొదట నెంత యుదారాశయములతో బయలువెడలెనో కడకంతసంకుచితాభిప్రాయములు కావలసివచ్చెను అందువలననే యిప్పటికిని యీమతములు విపరీతములగు నాచారములగలిగి యితరమతస్థుల స్పృశింపనైన నొప్పకున్నవి.

ఇట్లు సర్వవిధముల నభివృద్ధికి బ్రాహ్మణమత మడ్డునగులుటకు కారణమెద్దియో విచారింతము. మొదటనే యొకప్రశ్న గలదు. బ్రాహ్మణమత మిట్లడ్డుదగులుటకు దానిలో నేమైన ప్రత్యేకగుణము గలదా? లేక మరియేమతమయినాసరే దానిస్థానమున నుండినయెడల నదిగూడ నిట్లేయయి యుండునా? నిశ్చయముగా ఏమతమయినను అంతకంటె భిన్నముగా వర్తించి యుండనేరదు. కారణము?... ఒకమతసంస్థ యేర్పడినతరువాత ననేకులు దానినాశ్రయించుకొని యుందురు. ఆమతము వారి స్వత్వమగుటచే నందులోనుండు నంతవరకు తమకు కష్టములు రాజాలవు. పైగా తమలాభమునే దృష్టియందుంచుకొని తమ కనువగు విధముననే మతము నన్వయించుకొను చుండవచ్చును. జ్ఞానమున తమకంటె తక్కువగువారి కండ్లుగప్పి ప్రస్తుతపు స్థితియే ప్రపంచమునకు మిగుల శ్రేయస్కరమనియు నందువలన దానిని చెదర

కుండ గాపాడుటయే వారి పరమ ధర్మమనియు గాపాడ జూతురు. ఆసంస్థ మారినయెడల తమ కిపుడుగలలాభము లుండవని యెరింగి ప్రపంచమున కంతటికి ముప్పుగల్గునని యమాయకులగు జనులకు బోధించి వారిని తమవైపే త్రిప్పుకొని తమపట్టు వదలక కూర్చుండి యుండజూతురు.

కావున శాశ్వతముగా మార్పుజెందని మత ముండవలయుననుట మొదటితప్పు. ఈమతము దానికగు విద్య ఒకజాతికిగాని సంఘమునకుగాని చేరిన స్వత్వమై యుండుట రెండవలోపము. ఇందు రెండవదానిగూర్చి మొదట విచారింతము. దీనికి గల లోపములు రెండు కారణముల వలన గలుగుచున్నవి. మతము దానికి సంబంధించిన విద్య కొందరిపరముగా నుంచుటలో నుద్దేశమేమి? వారు తక్కిన జనులకంటె నుత్తములనియేకదా! మతము అనునది మనుజునకును సర్వజగత్తునకు ఆధారమగు మూలశక్తికిని గల సంబంధ మగుటవలన నది యితర విషయముల వంటిది గాదనియు మనుజునకుగల లోపములు దానికంటు కొననీయక దానిని నిర్మలముగ నుంచవలసి నందునను దానిని సామాన్య మానవుల కతీతమగునట్లొనర్చి దాని గౌరవ మర్యాదలు గాపాడుటకు కొందరిని కాపుంచవలయు ననుటయే కదా యుద్దేశ్యము. [ఈ సిద్ధాంతము నొప్పనివా రనేకులుగలరు. మతము నితరు లెరుగ కుండునట్లు మూసియుంచుటలో గాక సర్వమానవుల కందునట్లు బహిరంగప్రదేశమున నుంచినయెడలనే యది నిష్కళంకముగ నుండుటకు వీలగునని తలతురు] పై మతమును మనము సరియని యొప్పుకున్నను దానిని స్వచ్ఛముగానే యుంచి కాపాడ నియమింపబడిన వారు తక్కిన జనులకంటె నుత్తములని యెంచుట కెట్లగును?

మొత్తముమీద జనులలో నొకభాగమును తీసి వేరుచేసి వారికి ప్రత్యేకమగు విద్యాబుద్ధుల నేర్పి యితర జనులతో కలసిమెలసి యుండకుండున ట్లొనర్చినచో వారు తక్కినవారికంటె నుత్తమగుణములు గలవారు కాజాలక పోవుటయే కాక నీచప్రవర్తన గలవార లగుట సహజముగా ప్రపంచమును విమర్శదృష్టితో జూచిన వారికి గోచరించుట నిజము. దేవాలయములకు సమీపమునకు వచ్చుకొలది దైవభక్తి తగ్గుననువాక్యము యథార్థత్వమునుగూర్చి వేరుగ జెప్పబనిలేదు. దేవ దాసీలని పిలువబడు భోగమువారి సంఘపరిణామ వృత్తాంతము జూచిన నీసత్యము తేటపడగలదు. బౌద్ధమతప్రచార మొనరించుటకై నిర్దేశింపబడి యప్పటిసంఘమున ముఖ్యస్థానము వహించియుండిన బౌద్ధసన్న్యాసినులే యిప్పటి భోగము వారైరనిన, తమ స్వచ్ఛప్రవర్తనచే జనుల కాదర్శప్రాయులుగ నుండుటకు నియమింపబడి తరిఫీతు చేయబడుచుండిన స్త్రీల ప్రత్యేక సంఘము లిట్లగుటకు కారణము పైనజెప్పబడినదియే యనుటకు సందియములేదు. ప్రస్తుతము జగద్గురువులని పిలువబడు మతాధిపతులు, వారిశిష్యబృందము, హిందూ మతమున కెట్లు నైర్మల్యము రాకుండ కాపాడుచున్నవో అందరకు తెలిసినవిషయమే. ప్రస్తుతరాజకీయ సమస్యల జోలికి బోకయే దేవాలయముల మహంతుల జీవితములు లోకమున కాదర్శప్రాయములుగా మాత్రము లేవని చెప్పవచ్చునుగదా! జనులలో నుత్తములనువారిని, ఉన్నత వంశసంభూతులతో, నేర్పరిచిన సంఘములే యిట్లు పరిణమించియుండ నికయితరులకంటె నేవిషయమునను గొప్పకాని యొకసంఘమునూట చెప్పవలయునా! మరి రెండవది ద్రవ్యము: ఒకప్రతిష్ఠాపనను మార్పులేకుండ కాపాడినందులకే వారికి ద్రవ్యమొసగుచుండినచో నాప్రతిష్ఠాపనలయెడల జనులకు గౌరవాదరణములు తగ్గుటకు కారణము కాగలదు. జనులలో న్యాయదృష్టి(Honesty) నశింపగలదు. తాను నమ్మినను నమ్మకున్నను ప్రభుత్వముచేతిక్రిందనుండు మతమునందు జనుల కాదరముండినట్లు నటింతురు. నిశ్చయమగు మతవిశ్వాస మడుగంటును. దీనికిదోడు యీమతప్రతిష్ఠాపనలకు, మతాధిపతులకు యితరజనులపై నధికారము నొసగినయెడల నిక జెప్పవలసిన దేమున్నది. మతాధిపత్యమును రాజ్యాధిపత్యమును వేరుచేయుటకేకదా పాశ్చాత్య దేశములందు యిప్పటివరకు జరుగుచుండిన స్వాతంత్ర్యసమరములు! ఈరెండు ఆధిపత్యములొక్కరేకలిగియుండిన తురుష్క దేశము పాశ్చాత్య దేశములన్నిటికంటె నాగరికతయందు అధోగతిలోనుండెననిన నాశ్చర్యమేమి? మరియు నిట్టి ప్రతిష్ఠాపనయే యేదోపురాతనమగు మతమును గాపాడుటకే చేయబడినదే అయినచో మార్ప నసాధ్యమైనదై, ప్రస్తుతస్వాతంత్ర్యవాతావరణమును బీల్చజాలకుండుటచే దాని దుష్టప్రకృతియంతయు నొక్కసారి వెల్వడగలదు.

ఇట్టిపరిస్థితులలో మతప్రతిష్ఠాపనలకే అగౌరవము గలుగుచున్నది.

ఇందులో ఒక్కవిషయమును మాత్రము ముఖ్యముగా గమనించవలయును. ఇట్టి విపరీతపరిణామము, ఆయామతములు, లోపభూయిష్ఠతవలన గలుగనదికాదు. ప్రతిమతమునను,మనుజులొనర్చు ప్రతికృత్యమునను లోపములు గలవు. వానివలన గలుగబోవు ఫలితములు వేరు అంతేకాని మనమతములలో లోపములుండినందున నిట్లు జరిగెనని తలచుట పొరపాటు.మరియెందుననగా? ..అసలు మతసంస్థలుండుటయే మొదటితప్పు. మతములు మతసూత్రములు ఇచ్చువుండును. పోవుచుండును. జననమొందిన ప్రతివస్తువునలెనే యివికూడ నశింపగలవు. అవి యేర్పడవలసిన సంఘల పరిస్థితులలో నవియేర్పడి తమపనిని నెరవేర్చినవి. ఈ క్రొత్తపరిస్థితుల కనుగుణ మూతన మతములకవి తావునివ్వక తప్పదు. అంతేకాని ఒకసారి యేర్పడినది గాన నది శాశ్వతముగా నుండవలయునని యామూత్రముల బట్టి యాగులాడుచు గూరుచుండరాదు. మరియు ద్రవ్యము అధికారము చెలాయించుశక్తి యేదైన నొక మతము నొప్పుకొనుట వలననే కలుగునెడల వారిబుద్ధి యన్యాయమార్గములందు ప్రవర్తించుటకు వీలగును. బుద్ధిపటుత్వము గలవారు యిట్లు మనస్సును పరిపరివిధముల బోనిచ్చినచో నిజము నెరుగనివారై తాము చేయగల కార్యములగూడ జేయజాలక పోదురు.

శాశ్వతములగు మతసంస్థలమీదనే పూర్ణముగ నాధారపడి యుండువారు ఒక్కవిషయమును జ్ఞాపకముంచుకొనిన జాలును. తాము నమ్మియున్న మతముల నేర్పఱచిన వారి యుద్దేశము లేమిగనుండెనో అని యోచింప వలయును. వీరు వారికాలమున సంస్కరణ యవసరమనియు, మతమున లోపము లున్నవనియు నెరిగి తమశక్తికొలది పాటుపడిరి. వారి సంస్కరణ ఫలితము ననుభవించిన మనము శాశ్వతముగ నా రూపముననే యుండవలయుననుట వారి యుద్దేశ్యము కాజాలదు. వారు మార్పే పనికిరాదను వారైనచో సంస్కరణల దలపెట్టకయే యుండురు. మనకు బౌద్ధ,జైన, మహమ్మదీయ క్రైస్తవ మతములు లేకయేయుండును. "నేను చెప్పినట్లు చేయుము, నేను చేయునట్లు చేయకుము" అని యేమతకర్తయు చెప్ప సాహసింపడు. ఈమతముల నేర్పరుచుటలో వారియుద్దేశమేమి? సంఘోద్ధరణమే కదా? అను విషయము మాత్రమే మనము జ్ఞప్తియందుంచుకొనవలసినది.

అతి త్వరితముగ మార్పుజెందు నీకాలమున మతములవలన జనులకు కీడుగాక మేలే కలుగవలయు నన్నయెడల, యితరకృత్యములగతిగ, లాభము నపేక్షింపక, దానిపైగల ప్రేమతో, ఉత్సాహముతో చేయువారిచేతనే మతప్రచారము జరుగవలయును. అట్టివారు తమ ప్రక్కనే ప్రపంచమునసే సంచరించువారు గాన పురాతనపు నీతులన్నెపట్టి యూగులాడక, స్వతంత్రులు గాన పక్షపాతబుద్ధి లేక, నీతి, మత సమస్యల పరిష్కరింపు చుందురు. చలనమేలేని సంఘమున దప్పు గనిపెట్టుటను మతమునకై నిర్ణయింపబడిన వారివలన నుపయోగ ముండబోదు.

ఇట్టి కారణములవలననే యీకాలమున నీతియందుగాని మతములయందుగాని సంస్కరణములు, ఘనాశయములు, మతవిద్య బాగుగా నేర్చిన గురువులనుండి వెలువడుట లేదు. మతగురువులలో ననేకులకు తమ మతములందు సంపూర్ణవిశ్వాస ముండుమాట వాస్తవమే. అట్టివారు, తక్కిన సామాన్యులొనర్చినట్లు, పైయక్షరముల కప్పుడే ప్రాధాన్యమియ్యక, మనకు కావలసినది ముఖ్యముగా హృదయనైర్మల్యము, భక్తి, యుత్సాహము లేనని నిజముగా నమ్మియుందురు. అట్టివారు కొందరైన లేకున్నచో నీప్రపంచ మిప్పటికంటె నధోగతిలో నుండెడిదే. (అధికసంఖ్యాకు లగువారుమాత్ర మిందుకు వ్యతిరేకాభిప్రాయములు గలవారేనని చెప్పకతప్పదు.

కాని ఎంతభక్తియున్నను అట్టివారు ప్రపంచమునకు నవజీవము నొసగజాలరు. పురాతనమతములనే నమ్మియుండువారు (నమ్మకూడదని నాయభిప్రాయము కాదు. శాస్త్రదృష్టితో వానినిబరిశీలింప వలయు ననియే).జ్ఞానముకొఱకెన్న వెనుకవైపు జూతురు. భవిష్యత్తును గమనింపరు. వేదములలోను పురాణములలోను జ్ఞానము నన్వేషింతురు. వానియెడల గౌరవము గలిగియుండుటలో నేనితరులకు వెనుదీయువాడను గాను. ఇప్పటికి దొరకిన గ్రంథములలో నెల్ల వేదములు మొదటివనియు వానిలోను పురాణములలోను కొన్ని భాగములు ఉత్తమకావ్యములవ దీసిపోవనియు ఆకాలమున నంతవిషయపరిజ్ఞానమును

జూపు గ్రంథములు ప్రపంచమందు వేరెచ్చటనుగను పించుననియు నే నొప్పుకొందును కాని సకల విషయ ములును సమగ్రముగా నందు చర్చింపబడి యున్నవను విషయము సత్యమునకు దూరమని నామనవి. వానిలో విశేషముగు జ్ఞాన ముండుమాట వాస్తవమేకాని యిప్పటి సాంఘిక, రాజకీయ, నైతిక, ఆధ్యాత్మిక సమస్యలలో గొన్నిటి కందు ప్రత్యుత్తరము గాన్పింపదు.

స్వాతంత్ర్య ప్రియులగు స్త్రీ పురుషులుత్తమ యుత్తములగు జీవితముల నపేక్షించు నెడల మనమిప్పుడు మతమునకు సంబంధించినవని చెప్పు అనేక విషయముల వదలిపెట్టవలయును. మనము చేయవలసిన మొదటిపని, మన నీతియందు విధేయత యనుసరింపక స్వాతంత్ర్య మగుపడునట్లు చేయవలెను. ఇది చాల ముఖ్యమగు మార్పు. ప్రతివిషయమునను మనపూర్వు లేమిచెప్పిరని యాలోచించిన నేమిఫలము? మనపూర్వుల యోచనలు మనము దారితప్పకుండ సాయపడు మైలురాళ్ళని తలచ వలయునే కాని అసలుమార్గమే అదియని తలచుట పాడి గాదు. మఱియు మనకృత్యము లందు భయ మదృశ్యమై అన్వేషణ గాన్పింపవలయును. ఏదిచేయక యుండవల యునని ఆలోచించక యేదిచేయవలయునని యోచించ వలయును. ఈ ప్రపంచమున పుట్టి సంవడి చప్పుడులేక భగవంతుని కోపమునకు భయపడిన వారివలె నిష్క్రమించుట మన కర్తవ్యముగాదు. ఇది మన ప్రపంచము. దీనిని స్వర్గముచేయుటయు, నరకముగ నొనర్చుటయు మనచేతులలో నున్నది.

మన జీవితమును (పర్వదినములయందు మాత్రము) అప్పుడప్పుడు నిష్ఠనభినయించుటతో వ్యర్థపుచ్చక, యీ దుఃఖమయ ప్రపంచములోని కేల వస్తిమా యను వ్యసనముతో గాలముగడపక, ఆచార వ్యవహారములలో తప్పొప్పులేమి గల్గునో యను శుష్కవిచారములప లోను గాక గడపవలయును. మానవ జీవితావధినే స్మరించుచుండ వలయును. మానవలోకమును పైకగపడు ఆకారములబట్టి గాక వాని నిజతత్త్వము నెరిగి ప్రేమింపవలయును. పాపశూన్యలోకంబె కార్యకర్తృత్వమునకే జనుల నభినందింప వలయును.



# అదియ యిహపరానందదాయకపథంబు

భమిడిపాటి సుబ్బారావు గారు

ప్రాందితి వేపాటి భోగంబులని గాక, యిచ్చితివె య్యవి యీవులనుచు!
నిష్టకామ్యార్థంబు లెపుడందితని గాక, దీనావనం బెప్పు డూని తనుచు
నధికారదర్ప మేవిధిఁ జూపితనిగాక, సాహాయ్య మెంతగా సలిపి తనుచుఁ
బేరాస నేరీతిఁ బేర్చితి వనిగాక, ప్రేమ నేరీతి వర్షించి తనుచు
జీవితాంతపరీక్షలో దేవుఁ డడుగ, 'నియ్య, దిప్పు, డింత, యీరీతినే,' యనంగ
సకల జీవులఁ దన్పు వాత్సల్య వృష్టి; నదియ యిహపరానందదాయకపథంబు.




న్యాయపతి శ్రీనివాస రావు గారు

మానవజాతి సృష్టివైచిత్ర్యములను ప్రశంసింపగల సామర్థ్యమును సంపాదించిన నాటనుండియు, సర్వేశ్వరునియనంతలీలలను కన్నులారగాంచి వానికీర్తిని గానముచేయగల శక్తిగల్గిన నాటనుండియు మానవునిబుద్ధి పరిపరివిధముల పరుగులిడుచు లలితకళారూపమున వికాసము నొందెను. సర్వేశ్వరుని మహిమను స్తోత్రముచేయుట కొరకు సృష్టిసౌందర్యమును వర్ణించుటకొరకు కవితయు, నాకవితను గానముచేయుటకు సంగీతమును, ఆదేవదేవుని యనంతలీలలను చిత్రించుటకు చిత్రలేఖనమును, ఆమహామహుని ఘనరూపమును నిర్మించుటకు శిల్పమును ఉపయోగములోనికి వచ్చెను.

ఈశ్వర సృష్టియందు సర్వోత్కృష్టమగు జీవసముదాయమున మానవుడు తన యపారమగు బుద్ధికౌశలముచే నగ్రస్థానము నాక్రమింపగల్గెను. ఆబుద్ధికౌశలమునకు మానవనిర్మితమగు శిలావిగ్రహములే తార్కాణములు. జీవముదక్క దక్కిన యన్నివిషయములయందును మానవుని నయితము ధిక్కరించు ఈశిలావిగ్రహములను నిర్మించుటకే శిల్పమని యందురు.

ఈ భౌతికప్రపంచమున శిల్ప మనాదిసిద్ధము. పాశ్చాత్యదేశములలో నీశిల్పము క్రీస్తునకు పూర్వము కొన్నిశతాబ్దముల క్రిందటనే అభివృద్ధిపొందినటుల గాన్పించుచున్నది, పుణ్యభూమియగు నీభారతవర్షమున ఈశిల్పకళ వేదకాలమునాటికే అత్యున్నత దశయందున్నట్లు గన్పట్టుచున్నది. ఇట్టిపురాతనమైన శిల్పముయొక్క చరిత్ర కొంతవరకు క్లుప్తముగ తెలిసికొన వలసియున్నది.

మానవుడు గృహనిర్మాణమున కెప్పుడు ప్రారంభించెనో ఆనాటినుండియె శిల్పకళ యారంభమయ్యెనని యెరుంగనగును. గృహనిర్మా

ణమునందును, దేవాలయములను కట్టుట యందును, శిల్పకళానైపుణ్యము గానవచ్చును.

ప్రకృతియంతయు తనయానందమునకే సృజింపబడె నని మానవుడు గ్రహించిన నాటినుండియు మానవనేత్రముల కగోచరుడగు నా సృష్టికర్త కొకరూప మొసంగి దేవాలయములందు స్థాపనచేసి యారాధించుటకు మానవుడు తన బుద్ధి చాతుర్యమున తన శిల్ప కళానైపుణ్యమున అతి సౌందర్యమైన విగ్రహములను నిర్మించి శిల్పకళను బహుజనోపయోగ కరముగ జేసెను. రాను రాను పురాణము ఇతిహాసములు గాథలు జనసామాన్యమునకు సుబోధకమగు నటులు చేయుటకు శిల్ప మెంతయో యుపయోగింపబడుచుండెను. యీ విషయమున చిత్రలేఖనము సయితము యీకార్యమున కెక్కువ సహాయకారిగా నున్నదను విషయము సర్వజనవిదితము. కాని చిత్రలేఖనమునకు శిల్పమునకు భేదము లేకుండియున్నచో ఈ కళలు వేర్వేరుగా వృద్ధిపొంది యుండనేరవు.

ప్రకృతినిగల సర్వవస్తు సముదాయమును చిత్రించుటలో మాత్రము చిత్రలేఖనమునకు శిల్పమునకు కొన్ని విషయముల సామంజస్యము కలదుగాని అందును గూడ వానికి గల భేదములు ముఖ్యములై యున్నవి. అవి ఏవన :

1. చిత్రలేఖనమున చిత్తరువు చూపరుల మనముల నూతనభావములను సయితము స్ఫురింపచేయుట కవకాశము కలదు. ఇయ్యది శిల్పమున కసాధ్యము.

2. చిత్రలేఖనమున చిత్తరవును నేత్రముల మూలముననే చూచి యానందింపవలసి యుండును. శిల్పమున నేత్రానందమే కాక స్పర్శవలన సయితము శిల్పకారుని నైపుణ్యమును తెలిసికొని ఆనందింప గలము.

3. శిల్పమునందు సామాన్యగుణములను మాత్రము కనబరచుటకు అవకాశముగలదు. కాని గుణప్రదర్శనమునందు చిత్రలేఖనమునందువలె ప్రత్యేకతకు వీలులేదు.

ఈకారణముల వలననే చిత్రలేఖనమును శిల్పమును వేరువేరు కళలుగా వృద్ధిపొందెను.

పాశ్చాత్య దేశములలో శిల్పకళాభివృద్ధిని గనుపరచిన దేశములు రెండు మాత్రమే. అయ్యవి గ్రీసు రోము దేశములు.

గ్రీకు శిల్పము

1. గ్రీకులు ప్రపంచ జీవనము తదుపరి నాలోచింపక కేవలము ప్రపంచ విషయములందె నిమగ్నులై యుండుటచే వారి శిల్పమందును దైవసంబంధమగు విగ్రహములను చెక్కుటలో మానవాకృతిని భావమును తెలుపుడు చేయునటులనే ప్రదర్శించిరి.

2. వారికి మహావీరులయందు గల అభిమానము ఇంతింతయని చెప్ప నలవికాదు. మంచివిగ్రహములను తయారుచేయుటలో ప్రసిద్ధికెక్కిన శిల్ప కళానిపుణులు సైతము వీరిని తమకు ఆదర్శములు (Model) గా పెట్టి విగ్రహములను చేయుచుండిరి. "The fighting Gladiator" "Discolobus" మున్నగు మహావీరులు వీరి శిల్ప నైపుణ్యమున కాదర్శములు. పురుషరూపమును నిర్మించుటలో వీరు మహా

వీరుల అంగసౌష్ఠవము నటుల నాదర్శముగ నుంచుకొనిరో అటులనే స్త్రీరూపమును చెక్కుటలో అతిరూపలావణ్యవతులగు నారీమణుల నాదర్శముగా నుంచుకొనిరి. దీనినిబట్టి చూచినవారి జీవితాదర్శము మానవపూజ నతిక్రమింపలేదని విదితమగుచున్నది. ఈ విగ్రహములను చెక్కుటయందు వారు వ్యక్తులలోని ప్రత్యేకగుణములను విడిచి క్షణికములగు ప్రవృత్తులను విసర్జించి సమూహమునందుగల గుణసామాన్యములగు సుస్థిరవృత్తులను మాత్రము కనబఱచిరి. గ్రీకు శిల్పులు నేదైనవిగ్రహమును తయారుచేయునపుడు ఆవిగ్రహ మేవిషయము గూర్చినదో ఆవిషయసంబంధమున చేరిన మానవజాతియందంతటను గలసామాన్యగుణములను గ్రహించి అందు ప్రత్యేకవ్యక్తులకు సంబంధించిన క్షణికములైన గుణములెల్లను విసర్జించి విగ్రహములను జెక్కుటయే ఆదర్శముగ నుంచుకొని పనిచేసిరి.

The Greek sculptors were prompted constantly to seek the type in the individual to abstract and express only what is structural and permanent, to purge from the individual all that belongs only to him, all the accidents, the feelings and actions of the special moment,

ఇయ్యదియే పాశ్చాత్యదేశ శిల్పులందరకును ఆదర్శమయ్యెను. గుణసామాన్యప్రదర్శనమే వారి ఆదర్శము గనుక గ్రీకు శిల్పులు వారి విగ్రహములకు రంగులు పూయుట అనవసరమనియు అసమంజసమనియు కళావిహీనమనియు మానివేసినటుల తోచుచున్నది. దృష్టిమార్గమును సూచించక పోవుట రోమరాసులుగల ప్రదేశముల శిరోజములు జడలు మాదిరిగ పోగుపోగులుగ చెక్కుట, వ్యక్తిత్వమును తొలగించి గుణసామాన్యమును ప్రదర్శించుట కొఱకే. గుణసామాన్యమునే ప్రదర్శించుటలో ఆరితేరిన గ్రీకుశిల్పకళానిపుణులు సహితము వారు నిర్మించు విగ్రహములందు ప్రత్యేకవ్యక్తిత్వమును పూర్తిగ నిర్మూలించలేదనుటకు "వీనసు ఆఫ్ మిలాస్" (Venus of melos) అనే శిలావిగ్రహమే తార్కాణము. విగ్రహముహస్తములను గోల్పోయి నదయ్యెను శిల్పకళ కెంతయో వన్నె తెచ్చుట జూచి అతినిపుణు లగు శిల్పులు ఎందరెందరో హస్తములను అమర్చుటకు ప్రయత్నించిరి గాని లాభములేక పోయెను. హస్తము లమర్చినతోడనే భావమున మార్పు చెందినట్లు అనుమానము పొడముచుండుటజేసి వారిప్రయత్నమును మానుకొనిరి. ఇదియే సుప్రసిద్ధపురుషులచేతలయందు గల ప్రాశస్త్యము.

రోమక శిల్పము

గ్రీకుదేశములో అభివృద్ధిగాంచిన పిదప అనేకశతాబ్దములకు శిల్పము తిరిగి రోముదేశములో అభివృద్ధినొంది ప్రాముఖ్యము బడసెను. సజీవమైన కళలు కాలానుసారముగను స్థితిగతులంబట్టియు మార్పులు చెందుచుండును గదా! అందుచేతనే జీవకళయగు నీశిల్పమును రోముదేశమున, 14, 15, శతాబ్దములందు



మేనక-విశ్వామిత్రుఁడు




వేణుగాన కృష్ణుఁడు



సత్యభామ-కృష్ణుఁడు



సరస్వతి

శిల్పకారుఁడు: శ్రీయుత యమ్. యస్. నాగప్పగారు, నరసింగపురము, పూంటురోడ్డు, చెన్నపురి.

---

శ్రీయుత నాగప్పగారు ఈ శిలావిగ్రహముల చిత్రములను భారతియందుఁ బ్రకటనార్థ మొసఁగినందులకు వీరియెడ నెంతయుఁ గృతజ్ఞులము.—సంపాదకుఁడు.



గ్రీకుదేశమున ఏతెనుపట్టణమునందలి పార్థినను దేవాలయముయొక్క-
ప్రాకారముపైఁ జెక్కఁబడిన చిత్రము.



ఆఫ్రొడైటి-గ్రీకుల సౌందర్యాధిదేవత. రోమకుల కామదేవుని (వీనసును)బోలినది. ఈశిలావిగ్రహము రోమునందలి వాటికను భవనమున గలదు.



ఏతెను పట్టణమున ఒకానొక శిలా ఫలకముపైఁ జెక్కఁబడిన చిత్రము.

నూతన వికాసముతో అభివృద్ధికి వచ్చెను.

ఆకాలమున ఐరోపాఖండమందంతటను భావప్రపంచమున కలిగిన నూతన వికాసము వలన(Renaissance) నుద్భోదితుడైన రోమన్ శిల్పకళానిపుణుడగు మైకేల్ ఏంజిలో (Michael Angelo) అను నాతడు గ్రీకు శిల్పమునం దత్యంతాభిమానము కలవాడగుటం జేసి ఆంతరంగిక భావములను తెలియజేయు శక్తి యద్దానను లేకుండుటం జూచి సహింపలేక ప్రపంచమున తాబొందిన అనుభవజ్ఞానమువలనను తన ప్రతిభా శక్తి వలనను శిల్పకళయందు అట్టిలోపములు లేకుండ చేయ ప్రయత్నించి అత్యద్భుతమగు జయమును బొందెను.

డేవిడ్డు (David) శిలావిగ్రహ నిర్మాత యగు మైకేల్ ఏంజిలో గారి బుద్ధి చాతుర్యమును భావప్రకటనయందు తాబొందిన విజయ పరిణామమును జగద్విఖ్యాతి గాంచిన ఈ శిలావిగ్రహము కన్నులార గాంచు భాగ్యము గల్గిన ఏమానవులకు గోచరింపకుండును! ఈ విగ్రహము నెత్తిపై నుంచబడిన కఱకు రాతిని చూచినంతమాత్రముననే అపారమైన బాహ్యరూపసౌష్ఠవము గల యీముద్దులు మూటగట్టు శిలావిగ్రహము నెత్తిపై నింతకఱకు రాతినేల నుంచెనా యను సంశయము సకలమానవ హృదయములందు గలుగజేసిన దీయన శక్తి సామర్థ్యమే కదా?

ఈశక్తిసామర్థ్యములే మైకేల్ ఏంజిలో గారి ఖ్యాతిని నలుదెసలకు వ్యాపింప జేయ గలిగెను. ఈయన నిర్మించిన విగ్రహము లన్నియు రక్తమాంసప్రపూరితములై సంపూర్ణజీవము కలిగినటులే భావప్రకటనము గూడ జేయుచున్నవి. శిల్పకళయందు ఆంతరంగిక భావములను వెల్లడించుటకు అవకాశములను గలిగించినది యీయనయే! ఇదియే రోము దేశమున శిల్పకళబొందిన శాశ్వతమైన మార్పులని యెఱుంగనగును.

టస్కనీదేశ శిల్పము

మైకేల్ ఏంజిలోగారి తదనంతరము, టస్కన్నీ (Tuscanny) దేశమున గ్రీకుశిల్పుల గుణసామాన్యమును మైకేల్ ఏంజిలోగారి భావప్రకటమున సమ్మేళనము చేసి (low relief) శిల్పకళను వృద్ధిపరచిరి.

భారతశిల్పులు

హైందవ శిల్పులు ఐరోపాదేశస్థుల సాధారణశిల్పవిధానముల ననుసరించుచు మత సంబంధమైనట్టియు తత్త్వ సంబంధమైనట్టియు గూఢార్థమును బోధచేయుచు దేవస్థానముల లో దైవికమైనట్టి రూపలావణ్యములను వెల్లడించుచుందురు. పాశ్చాత్యులవలె, హైందవ శిల్పులకు మనుష్యునియొక్క రూపలావణ్యము, బాహుబలము, గుణాగుణములతో పనిలేదు. మన హిందూదేశములో నాగరికత ఉన్నతస్థితి యందుండునపుడు మతసంబంధమగు విషయములచే నెక్కువగా నిండియుండుట చేతను మతప్రచారకులలో కొందరు సాధారణముగా శిల్పకళానిపుణులగుటచేతను, మతబోధనలు చేయుటయందు తమ శిల్పచాతుర్యమంతయు వినియోగించిరి. "కాయముల్ బుద్బుద ప్రాయ

ముల్ పరికింప సంపదల్ చంచలసదృశము" లను నార్యోక్తి హైందవ జాతికంతయు అనాది సిద్ధమగు నమ్మకమగుటచే క్షణభంగురము లైన ఐహిక విషయము లందు ఆసక్తి లేక ఆముష్మికమునే సాధించుటకు అందరును ప్రయత్నపడుటచే శిల్పమునకు ఐహిక చిహ్నములను తెచ్చిపెట్టుటలేదు. అందువలనపాశ్చాత్యులవలె, భౌతిక బాహ్య సౌందర్యమును శిల్పమునందు చొరనీయలేదు. అస్థిరమైన రక్తమాంసాదులతో కూడుకొని ప్రకృతిదేహమును అసహ్యాభావముతో పరిగణించుట చేత శరీరావయసౌష్ఠవమునకు శిల్పమునందెట్టితావు నియ్యలేదు. మన దేశపుకళసాంకేతికమై (symbolic), ఆదర్శప్రాయమై (Idealistic), గూఢమై (mystic), ఆధ్యాత్మికమై (transcendental), ఆంతరంగికసంబంధమై, శాశ్వతమైనట్టి రూపలావణ్యమును తెలియపఱుచుచున్నది. కాన కామక్రోధలోభమోహ మద మాత్సర్యములచే చంచలించుచుండు ప్రకృతి స్వరూపముగాక అనంతమైన ఆధ్యాత్మిక స్వరూపమును పొందియుండును. ఇందుకు తార్కాణముగా బుద్ధుని విగ్రహముతీసికొన వచ్చును. ఉన్నతమైన స్వరూపము, విశాల వక్షస్థలము, ఆజానుబాహులు చూచిన ఉత్కృష్టవంశజాతుండనియు, మహావీరుడనియు నెల్లరునుపొగడక మానరు. ఇక ముఖవిలాసమును చూచిన చంచలతలేని శాశ్వత మైన తపస్సువలన కలిగిన శాంతము, నెమ్మది, ప్రశాంత మనస్కత, దివ్యజ్ఞానమును బడసినందు వలన కలిగిన తృప్తితో కూడుకొనిన మందహాసము, చూపరులకు వదనమున ప్రస్ఫుటము కాగలదు. ఇట్టి ఉత్కృష్టమైన దైవిక భావములను ప్రచురణచేయు శక్తి పాశ్చాత్య శిల్పమున కరుదు.

హైందవ శిల్పకారులు పాశ్చాత్యులకు పూర్వమే 'Full relief' నందును, 'Low relief' నందును వాటివాటి సౌందర్యమును లావణ్యమును కనుపెట్టి సరియైన తావులందు నిర్మించుటవలన కలుగు ఛాయావిభేదములచే సొంపు గొలుపుచు నూతనభావోత్పత్తికి తోడ్పడునటుల శిల్పమునకు వన్నెతెచ్చిరి. ఇందుకు తార్కాణములు అజంతా, ఎల్ఫెంటా (Elphanta), ఎల్లోరా (Ellora) గుహాలలో నిర్మింపబడిన అత్యద్భుతములైన శిల్పములు.

పై నుదహరించబడినట్టి ప్రాముఖ్యమైన భేదములు హిందూ శిల్పమునకును పాశ్చాత్య శిల్పమునకును ఆదర్శములందుండినను శిల్పమునందు ప్రత్యేక వ్యక్తిత్వమును తొలగించునట్టి క్రియలలో, అనగా, కనుపాపలు చెక్కి దృష్టి నివ్వకపోవుట, శిరోజములను చెక్కినపుడు పోగు పోగులుగా జడల మాదిరిని చెక్కుట, వర్ణములు వేయకుండుట, మొదలగు వాటిలో మాత్రము భారత శిల్పమును పాశ్చాత్య శిల్పమును ఒకే నియమమును పాటించుచున్నవి. కాని సాంకేతికములైన సూచనలు అవస్థలు ముద్రలు మొదలైన చిహ్నములచే భారత శిల్పము యితరశిల్పసభ్యతలను మించుటయే కాక శిల్పము తనంతటతాను తెలియపఱచగల పరిమితిని మించి భావములను వ్యక్తపఱుప గలిగినది.

ఈ విషయమునుగూర్చి యింతకుముందు వివిధములైన వ్యాసములు తెలుగుపత్రికల ద్వారా వెలువడినవి. అవి ముఖ్యముగా భారతశిల్పము చరిత్రానుసారముగా నెట్టుల పరిణమించినదో తెలియపఱుచుచు వచ్చినవి. ఈ వ్యాసము శిల్పము సాధారణముగా నేగినమార్గములు త్రొక్కుచుండెనో దాని గుణాగుణములను దాని సూత్రములను హైందవ ఆదర్శములను తెలియ జేయుటకై ఎట్టి మార్పులను పొందినదో సక్రమముగా చర్చించుటకై వ్రాయబడినది. కాని ఆపని నెరవేర్చుటకు తగినంతభావప్రకటనమునకు వీలగు ఆంధ్రభాషసమకూడదని ప్రతిబంధకముచే బాధపడుచు చదువరులకు యీ విషయము నందించుకంత యభిరుచి కలుగజేసి సరియైన విమర్శన దృష్టితో వివిధములైన శిల్ప సభ్యతలను వీక్షించునటుల చేయుటయే ముఖ్యోద్దేశముగా పరిగణించ గోరెదము.



# ద్వాదశజ్యోతిర్లింగములు

[సర్వేశ్వర సహస్రమునుండి]

సిద్ధదవోలు సుందరము పంతులు గారు

శ్రీ రామేశుఁడు సేతుబంధమునఁ గాశి న్విశ్వనాథుండు కే
దారేశుండు హిమాద్రి దారుకవనిం దానొప్పు నాగేశుఁడోం
కారేశుం డమరేశ్వరంబున మహాకాళేశుఁ డుజ్జైనిలో
సౌరాష్ట్రంబున సోమనాథపతి శ్రీశైలంబు మల్లేశుఁడున్
కారుణ్యామృత సాగరుండయిన దాక్షారామ భీమేశుఁడున్
పారేల్యంబున వైద్యనాథుఁడును భవ్యంబైన గోదావరీ
తీరత్ర్యంబక నాథశంకరుఁడు జ్యోతిర్లింగరూపంబు లె
వ్వారెల్లప్పుడు వేకువన్ శివుని దేవాగారముం జొచ్చినన్
నోరారం బఠియింప నెంతయును సంతోషాబ్ధినిం దేలి దు
ర్వారాఘంబులఁ బాసి మోక్షపదవిన్ రాణింతు సర్వేశ్వరా!




గూడవల్లి రామబ్రహ్మం గారు

సుమారు రెండువేలసంవత్సరముల క్రిందట ఆధునిక నాటక కళాభిమానుల యభిప్రాయమున ననుకూలముగ నుండునట్లు రచింపబడిన యీరూపక మాంధ్రనటమండలిచే నేటికయినను ప్రయోగింపబడినదిగ భావింపంబడుట శుభసూచకమే. కీర్తనలకు ప్రాముఖ్యమొసంగకతీఱని నేటి నాటకరంగమునం దాంధ్రీకృతసంస్కృతనాటకములకు దావు లభింపదు. అందును, వేణీసంహారమువంటి వీరరసప్రధానరూపకములకు జీవమే కలుగదుకాన నని ముట్టునైన సాహసించువారు లేరు. ఎట్లో రసభంగకరములైన మార్పులతోడను, కీర్తనలతోడను, కాళిదాసుని శాకుంతలముమాత్రము ప్రదర్శింపబడుచున్నది. ఈకీర్తనలు సామాన్యజనాభిలాషను దీర్చి, సంఘపోషణకు ధనము రాబడి నార్జించుటకుగా నుపయుక్తము లగుచున్నవని ప్రతీతి. కావున, భాషకు గద్య పద్యగీతములు మూడును స్వరూపములనుట వాటికిగల స్థలభేదముల నెఱింగి, యయ్యవి నాటకముల జొప్పింపబడిన నాటకమునందలి రసాంతరప్రాముఖ్యమునకు లోపముగలుగకుండ సామాన్యజనాభిలాషను సక్రమగతులకు ద్రిప్పవార మగుదుము. అవిఘ్నముగ సంఘాధిపతులును, నటులును పాటుపడుదురుగాత.

శ్రీయుత మోతే నారాయణరావు జమీందారు వారిచే బోషింపబడు శ్రీ సీతారామాంజనేయనాటక సమాజమువారు కీదృశమయిన ప్రయత్నమున ప్రథమస్థాన మలంకరించినారని వినుట కాంధ్రనాటక కళాభిమానులు సంతసింప వలసియున్నది. వారు మృచ్ఛకటికమను ప్రకరణమును ప్రదర్శింపుమ నీయుద్యమమును ప్రారంభించిరి. పవిత్రమగు నీకృషియుద్యమస్థాపకులగు శ్రీనారాయణరావు గారికి భగవంతుడాయురారోగ్యములు ప్రసాదించుగాక.

ఈ నాటకమునందు గల పాత్రము లన్నియు అపూర్వప్రాయములే. వేశ్యయెడ ననురాగము కలిగియు ధర్మానురక్తిగల చారుదత్తుడు వేశ్యాలోలురకును, వేశ్యయయ్యు బహువిటసమాకర్షణాభిలాషము లేని వసంతసేన వేశ్యలకును అపూర్వప్రాయులు. వసంతసేనం గామించియు నామెశీల మెఱింగి యామెయెడ గలకాంతా గౌరవము వహించి యామెకు కష్టదశ సంప్రాప్తించిన తఱి నా దశను తొలగింప ప్రయత్నించిన విటుడు సామాన్య విటులకును, సర్వవిధముల చౌర్యమున నారితేఱిన శర్విలకుడు జారచోరులకును, జూదమున నోడి సర్వమును గోలుపోయి బౌద్ధసన్యాసియై జీవితము పవిత్రము గావించుకొనిన సంవాహకుడు జూదరులకును, తమ తమ చరిత్రలలోపముల నెల్ల దిద్దుకొను సదుపాయములు చెప్ప నేర్పడిన సాధారణపాత్రములు.

ఈనాటకము శృంగారరస ప్రధానము. ఇందు నాయకుడు ధీరోదాత్తుడగు చారుదత్తుడు. శకారు డిందు ప్రతినాయకుడని కొందఱి యభిప్రాయము. పూర్వ నాటకలక్షణానుసారముగ వీరరసమునందువలె శృంగారరసమున ప్రతినాయకు లుండరు. అదియుగాక నీచపాత్రయగు శకారు నుత్తమపాత్రయగు చారుదత్తునికి ప్రతినాయకునిగ భావించుటయు దగనిదే. నాయక ప్రతినాయకులలో నొకరినొకరు లక్ష్యముచేయ దగినంత గుణరూప సౌశీల్య ప్రసిద్ధముగ పరస్పరత సిద్ధింపవలసియుండును.

శకారుడు కులశీల మర్యాదల కడునీచుడు. వానికిగల గౌరవము "రాజుగారి యుంపుడుకత్తె తమ్ముడని" ఘూర్ణుడయిన పాలకమహారాజు దయవలన రాష్ట్రియశ్యాలకు డయ్యెను. జన్మమువలన గలిగిన

* భావప్రదర్శనములకు నీనాటకమందలి పాత్రధారుల చిత్రము లీసంచికయందు గలవు.



1. శ్రీయుత ఆరణి సత్యనారాయణగారు-వసంతసేన

ఉజ్జయినీ పురవీథి. వసం:—అమ్మయ్యో, అమ్మయ్యో, పరిచారికలందఱు నెచ్చటకిఁ బోయిరో! నేఁడు నా యాత్మను నేనే రక్షించుకొనవలయును.। మృచ్ఛకటికము.

2. శ్రీయుత కొచ్చెర్లకోట రంగారావు గారు-శకారుఁడు

శకా:—గీ. ఏను దుశ్శాసనునివలె నిపుడు నీదు, కొప్పు దొరకొందు జమదగ్నికొడుకు భీము నేనుఁ డేతెంచి యాఁపునో చెనటి కుంతి, కాత్మజుం డగు రావణుం డాఁపఁగలఁడొ? మృచ్ఛ.



శ్రీయుత ఆలమూరి పట్టాభిరామయ్యగారు-మైత్రేయుఁడు

చారుదత్తుని యింటిముందు 1. "మైత్రే:—నా యదృష్టమువలెఁ గుటిలముగానున్న యీచేతికఱ్ఱతోఁ బుచ్చిపోయిన ప్రాఁత వెదురుబొంగుఁ బగులఁగొట్టినపగిది వానితల వ్రక్కలు చేసెదను.

2. శకా:—అమ్మో! చచ్చితిని.[శ్రీ సీతారామాంజనేయ నాటకసమాజము, ఏలూరు.]








శ్రీయుత ముంజులూరి కృష్ణరావు గారు-శర్విలకుఁడు

శర్వి:—బ్రాహ్మణులకు యజ్ఞోపవీతము పరమోపకారకమగువస్తువు.

గీ. దీనిచేఁ దల్పుగడె లూడఁదీయవచ్చు
దీనిచే సీల నగలకుఁ ద్రిప్పవచ్చు
దీనిచేఁ గొల్వవచ్చు భిత్తిక సురంగ
దీనిచేఁ బాము విషమును దింపవచ్చు. మృచ్ఛకటికము.

మేఘావరణసమయము-వర్షము

(ఉజ్జ్వలాభిసారిక)

వసం:—క. ఉఱుములు పెల్లుఱమించుచు
కురిపించుచు వానయుఁ బిడుగులతోఁ గూడన్
మరలించుట నీతరమా
తెరవలు ప్రియులను గలయఁమతిం బోవునెడన్. మృచ్ఛ.

నీచత్వముచేత బిఱికియయ్యెను. ఇతడు రాష్ట్రమునందెల్ల స్వేచ్ఛాసంచారము గలవాఁడై తాను సర్వజ్ఞుఁడ నను భావము గలవాడు. అట్టిపాత్రమును రసోచితముగ బ్రదర్శించుట కడుకష్టము. కేవలము హాస్యరసప్రధాన మైన దిగ భావింపక శృంగారవీరబీభత్సభయానకముల వికృత స్వరూపమే యీపాత్రవలన నడిపింపవలయును.

శ్రీసీతారామాంజనేయ సమాజమున నీపాత్రను ధరించిన శ్రీకొచ్చెర్లకోట రంగారావుగారు కడుసమర్థులు. వసంతసేనవెంబడించుతఱి, జీర్ణకరండకోద్యానవనమున, అధికరణమంటపమున తమచాకచక్యమును చక్కఁగ నెల్లడించిరి. శ్రుతిసహాయమిసుమంతయయినను లేక పద్యములను స్ఫుటముగ జదువుటలో నూతనమార్గము ద్రొక్కిరి. కాని వాచికాభినయమందలి గాంభీర్యాతిశయమును, ఆంగికమునందలివేగవిస్తృతియు హరింపబడిన ప్రదర్శన మింకను బాగుగనుండుననిపలువు రభిప్రాయపడుచున్నారు.

చారుదత్తుడు ధీరోదాత్తుడు. ధీరోదాత్తు డన సర్వావస్థలయందు నొక్కవిధముగ నుద్ధతిలేక శాంతుడై సంచరించువాడు. సర్వగుణ సమిద్ధుడు. లోకవ్యవహారములన్నియు నెఱింగి దుర్గుణముల పొంతబోవని యుత్తమశీలము గలవాడు. వీనియందు తత్తరము, ఆవేగము, మొదలగు తీవ్రభావము లుండవు కాని, నిర్లక్ష్యము, అవశత మొదలగు సమాంద్యావస్థలు నుండకూడదు. ఈపాత్రము జాగ్రతగ ప్రదర్శింపబడినచో శకారుని జుగుప్సలో నంతరించిపోవుటో, కాక వాఁడభినయింపవలసిన వివిధరసముల శోభను యథారీతిని కనుబడనీయకపోవుటో సంభవించును. ఈతడు బ్రాహ్మణుడు; ఇప్పటివారి క్రాపింగులు మీసములు మొదలగునవి, పూర్వకాలపు హిందూదేశీయులు మతవర్ణభేదముల ననుసరించి వేషములు దాల్చుట కడ్డము వచ్చుచుండును. శుద్ధశ్రోత్రియుడగుట పాపటగలవిగ్గను ధరించుట ప్రమాదము. తలకొకశాలువను చుట్టుకొనిన బాగుగనుండునేమో. ఈపాత్రమును ధరించిన శ్రీలక్ష్మణరావుగారిని చూచినవారు, నిజమైన చారుదత్తుడేమో యని భ్రమింపకపోరు. వీరు మిగుల మాంద్యముగ వివిధాభినయములయందు ప్రవర్తించుటచేత, ప్రదర్శనమున నుండవలయుసామరస్యము చూపట్టుచున్నదని చెప్పవచ్చును.

వసంతసేన విద్యాచతురసంపన్నయైన వేశ్యయైనను, విటకాండ్రమధ్య విచ్చలవిడిగా సంచరించు టక్కునిక్కులబోగముది కాదు. వేషభావములందు మిగులపరాకర్షణసమర్థత నెరపువ్యాపారము గలదియైనను, సాంసారికప్రవృత్తినుండి దలంపుగలిగి చరించెడి స్వాతంత్ర్యవతి. ఆమెయే చారుదత్తునకు సహాయము చేయుట, జూదగానికి ధనమిచ్చి వాని అప్పుదీర్చుట, మొదలగువానివలన పూర్వార్జించిన విత్తముగలది యని తెలియుచున్నది. కాని అంతమాత్రమున, యది విటజనవశీకరణమును గావించు విలువగలిగిన భూషణములను ధరించునని తలప వలనుపడదు. విటులు తన్ను చూడకుండవలయుననియే యామె తలంచును. సుగుణములును, సౌందర్యమును, గల యౌవనవతి. చిన్నతనమునందు కులవిద్యలగు గానాభినయములనేర్చి కొనుట యిప్పటికిని ఆచారము గాన నావిద్యలయందు నిపుణతగలది యని యూహింపవచ్చును. కావున గమనమునం దొయ్యారము, పలుకునందు నేర్పు, హావభావముల స్ఫురణయు, గలిగి నటించుట వేశ్యాకులమున జన్మించినది యని స్ఫురించుట కుండి తీరవలయును. ఈ పాత్రమును ధరించిన శ్రీ ఆరణి సత్యనారాయణగారు పాత్రధారణమునందు పైన చర్చించిన మార్పుల గనుపఱచి అభినయమందు కాననగు పురుషత్వమును సంహరించిన నింక వాసి వహింప జాలుదురు.

"విటు డొక్కడా యిద్దఱా" యను సందేహము చాలమందికి గలదు. ఈ సంఘమువారు యిద్దఱని నిర్ధారణ చేసినట్లు తోచుచున్నది. కొంద ఱొక్కడే యనియు ఒక్క విటుని పరివర్తనమె చూపింపబడెననియు సిద్ధాంతము జెప్పుచున్నారు. దీనిగూర్చి విపులముగా ముందు చర్చింతును.

ఈపాత్రమునం దొక విశేషము గలదు. శకారుని వీడు వెంబడింపని యుండును. అట్లుకానియెడల వసంతసేన మిగుల దురవస్థపాలు గావలసివచ్చును. వసంతసేనయెడ నతడనురాగము గలవాఁడైనను దాని గుణగణమునెడ సుముఖత్వము గలవాడు. బలాత్కారముననైనదానిం బొందదలంపుగలవాఁడు కాదు. దానిమాటయందు విశ్వాసము గలవాడు కూడను. కావుననే జీర్ణకరండకోద్యానవనమున నది బండి దిగినప్పుడు మొదట తల్లి

పనుపున వసంతసేన శకారుని కోరిక దీర్పవచ్చిన దని నిశ్చయించి అది బండి మార్పుదలచే వచ్చితినని చెప్పగనే విశ్వసించెను. ఈపాత్ర మంత ప్రాముఖ్యముగ నీసంఘము వారు తలంచినట్లు తోపదు.

శర్విలకుడు చౌర్యమును శాస్త్రప్రసిద్ధముగ నేర్చికొనిన బ్రాహ్మణుడు. వసంతసేనయింట దాస్యము చేయుచున్న మదనికయందు మోహముగలవాడై తానేర్చిన విద్య ప్రదర్శింప బయలువెడలెను. కేవలము వ్యామోహమే యీచౌర్యమునకు కారణము. అందువలన వీని వృత్తియెడ విముఖతయు, కాబోయెడు పాలకుడైన ఆర్యకు ననుసరించియుండు నుద్దేశ్యమును కలిగి వెడలిపోయెను. ఈపాత్రమును ప్రదర్శించుపట్ల క్రొత్తవానికిం గలుగు నేమఱుపాటును, సాహసమును పరులు చూతురను భీతియు, పిల్లివలె నడచుటయు, వెనుకముందులు పరీక్షించుటయు, కనబఱుప వలయును. ఈపాత్రమునుధరించిన ముంజులూరి శ్రీకృష్ణరావుగారు చక్కగనే ప్రదర్శించిరి; కాని వారు రంగమున పక్కాదొంగలాగున నడచిరి; క్రొత్త బిచ్చగాడగు బ్రాహ్మణదొంగ పోకడలను కనబఱుపలేక పోయిరి.

సంవాహకుడు చారుదత్తునిసేవ చేయుచుండువాడు. జూదగాడై, దరిద్రుడై, బౌద్ధసన్న్యాసియాయెను. ఈతనివలన జూదగాండ్రకుండువ్యసనము చక్కగా తెలియ నగును. ఓర్పును, నేరుపును గలవాడు. అట్టి యీపాత్రను ప్రదర్శించుపట్ల తొందఱ పనికిరాదు. అట్టితొందఱవలన, రసము, సుగోచరము కాదు. ఈపాత్రధారి కొంచెము తొందఱపడినట్లు కనబడినది. బౌద్ధసన్న్యాసిగా వచ్చినప్పుడు చిలుముబై రాగివలెనుండెను. సర్వముండనము గావించుకొనవలయు ననునియమముగల బౌద్ధుల కిట్టి సన్న్యాసి దొరకుట కర్మపరిపాకముగాక మఱియేమి?

ఇందలివిదూషకపాత్రమును హాస్యరసప్రధానము గగాక, తనకు సంబంధించినపాత్రల ఔచిత్యమును వెల్లడి పఱచుటకుగా సృష్టింపబడెను. అందుచేత, యీ పాత్రధారి ప్రతివిషయమును హాస్యమున ముంచక, కడునిపుణతతో మెలగవలయును. శ్రీయుతఆలమూరి పట్టాభిరామయ్యగారు యీపాత్రనుధరించి. తమసహజవిదూషకత్వమును మాని, స్వకపోలకల్పితసమాసముల విడనాడి, శ్రద్ధగా, నేర్పుతో కడు సమర్థతతో యీ పాత్రను పోషించిరి. ఇదంతయు, సంస్కృతనాటకముపైని వారికి గల అభిమానమునుకొనెడను.

మిగిలిన పాత్రములన్నియు, యథోచితములేకాని యిందొక్కటియు నిష్ప్రయోజకము కాదు. కాని కొలది భాగములలో జూపట్టవలసిన కరుణబీభత్సములకు దగినంతసామరస్య మొదవలేదు. దీని నింతతో విడువక సామాజికులు సంపూర్ణరస ప్రదర్శనసౌభాగ్యము సిద్ధింప బ్రయత్నము చేయుదురుగాక.

ఈనాటకము, రంగాలంకారముల గోరువారికి మిక్కిలి యనుకూలము. పరిభ్రమణరంగ నిర్మాణమునకు (Revolving Stage)చాలయవకాశము గలదు. ఇందును, విశేషవ్యయప్రయాస లక్కరలేక సులభప్రయాణమున కనుకూలముగనే చేయింపవచ్చును. రంగస్థలమున పాత్రములుండగనే యీభ్రమణ మిబ్బందిలేకుండ జేయింపనగును. అందులకు చతుర్థాంకములోని వసంతసేన భవనరంగము మిగుల ననుకూలము. అట్టి రంగమును, సమాజమువారు కనబఱుపరైరి.తదితర రంగాలంకారములన్నియు చక్కగ చూపబడినవి.

ఇంకొకమనవి. ఈనాటకమును ప్రదర్శింపదలచినవారొక్కదినమునకు దగినంత నేర్చి ప్రదర్శించుటయే కాక సంపూర్ణముగ నేర్చి మొదటిభాగము సాయంకాలమును రెండవభాగము రాత్రియందును బ్రదర్శింప సమకట్టుట మేలని నావిన్నపము. ఏలయన యిందలి యితివృత్తము సామాన్య వ్యవహార ప్రసిద్ధముగుటచే విడిచి వేయదగినది యుండదనియు విడిచిన భాగములవలన కొంత సామరస్యము చెడిపోవుననియు నా సందేహము.

మొత్తముమీద సూరిశాస్త్రిగారు వ్రాసినటు లీనాటక ప్రదర్శనము రక్తికట్టి ప్రేక్షక సముదాయమును ఆనందమున ముంచివేసినది. శ్రీమోతే నారాయణరావుగారు సమాజమును స్థాపించి కొలదికాలమే యైనను ధీరోదారులై సంస్కృత నాటక ప్రదర్శనము నెడ నభిలాష వహించి మృచ్ఛకటికతో నుద్యమమును బ్రారంభించుట యెంతయు బ్రశంసార్హము.

ఇంతటితో విడువక, ఈసమాజమువారు సంస్కృత నాటకములన్నియు, ఆంధ్రలోకమునకు పరిచితము చేయుదురుగాక.

పనుపున వసంతసేన శకారుని కోరిక దీర్పవచ్చిన దని నిశ్చయించి అది బండి మార్పుచేతచే వచ్చితినని చెప్పగనే విశ్వసించెను. ఈపాత్ర మంత ప్రాముఖ్యముగ నీసంఘము వారు తలంచినట్లు తోపదు.

శర్విలకుఁడు చౌర్యమును శాస్త్రప్రసిద్ధముగ నేర్చికొనిన బ్రాహ్మణుడు. వసంతసేనయింట దాస్యము చేయుచున్న మదనికయందు మోహముగలవాడై తానేర్చిన విద్య ప్రదర్శింప బయలుదేఱెను. కేవలము వ్యామోహమే యీచౌర్యమునకు కారణము. అందువలన వీని వృత్తియెడ విముఖతయు, కాబోయెడు పాలకుడైన ఆర్యకు ననుసరించియుండు నుద్దేశ్యమును కలిగి వెడలిపోయెను. ఈపాత్రమును ప్రదర్శించుపట్ల క్రొత్తవానికిం గలుగు నేమఱుపాటును, సాహసమును పరులు చూతురను భీతియు, పిల్లివలె నడచుటయు, ననుకొనుందులు పరీక్షించుటయు, కనబరుప వలయును. ఈపాత్రమునుధరించిన ముంజులూరి శ్రీకృష్ణరావుగారు చక్కగనే ప్రదర్శించిరి; కాని వారు రంగమున పక్కాదొంగలాగున నడచిరి; క్రొత్త బిచ్చగాడగు బ్రాహ్మణదొంగ పోకడలను కనబఱుప లేక పోయిరి.

సంవాహకుడు చారుదత్తునిసేవ చేయుచుండువాడు. జూదగాడై, దరిద్రుడై, బౌద్ధసన్న్యాసియాయెను. ఈ తనివలన జూదగాండ్రకుండువ్యసనము చక్కగా తెలియ నగును. ఓర్పును, నేరుపును గలవాడు. అట్టి యీపాత్రను ప్రదర్శించుపట్ల తొందఱ పనికిరాదు. అట్టితొందఱవలన, రసము, సుగోచరము కాదు. ఈపాత్రధారి కొంచెము తొందఱపడినట్లు కనబడినది. బౌద్ధసన్న్యాసిగా వచ్చినప్పుడు చిలుముపై రాగినవెనుండెను. సర్వముండనము గావించుకొనవలయు నను నియమముగల బౌద్ధుల కిట్టి సన్న్యాసి దొరకుట కర్మపరిపాకముగాక మఱియేమి?

ఇంచలివిదూషకపాత్రమును హాస్యరసప్రధానముగగాక, తనకు సంబంధించినపాత్రల ఔచిత్యమును వెల్లడిపఱచుటకుగా సృష్టింపబడెను. అందుచేత, యీ పాత్రధారి ప్రతివిషయమును హాస్యమున ముంచక, కడునిపుణతతో మెలగవలయును. శ్రీయుతఆలమూరి పట్టాభిరామయ్యగారు యీపాత్రనుధరించి. తమసహజవిదూషకత్వమును మాని, స్వకపోలకల్పితసమాసముల విడనాడి, శ్రద్ధగా, నేర్పుతో కడు సమర్థతతో యీ పాత్రను పోషించిరి. ఇదంతయు, సంస్కృతనాటకముపైని వారికి గల అభిమానమనుకొనెదను.

మిగిలిన పాత్రములన్నియు, యథోచితము లేకాని యిందొక్కటియు నిష్ప్రయోజకము కాదు. కాని కొలది భాగములలో జూపట్టవలసిన కరుణబీభత్సములకు దగినంతసామరస్య మొదవలేదు. దీని నింతతో విడువక సామాజికులు సంపూర్ణరస ప్రదర్శనసౌభాగ్యము సిద్ధింప బ్రయత్నము చేయుదురుగాక.

ఈనాటకము, రంగాలంకారముల గోరువారికి మిక్కిలి యనుకూలము. పరిభ్రమణరంగ నిర్మాణమునకు (Revolving Stage)చాలయవకాశము గలదు. ఇందును, విశేషవ్యయప్రయాస లక్కరలేక సులభప్రయాణమున కనుకూలముగనే చేయింపవచ్చును. రంగస్థలమున పాత్రములుండగనే యీభ్రమణ మిబ్బందిలేకుండ జేయింపనగును. అందులకు చతుర్థాంకములోని వసంతసేన భవన రంగము మిగుల ననుకూలము. అట్టి రంగమును, సమాజమువారు కనబఱుపకైరి. తదితర రంగాలంకారములన్నియు చక్కగ చూపబడినవి.

ఇంకొకమనవి. ఈనాటకమును ప్రదర్శింప దలచినవా రొక్కదినమునకు దగినంత నేర్చి ప్రదర్శించుటయే కాక సంపూర్ణముగనేర్చి మొదటిభాగము సాయంకాలమును రెండవభాగము రాత్రియందును బ్రదర్శింప సమకట్టుట మేలని నావిన్నపము. ఏలయన యిందలి యితివృత్తము సామాన్య వ్యవహార ప్రసిద్ధముగుటచే విడిచివేయదగినది యుండదనియు విడిచిన భాగములవలన గొంత సామరస్యము చెడిపోవుననియు నా సందేహము.

మొత్తముమీద సూరిశాస్త్రిగారు వ్రాసినట్లీనాటక ప్రదర్శనము రక్తికట్టి ప్రేక్షక సముదాయమును ఆనందమున ముంచివేసినది. శ్రీమోతే నారాయణరావుగారు సమాజమును స్థాపించి కొలదికాలమే యైనను ధీరోదారులై సంస్కృత నాటక ప్రదర్శనము నెడ నభిలాష వహించి మృచ్ఛకటికతో నుద్యమమును బ్రారంభించు టెంతయు బ్రశంసార్హము.

ఇంతటితో విడువక, ఈసమాజమువారు సంస్కృత నాటకములన్నియు, ఆంధ్రలోకమునకు పరిచితము చేయుదురుగాక.




## ప్రథమ తరంగము

### ౧ జననీజనకులు

భారతము

తల్లి ప్రేఁగుసువ్వొ, ధరణికంటెను; నాక
సంబుకంటెఁ బొడవు, జనకుఁడు; దరయ
గాడ్పుకంటెఁ మనసు కడుశీఘ్రగతి; తృణో
త్కరముకంటెఁ జింత కరముఁ దఱచు.

క. జనకుం డధికుఁ డుపాధ్యా
యునకుఁ బదిమడుంగు; లెక్కడుర్వీనాథా!
జనకునకు దశగుణంబులు
జనని గురుత్వమున నిది ప్రశస్తము శ్రుతు

క. కలవాఁడు లేనివాఁడు స [లన్.
బలుఁడబలుఁడు మూఢబుద్ధి ప్రౌఢుండనఁగా
వలదెవ్వరికైన జనని
కలిమియు, యత్యంతసౌఖ్యకరమైయుండున్.

గీ. వచ్చిపోయి, చూచు వాఁడు గాకిడుములఁ
బడునె? తల్లివోలెఁ బట్టితోడఁ
దండ్రి? చెప్పనిట్లు ధర్మశాస్త్రంబుల
నంబ గౌరవమున నధికయగుట.

చ. కరచరణాది సంఘటిత
కాయము సంజననంబు వహ్నిపు,
ట్టరణియపోలెఁ దల్లి దెస
నైనది గాదొకో యట్లుగాక దు,
ర్భరమగు గర్భఖేదమును
బట్టికినై, నిజదేహచింతపై
భర మొకయింత లేక పడు
పాటులు నక్కట యెక్కుడింతకున్.

గీ. బాలుఁడైనఁ గొడుకు, ప్రౌఢుఁడైనను వృద్ధుఁ
డైన నొక్కవిధమ యర్మిలియును
నరయ భరము తల్లికాపదార్థంబు జ
గంబు కలిమికెల్లఁ గారణంబు

ఆ. క్షుద్రజంతువులకు గురులకు నెమ్మియిఁ
దలఁప నొక్కరూప తల్లివలయు
నూఱడిల్లఁ గలదె యొండుచోటులను వ
స్తువు నివాసమైన చోటఁగాక.

క. అప్పుడ యసమర్థుండగు
నప్పుడ దుఃఖియగు, శూన్యమైతోఁచుజగం
బప్పుడ మాతృవియోగం
బెప్పుడువాటిల్లెనపుడ యెంతయుదూలున్.

గీ. మాతకును, వేదమునకు, ధర్మంబులకును
బరములగు గురు శాస్త్రలాభములు లేవు
తపములే దుపవాస వ్రతంబుకంటె
నధికమైనది; యింద్రు మహాత్ము లనఘ!

* శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారిచే ఏర్చి కూర్పఁబడినది.

సీ. వినుము తల్లియుఁ దండ్రియును, గురుండు
నీయులు సద్భక్తి నిత్యనిరతి [ను సేవ
వారలఁ గొలుచుచు వారెద్ది చెప్పిన
నదియాదరించుట యధికధర్మ
మాగమత్రయమును, నగ్నిత్రయంబులో
కత్రయంబును దేవతాత్రయంబు
ననువస్తువులు వానియందును జనని గౌ
రవమున నెక్కుడు రాజముఖ్య!

గీ. యీజగంబున, దివమునఁ బూజవడయు
మాతృభక్తుఁడు; పితృభక్తి మానసుండు
నట్ల యవ్యయానంద సంప్రాపణంబు
గురుపదాబ్జ సమారాధకుండు గాంచు.

క. జననీజనక గురులయెడ
నొనరించిన మేలుగీడు లొందవించు సుఖం
బునకును దుఃఖమునకు నిం
తని కొలఁది యిడఁగ వశంబె? యజునకు

క. మాతృపితృగురులు దక్కఁగ [నైనఁగ.
నేతెరువునఁ బాప మొలసెనేనియు దానిం
బాతురు, ప్రాయశ్చిత్త
స్థితులు,దద్విషయమైనఁ జెడదల్పమునఁగ.

క. జనకుఁడు దపమును ధర్మం
బునువిద్యయుఁబరమదైవమునుగావున నా
తనికిఁ బ్రియంబగు పనిసే
సిన దేవతలెల్లఁ బ్రీతిఁ జెందుట గల్గున్.



# బాల్యస్మృతి

'కృష్ణుడు,' బి. యే.

సంజవేళల నపరంజి చాయ దాల్చి
శోభిలు మొయిళ్ల పిండులజూచి యెవరో
నింగిపై బసుపు కుంకుమ నెరపిరనుచు
జెప్పుకొనుచుంటి మిచ్చోట జెలిమి కాడ!

నిండు జాబిల్లి గురియు వెన్నెలలలోన
నాటకత్తెల గూడి నే హర్షమునను
బొంగి పరువెత్తి వెన్నెలపోగు లాట
లిచ్చటనె యాడుకొంటి నోయీ హృదీశ!

పసుపు కుంకుమ లలది క్రొంబసిడి చాయ
నలరు తాటాకు బొమ్మల కంబరముల
దొడిగి యాభరణంబుల తోడ వాని
వింతగ నలంకరించి గావించినాము
వియ్యముల బెండ్లిపండుగల్ వేడ్క నిచట.

అతిరయంబుగ నుంటి బాల్యంబు నందు
ఉదయమాదిగ నాటల మదిని నిల్పి;
కన్నులకు గట్టినట్లుండె కాంత! నాకు
చిన్నతనమందు జేసిన చేష్ట లెల్ల



1. వసం:—జూదగాఁడా! ఈ ప్రదోషకాలము సుఖకరముగనున్నదా! 2. చారుదత్తుఁడు.



శ్రీయుత లక్ష్మణరావు గారు-చారుదత్తుఁడు

చారు—గీ. ప్రేమ సర్వధనంబు దరిద్రులకును, భాగ్యవంతులకును దుల్యభాగ మార
పుత్రగాత్ర పరిష్వంగమున జనించు, సుఖముకంటెను వేఱొండు సుఖముగలదె? మృచ్ఛకటి.

[శ్రీ సీతారామాంజనేయ నాటకసమాజము, ఏలూరు.]



శ్రీ నెల్లూరు నాగరాజరావుగారు—పాపారాయఁడు

(బొబ్బిలి యుద్ధనాటకము)



శ్రీయుత సానం నరసింహారావు గారు

పురుషాకృతి నున్న రోషనార

"అది రామసింహుని యాగమనమే; ఇఁక నా కపటనాటక మాడెదఁగాక"

(శివాజీ.)

శ్లో. ద్విస్వరం త్రిస్వరం వాపి చతుస్స్వర
మథాపివా, క్రమం కించి ద్విలిఖ్యాదా
పూర్వాఃపూర్వాః పరాదథ. స్వరః స్థాప్యః
సచే దగ్రే తత్పూర్వ స్తదధో భవేత్,
పరతోఽపి లిఖే ద్ధీమాన్ స్వరానుపరి
వర్తినః; మూలక్రమః క్రమాత్ పృష్ఠే
శేషాః ప్రస్తార ఈదృశః.

(సం. రత్నాకరం, దర్పణం)

దీనియందు రత్నాకర దర్పణములకు కొంచెము పాఠాంతరముగలదు. ప్రస్తారక్రమమును నిరూపించియున్నారు. దీని కనేకమార్గములున్నవి. వీనిలో ముఖ్యమగుదానిని నిరూపించెదము. ఏకస్వరమునకు నొకభేదమే. స్పష్టము. ద్విస్వరతానమునకు సరి, రిస,యని రెండగుటయు స్పష్టమే; త్రిస్వరతానములందు సాద్యములు 2, రి ఆద్యములు 2, గాద్యములు2 అనగ సరిగ, సగరి, రిసగ, రిగస, గసరి, గరిస =6 అగుచున్నవి. ఇదియు స్పష్టము. చతుస్స్వరతాన(సరిగమ)లందున సరి, సగ, సమ, రిగ, రిమ, గమ, యీరీతిని ప్రస్తరించి శేషించిన రెండుస్వరముల ప్రక్కను వ్రాయుట యొకప్రస్తారభేదము. ఇట్లుగాక సంగీతదర్పణాదిపూర్వగ్రంథములందు ప్రస్తారక్రమమున సరి, రిస, సగ, గస, రిగ, గరి, సమ, మస, రిమ, మరి, గమ, మగ, యీతీరున వరుసగ లిఖియించి శేషించినస్వరముల వీటిప్రక్కను వ్రాయుటచే పండ్రెండును, మరల నీస్వరముల నట్లేయుంచి శేషించినస్వరముల ప్రస్తరించుటచే (అనగ "గమ" యనుటకు "మగ" యని లిఖించుట) మరల పండ్రెండును మొత్తమున నిరువదినాల్గగుచున్నది. దీనికి వివరము:

1. స రి గ మ—స రి మ గ 13
2. రి స గ మ—రి స మ గ 14
3. స గ రి మ—స గ మ రి 15
4. గ స రి మ—గ స మ రి 16
5. రి గ స మ—రి గ మ స 17
6. గ రి స మ—గ రి మ స 18
7. స మ రి గ—స మ గ రి 19
8. మ స రి గ—మ స గ రి 20
9. రి మ స గ—రి మ గ స 21
10. మ రి స గ—మ రి గ స 22
11. గ మ స రి—గ మ రి స 23
12. మ గ స రి—మ గ రి స 24

దీనిని ఏరీతిగ ప్రస్తరించినను a. b. c. d. అనునా నాల్గింటిలో, ab, ac, ad, bc, bd, cd, అనునవియూ ఏతీరున గల్గుచున్నవో అట్లే కల్గుచున్నవి. ప్రస్తారభేదమనగ దీనిలో వరుసభేదముదక్క దక్కినభేదములందునను మొత్తముమీద పైన గనుపఱచిన ప్రభేదములు మాత్రమే గలుగగలవు. దీనికి పైన యేప్రస్తారము ప్రకారమునను గలుగుటకు వీలులేదు. ఏదియో యొకవరున జ్ఞాపకము పెట్టికొనవలసియున్నది. చివరనుంచి మొదటికో మొదటినుంచి చివరకో ప్రస్తరింపగా గల్గు భేదములవరుస తప్పినను, సంఖ్యమాత్ర మొక్కటనియే తేలుచున్నది. ఇట్లే పంచస్వర (ఔడవ)షట్స్వర(షాడవ) సప్తస్వర (సంపూర్ణ) తానభేదప్రస్తారము గ్రంథాతివిస్తరభీతి విరమితము. ఊహ్యాము.

పిమ్మట నష్టోద్దిష్టతానబోధార్థము ఖండమేరువునుగూర్చి వ్రాయబడుచున్నది.

శ్లో. సప్తాద్యేకాన్తకోష్ఠానా మధోఽధః సప్త పంక్తయః, తా స్వాద్యాయా మాద్యకోష్ఠే లిఖే దేకం పరేషుఖమ్. వేద్య తానస్వర మితాన్ న్యస్యే త్తేష్వేవ లోష్టకాన్, ప్రాక్ పంక్త్యాంకసంయోగ మూర్ధ్వాధః స్థిత పంక్తిషు. శూన్యా దధో లిఖే దేకం తంచాధోఽధః స్వకోష్ఠకాన్, కోష్ఠసంఖ్యాగుణం న్యస్యేత్ ఖండమేరు రయం మతః.

(సం. రత్నాకరం)

శ్లో. సప్తకోష్ఠాన్ లిఖేదాద్యాన్ పంక్తిమేకైక కోష్ఠతః, హీనంతు పూర్వపూర్వాంస్యాత్ పంక్తిషట్కం మధో లిఖేత్. ఆద్య పంక్త్యాదికోష్ఠేతు లిఖే దేకం పరేషు ఖమ్, ద్వితీయ పంక్త్యా మప్యేకం ఆద్యకోష్ఠే లిఖే ద్బుధః. పరేషు పూర్వపూర్వోకం కోష్ఠసంఖ్యా గుణం న్యసేత్, ఏవమేవ లిఖే దంకం అధోఽధః పంక్తికోష్ఠకే; ఖండమేరు రయం ప్రోక్తో నష్టోద్దిష్టప్రభోధకః. (సం. దర్పణం)

ఖ ం డ మే రు వు

| పంక్తి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|---|
| | స C | రి D | గ E | మ F | ప G | ద A | ని B |
| పంక్తి 1 | 1 | 0 | 0 | 0 | 0 | 0 | 0 |
| 2 | | 1 | 2 | 6 | 24 | 120 | 720 |
| 3 | | | 4 | 12 | 48 | 240 | 1440 |
| 4 | | | | 18 | 72 | 360 | 2160 |
| 5 | | | | | 96 | 480 | 2880 |
| 6 | | | | | | 600 | 3600 |
| 7 | | | | | | | 4320 |

ఖండమేరువు

అనగ నూర్ధ్వమున నేడుగళ్లు గీచి దానికి దిగువ నారుగళ్లు, దానికిక్రింద నైదు, దాని క్రింద నాల్గు, మూడు, రెండు, ఒకటి వరుసగ దక్షిణభాగమునకు దిగునట్లును ఎటుచూచిన నేడు పంక్తులువచ్చునట్లు గీయవలెను. చక్రమును జూచిన స్పష్టమగును. దీనియందు మొదటిపంక్తిలో మొదటిగడియందున నొకటి వేయవలెను. ఆపంక్తిలో శేషించినవాటిలో (ఖం) శూన్యము నుంచవలెను. రెండవపంక్తి యందునను మొదటిదానియందువలెనే 1 వేయవలెను. మూడవపంక్తిలో మొదటి రెండింటిలో అన్త్యాంకములచేరిక $1+1=2$ గనుక అదివేయవలెను. దానిక్రిందదానికి ద్విగుణము $2\times2=4$ వేయవలెను. నాల్గవ పంక్తియందునను తత్పూర్వపంక్త్యన్త్యాంకములు చేరి $1+1+4=6$ గనుక శూన్యము క్రింద వేయవలెను. దానిక్రిందను వరుసగ ద్విగుణము త్రిగుణము చేసి దానిని క్రమముగ వేయవలెను. అనగ $6\times2=12$, $6\times3=18$ వేయవలెను. ఇట్లే పంచమపంక్తియందు ప్రథమద్వితీయతృతీయచతుర్థపంక్త్యన్త్యాంకములచేరిక అనగా $1+1+4+18$ = శూన్యముక్రింప 24 వేయవలెను. దీని క్రింద మరల ద్విగుణము త్రిగుణము చతుర్గుణము, అనగ 48, 72, 96 వేయవలెను. ఇట్లే యాఱవపంక్తియందు $24+96$ = (పూర్వపంక్తులలోని చివరఅంకెలు చేరి) = 120 గనుక దీనిని శూన్యముక్రింద వేయవలెను. దీనికి దిగువను, ద్విగుణాదికములు అనగ 240, 360

480, 600 వేయవలెను. కడపట నేడవపంక్తిని శూన్యము క్రింద పూర్వపంక్తుల అన్త్యాంకముల మొత్తం 120 + 600 = 720 వేసి దీనికి దిగువగళ్లలో ద్విగుణాదికములు అనగ, 1440, 2160, 2880, 3600, 4320, వేయవలెను ఇది నష్టోద్దిష్టబోధకమగు ఖండమేరువని నుడివి యున్నారు.

యీ ఖండమేరువునందు నష్టోద్దిష్టబోధనోపాయవిధము నిరూపింపబడుచున్నది.

శ్లో. స్వరాణ్ మూలక్రమ స్యాన్త్యాత్ పూర్వాం యావతి ధః స్వరః, ఉద్దిష్టాన్త్యస్తావతిథే కోష్ఠేఽధోలోష్టకంక్షిపేత్. లోష్టచాలన మన్త్యా త్సైక త్రిక్త్వా లబ్ధం క్రమో భవేత్, లోష్ట కాన్త్యాంక సంయోగా దుద్దిష్టస్య మితిర్భవేత్. యైరంకైః ర్నష్ట సంఖ్యా స్యాత్ పూర్వైకాంకసమన్వితైః, తేషు లోష్టం క్షిపే న్మూలం లోష్టస్థాన మితం భవేత్. నష్టతానస్వరస్థానం తతో యావతి థే పదే, అధః క్రమా దస్తి లోష్ట స్స్వరస్తావతిథో భవేత్. క్రమా న్తిమ స్వరాత్ పూర్వాత్ లబ్ధతాన్యాగాది పూర్వవత్, తానస్వరమితోర్ధ్వాధః పంక్తి గాన్త్యాంకమిశ్రణాత్; ఏకస్వరాదితానా నాం సంఖ్యా సంజాయతే క్రమాత్.

(సం. రత్నాకరం)

పాఠభేదము సం. దర్పణమం దిటులు గానగును.

శ్లో. వేద్యతానస్వరమితాణ్.దత్వా తేష్వేవ లోష్టకాణ్, మూలక్రమం లిఖిత్వాదా వుద్దిష్టం తదధో లిఖేత్, స్వరాణ్ ...... భవేత్. (సమపాఠము)

సమ శ్చేదంతిమోంత్యేన సోఽపిత్యాజ్యః ప్రయత్నతః, లోష్ట...భవేత్.(సమపాఠము)

సంఖ్యయాతు యదా రూపే పృష్టే నష్టం త దుచ్యతే, యైరం......తైః. (సమ పాఠము)

క్రమోత్రాపిచ కర్తవ్యో లబ్ధతాగేన పూర్వవత్, తథైవాత్ర లిఖేచ్ఛిష్ట మేవం నష్టో త్తరం వదేత్.

(సం. దర్పణం.)

ఈ నష్టోద్దిష్టప్రకారము ద్వివిధములు. దీన మొదటిదాని కుదాహరణముగ చతుర్వింశతి చతుస్స్వరతాన ప్రభేదములలో 23-వది ఏది?అని ప్రశ్నింపగాకను గొనుట. రెండవది "గమరిస" అను ప్రస్తారభేదము చతుస్స్వర ప్రస్తారిత తాన ప్రభేదములలో నెన్నవది యనిన గనుగొనుట.

| C | D | E | F |
|---|---|---|---|
| స | రి | గ | మ |
| 1 | 0 | 0 | 0 |
| | 1 | 2 | 6 |
| | | 4 | 12 |
| | | | 18 |

దీనికుదాహరణము 1 చక్రమున జూడుము:

(C. D. E. F) లేక సరిగమలకు నేర్పడు నాలుగుపంక్తులలో పంక్తికి నొక్కొకయంకమును మాత్రము చేర్చినచో "23" ఎట్లగునో అది కనుగొనవలయును. "స రి గ మ" కమములకు తప్పక నొక్కొక అంకము రావలెను. "స" అనుదానికి 1 తప్పదు. మరియొకఅంకము లేదుగనుక, "రి" అనుదానికిగూడ 1 వేసి చూతము. యిప్పటికి మొత్తము 1 + 1 = 2

అయినది. యింకను 23_2=21 కావలెను. "గ" కు 4 వేసితీరవలయును. యింకను 21_4=17 మనకు "మ" పంక్తిలోనుంచి కావలెను. కాని యీ 17 అందులోలేదు. యీఖండమేరువునందు 1 మొదలు అన్ని అంకములు సమకూర్చుటకు వీలు గలుగజేయబడియున్నది గనుక నేకాది సప్తస్వర ప్రస్తారిత తానప్రభేదములకు గల్గుసంఖ్య 1 మొదలు 4320 వరకు అన్ని అంకములను నాయా ప్రస్తారముల కనుగుణముగ నుండుటకేర్పాటు గలదు. గనుక మనకు 23 సరిగమ అనునాల్గుస్వరముల కేర్పడుకక్షములందుననే కుదురవలెను. 'సరిగ' కక్షములలో నిదివరకే మొత్తము 6 వచ్చియున్నది. "మ" కక్షమందు "18" యున్నది. నాల్గింటి మొత్తము 24 అగుచున్నది. మనకు 23మాత్రము కావలసియున్నది. గనుక మనమెచటను అంకెల నేరుకొనుటలో తప్పుచేసితిమి. అనగ నొకటి అధికముగ తీసికొనియుంటిమని తేలుచున్నది. "రి" కక్షమునకు "1"ని దీసికొనుటకు బదులు "0" దీసికొనియున్నచో మనకు "సరిగమ" కక్షలకు వరుసను 1+0+4+18 దీసికొనిన నేమనకు గావలసిన "23" సమకూడుచున్నది. మఱియొకవిధముననొనగూడదు. "నాన్యఃపంథా విద్యతే" యనునట్లు అనగ "మ" కక్షమునకు 18, గ=4, రి=0, స=1 ఇట్లువచ్చినవి, దీనిని "సరిగమ" కు ఉద్దిష్ట వరుసగ నేర్పరిచినచో 18. 401 ఇట్లుగలుగుచున్నది. వీటికి మేరువునందు 1-0-4-18 ఇటుల వరుసగలదుగనుక దానిస్థానమున నీఅంకములను వ్రాయుచో "గమరిస" అని తేలుచున్నది. దీనిని 2-వ చక్రమున జూచిన స్పష్టముగ దెలియనగును.

| స | రి | గ | మ |
|---|---|---|---|
| 1 C గ | 0 D మ | 0 | 0 స |
| | 1 | 2 | 6 |
| | | 4 E | 12 |
| | | | 18 F |

ద్వితీయము అనగ మూలప్రకారమున "సరిగమ" గలదు. మన కుద్దిష్టమున 'గమరిస' అని కావలయును. "మా" అన్తపంక్తియందు "స" చతుర్థము గనుక చక్రమున చతుర్థము 18 అనియును, దీనికే F అని చక్రమున వేయబడియున్నది. ఇప్పుడు "స" అక్షరము తేలినది. కనుక శేషించిన "రిగమ" మూలక్రమమగుచున్నది. దీనికి నుద్దిష్టమును "గమరి" "రి" అన్తము. ఇది తృతీయము గనుక తత్కోష్ఠమున తృతీయము "4". ఇపుడు "సరి" తేలినవి. శేషించిన మూలక్రమము "గమ" దీని కుద్దిష్ట ప్రకారము "గ మ" యేయున్నది. "మా" న్తము ప్రథమమే గనుక ఉద్దిష్టపు "మ" పంక్తిలో ప్రథమాంకము "0" శేషించిన "గ" కు వైకల్పికములేదు. ఎందుకనగ ప్రథమమున నొకటే కోష్ఠముగనుక దానికి "1" అని స్పష్టము ఇట్లు "గ మ రి స" అను తానప్రభేదము ఖండమేరువునందు 1+0+4+18 అనగా = 23 అని తేలుచున్నది. గనుక చతుస్స్వర తానప్రభేదములలో "గ మ రి స" అనునది 23 వది యనదగును. స్పష్టముగా దెలియుకొరకు 1 మొదలు 10 వరకును అంకనిరూపణ విధము వ్రాయబడుచున్నది.

దీనిలో మొదటిఅంకము మొదటిపంక్తి నుండియనియు రెండవఅంకము ద్వితీయపంక్తి నుండియనియు, నిట్లే మూడవది, నాలవది తృతీయ చతుర్థ పంక్తులనుండియు పంక్తికి నొ

కొక్కొక్కటిచొప్పున మాత్రమును, ప్రతిపంక్తి కిని తప్పక నొక్కటియు నని తెలియనగును.

$1=1+0+0+0$ దీనినిబట్టిచూచిన
$2=1+1+0+0$ మొదటి ఆరింటికిని
$3=1+0+2+0$ నాల్గవది "0" యేగ
$4=1+1+2+0$ నుక "మా" స్తముగ
$5=1+0+4+0$ గాని "సా" స్తముగ
$6=1+1+4+0$ గాని ప్రస్తరింపనచ్చు
$7=1+0+0+6$ ను. ఇట్లే శేషించిన
$8=1+1+0+6$ వాటికి 'కూడ' నూ
$9=1+0+2+6$ హింపవచ్చును. ఇట్లే
$10=1+1+2+6$ అంకములను 4320

వరకు నూహించి తెలిసికొనునది. అన్నిసంఖ్యలకు నన్నిమార్గము లున్నట్లును నొక్కొకమార్గమునకు నొకశే మార్గ మున్నట్లును తెలియనగును.

ప్రథమమున సంఖ్య దెల్పిన నుద్దిష్టము గను గొనుటయు ననగా 23వ చతుః శ్రుతితాన ప్రభేదము కనుగొనవలెననగ "23"నకు సరియగు నాల్గంకముల నేరికొనినచో $1+0+4+18$ అని నాల్గుపంక్తులలో తేలుచున్నది. మూలక్రమము సరిగమ దీనికి నుద్దిష్టము మగరిస అని చేసికొని "స" పంక్తిలో చతుర్థాంకము=18. ఇట్లే 18కి నాల్గవది'స'అనియు, తృతీయపూటచే "రి"పంక్తిలో తృతీయాంకము"4" మనకుగావలెను గనుక తృతీయము "రి" అనియు, పిమ్మట శేషించిన "గమ"లకు ఉద్దిష్టము"మగ" దీనిలో గాన్తమునందు మనకు గావలసినసంఖ్య "0"బిందువేకనుక "గ" ప్రథమముగను వేసికొనిన శేషించిన "మ"కు"1" అంకము ద్వితీయముగనుక "మ" ద్వితీయ స్థానమని తెలిసికొని 23వ చతుస్స్వరతాన ప్రభేదము "గమరిస" అని యూహించవలెను. ఇట్లే సకలతాన ప్రభేదములకు దెలియనగును.

శ్లో. అథాత్ర శుద్ధతానానాం నామాని వ్యాహ
రామహే, అగ్నిష్టోమోఽత్యగ్నిష్టోమో
వాజపేయశ్చ షోడశీ. పుండరీకో ఽశ్వ
మేధశ్చ రాజసూయ స్తతః పరమ్, ఇతి
స్యుః షడ్జహీనానాం సప్త నామా న్యను
క్రమాత్.

(సం. రత్నాకరం.)

షడ్జహీన శుద్ధతానములకు పేర్లును అదృష్టఫలసంబంధమునుగూర్చియు నిరూపింపబడినది. అర్థము స్పష్టము. మఱియు షాడవ తాన నామములు.

శ్లో. స్విష్టకృ ద్బహుసౌవర్ణో గోసవశ్చ మహా
వ్రతః; విశ్వజి ద్బ్రహ్మయజ్ఞశ్చ ప్రజా
పత్యశ్చ సప్తమః. క్రమాత్ ఋషభహీ
నానాం తానానా మభిధా ఇమాః, (ఇవి
ఋషభహీనతానములకునామములని.)
అశ్వక్రాన్తో రథక్రాన్తో విష్ణుక్రాన్తః తతః
పరమ్, సూర్యక్రాన్తో రథ (గజ)క్రాన్తో బరి
(ల)భిన్నాగయ(ప)తుకః. ఇతి పంచమ
హీనానాం సంజ్ఞా స్సప్త క్రమా న్మతాః;
(ఇవి పంచమహీనములగువాటికి పేర్లని
యు (చాతుర్మాస్యోఽథ సంస్థాఖ్యః శస్త్ర
శోభక శ్చతుర్థకః సౌత్రామణి స్తథా చిత్రా
సప్తమ స్తూద్భిదాహ్వయః, సంజ్ఞా నిషా
దహీనానాం షాడవానా మిమాః
క్రమాత్.

(ఇవి నిషాదవర్జషాడవశుద్ధతానములకు వరుసగ బేర్లనియు,) షడ్జగ్రామమున నష్టావింశతిషాడవతానములనియు బేర్కొనిరి.

శ్లో. సావిత్రీచార్ధసావిత్రీ సర్వతోభద్రసంజ్ఞకః, ఆదిత్యానామయనశ్చ గవామయన నామకః. సర్వాణా మయన ష్షష్ఠః కౌణ్డ (ణ) పాయి (య) నః, (?) నామాని షడ్జహీనానాం తానానా మితి మేనిరే.

(ఇవిషడ్జహీనతానములకు బేర్లనియు)

అగ్నిచిద్ద్వాదశాహశ్చ ఉపాంశు స్సోమభిద స్తతః, అశ్వప్రతిగ్రహో బర్హిః అథాభ్యుదయసంజ్ఞకః. ఋషభేణ విహీనానాం ఇతి నామాని మన్యతే.

(ఇవి ఋషభహీనతానములకు నామములనియు)

సర్వస్వ దక్షిణోదీక్షా సోమాఖ్యః సమిదాహ్వయః, స్వాహాకార స్తనూనపాత్ తతో గోదోహనో మతః, ఇతి గాంధారహీనానాం క్రమాత్ సంజ్ఞాః ప్రచక్షతే.

(సం. రత్నాకరం)

(ఇవి గాంధారహీనతానములకు బేర్లనియు గలదు). ఇవన్నియు మధ్యమగ్రామసంజాతములగు ఏకవింశతిషాడవతానములకు నామములని యుదాహరించియున్నారు.

ఔడవతాననామములు:—

శ్లో. ఇడా పురుషమేధశ్చ శ్యేనో వజ్రఇషు స్తతః, అంగిరాః కంక ఇత్యేతాః సషహీనాభిదాః క్రమాత్. జ్యోతిష్టోమ స్తతోథ రోమ్ నాన్యాఖ్యాః పౌర్ణమాసకః, అశ్వప్రతిగ్రహో రాత్రిః సౌభర స్సప్తమః స్మృతః; ఏతా నిషాదగాంధారహీనానా మభిదాః క్రమాత్.

(ఇవి షడ్జపంచమ గాంధారనిషాదహీనములగు నౌడవతాననామములనియు)

సౌభాగ్యకృ చ్ఛకారీరీ శాన్తికృ త్పుష్టికృ త్తథా, వైనతేయోచ్చాటనౌచ, వశీకరణసంజ్ఞకః, పంచమర్షభహీనానాం తానానా మభిధా ఇమాః.

(సం. రత్నాకరం)

(ఇవిఋషభపంచమవర్జితమైన ఔడవతానముల నామములనియు) గలదు. ఇవన్నియు షడ్జగ్రామమునకు సంబంధించిన ఏకవింశతి ఔడవతాననామములు. మరియు మధ్యమగ్రామమునకు జెందిన చతుర్దశ ఔడవతాననామములు యీక్రింద నుదాహరింపబడుచున్నవి.

శ్లో. త్రైలోక్యమోహనో వీరః కందర్పబలశాతనః, శంఖచూడో గజచ్ఛాయో రౌద్రాఖ్యో విష్ణువిక్రమః. తానానాం రిధహీనానాం నామా న్యేతా న్యనుక్రమాత్,

(ఇవి ఋషభధైవత హీనతానములకు నామములనియు)

భైరవః కామదాఖ్యశ్చ అవభృతోష్టకపాలకమ్, స్విష్టకృచ్చ వషట్కారో మోక్షదః సప్తమోమతః, సంజ్ఞా నిషాదగాంధార హీనానా మితి సమ్మతాః.

(సం. రత్నాకరం)

(ఇవి గాంధారనిషాదహీనతానములకు జేర్లనియు) నిరూపించిరి. మఱియు తానఫలముల గూర్చి ఇట్లు వ్రాసియున్నారు.

శ్లో. యద్యజ్ఞనామాయస్తాన తస్య తత్ఫలమిష్యతే, గాంధర్వమూర్ఛనా స్తానాః శ్రేయసే శ్రుతిచోదితాః. గానే స్థానస్య లాభేన తే కూటాః శ్చోపయోగినః.

(సం. రత్నాకరం)

దీనివలన మనుజుడు పొందులాభముల నింక నిట్లని నిరూపించిరి.

శ్లో. ఉత్తరమంద్రానుగతా గాయేత్ త్రిస్రోముదాయుతః, గాంధారతోఘ్నిరిత్యోద్గాత్రే (?) మూర్ఛనావిహితాః. అగ్నిష్టోమికతానేన గీతం సామ శృణోతి యః, స సర్వపాతకై ర్ముక్తో లోకాఞ్జయతి దుర్జయాఞ్. దక్షుప్రోక్తంపఠేద్యస్తు వర్ణయఞ్ శుద్ధషడ్జయా; ప్రత్యక్ష సంధ్యయో స్తోత్రం నాకలోకం సగచ్ఛతి. అగ్నిష్టోమకతానేన మై ర్నరైః స్తూయతే శివః. తే భుక్త్వా విపులాఞ్ భోగాఞ్ శివసాయుజ్యమాప్నుయుః.

ఆయాతానముల పాడుటవలన నైహికాముష్మికసుఖము లందుననియు గలదు.




# ధర్మమేవ జయతి

సాహిత్యసరస్వతి డి. యన్. శర్మగారు

చుక్కతూఱెను తూర్పున శుభము తెలిపి
మినుకుఁ జుక్కలు మిక్కిలి తనికె నింత
"చాలు మీతలలెత్తుట చాలు! చాలు!"
ననుచు దూరంపుఁజీకటు లలమికొనియె. ౧

మోటుబలమునఁ జీకటి థాటిసూప
పోటుతగులుట తగదని ముడిఁగికొనుచు
మంచిరిక్కలు సాధుత్వ మాన్యగరిమ
మొప్ప నమ్రతఁ జిత్రించె నుప్పరిగెల. ౨

పదియునాఱుచాయలు, సుధాప్రసరవర్షము, నెఱచల్లదనంబును, తనివిపోలుపు,
పరమశాంతలీలలు, స్వచ్ఛతరయశస్సుఁ
బఱపి చంద్రుండు తారలఁ దఱిసె వేడ్క. 3

చాలస్వచ్ఛందవృత్తినిఁ జరుగుచంద్రి
కల మహస్సునకుఁ దమస్సు కలఁగి నిలువఁ
జాలక నమసిపోయె! నక్షత్రగణము
కువలయశ్రీకరంబయి కొమరు మిగిలె. ౪

# కీ. శే. దామెర్ల రామారావు గారు

పికొండల వేంకటరావుగారు బి. ఏ., బి.యల్.

## విషాద గీతిక

౧

ఆ కళారత్నమిస్సీ! కట్టెయగు టెట్లు?
నవనీతపుంగుంచె నాడిసోకమి యెట్లు?
చిత్రకారుని సొగసు క్షితికి బరువౌటెట్లు?
నమ్మఁజాలను నేను
నమ్మనేరను హారీ!

౨

అతఁడు నాకొడుకంచు అమ్మతలంచుటా?
అతఁడు తమ్ముండంచు అన్న స్మరించుటా?
అఖిలాంధ్రలోకంబు అనుకొనియున్న దే
లలితకళకుం గ్రొత్త లాలిత్యమొదవునం
తతనిచే తన కీర్తి అతులితంబగునంచు
హాతవిధీ! హాతవిధీ!
అదియేని తలపోయ
కయ్యో ఆయువు సున్న.
అనిపించితివె యపుడె

౩

చిరునవ్వు మోముతో చెంత నొక్కనిఁజేరి
సరసత్వమదిగో! ఆసరసఁ జూడుము దీన
అనియేమొ తలపోయు చాలేఖ్యసౌందర్య
ందె ఆనందంబు నందు నాతని చూడ్కి
గోదావరిక్ మలినహా టదియెట్లు?
నమ్మఁజాలను నేను నమ్మనేరను కటా!
భువన కేళినే దక్షత్వమనుకొంటె
అలయలంకృతపుష్ప మంతకంటెనుమించె
ఎంచి పుట్టించె విరించి నిన్భువి నన్ను
ఇంతలోనే చావు లెక్కించె నానీదు
నూరేండ్లునుం గుజ్జు! నేర నమ్మగనేర
శాంతపథమేవైపు స్వర్గసుఖమొందెందు
ఆధ్యాత్మికపు ముక్తి ఆత్మకెచ్చట? ఎటు?
అచ్చోట నీ యాత్మ అమల నిశ్చల కాంతి
నైక్యమయ్యెడుగాత! అనుజ! రామారాయ!

*   *   *   *

యల్. సాంబశివరావుగారు

మ. అకటా ! కర్ణకఠోరమై హృదయభే
ద్యంబై భృశవ్యాకులా, త్మకమై దారు
ణమై నిరంతర నిరుత్సాహంపు దౌర్భా
గ్యసూ, చకమై మించిన నీయకాలమృతి
చాంచల్యంబుగ్గా వింటి సు, ప్రకటాధిక్య
కళావిశారదమణీ! రామాఖ్య! విజ్ఞోత్తమా!

గీ. వయసునందుననా మిత్తివాత బడుట
చిఱుతతనమందె స్వర్గంబు చేరఁజనుట
భరతఖండ దౌర్భాగ్యతాపజనకంబు
కాదె? రామరాయ! సుజనగణవిధేయ!

సీ. వంగచిత్రకళల పద్ధతి నేరిచి
పాశ్చాత్యవిధములపటిమ మెఱిఁగి
తద్ద్వయచిత్రసంధానముం గూరిచి
ఆంధ్రకళౌన్నత్య మలరఁజేసి
స్వకపోలకల్పనాచాతుర్యమునఁ గృష్ణ
లీలాదిచిత్రముల్ క్రాలఁజేసి
భావసౌష్ఠవరూపపరిణతచిత్రాళిఁ
జూపి 'వెంబ్లీ' యందు శుభము పొంది
లోకకల్యాణమూర్తివై ప్రాకటముగ
మెప్పులందితివని నిన్ను మృత్యుదేవి
చేరి వరియించెనో! యేమొ! చెప్పఁజాల
నెఱుఁగ దుఃఖోపశమనంబ దెట్లొ మాకు.

సీ. స్వాగతమిచ్చెనా? స్వర్గాధిపతి నీకు
దివ్యచిత్రములను దిద్దు మంచు
అభిలాషకలిగెనా? హనుమంతునకుఁ 'జిత్ర
కళలమందిర' సుభాగ్యంబు నొడువ
ఉత్సాహమునను గాంధర్వద్వయమఫలితంబుఁ
దెల్పఁగా నేగితో? తిలకుకడకు
ఆంధ్రులచిత్రకళాఖర్వమహిమక్ర
మాళిఁ దెల్పఁ జనితో? నాకమునకు
అతులనిత్యద్రఢిష్ఠసుఖామృతమయ
వీచికావళిం దోఁగుచు విభిని దప్ప
శక్య మౌనా! యని తలంచి సరళమతిని
అవని విరమించి ముంచి దుఃఖాబ్ధి జనులఁ
దరలిపోయితి స్వర్గంబు తరుణమందె
ప్రథితపావన 'దామెర్ల' వంశ రాజ!

గీ. బహుళరసభావములఁ జేర్చి పదిలపఱచి
చిత్రమందునఁ జూపి యశేషముదము
సల్పు నీనవ్యచిత్రముల్ చక్షువులకుఁ
బర్వ మొనరించు భాగ్యంబుఁ బడయలేదు
శాంతి యగుఁగాక! ఆత్మకు సంతతంబు
రమ్యగుణనిధీ! దామెర్ల రామరాయ.

* * * *

అనుముల వేంకటశేషకవి (అష్టావధాని)

గీ. అక్కటా! యేమివింటి? యన్యాయ మింత
కల్గునే?- "బాంబెయీక్రానికలు"న నుండి
"యాంధ్రపత్రిక" వైచినయట్టిమాదు
సోదరుని రామరాయుని స్తుతిని కనులఁ
గాంచి నిన్ననె తోషంబుఁ గంటి నింత
లోననే యింత ముప్పు కలుగు నటంచు
స్వప్నమున నేనియును దలఁచంగనైతి;—
"ఆర్టు" నశియించెనే? యింత కాంధ్రమాత
కొంప గూలెనే? ... యేమనఁగూడు నింక?
"మూల్గునక్కపయిం దాటిముట్టెపడిన
విధమునను" - "గోరుచుట్టుపైఁ బెద్ద దైన
రోకలియొకం డాడిసినట్లు" రూఢి మీఱు
నట్టి చెలికాని లచ్చరాయాది లాతి
సోదరులమృతికై కడు స్రుక్కియుక్కఁ
దక్కి దుఃఖించు నాంధ్రమాత చనుల బడి
కనులనుండి ప్రవాహముల్ కట్టు బాష్ప
బిందువులతడి యాఱక మున్దె యగడు
పఱచితివె యింత రక్తాక్షి వత్సరంబ:—
"వెంబ్లిమెగ్జిబిషన్" నందు వినుతిఁ గాంచి
నట్టి మేధావి; దేశంబు నందె కాక
యట్టె సర్వప్రపంచంబునందుఁ గూడ
పేరుఁగనినట్టి ధీశాలి; స్వీయమతిని
తనసమానను జేసి మొన్ననె పితాపు
రమున బహుమానమందించు ప్రాజ్ఞమా
ఇంకఁ గొన్నాళ్లుమనియుండు నేనియు, ర
వర్మనేఁ బ్రింగఁగలయతిప్రతిభుఁడహా
యింతకును నిర్వదియు నొక్కయేండ్ల
కుఁడు రమారమి సమవయస్కుండు మ
లేకపోయె; నిఁకేటికి లేనిబ్రతుకు?—
"మమ్మునుం గూడ వెనువెంట మాప
పోము! కొనిపోము! వైళంబ, స్ఫోటకంబు
యనుచు దుఃఖించు మిత్రులనైనఁ గను
జూడవేల? పదాఱేఁడు లీడు గల్గు
భార్యనైనను నోదారుపంగ నెంచ
వేల? రాజమహేంద్రంబు నిట్టుపు
యామహేంద్రునిపురివంక కరుగ, మాఱు
నర్చు పాపం బదేమి? వినంగఁ జేయ
రాదొకో! యింత? దామెర్ల రామరా
అకట! జీవచ్ఛవంబులయట్టులు స్మ
పద్యములఁ గాలమున్ బుచ్చువార
మే మికను జేయునది యేమి? యెందు
పేరు ప్రఖ్యాతిమై నిల వెలయుఁగాక!
(శ్రీ)వరుఁడు నీకు దయసేయుఁ జిత్తశాం
ఇంకఁ బరలోకమున సుఖియింతుగాక!
నీమహాశక్తి యాంధ్రాళి నిలుచుఁగాక!

చెన్నరాజధానియందు 1924-వ సంవత్సరము ఏప్రిలు మొదలు జూను వఱకు

ముద్రితములై ప్రచురింపఁబడిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక

## పద్యకావ్యము - ౧ ప్రబంధములు

తుఖారామ్—శ్రీరాం వీరబ్రహ్మం
మర్యాదరామచరిత్రము—తురగా వెంకమరాజు
సత్యనారాయణచరిత్రము—కన్నెకంటి ప్రభులింగాచారి
సాత్రాజితీపరిణయము—అడవి సాంబశివరాయకవి
సౌగంధికప్రసూనసంగ్రహము—అప్పప్పకవి

## పద్యకావ్యము - ౨ శతకములు

ఆత్మలింగశతకము—ఆముల గురుమూర్తి
ఆనందకందశతకము—వెంతురుపల్లి సన్యాసిరాజు
ఆపద్బాంధవశతకము—గన్నవరపు వెంకటరాయకవి
కాలగుణాదర్శము అను తిరుపతి వెంకటేశ్వరశతకము—టంగుటూరి వరదరాజశర్మ
కుమారీశతకము—పక్కి వేంకటనరసింహకవి
కురుమూర్తినాథశతకము—సి. నారాయణకవి
చెన్నమల్లేశ్వరశతకము—గంగాధరకవి
జానకీపతిశతకము—శృంగారం అయ్యమాచార్య
తురిమెళ్లమాధవశతకము—యునయగిరి చెన్నయ్య
పరమపురుషశతకము—సద్గురు రాయశతకము-శతకములు
లోకనాయకశతకము—ఆదిభట్ల రామమూర్తి
వెంకటేశ్వరశతకము—సి. వి. నరసింహదాసు
శ్రీరఘురామచంద్రప్రభోశతకము—పి. సుబ్బయ్య
శ్రీరమామనోహరశతకము—పోదిచెట్టి నారాయణరావు
శ్రీరామనామశతకము—వంకాయల అప్పలనరసింహభక్త
శ్రీవాసుదేవశతకము—కె. పెదకామేశ్వరరావు
శ్రీసూర్యనారాయణశతకము—చింతపెంట సుబ్రహ్మణ్యం
సీతాదేవిశతకము—పి. సుబ్బయ్య
సుబుద్ధిశతకము—ఖాసీం అలీషా
హరిశతకము—తూము సీతారామయ్య

## పద్యకావ్యము - ౩ ఇతరములు

ఆంజనేయదండకము—సూర్యదండకము
కుప్పసామితారావళి—ఖాశీం అలీషా
కులపాతకుడు లేక కలరా పురువు—సి. వి. ఆంజనేయులు
ప్రథమవార్షిక పరమభాగవత సమావేశము, పల్లూరు పి. బసవయ్యకవి
దశావతారచరిత్రము—
మందేశ్వర స్తవము—సుందరరామకవులు
మాదలశతావధానము—ముప్పాళ్ల జానకిరామశాస్త్రి
లక్ష్మీభాయిచరిత్ర—చాట్రాతి లక్ష్మీనరసమ్మ
వరలక్ష్మీవిలాసము—సుందరరామకవులు
వేణుగోపాల నక్షత్రమాల—యన్. మృత్యుంజయరావు
శివనామసంకీర్తనతారావళి—యస్. దశరథరామశాస్త్రి
శ్రీసూక్తిరత్నావళి—సంగాల హనుమయ్య
హనుమత్పంచవింశతి—నామ వేంకటసుబ్బయ్యచెట్టి

## వచనకావ్యము - ౧ కథ

ఆర్యకథానిధి—వావిలికొలను సుబ్బారావు
ఆర్యమతోపాఖ్యానము—మొదటిభాగము
ఏడవవాచకపుస్తకము—కే. వీరేశలింగంపంతులు
గయోపాఖ్యానము—బి. బాలాజీదాసు
తెనాలిరామకృష్ణునికథలు—
ప్రాచీనకాలపు హిందూసుందరీమణుల చరిత్రములు, రెండవభాగము (3 వకూర్పు)-రాయసం వేంకటశివుడు
ప్రాచీనకాలపు హిందూసుందరీమణులచరిత్రములు—మూడవభాగము (2వ కూర్పు) రాయసం వెంకటశివుడు
భారతనారీమణులు—ప్రథమభాగము— కె. వెంకటరాయశర్మ
బాలభారతము—యన్. ఎ. నరసింహాచార్య

15 7

బుద్ధునిపూర్వజన్మములు—ఆమండి వేంకటశాస్త్రి
రంగమ్మపేరంటాలుకథ—బి. సుబ్బయ్య,ఎ. వీరబ్రహ్మం
రెండవకథావాచకపుస్తకము—కందుకూరి వీరేశలింగం పంతులు, మహాకాళి సుబ్బారాయుడు
వేదాంతరహస్యదర్పణము అను నూతన విచిత్రపతివ్రతల కథలు—పరదేశి వకుళాభరణ
శ్రీకృష్ణజీవితము—చిట్టా బాలకృష్ణశాస్త్రి
శ్రీకృష్ణునిబాల్యము—

వచనకావ్యము - ౨ నవల

అభాగిని—చిల్లరిగె శ్రీనివాసరావు
చిత్రలేఖ—చింతా శంకరదీక్షితులు
నవలాత్రయము—ఆర్. రాఘవరామారావు
ఫాస్టు, ప్రథమభాగము—వెమురుమూడి శేషగిరిరావు
మంగళసూత్రము—అబ్బూరి రామకృష్ణారావు
లండను రహస్యములు, ప్రథమభాగము—విశ్వనాథ వెంకటేశ్వర్లు
హైమవతి—బులుసు సోమనాథశాస్త్రి, బులుసు పట్టాభిరామశాస్త్రి

వచనకావ్యము - 3 చరిత్రలు

పల్నాటియుద్ధము—పంగనామముల రామచంద్ర రావు
సామ్రాజ్యతత్వము—కళా వెంకటరావు

వచనకావ్యము - ర రాజకీయములు

చిత్తూరుజిల్లా కాంగ్రెసు సంఘము - కాంగ్రెసులో మనమెందుకు చేరవలయును—కె. రాజగోపాలాచారి
వలసపోయిన భారతీయులు—తల్లాప్రగడ రామారావు

వచనకావ్యము - ౫ ఇతరములు

అసహాయుడవనేడు-జనపనేని సూర్యనారాయణరాజు
ఉపన్యాసము—యన్. బుచ్చివెంకటపతిరాజు
కమ్మమహాజనసంఘపు నిబంధనలు—
కర్ణానందము—కాళహస్తి వెంకటనరసింహారావు
కాంగ్రెసుచట్టము—
కాఫీహోటల్—తుర్లపాటి గోవర్ధనరావు
కురంగి—పంగనామముల రామచంద్రరావు
కోటీశ్వర స్తవము—యం. సాంబయ్య
చిత్తూరుజిల్లా, అదాలతుకోర్టు తీర్పు — వి. త్యాగరాజాచార్లు
ధర్మవ్యాధునిచరిత్రము—గుండాల వీరాస్వామి
నీచసంబోధనము—ఇనుపకుతిక శంకరశాస్త్రి
పల్నాటి దురంతములు — దండు నారాయణరాజు, సి. వి. రంగంశ్రేష్ఠి, గోనుగుంట్ల సుబ్రహ్మణ్యం
పుండరీకభక్తునిచరిత్రము—గుండాల వీరాస్వామి
పూర్వపు మహమ్మదీయ ప్రభువులు, గోసంరక్షణము—అహమద్ సాహెబు
ఫారెస్టు పంచాయితీలసభ, భావమురళి — కవికొండల వెంకటరావు
మైరావణచరిత్రనాటకము—యు. వెంకటసుబ్బయ్య
యామునతారావళి—చెలికాని వెంకటనరసింహకవి
వేదకవచ దుర్మతప్రకాశిక—బి. అప్పలాచార్యులు
వేశ్యాంగనామహాజనసభ—గాడేపల్లి అనంతరామమూర్తి
శతావధాన కవిత—జె. సుబ్రహ్మణ్యశాస్త్రి
శ్యమంతకోదంతం—ఆర్. రామకవి
శ్రీరామనవమి—ఆర్. రామశాస్త్రి

నా ట క ము లు.

కాంతామతి—రామనారాయణకవులు
నవరత్నచింతామణి—అయినాపురపు సోమేశ్వరరావు
పాండవ అశ్వమేధము—రామనారాయణ కవులు
పాండవవిజయము—రామనారాయణ కవులు
ప్రబోధచింతామణి—మోచెర్ల హనుమంతరావు
ప్రమీలార్జునీయము—డి. సీతారామరావు
భీమప్రతిజ్ఞ—కె. కోదండరామయ్య
మాతృదాస్యవిమోచనము—బుధవరపు పట్టాభిరామయ్య
మార్కండేయవిజయము—టంగుటూరు వరదరాజశర్మ
రంగనాథశశిరేఖాపరిణయము,నాటకము—వై. నరిసిరెడ్డి
రత్నపుత్రికాజయచంద్రీయము—దివాకర్ల సత్యనారాయణమూర్తి
రాజకళింగగంగు—కొత్తపల్లి సూర్యారావు
రామరాజు—సంగవరపు రాఘవశాస్త్రి
రుక్మాంగదనాటకము—పుప్పల పిచ్చయ్యశాస్త్రి

వైదర్భీపరిణయము—రాజా కమదన వెంకటరావు బహద్దరు
శివరామకృష్ణీయ మను అపరప్రహ్లాదనాటకము—మలక పల్లి చిన్న శేషగిరిరావు

## ప్రహసనములు

కర్కోటకుడు
మాయలమారి పెండ్లాము

## భాష నిఘంటు వ్యాకరణము

కావ్యచంద్రిక—మల్లెల దావీదు
క్రొత్తతెలుగు బాలశిక్ష—డి. రామమూర్తి
పరిమితవ్యాకరణము—ములుకుట్ల వెంకటకృష్ణశాస్త్రి

## జ్యోతిషము

ముహూర్తసంగ్రహము—యం. సుబ్బారాయుడు

## గణితము

అతిస్పష్టమైన అంకగణితము—యం. యస్. హెచ్. థాంప్సన్ ఎక్కములు
క్రొత్తచట్టపుగణితము (నాల్గవతరగతి)
ప్రారంభగణితము మొదటిపుస్తకము— వి. వెంకట సుబ్బయ్య
రాబడి పన్ను పట్టీలను నింపుక్రమము—పాకాల వరాహ నరసింహశర్మ
రామకృష్ణజంత్రి
లోయర్ సెకండరీ అరిథ్మెటిక్—జె. యస్. దేవసహాయం

## వైద్యం

కుష్ఠు—మల్లిడి సుబ్బారెడ్డి
జ్వరవైద్యవిధానము—పి. సూర్యనారాయణరావు, పి. రామచంద్రరావు
సర్వసుఖరోగ చికిత్సాచింతామణి, మొదటిభాగము—జె. నాగభూషణదాసు

## మతము

బ్రాహ్మమతము—పాలపర్తి నరసింహం

## మహమ్మదీయ మతము

హకీకతుల్ ఇస్లామ్—మీర్జా రౌనక్ బేగ్ సాహెబ్

## క్రైస్తవ మతము

అర్చ్యకిరీటప్పగారి చరిత్రము—జె. ఆలెను
అర్చ్యక్లారమ్మగారి చరిత్రము—జె. ఆలెను
అర్చ్యజ్ఞానప్రకాశముగారి చరిత్రము—జె. ఆలెను
అర్చ్యశిష్ట ఆగ్నేసమ్మగారిచరిత్రము—జె. ఆలెను
అర్చ్యశిష్టఆరోగ్యనాధులవారిచరిత్రము—జె. ఆలెను
అర్చ్యశిష్ట జెర్లాక్కుగారి చరిత్రము—జె. ఆలెను
అర్చ్యశిష్ట నిసేఫోరప్పగారి చరిత్రము—జె. ఆలెను
అర్చ్యశిష్ట విన్సెంటుగారి చరిత్రము—జె. ఆలెను
చక్రిశతకము—యస్. సత్యనారాయణమూర్తి
దైవసాన్నిధ్యసాంగత్యము, పాతనిబంధనవ్యాఖ్యానప్రదర్శనము—మాచెనర్ ఒకటవజేమ్సు
పేతురుచరిత్ర
ప్రభుపాదసన్నిధి రక్షణసైన్యము కీర్తనలు విశేషక్రమ చట్టములు
లూకా వ్రాసిన సువార్త—సంగీతములు
సత్యవేదసంగీతరత్నావళి—పేతురురోసిలాన్
సభనిమిత్తము—ప్రార్థనలు

## వేదాంతము

ఆత్మవిచారము ఉత్తరభాగము-అద్దంకి సీతారామశాస్త్రి
గీతావాక్యము, కర్మయోగము
తత్వోల్లాసిని—నారాయణదాసు (ధన్)
భగవత్పూజ ప్రథమభాగము — పి. ఉమామహేశ్వర పండితులు
భగవద్దర్శని—నారాయణదాసు (ధన్)
విదేహకైవల్యము క్షిప్రదాయిని—వెత్స వెంకట్రామయ

## ధర్మశాస్త్రము

దశమీవేధదర్పణము—కాశి కృష్ణాచార్య

## నీతి

వివేకచంద్రిక రెండవభాగము—టి.ఎ. స్వామినాధయ్య
సూక్తిరత్నాకరము—

## సంగీతము - ౧ హరికథ

కన్నప్పచరిత్రము, హరికథ—త్రిపురారిభట్ల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి
పరీక్షిద్విలాసము—పి. శ్రీకృష్ణయ్య

## సంగీతము - ౨ గేయము

ఆదిమూలము-ఘటశోధనతత్వములు—పి. భూపతిదాసు
ఋషుల యాత్రేమము—
కర్ణపర్వనాటకము—యు. వెంకటసుబ్బయ్య
కోటప్పగురుకీర్తనలు—
కృష్ణజననము, కంససంహారణము—
జ్ఞానామృత తత్వములు—అందెల పాపయ్య
తులసీదళము—
తూము నృసింహదాసుచరిత్రము—సింగారిదాసు
తెలుగుపాటలు—వి. రాజగోపాలఅయ్యర్
నుతిత్రయము—వావిలికొలను సుబ్బారావు
నూతన రామకీర్తనలు—పెమ్మాది రామదాసు
పరశివ తత్వములు—పెద్దిరాజు రమణమ్మ
భారతమాత బోధ—కాంతాస్ఫూర్తి సత్యనారాయణ దాసు
మంగళహారతులు—
మేలుకొలుపులు—
రామదాసుచరిత్రము—
రామవర రామాయణము—యన్. బసివిరెడ్డి
లక్ష్మణదేవరనవ్వు—
విచిత్ర నూతన రంగూన్ కీర్తనలు—వై. వీరన్న
శివనామ సంకీర్తనలు
శ్రీనివాస సంకీర్తనలు—పి. వి. జగన్నాథాచార్యులు
శ్రీరామనామమాహాత్మ్యము
సీతాకల్యాణము—బి. బాలాజీదాసు
సీతాకళ్యాణము
సుజనమనోహ్లాదిని—పి. కోదండరామదాసు
సురాభాండేశ్వరీయము—యస్. బంగారురాజకవి

## ఇతరములు

అసహాయుడనవడు-జనపనేని సూర్యనారాయణరాజు
ఉపన్యాసము—యన్. బుచ్చివెంకటపతిరాజు
కమ్మమహాజనసంఘపు నిబంధనలు
కర్ణానందము—కాళహస్తి వెంకటనరసింహారావు
కాంగ్రెసుచట్టము
కాఫీహోటల్—తుర్లపాటి గోవర్ధనరావు
కురంగి—పంగనామముల రామచంద్రరావు
కోటీశ్వర స్తవము—యం. సాంబయ్య
కృషియును, తోడ్పాటును—ఆరోగ్యం
చిత్తూరుజిల్లాఅదాలతుకోర్టుతీర్పు—వి. త్యాగరాజాచార్లు
దీనకల్పద్రుమము—గుమ్మలూరి లక్ష్మీనరసింహశర్మ
ధర్మవ్యాధునిచరిత్రము—గుండాల వీరాస్వామి
నీచసంబోధనము—ఇనుపకుతిక శంకరశాస్త్రి
పల్నాటిదురంతములు—దండు నారాయణరాజు, సి.వి. రంగంశ్రేష్ఠి, గోనుగుంట్ల వెంకటసుబ్రహ్మణ్యం
పుండరీకభక్తునిచరిత్రము—గుండాల వీరాస్వామి
పూర్వపు మహమ్మదీయప్రభువులు గోసంరక్షణము-అహమద్ సాహెబు
ఫారెస్టు పంచాయితీల సభ—
భావమురళి—కవికొండల వెంకటరావు
మైరావణచరిత్రనాటకము—యు. వెంకటసుబ్బయ్య
యౌవనతారావళి—చెలికాని వెంకటనరసింహకవి
వేపకపచమర్కత ప్రకాశిక—బి. అప్పలాచార్యులు
వేశ్యాంగనామహాజనసభ—గాడేపల్లి అనంతరామమూర్తి
శతావధానకవిత—జె. సుబ్రహ్మణ్యశాస్త్రి
శ్యమంతకోదంతం—ఆర్. రామకవి
శ్రీరామనవమి—ఆర్. రామశాస్త్రి



# ప్రాచీనాద్భుత విషయములు



బల్గేరియా దేశమున ప్లెవ్నా అను గ్రామముచెంత వ్యవసాయకులు పొలమున ద్రవ్యమండ నొక (గిన్నె) పాత్రము బయలుపడెను. వారు దానిని లోహపాత్రముగాదలచి గ్రామాధికారి కప్పగించిరి. అతడు దానిని సోఫియా పట్టణమునకు గొనిపోయెను. అచ్చట నొక లోహవిజ్ఞానశాస్త్రజ్ఞుడు దానిని బరీక్షించి కరగిపోసిన బంగారు పాత్రమని తేల్చెను. దానిబరువు ౩౯౦ అవున్సులు (ఇంచుమించుగ నొకమణుగు.) ఆగిన్నెయందు ౧౧ ప్రత్యేక పాత్రము లుండెను. వానియందు పెద్దదానియెత్తు ఆరంగుళములును, వ్యాసము పదియంగుళములు నుండెను. ఈగిన్నె మిగుల రమణీయముగను, నిరుపమానముగను ఉన్నది. ఆసియాఖండపువైఖరి దీనిఆకారమున గలదు. ఒకవిజ్ఞుని యభిప్రాయము ననుసరించి ఇట్టిదే ప్రాచీనపరిషియాదేశమున నుపయోగమున నుండెనని తేలుచున్నది.



మెసపొటేమియాదేశమున కిష్పట్టణమునుగూర్చి అనేకాద్భుతవిషయములు వెల్లడిఅయినవి. ఇంకను వెల్లడికానున్నవి. ఇప్పటికి రెండుపర్యాయములు మాత్రమే వెల్డుబండల్ ఉద్యమమువారు అచ్చట పనిచేసిరి. తత్ఫలితముగ క్రీస్తుకు నాలుగువేలయేండ్లకుపూర్వ ముండినవని తేలుచున్న కట్టడములు బయలువడినవి. ఈ చిత్రముననున్న సభాభవనము నింకను త్రవ్వి పరిశోధింపవలసి యున్నది. అధికపరిమాణముగల గుండ్రని స్తంభములతో నిండియున్న దీ కూటము. స్తంభముల పాతులు మాత్రము కాన్పించుచున్నవి.

ఈ నగలు మిగుల ప్రాచీనులగు సుమేరియను స్త్రీలవి. ఇవి క్రీస్తునకు మూడువేలేండ్లపూర్వముండినవి. నడుమనున్న పతకము వెండితో చేసినది. దానిచుట్టునున్న నగాసుపని సన్నని వెండికమ్మితో చేయబడినది. ఇదివఱకు బయలుపడినసమీచీన ప్రాచీనాభరణములలో నిది యొక్కటిగా పరిగణింపబడుచున్నది.





ఈ (R. S. I.) విమానము దూలములతోను సంచులతోను కట్టబడినదియు, (Semi-rigid) సర్వతోముఖముగ యానము చేయునదియును. సంయుక్తరాష్ట్రములయం దిది మొట్టమొదటి విమానము. ఇట్టిది ఇటలీదేశమున మాత్ర మొకటి గలదు. దీనిపొడవు 282 అడుగులు. నడిమికొలత $70\frac{1}{2}$ అడుగులు. దీనిలోగూడ నావశ్యకమగునపుడు దింపుటకుగాను చిన్నవిమానములుండును. ఇది పోవుచున్నపుడే వానిని విడుచుటకు దగినసదుపాయము ఈ విమానము క్రిందిభాగమున గలదు. దీనిని "గుడ్ ఇయర్ జెప్లిను కంపనీవారు" నిర్మించిరి.



క్రీస్తుకు పూర్వ మెనిమిదవశతాబ్దమునసుండిన యొకరాణియొక్క శవపేటిక.



౨౮౦౦ యేండ్లకు పూర్వముండిన పెంపుడులేడియొక్క మృతకళేబరము. ఈ లేడిని తీబ్సుదేశపు రాజకుటుంబములోనివారు పెంచుకొనియుందురని ఊహింపదగును. ఇది క్రీస్తుకుపూర్వము ఎనిమిదవశతాబ్దియందు తీబ్సును పరిపాలించిన ఆంఖ్ షెక్ను పెట్ రాణియొక్క లోపలిశవపేటిక సమీపమున నుండినది. వీనిని ఇటీవలనే న్యూయార్కు పట్టణమునందలి మెట్రాపొలిటన్ మ్యూజియమునకు జేర్చిరి.




## ఆంధ్రదేశమందలి పరిశోధకులకు, బండితుల కొక విజ్ఞాపనము

ఆర్యులారా !

నేను బరంపురము నుండి రైలుబండిలో పోవుచుండగా నొక యోఢ్రదేశపు ముదుసలి బ్రహ్మచారి నా బండిలో గూడ బ్రయాణము చేసెను. ఆతనియొద్ద కొన్ని ముతకకాగితములపై వ్రాసిన ఓఢ్రభాషాగ్రంథములను, నాగరాక్షరములతో తాటాకులపై వ్రాయబడిన యొకగ్రంథమును చూచితిని. ప్రసంగవశమున గలిగిన చనవుచే యాపొత్తములం ద్రిప్పిత్రిప్పి చూచుచుండగా నందు దాళగ్రంథమున నేమేమియో యంత్రములు మంత్రములు బొమ్మలు స్తోత్రములు వ్రాయబడియున్నవి. వ్రాతనాగరాక్షరములతో నా కంతపరిచయము లేకపోవుటచే నవియేమో తెలుసుకొన నాకంతపట్టినది కాదు. కాని యీదిగువ నుదహరించిన జగద్గురు సూత్రములని యందున్నవి. విడివిడిగా నుండుటచే గబగబ నొక కాగితముపై నెత్తివ్రాసితిని. ముగించువరకతడాగ్రహించి నేను చూడ నిచ్చితినిగాని వ్రాయనిచ్చితినా యని పుస్తకమును దీసికొనెను. అది తంత్రశాస్త్రాంతర్గతమని తోచుచున్నది. వుడ్డురాఫ్ (Wood rof) మొదలగు పాశ్చాత్యులీతంత్రము విషయమై పరిశోధనము లొనర్చ మన ముపేక్షించుట గల్గుచున్నది. ఈసూత్రములు విమర్శించి వీనియభిప్రాయమేమో, దీనిమాతృక సమగ్రముగ నేమహనీయుల యొద్దనైన కలదో తెలియవేడి యీ భారతీపత్రికయందు బ్రకటించితిని.

### ప్రథమపాదః

౧ “అథాతస్తంత్ర జిజ్ఞాసా”

౨ “మానోమానమ్”

౩ “యోనిత్వాత్”

౪ “జీవనమపి”

౫ “ప్రజాపతేర్భంగః”

౬ “లింగసంయోగాత్”

౭ “ఏకోఽనీశః”

౮ “నిరింద్రియత్వాత్”

౯ “సృష్టేర్విలయమ్”

౧౦ “ఐక్యత్వాత్”

౧౧ “అధోగతిః”

౧౨ “అగతికత్వాత్”

౧౩ “సంఘూకర్షణమ్”

౧౪ “భ్రష్టస్యముక్తేః”

౧౫ “విలాసం కలేః”

౧౬ “తత్సంకల్పాత్”

౧౭ “నవానామేకః”

౧౮ “చిదానందః”

౧౯ “సత్సంగత్వాద్రిక్”

౨౦ “ఏతదపి”

౨౧ “సదసద్వివేకే”

౨౨ “నసమాధౌ”

౨౩ “అన్వయవ్యతిరేకాభ్యామ్”

౨౪ “ధీరోఽవసానమ్”

౨౫ “అన్యోఽవమానమ్”

౨౬ "ద్వా"
౨౭ "నిత్యసంయోగాత్"
౨౮ "ధర్మస్తత్త్వమ్"
౨౯ "ఓం తత్సర్వం మన్యే"
౩౦ "నిరాలంబం మార్గమ్"
౩౧ "కవేః ప్రసాదాత్"
౩౨ "స్థానంశూన్యమ్"
౩౩ "గాయత్రీ మానసమ్"
౩౪ "సిద్ధిస్సత్యే"
౩౫ "అవశేషఅత్మా"
౩౬ "ఓం భూర్భువస్సువరోమ్"

"జిజ్ఞాసువు"



# అభినవాంధ్ర నటశేఖరులు

(సంపుటము ౧. సంచిక ౧౦ తరువాయి)

## శ్రీ యుత స్థానం నరసింహరావు గారు

ప్రస్తుత మాంధ్ర నాటకరంగములయందు పేరు గాంచుచున్న నటకులలో శ్రీనరసింహారావుగారొక్కరను ట కెంతయుదగియున్నారు. వీరి నివాసస్థానము బాపట్ల. వీరు సుందరయువకులు. వీరికంఠస్వరము శ్రావ్యముగ నుండును. మధురవాణి రోషనార మొదలగు స్త్రీపాత్రములను వీరు ధరించుచుందురు. వీరు రంగస్థలము నలంకరించినప్పు డుచితముగ సంగీతమునుబోషించుచు భావప్రకటనమున దమకుగల సామర్థ్యమును జూపుదురు. పాత్రస్వభావమును బాగుగ మున్ముందు పరిశీలించి యాపాత్రపోషణమును గావించుచు ప్రేక్షకులను దన్మయులను గావింతురు. మధురవాణి భూమికను ధరించి మధురమందహాసముతో జూడ్కుల నిగుడ్చిన జాలును, చూపరులు దేహములను మఱువవలసినదే. రోషనారపాత్రమున కేమాత్రమైన కోపముగలిగెనా శుద్ధమహమ్మదీయస్త్రీస్వరూపము ప్రత్యక్షమగును. వీరికి 'అభినవరోషనార' యను బిరుదము గలదు. వీరు పారితోషకముగ ననేకస్వర్ణపతకములను బడసియున్నారు. వీరి నేర్పును విలాసమును రంగస్థలమున గాంచి మెచ్చుకొననివా రుండరను టతిశయోక్తి కాదు.* వీరిరోషనారచిత్ర మీ సంచికయందుగలదు.

(నాటక కళాభిమాని)

---

మాప్రార్థన నంగీకరించి భారతియందు ప్రచరించుటకై తమ రోషనార చిత్రమునొసంగినందుకు శ్రీ నరసింహారావుగారియెడ నెంతయుగృతజ్ఞులము.

సంపాదకుడు.




## కాంచనమాల

అనువాదకుఁడు :— సాహితీ సమితి సభాపతి

### శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రిగారు

క్రౌను సైజున ౧౫౦ పేజీలు. వెల ౧-౦-౦ మాత్రము.

దీనిని రాజమహేంద్రవరమునందలి సరస్వతీ గ్రంథమండలివారు ఐదవ అనుబంధమాలికగాఁ బ్రకటించిరి.

ఇదియొక చారిత్రకకథ. గొప్పపండితుఁడగు శ్రీ హరప్రసాదశాస్త్రిగారు వంగభాషయందు రచియించిన గ్రంథమునుండి శ్రీశాస్త్రిగారు దీని ననువదించిరి. ఇందు నాయికానాయకులు కాంచనమాలా కుణాలులు. మగధ సామ్రాజ్యాధిపతియగు నశోకుఁడు కుణాలునకుఁ దండ్రి. అశోకుని ద్వితీయ భార్య తిష్యరక్ష. నీచకులమునఁబుట్టినది. కుణాలుని గాఢముగ మోహించినది. సాధుచరిత్రుఁడు, సద్ధర్మపరాయణుఁడు నగు కుణాలుఁడు తనకు లభింపని కారణమున నాతనికిని, కాంచనమాలకును నెన్నియో యుపద్రవములఁ గల్పించి వారల నెడబాపి తుదకుఁ గుణాలుని కన్నులను నెత్తిమాడఁ జేయించినది. ఈ దుస్తంత్రమంతయు నశోకునకుఁ బొలుదొల్ల తెలియక యుండెను. కడపటఁ దెలిసి యాతఁడు తిష్యరక్షను గర్హించెను. కుణాలున కొక విజ్ఞానబిదుని మహిమవలనఁ గన్నులు మరల వచ్చినవి. తుదకు బుద్ధి తెచ్చుకొని తిష్యరక్ష కాంచనమాలా కుణాలుల దయకుఁ బాత్రమయ్యెను. కాంచనమాలా కుణాలులు బోధిసత్త్వులై బుద్ధధర్మమును భరతఖండమున సర్వతోముఖముగ వ్యాపింపఁజేసిరి. ఈ దంపతులు కావించిన ధర్మసంఘసేవ నిరుపమానము. వీరిమూలమున బౌద్ధధర్మము భారతదేశమున వేయేండ్లు స్థిరముగ నెలకొనినది. కథాసూత్రము సమీచీనముగను, రసవంతముగను నడచుటకై యింకనెన్నియో విషయములు సందర్భోచితముగ నిందుఁ జేరినవి.

అనువాదమే యైనను స్వతంత్రరచనమువలె సర్వాంగ సుందరముగ నున్న యీకాంచనమాల యాంధ్ర భాషాసఘూటీమణి కంఠసీమకుఁ గాంచనమాల యయ్యెనను టతిశయోక్తి కాదు. రచనము రసవత్తరమై హృదయంగమముగనున్నది. భావములు వర్ణనములు రమణీయములుగ నున్నవి. ఇందలి పాత్రములన్నియుఁ దమధర్మములను జక్కఁగా నిర్వహించుకొనినవి. శైలి శ్రోత్రపేశలతో మార్గదర్శకముగనున్నది. గ్రంథరచయితల పరిశ్రమమునకుఁ బ్రతిఫలము రసజ్ఞులగు పాఠకులయానందమే కదా!

ఇట్టి సద్ధర్మబోధకములగు గ్రంథములఁ బెక్కింటిని దీరుతీయముగల శైలిని రచియించి వీరు తమ యాంధ్రసోదరుల కొసంగి వారిమన్ననకుఁ బాత్రులగుదురు గాక!

గ. సు.

*   *   *   *

## ఆంధ్ర నాటకరంగము

### గ్రంథకర్త: బ్రహ్మశ్రీ గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు — చిత్తూరు.

ఈ గ్రంథము విద్యావినోదినీ గ్రంథమాలా ప్రసవము సప్తమము. క్రౌను సైజున ౨౩౦ పుటలుగలది. దీనివెల రు ౧-౮-౦ మాత్రము. ఇది పై గ్రంథమాలయొక్క మేనేజరుగారియొద్ద వెలకు దొరకును.

కళాభివృద్ధికి శాస్త్రములతోపాటు విమర్శనములు నావశ్యకము లనుట నందఱు నెఱిఁగినదియే. శాస్త్రము 'లిట్లు చేయవలె' నని శాసించునవి. విమర్శనములు తదాచరణమునందుఁగల లోపాలోపములను నిరూపించునవి. లోపముల నెఱిఁగి దిద్దుకొనిననేకదా కళాభివృద్ధిగలుగుట!

ఆంధ్రదేశమున నాటకములు, నాటకసమాజములు లెక్కకు మిక్కిలిగ బయలుదేరుచున్నవి. ఇక నటకుల సంఖ్యనుగూర్చి చెప్పవలసినదిలేదు. ఆంధ్రభాషయందు నాటకకళను శాసించుగ్రంథములుగాని, విమర్శించుగ్రంథములుగాని మొన్నమొన్నటివఱకు లేవనియేచెప్పవచ్చును. ఇఁక నాటకకళాభివృద్ధి కలుగు టెట్లో యూహించుకొనవగును?

ఇటీవల శ్రీయుత పురాణం సూరిశాస్త్రిగారు, నాట్యాంబుజము, నాట్యోత్పలము నను గ్రంథముల రచియించి మార్గదర్శకులైరి. ఇవి కేవల విమర్శనగ్రంథములనఁదగును. వీరాంగ్లవిద్యావిశారదులగుటచే నాభాషయందలి నాటక, నాటకకళావాఙ్మయమునంతయుఁ బరిశీలించియు, ఆంధ్రద్రావిడ కర్ణాటకాంగ్ల నాటక ప్రదర్శనములఁ దిలకించియుఁ, బ్రాచ్యపాశ్చాత్యనైఖరుల కొండొంటికి సామరస్యముఁ గల్పించియుఁ దమకుఁ దోఁచిన యంశముల నీ గ్రంథములయందు విమర్శించినారు. ఈ గ్రంథములు నాటకకళాభివృద్ధి కుపకారము లనఁదగును. ఇంకను వీ రీకళనుగూర్చి కొన్ని గ్రంథముల వ్రాయనున్నామనిరి. వానినిఁజూచు భాగ్య మెపుడు లభింపగలదో?

ఈ గ్రంథకర్త (శ్రీరామశాస్త్రి)గారు సంస్కృతాంధ్రములయందు గొప్ప పండితులు. వీరికి నాటకకళయందుఁ గల శాస్త్రలోకానుభవములే యీ గ్రంథరూపమును దాల్చినవి. ఈ కాలపు నాటకకర్తలయందును, నాటకములయందును, నటకులయందును నాటక సమాజములయందును, ప్రదర్శనములయందును, సర్వసామాన్యముగఁ గాన్పించుచున్న దురాచారములను లోపములను జక్కఁగా నిందు విమర్శించినారు. ఈగ్రంథము నాటకకళను బెంపొందించుట కెంతేయుఁ జాలినది.

ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్వికము నను నాల్గువిధములగు నభినయము, పాత్రోచిత భాష, సంగీతము, దాని ప్రయోజనము, నాటకమున సంగీతముయొక్కయు, గీతములయొక్కయు, పద్యములయొక్కయు నావశ్యకత, కష్టాంతనాటకములు మొదలగువానిని గూర్చి విపులముగఁ జర్చించిరి. నటులను నాటకములను గూర్చి యొకింత ముచ్చటించిరి. చర్చించిన విషయములనుగూర్చి నిశ్శంకముగా దోషములను ఖండించుచుఁ దమ సిద్ధాంతములను జాటిచెప్పిరి. వీనియెడ భిన్నాభిప్రాయము లుండవనిచెప్ప నలవికాకున్నను వీని ప్రయోజన మత్యధికమనుట సత్యము. కావున, నాటకకర్తలకును నటులకును, నాటక సమాజములకును నీగ్రంథము తమ లోపములనుబాపుకొన నుపకరించునదగుటచే సర్వధాసమాదరణీయమని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. మీఁదు మిక్కిలి వారందఱు నిట్టిగ్రంథమును రచియించి తమకు మహోపకారమును గావించినందులకు శ్రీశాస్త్రిగారియెడఁ గృతజ్ఞులై యుండఁదగుదురు.

శ్రీ శాస్త్రిగారు దీనినేకాక 'నాటకజిజ్ఞాస' 'కావ్యనాటక మీమాంస' యను గ్రంథములనుగూడ రచియించియున్నారట. వానిని దిలకించి యానందించు భాగ్య మాంధ్రలోకమున కచిరకాలమున లభించుఁగాక!

ఈగ్రంథముయొక్క శైలి ధారాళముగను, సరసముగను, సులభముగను నున్నది. చదువఁజదువ నింపుగనుండును. ఏతన్నాటక కళాభివృద్ధికరములగు గ్రంథముల నింకను రచియించి యాంధ్రసోదరుల కర్పింప జగన్నాటక సూత్రధారియగు పరమేశ్వరుఁడు శ్రీ శాస్త్రిగారి ననుగ్రహించుఁ గాక!

గ. సు.

* * * *

## చిత్రకథామంజరి - ప్రథమభాగము

నెల్లూరులోని శ్రీ వేంకటగిరిరాజావారి కళాశాల కధ్యక్షులుగానుండు సు. రా. శ్రీ. రాయసము వేంకటశివుఁడు ఏమ్.ఎ., యల్.టి., గారిచే రచింపఁబడిన పైగ్రంథ మామూలాగ్రముగాఁ జదివి యానందించినాను.

విద్యాధికులును విపుల లోకానుభవముగలవారును నీతిసంపన్నులును అగు వేంకటశివుఁడుగా రిట్టి పుస్తకములు వ్రాయదొరఁకొనుట ఆంధ్రబాలురకును బాలికలకును ఎంతో శ్రేయస్కరము.

కల్పనలు స్వభావసిద్ధములుగను సందర్భోచితములుగను నుండి ప్రస్తుత హైందవప్రజాస్థితిగతులను చిత్తరంజకముగాఁ జిత్రించి సంఘాభివృద్ధికిఁ గావలయు మార్పులను జక్కఁగా సూచింపుచున్నవి.

శారదా బాలాంబల కథలలోని ప్రకరణములకు శీర్షకములుగా ఎత్తివ్రాసిన ప్రాచీనకవికృత పద్యభాగములు, స్కాట్టుగారి యాంగ్లాఖ్యాయికలలోనివానివలెఁ గడుసమంజసములుగ నున్నవి.

బాలామణియగు లీల మృతిపట్టు కరుణరసభరితమైయున్నది.

కృష్ణవేణి జననవృత్తాంతమువలన, స్వహితపరాఙ్ముఖతాపరోపకారములు మానవుని సహజప్రవృత్తులని స్పష్టమగుచున్నది. కథావైపుల్యకల్పనాపాటనములు తక్కినకథలలోకంటె దీనిలో విశేషముగాఁ జూపట్టుచున్నవి. జులెయిఖాకృష్ణవేణుల యవ్యాజ గాఢమైత్రియుఁ బ్రేమయు మనోహరముగా వర్ణింపఁబడినవి. కాని భక్తతల్లజుఁడగు గోపన్నగారి పరమతీవ్రమైన రామభక్తి మూఢభక్తిగాను కృష్ణవేణీనిర్మలానందుల భక్తికి లొజ్జుగాను జూపఁబడినది. స్నేహితురాలికి సాహాయ్యము చేయుటకై జులెయిఖా చంద్రికగారిని మోసపుచ్చినట్లు చెప్పఁబడినది. బలవత్తమములైన లిఖితప్రమాణాదు లున్నచో నివిరెండును సరియే; లేనియెడలఁ దద్విషయకమైన కల్పనలు పరంపరావిశ్రుతమగు గోపన్నగారి చారిత్రమునకు విరుద్ధములుగా నుండుటచేఁ బెక్కురకసమ్మతములుగా నుండునని తోఁచుచున్నది.

బాలాంబప్రజావాత్సల్య సౌశీల్యములును, నిర్హేతుకములైన సుందరీదేవి యసూయాద్వేషబుద్ధులును, బాలాంబకై చేటికా శిఖామణియగు సీత చేసిన ప్రాణత్యాగమును, మానసంరక్షణార్థము పతివ్రతాతిలకమగు బాలాంబ దేవీసన్నిధిని గావించిన శరీరత్యాగమును, అందువలన వెంటనే ఇనాము పశ్చాత్తప్తచిత్తుఁడై ప్రకృతి మార్చుకొని పకీరగుటయును జక్కఁగాఁ వర్ణింపఁబడినవి. ఈకథలోఁ గొన్నిపట్లు పఠితలహృదయములు కరఁగించి కనులు చెమ్మగిల్లఁజేయఁజాలియున్నవి.

కోడిఅవిదయ్యము, నాగరాజు, మచ్చపులి: ఈ మూడుకథలును నమ్మశక్యముగాకున్నను పిల్లలకు మిగుల నింపుగానుండును. నాగరాజుకథలో విషజంతువునకు సైతము మనుష్యాతీతమైన యనురాగముండవచ్చుననువిషయము గోచరించుచున్నది. "తుదకిల్లాలు కంటఁదడిపెట్టికొని పతిచెప్పినమాటలకుఁ దలయూఁచెను" అనుమాటలకును, "ప్రమాదమున నవలమున కాహుతియైన తన సర్పకుమారునికి........."అను మాటలకును పరస్పర వైరుధ్యమున్నట్లు కాన్పించుచున్నది.

ఉత్తమపుష్పము, గౌతమి-ఇవి హృదయాహ్లాదకరములుగ నున్నవి. మనుజుఁడెంతగొప్పవాఁడైనను విశ్వాసగుణమునందు కుక్కకుఁ జాలఁడని గౌతమిగురుపద మధిష్ఠించి బోధించుచున్నది.

మాణిక్యము యొక్క విశిష్టతనుసౌందర్యము రమ్యముగాఁ జిత్రింపఁబడినది. (112 పుటలు)

మాలతిలో—అద్వైతమమైనట్టియు ఆనశ్యకమైనట్టియు సంఘసంస్కరణమే కథారూపమున బోధింపఁబడినది. వందనీయమగు శ్రీ వీరేశలింగపాత్రమునందు బాగుగాఁ బ్రవేశపెట్టినారు.

నిశ్చల యనుకథ బహునీతిదాయకమైనకథ:—జాన్సుగారికిఁదొలుత బైరాగియందుండు నిరసనభావము, అతని చికిత్సనుగూర్చిన యవిశ్వాసము కించిత్ప్రతిఫలాపేక్షయులేని ఆబైరాగియొక్క శ్రీరామచంద్ర పాదారవిందవినిర్మలభక్తి పూర్వకమైన పరోపకార ప్రవృత్తి, అద్భుతరోగ నివారణము, జాతిమతభేదభావములందు గేవలము భిన్నులైనవయొలెట్టుజాన్సు దంపతుల స్తవనీయమైన కృతజ్ఞత, నిర్భయులై తమపుత్రికకును పుత్రునకును నిశ్చలారామనామములిడి దానిని వెలిపుచ్చుట, తమ పిల్లలచేఁ దమమిత్రునికిప్పించిన బహుమానములు—ఇవన్నియుఁ గడుహృద్యముగా వర్ణింపఁబడినవి. కథాదియందు జీవయాత్రను రెయిలుప్రయాణముతోఁ బోల్చి కావించిన వర్ణనము బాగుగానున్నది.

"కాష్ఠములేని యగ్నివలె విషయములేనివారి యీర్ష్యయు,గోపమును శీఘ్రకాలములో నే చల్లారినవి", (14) "దైవకృపను గాంచినవాని పాపమువలెనే, యుష్ణ

మామె శరీరమునుండి యూరేయి మెల్ల మెల్లఁగఁ దొలఁగి పోయెను” (43); అచ్చు టచ్చుటఁ గానిపించు నిట్టియుపమానము లెంతేయు హృదయంగమములుగ నున్నవి.

“కొంతసేపట్టి కొక ముసలివితంతువుయొక్క యాకారము గానవచ్చును! బాల్యావస్థలోనే నేనుండిన యెడల అది దయ్యమే యని భ్రమించియుందును” (130, 131) “దేశరాజు ప్రకాశముగారు పైనిజెప్పిన ముసలియవ్వ మామగారి తాతగారఁట” (131); కొన్నిచోట్ల నిట్టి యతిమృదులమైన నరోక్తులును గలవు.

భావలలితమైన గ్రాంథికభాష. శైలి ధారాళముగ నున్నది.

“చింతలపల్లి పల్లెటూరున నుండవలసిన సౌఖ్యములు గలిగియుండెను”:—ఇది యాంధ్ర భాషాసంప్రదాయానుకూలముగా లేక ఆంగ్లవాక్య నిర్మాణపద్ధతి ననుసరించి యున్నది.

వదెన (15) దగ్గిరనే (17) తేజోవంతముగ (59) వర్షకాలము (75) అంచలేకిని (79) పెఱుఁగదు (94) పితాసుతల (112) వేటకారులది (138) రుమాల (150); ఇట్టి యనిష్టరూపములు కొన్నిచోట్లఁగాన్పించుచున్నవి. ప్రమాదజన్యములైన యీస్వల్పదోషములను ద్వితీయముద్రణమునందు సవరింతురనుకొనెదను.

గ్రంథము గుణబహుళమై, నీతిబోధకమై, ఔచితీవిశిష్టమై బాలురకును బాలికలకును బహుధా పఠనయోగ్యమైయున్నదని నాయభిప్రాయము. తక్కిన ద్వితీయాదిభాగములుకూడ నచిరకాలములోఁ బ్రకటించి గ్రంథకర్తగారింకను ఆంధ్రజనోపకర్త లగుదురుగాక!

కూచి నరసింహము



# చిలుక

వెలగపూడి దానయ్య చౌదరి గారు

మంచిపచ్చల కాంతిని మించినట్టి
యతులితంబగు రంగుచే నమరియున్న
చక్కనగు, తోఁక, ఱెక్కల, చక్కిఁజూడ
ఘనత రానంద మొనఁగూడుఁ గాదె చిలుక!

గీ. సన్నమై యెఱ్ఱఁగానున్న సున్నయందు
గాజుపూస నమర్చిన కరణినొప్పు
సుందరంబగు కనుఁగవ సొంపుఁ జూడ
ఘనత రానంద మొనఁగూడుఁ గాదె చిలుక!

గీ. వంగి మొనదేఱి యెఱ్ఱనిరంగుతోడ
మెఱయుచక్కని త్రోటియు మెడకు గ్రిందఁ
జారుతరమైన నీలంపు గీఱఁ జూడ
ఘనత రానంద మొనఁగూడుఁ గాదెచిలుక!

గీ. కంఠమును జూచి ముక్కుతోఁ గఱచి పట్టి
యెదురుగానున్న శాఖపై కెక్కు నపుడు
తనువు మును జేర్చి కాళ్లూనుటను గనంగ
ఘనత రానంద మొనఁగూడుఁ గాదె చిలుక!

గీ. ఫలయుతంబగు వృక్షంబుపైనిఁ జేరి
యందమైన పదంబుతో ముందునున్న
పండుఁగొని మెక్కఁజూచెడి పట్టుఁ జూడ
ఘనత రానంద మొనఁగూడుఁ గాదె చిలుక!

గీ. సరవి గడనెక్కు దొమ్మరసాని పోల్కి
ఱెక్కలను జాచి పూనిక ముక్కుతోడ
మ్రాఁకుఁ బట్టుక, పై కెగఁ బ్రాఁకుటఁ గన
ఘనత రానంద మొనఁగూడుఁ గాదె చిలుక!




కీ. శే. దామెర్ల రామా రావు గారు

దైవనిర్ణయములు మానవులకు దుర్గ్రాహ్యములు. అనంతములైనమనోరథములు క్షణకాలమునందు భగ్నము లగుచుండును. ఆశలు నిరాశలగును. భావిపరిస్థితు లంధకార బంధురముగ గనుపడును. కాని జగన్నాటక సూత్రధారుని యాదేశానుసారముగను ప్రపంచప్రవృత్తి యథాప్రకారము సాగుచుండును. వ్యక్తిస్వరూపము లంతర్హితమైనను సంకల్పిత భావము భిన్నరూపములను దాల్చి వృద్ధిని బొందుచుండును. సంచితమైన విజ్ఞాన మవిచ్ఛిన్నముగను లోకహితార్థము వినియోగపడుచుండును. లోకహితార్థ మవతరించెడి భావ పరంపరలవికాసమునం దంతర్హితమైన వ్యక్తి స్వరూప మమరత్వమును బడసి విరాజిలుచుండును. జననమరణములు స్వరూపములందు భేదభావమును వ్యక్తముచేసినను స్థిరమైన భావపరంపరలు వ్యక్తిస్వరూపమును స్ఫురింపజేయుచుండును. మానవకల్యాణమున కొక తృణమునైనను సమర్పించిన వ్యక్తు లల్పాయుష్కులైనను కృతార్థులు. ప్రతిభాశాలురైన వ్యక్తులు మృతినొందినను వారి ప్రతిభయందె చిరంజీవత్వమును గలిగియుండి జన్మసాఫల్యమును విశదముచేయుదురు. జగన్నాటక సూత్రధారుని లీలావిలాసములు విషాదపూరితములై సామాన్యదృష్టి కగ్రాహ్యములైనను భగవన్నిర్ణీతమైన లోకకల్యాణమునకు వినియోగపడుచున్నవి.

మాఘమాసపు భారతియందు దామెర్ల రామారావుగారి ఛాయాపటమును ప్రచురించునపుడు పుష్యమాసపు భారతియందు రామారావుగారి మరణసంకీర్తనమును జేయవలసిన యవసరమచింత్యముగనుండెను. మాఘ శుద్ధ త్రయోదశినాడు (౬-౨-౨౫) రామారావుస్వర్గస్థులై బంధుమిత్రాదులను కళాభిజ్ఞబృందమును విచారసాగరమునందు ముంచిరి. అల్పవయస్సునందె రామారావుగారు సువ్యక్తముచేసిన చిత్రకళాప్రావీణ్యము, వారిసౌజన్యము, వారికళారాధన తత్పరత్వము, వారి యకాలమరణమువలనను విచారమును గలుగజేసినవి. పత్రికలయందు వారియకాలమరణమును దెలుపుచు వ్యాసములు పద్యగీతములు ప్రచురింపబడినవి. వారి నివాసస్థానమైన రాజమహేంద్రవరమునందు స్మరణచిహ్నమును నెలకొలుపుటకు మహాసభ గావింపబడినది. అల్పవయస్సునందె యస్వార్థముగను కీర్తిశేషులై కళాకోవిదులమన్ననలకుబాత్రులైన రామారావుగా రాంధ్రకళా ప్రపంచమునకు చిరసంస్మరణీయులుగ నుండగలరు. రాజమహేంద్రవరమునం దేర్పడిన

యుపసంఘ ముచితమైన స్మారకచిహ్నము నేర్పరచుటకు దయామయుడైన పరమేశ్వరు డనుగ్రహించుగాత !

రామారావుగారు బొంబయికలత్తానగరములందు చిత్రకళాభ్యాసమును జేసినను వారి చిత్రములం దనిర్వచనీయమైన రససౌందర్యము గోచరంబగుచున్నది. పరమేశ్వర స్వరూపము "శివం శాంతం సుందరం" స్వభావములందును స్వరూపములందును ప్రత్యక్షమగుచు మానవులకు దమయం దప్రత్యక్షముగనున్న దైవవిభూతిని బ్రత్యక్షము చేయుచు దుఃఖనివృత్తికిని సుఖప్రాప్తికిని సాధనంబగుచున్నది. పరమేశ్వరుని సచ్చిదానందస్వభావమును విశ్వరూపములందు కవులు సందర్శించుచు వర్ణించియును, గాయకులు వినుచుపాడియును, చిత్రకారులుచూచుచు చిత్రించియును, తత్త్వజ్ఞులు గనుగొనుచు బోధించియును దుఃఖనివృత్తికిని సుఖప్రాప్తికిని దోడ్పడుచున్నారు. భగవంతుని సౌందర్యవిభూతిని ప్రత్యక్షముచేయుచు నానందరసపరవశత్వమును గలుగజేయుట కాత్మానందదాయకమైన రూపప్రపంచమును చిత్రకళాభిజ్ఞులు దివ్యరచనలను చిత్రించుచు విశ్వకల్యాణమును జేయుచున్నారు. ప్రాచీప్రతీచులసంసర్గము భారతసంస్కారమున కితరరంగములందువలె చిత్రకళారంగమునందును ప్రతిబంధకముగను బరిణమించినది. ప్రభుత్వాదరణమునకు బాత్రమైనరూపారాధనము వికసించి భారతసంస్కారమునకు సహజమైన భావారాధన మస్తమించినది. చిత్రకళయందు సర్వాంగసౌష్ఠవమునకు ప్రతిభ ప్రబలి భావసౌష్ఠమునకు ప్రతిభ క్షీణించినది. పాశ్చాత్యపండితులు పాశ్చాత్యదృష్టికి పరిపాటియైన యంగపోషణమును చిత్రకళయం దధికతరముగను వ్యాపింపజేసిరి. సౌందర్యమున కాధారభూతమైన లావణ్యవిన్యాసముక్షీణించి పుష్టివిన్యాసభావము ప్రబలినది. ప్రబోధసమయమునందు వంగరచనయందు ప్రతిఘటన ముదయించినది. చిత్రకళాభిజ్ఞులు నందలాలు బోసు, అవనీంద్రనాథ ఠాకూరు ప్రభృతులు పుష్టివిన్యాసమునకు పదచ్యుతిని గలుగజేసి లావణ్యవిన్యాసము నధిష్ఠింపజేసిరి. వంగచిత్రవైఖరియందు భావవిన్యాసము ప్రబలినను లావణ్యసౌష్ఠవసంయోగమునందు విచిత్రవైఖరి యేర్పడినది. ఈవైఖరియందలి గుణదోషముల విషయమునను ఖండనమండనము లెటులున్నను భారతచిత్రవిన్యాసమునకు ప్రాణకళయైన భావారాధన ముద్ధృతిని బడసినది. రామారావుగారు భారతసంస్కారమునకు పరిపాటియైన భావారాధన విన్యాసము నవలంబించియును రూపవిన్యాసమునందు నయిత ముద్ధరణమార్గము నవలంబించి చిత్రకళావిన్యాసమునందు భారత సంస్కారమునకు సహజమైన యాధ్యాత్మిక స్వభావమును పరిస్ఫుటము చేయుటకు బ్రయత్నించిన విధమును రామారావుగారి చిత్తరువులు విశదము చేయుచున్నవి. రామారావుగారు చిత్రపటములను ప్రత్యక్షప్రమాణములనుజూచి యారంభమునందు చిత్రించినను కాలక్రమమునను

వా రామార్గమునువదిలి సంకల్పనిర్మాణవిధానము నవలంబించుచుండిరి. రామారావుగార జంతాచిత్రవిన్యాసమునులక్ష్యమునుగ గైకొని వారిచిత్రములందలి రూపరేఖాలంకార విధానములం దజంతావిధానము నవలంబించిరి. రామారావుగారి చిత్రము లవయవవిస్ఫురణమును బ్రకటించుచున్నను దివ్యవిభూతులను స్మరింపజేయుచుండును. పరమేశ్వరవిభూతులైన శాంత శివసుందరభావములు చిత్రములందు సహజరీతిని ప్రత్యక్షమగుచుండును. గతసంవత్సరమునందుభారతియందు బ్రచురించిన గౌరీ శంకరుల చిత్రమునుజూచినను, ఇతర మానవ దేవతాచిత్రములను జూచినను నీభావము పరిస్ఫుటమగుచున్నది. ఫాల్గుణమాస సంచిక యందు ప్రచురించిన అజంతాచిత్రపటము రామారావుగారి లక్ష్యమును విశదము చేయుచున్నది. రామారావుగారు లావణ్యసౌష్ఠవములకును మానవదివ్యవిభూతులకును భావరూపములకును సహజమైన సంయోగమును గలుగజేయుటకు యథాశక్తిని చిత్రకళాదేవి నుపాసించి కృతకృత్యులైరి. కళోపాసకులైన రామారావుగారి యకాలమరణము చిత్రకళాభ్యుదయమున కుత్తేజమును గలిగించి రామారావుగారికి సాయుజ్యప్రాప్తి గలుగుటకు భగవంతు డనుగ్రహించుగాత!

* * * *

వివిధపక్షముల సభ

ప్రపంచప్రవృత్తియందు సంకల్పమునకు మించిన ఫలము గలుగుట యసంభవము. వివిధ పక్షముల సభకు సంకల్పిత ఫలము సంభవించినది. బొంబయిసమావేశమునందె రానున్న ఫలమును విజ్ఞులు సూచించిరి. ఎ. యస్. రామస్వామి మొదలియారుగారు నిరాటంకముగను వారిభావమును విశదము చేసినందుల కాగ్రహము గలిగినను పర్యవసానము మొదలియారుగారి జ్యోతిషమును సఫలము చేసినది. స్వరాజ్యపక్షమువారి కార్యము నిర్బంధశాసన ఖండనముతో తీరినది. బెల్గాము నందుగాని ఢిల్లీయందుగాని సంయోగ సాధనములకు ప్రసక్తిగలుగలేదు. ఢిల్లీయందు గూడిన సభయందు ప్రసక్తిగలిగినను ఫలము గలుగలేదు. స్వరాజ్య విధానమును నిర్ణయించుటకేర్పడిన సభ స్వీయకార్యభారమును నిర్వహించినది.

డాక్టరు బిజెంటమ్మగారి కార్యదీక్షయును నిర్వహణసామర్థ్యమును విజయమునకు గారణములు. బిజెంటమ్మగారి కన్వెన్షనుచట్టమునందలి ముఖ్యాంశములు స్వరాజ్యచట్టమునందలి ముఖ్యాంశములుగ బరిణమించినవి. స్వరాజ్యశాసనస్వభావరూపము లెట్టులున్నను ఉపసంఘము నిర్ణయించిన విధానము శాసనరూపమును దాల్చుటకు సాధనాంతరములు మృగ్యములు. శాసనవిధానమును సామ్రాజ్యశాసనసభయందుగాని పార్లమెంటునందుగాని ప్రవేశపెట్టుట కవకాశము గలుగదు. అవకాశము గలిగినను శాసనరూపమును దాల్చుట కాటంకములు గలవు. శాసనరూపమును దాల్చినను దరిద్రుల మనోరథము వలె మృతాక్షరముగ నుండును. నిరంకుశాధి

కారప్రాబల్యమునకు గారణము సద్భావలోపముగాని శాసనముల లోపముగాదు.

సంయోగసభ నిర్ణయించిన రెండవయుపసంఘు వ్యవహారములును నిరర్థకములైనవి. హిందూ మహమ్మదీయులకు సంయోగసాధనము సాధ్యముగాలేదు. ఉద్యోగములందును ప్రాతినిధ్యమునందును గలిగిన విభేదములు స్థిరములైనవి. హిందువులును మహమ్మదీయులును స్వపక్ష వాదమును సమర్థింప బూనుకొనుచున్న విధమును జిన్నా, లాజపతిరాయిగారల భావములు విశదము చేయుచున్నవి. లక్నో యొడంబడికను విమర్శింపవలసిన యవసరమును లాలాజిగారు నిరసించుచున్నారు. లాలాజివర్గమువారిదృష్టి హిందూసంఘటనమునందు లగ్నమగుచున్నది. గాంధిమహాత్ముడు హృదయపరివర్తనము గలుగనపుడుభయసంఘములకును సంయోగము దుర్లభమని విశదముచేసి సంయోగసభను ప్రస్తుతము విరమింపజేసెను. గాంధిమహాత్ముడును పండిత మోతీలాలునెహ్రూగారలు ప్రకటింపనున్న నివేదికయును నధికాంశములను గలిగియుండునని యూహించుట కవకాశములులేవు. సంయోగసభావ్యవహారములు నిరర్థకములైనను స్వరాజ్యప్రాప్తికి వివిధపక్షముల సంయోగమును హిందూమహమ్మదీయ సంయోగమును నవసరములని అన్నిపక్షములవారును నంగీకరించుచున్నారు. వివిధపక్షముల సంయోగమునకు కాంగ్రెసు సిద్ధాంతమె మార్పును బొందవలయును. లిబరలుపక్షమును స్వాతంత్ర్యపక్షమును నూలువడికెడినిర్ణయమునె తీసివేయగోరుచున్నవి. స్వరాజ్యపక్షము నియమము నంగీకరించినను క్రియయందుమాత్రము ప్రయోజనము గలుగకున్నది. కాంగ్రెసు పక్షమువారైనను నూలువడికెడి నియమమును పూర్తిగను పాటింపకున్నారు. గాంధి మహాత్ముని ఖద్దరుఘోష యరణ్యఘోషగ నున్నది. బెల్గాము కాంగ్రెసు ముగిసి రెండుమాసములైనను ఏరాష్ట్రమునందును కాంగ్రెసు సభ్యులు విశేషముగను చేరినటులు గనుపింపదు. ఈ విషమపరిస్థితులందు గాంధిమహాత్ము డేమి చేయనున్నదియును కాలము తెలుపగలదు.

* * * *

స్వరాజ్యపక్షము

స్వరాజ్యపక్ష సిద్ధాంతములు క్రమముగను శిథిలమగుచున్న విధమును నిత్యవ్యవహారములువిశదము చేయుచున్నవి. స్వతస్సిద్ధముగ బలములేని స్వరాజ్యపక్షమున కితరులసహాయములేకను ప్రభుత్వమును ప్రతిఘటించుటకు శక్తిలేకున్నది. గతసంవత్సరమునందు గలిగిన యైక్య మీయేడు దుర్ఘటమై స్వరాజ్యపక్షమునకు సామ్రాజ్యవంగీయ శాసనసభలయందు పరాజయము గలిగినది. లిట్టనుప్రభువు చమత్కారముగను వంగరాష్ట్రమునందు సంయోగమునుభేదించి ప్రభుత్వవిజయమును బడయగలిగెను. హిందూ మహమ్మదీయుల పట్లను స్వతంత్ర స్వరాజ్యపక్షముల పట్లను నవలంబించిన సామదానభేద తంత్రములును వంగరాష్ట్రమునం దవలంబించిన దండన తంత్రమును సంపూర్ణవిజయమును బడసినవి.

నిరంకుశ ప్రభుత్వవిధానమునందుగల ప్రభావమును ప్రజలదౌర్బల్యమును విశదమైనవి. సామ్రాజ్యశాసనసభయందు భిన్నపక్షములకు గలిగిన ప్రాతికూల్యమును ప్రభుత్వతంత్రమును ప్రభుత్వవిజయమునకు దోడ్పడినవి. ఆసభయందు జిన్నా నెహ్రూగారలకు జరిగిన సంభాషణములు ప్రజానాయకుల హృదయమును విశదముచేయుచున్నవి. స్వరాజ్యపక్షము ప్రత్యక్షముగను పరోక్షముగను ప్రతిఘటనతంత్రమును విరమించుటయును, అనుకూలసహకారతంత్రమునవలంబించుటయును సంభవములు. ఈవిషమపరిస్థితులందు గాంధిమహాత్ముడు కాంగ్రెసుయొక్క ప్రత్యేకసమావేశమునుజేసి బహిష్కారసాధనములను నూలు నియమమును విరమించుటయును సంభవములు. వర్తమాన పరిస్థితులందు సకలమును నంధకారబంధురముగ గనుపడుచున్నది.

* * * *

**ఆదాయవ్యయ పట్టికలు**

సామ్రాజ్యశాసనసభయందును రాష్ట్రీయశాసనసభలయందును నాదాయవ్యయ వివరములు చర్చింపబడుచున్నవి. సామ్రాజ్యాదాయము 133,68,00,000. ఆదాయమునుండి వ్యయముపోను 3,24,00,000 నిలువయుండునని మదింపువేయబడినది. వ్యయమునందు 5633 లక్షలు సైన్యవ్యయమునకు వినియోగపడుచున్నవి. సైన్య వ్యయమునందు 4 కోట్లు తగ్గినను సైన్యవ్యయము దుర్భరముగ నున్నది. ఐ షెంపుకమిటి నిర్ణయానుసారముగ నైనను ఇంకను 7 కోట్లు తగ్గుటకవకాశముగలదు. కాని సైన్యవ్యయమును తగ్గించుట కధికారులకు మనసొప్పదు గదా! అధికాదాయమునుండి 126, 56, 61 లక్షలు చెన్నపురిరాష్ట్రము సంయుక్తరాష్ట్రము పాంచాలరాష్ట్రముల కప్పములనుండి తగ్గించుట కేర్పాటులు చేయబడును. అధికాదాయమునకు మారకము, మంచివానలు, అనుకూలవ్యాపారము, స్టోరుల విక్రయము గారణములు. ఆదాయవ్యయముల పరిశీలనము సంతృప్తిని గలుగజేయదు. నూలు మీది సుంకము నిలిచియే యున్నది. సైన్యవ్యయమును తగ్గించలేదు. ఆకస్మికకారణములాదాయమును పెంచినవి. వ్యయము తగ్గినను ప్రజాభారము తగ్గినను సంతసింపవచ్చును. ఆకస్మికకారణములవలననైనను క్రొత్తపన్నులను వేయవలసిన యవసరము తప్పినందులకు సంతసింపవలయును. ఆదాయవ్యయనిర్ణయాధికారము సామ్రాజ్యసభకు గలుగనంతవరకును ఆదాయము హెచ్చినను వ్యయము తగ్గినను సంతసించుటకు గారణములు గనుపడవు.

రాష్ట్రములందు సామాన్యముగ నాదాయమునకు మించినవ్యయము గలిగినది. సంయుక్తరాష్ట్రములందు 28, బర్మాయందు 157, చెన్నరాష్ట్రమునందు 88 లక్షలు లోటుగలుగనున్నది. సామ్రాజ్యప్రభుత్వ మీయదలచిన మొత్తములు లోటును పూర్తిచేసినను రాష్ట్రముల దుస్థితిని బడ్జెటులు విశదము చేయుచున్నవి. సంస్కరణములఫల మధికవ్యయమునందు వ్యక్తమగుచున్నది. కాని ప్రజాధికారము నందును ప్రజాసౌఖ్యము నందును వ్యక్తమగుటలేదు. వర్తమాన విషమదశను

నివర్తించుటకు సామర్థ్యము భారతప్రజాహస్తములందు గలదు. వర్తమానవిషమదశ నతిక్రమించి స్వరాజ్యమును బడయుటకు సాధనములను గాంధిమహాత్ము డనవరతము బోధించుచున్నను స్వరాజ్యసిద్ధికి కర్మపరిపక్వము గాకున్నది. ప్రజలును నాయకులును వారిదృష్టిని గౌరవాధికారపదవులనుండి మరల్చి గాంధిమహాత్ముడు నిర్ణయించిన నిర్మాణవిధానమునందు లగ్నముచేసి స్వధర్మారాధనపరాయణులై కృతార్థు లగుదురుగాత! పురుషార్థమునకు సాధనములైన శాంతి సత్య దయా ధర్మములను గాంధిమహాత్ముని యుపదేశానుసారముగను ప్రజానాయకులు సేవించి తరించెదరుగాత!





# సత్యనారాయణస్వామి

బలిజేపల్లి లక్ష్మీకాంతము గారు

వః నిపంటన్ గపురంపుటాకు విడెయంబు న్నోర్మవి కందించుచున్
గనులన్ బాళి పిసాళి నవ్వు లొలయంగాఁ జెంత లక్ష్మీ విలా
సిని లాలింప, సుధార్ణవోచ్ఛలిత వీచీడోలలన్ నాగశ
య్యా నుయాలూఁగుచు దీనుల న్మఱచినావా ? సత్యనారాయణా!

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7 Thumbu Chetty Street, G. T. Madras